# శ్రీనివాస వైభవం

(శ్రీవారి సేవలు, ఉత్సవాలు)

## జూలకంటి బాలసుబ్రహ్మణ్యం



తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి

# శ్రీనివాస వైభవం

(శ్రీవారి సేవలు - ఉత్సవాలు)


రచయిత

**జూలకంటి బాలసుబ్రహ్మణ్యం**

సబ్-ఎడిటర్

**"సప్తగిరి"**

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి






ప్రచురణ

కార్యనిర్వహణాధికారి

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి

**2005**

**SRINIVASA VAIBHAVAM**
(Srivari Sevalu - Utsavalu)

BY:
**Julakanti Balasubrahmanyam**

T.T.D. Religious Publication Series No.684



Price Rs.40/-

First Edition : 2005

Copies : 5,000

Published by:
**Sri A.P.V.N. Sarma**, I.A.S.,
Executive Officer,
Tirumala Tirupati Devasthanams,
Tirupati - 517 501.

Cover Design:
L. Subramanyam, Adsprint.

Printed at:
Adsprint
T.Nagar, Chennai - 17.

# సమర్పణ



శ్రీ వేంకటేశ్వరస్వామివారి పాదపద్మములకు...



నిత్య కల్యాణ చక్రవర్తి

# ముందుమాట

ప్రపంచప్రసిద్ధిగన్న క్షేత్రం తిరుమల. ఈ పుణ్యస్థలంలో స్వయంవ్యక్తమై ఆవిర్భవించిన స్వామి శ్రీ వేంకటేశ్వరుడు. ఈ స్వామి ఎంతటి అలంకార ప్రియుడో అంతటి నైవేద్యప్రియుడు. ఎంతటి నైవేద్య ప్రియుడో అంతటి ఉత్సవ ప్రియుడు. ఎంతటి ఉత్సవ ప్రియుడో అంతటి భక్తప్రియుడు. విశేషమైన ఈ గుణగణాల వల్ల ముఖ్యంగా భక్తరక్షణ వల్లా "వేంకటేశ సమోదేవో న భూతో న భవిష్యతి" అని ప్రసిద్ధి పొందినాడని చెప్పవచ్చు. శ్రీ వేంకటేశ్వరస్వామి నిలిచి వుంటూ నిరంతరం భక్తుల కోసమే ఎదురు చూస్తూండగా, ఆ కోట్లాది మంది భక్తులు ఆ స్వామి దర్శనం కొరకు అర్రులు చాస్తూ వేంకటాచలంవైపు పరుగులు పెడుతున్నారు. కన్నులారా ఆ స్వామివారిని దర్శించుకుంటున్నారు. నోరారా కీర్తిస్తున్నారు. ఉత్సాహంగా ఉత్సవాలు చేస్తున్నారు. ఆ పరంధాముని దివ్య ప్రసాదాలను చేతులారా స్వీకరించి ఆనందిస్తున్నారు.

కాని తిరుమలకు వచ్చిన ప్రతి భక్తుడు, ఆ ఏడుకొండలవాడికి ఎప్పుడెప్పుడు ఏ ఏ సేవలు జరుగుతున్నాయో, ఏ ఏ రోజుల్లో ఏ ఉత్సవాలు నిర్వహింపబడుతున్నాయో, ఏ ఏ వేళల్లో ఏ దివ్యాన్నాలూ, నివేదింపబడుతున్నాయో, వాటిని తెలుసుకొనవలెనన్న కుతూహలంతో పాటు, వాటిల్లో పాల్గొని దర్శించాలన్న మెండైన కోరికతో, జిజ్ఞాసతో సతమత మవుతూవున్నాడు.

తిరుమలేశుని భక్తులు, కేవలం ఒక్కక్షణంకాలం పాటు లభించే శ్రీవారి దర్శనంతో మాత్రమే సంతృప్తి పడవలసిన ప్రస్తుత తరుణంలో శ్రీ వేంకటేశ్వరస్వామివారికి జరుపబడే ఉత్సవాలన్నింటిలో ప్రత్యక్షంగా పాల్గొని తిలకించాలన్న భక్తుల కోరిక, కోరికగానే మిగలటంలో ఆశ్చర్యం ఏ మాత్రం లేదు. శ్రీనివాసునకు జరిగే అన్ని సేవలను, ఉత్సవాలను దర్శించలేక పోయినా, వాటిని గూర్చి వివరంగా తెలియజేసి, భక్తులను కొంతవరకైనా సంతృప్తి పరచాలను సంకల్పంతో, తిరుమల తిరుపతి దేవస్థానం ఉపసంపాదకులు అయిన శ్రీ జూలకంటి బాలసుబ్రహ్మణ్యం "శ్రీనివాస వైభవం" అనుగ్రంథాన్ని రచించారు. తిరుమల శ్రీవారి ఆలయ విశేషాలను గూర్చి ఇప్పటికే వీరందించిన "హరికొలువు" గ్రంథం భక్తలోకంలో విశేషాదరణ పొందింది. ఆ 'హరికొలువు' గ్రంథానికి అనుబంధంగా రచింపబడిన పుస్తకమే ఈ "శ్రీనివాసవైభవం". తిరుమల తిరుపతి దేవస్థానంవారి ధార్మిక ప్రచురణగా వెలువడిన ఈ పుస్తకంలో తిరుమలేశునకు నిత్యమూ జరిగే సేవలు మొదలు, ఏడాది పొడవునా జరిగే ఉత్సవాల వరకు కూడా సరళమైన శైలిలో రచయిత వివరించారు.

తిరుమలేశుని భక్తులందరు ఈ గ్రంథం ద్వారా, శ్రీనివాసుని ఉత్సవ వైభవాన్ని తెలుసుకొని మరింత ధన్యులు కాగలరని ఆశిస్తున్నాం.

**ఎ.పి.వి. నారాయణశర్మ**
కార్యనిర్వహణాధికారి
తి.తి. దేవస్థానములు, తిరుపతి.

తిరుపతి,
తేది.14-6-2005.

# ఉత్సవాల దేవుడు

అనంతకోటి బ్రహ్మాండాలలో భూమండలం కేవలం సూక్ష్మాతి సూక్ష్మమైన ఒక చిన్న గ్రహం మాత్రమే. అంతమాత్రమే అయినా విశ్వాంతరాళంలో ఈ భువికి అనంతమైన, అమృతత్వమైన, ఆదరణీయమైన ఒక విశిష్టస్థానం వుంది. బహుశా అద్భుతావహమై నటువంటి ఆశ్చర్య కరమైనటువంటి, ఆనందమయమైనటు వంటి, ఎంతకూ తరగనటువంటి అనంతమైన ఒక ఆధ్యాత్మిక తేజోనిధి ఈ భూమి మీద నెలకొని వుండడమే అందుకు ప్రధానకారణం. ఆ అద్భుత తేజోరాశి భూమండలంపై నెల కొనివున్నా, ఆ శక్తియొక్క వింత వింత వెలుగులు విశ్వాంతరాళమంతా విరజిమ్మబడుతున్నాయి.

అనాదిగా ఆ దివ్యశక్తి కేంద్రీకృతమైన పుణ్య స్థలాన్ని వేంకటాచలమనీ, శేషాచలమనీ, సప్తగిరులనీ అంటున్నారు. అలాగే ఆ అనంత శక్తిని శ్రీనివాసప్రభువనీ, సప్తగిరీశుడనీ, వేంకటరమణుడనీ, గోవిందుడనీ, తిరుమలేశుడనీ..... ఇలా ఎన్నో పేర్లతో పిలవటం జరుగుతుంది.

ఇలాగ అనంతమైన పేర్లతో పిలువబడుతున్న దివ్యమైన కాంతిపుంజం ఎలాంటిది? అంటే కోరిన వారి కల్పతరువు! పట్టిన వారి చేతి బంగారం! ముట్టి కొలిచిన వారి ముందు జీతం! సేవ చేసినవారి చేతిలో మాణిక్యం! భావించువారి పరబ్రహ్మ. కావలెనన్నవారికి ఘనమనోరథ సిద్ధి నిచ్చే గురుతైన దైవం! పూజించేవారిని రక్షించే వజ్ర పంజరం! తన్మయించి నుతించేవారి ఆనంద రూపం! అందుకే.

వేంకటాద్రి సమం స్థానం బ్రహ్మాండే నాస్తికించన
వేంకటేశ సమో దేవో న భూతో న భవిష్యతి.

శ్రీస్వామివారికి అర్చన జరిగిన వెంటనే వక్షఃస్థల లక్ష్మికి మళ్లీ అర్చన జరుగుతుంది. ప్రతి మంగళవారం మధ్యాహ్నం 11 గంటలకు రెండవ అర్చనగా మూలవిరాట్టునకు 108 బంగారు కమలాలతో 'అష్టదళ పద్మారాధన' అనే పుష్పార్చన జరుగుతుంది. ప్రతి గురువారం రెండవ అర్చ సమయంలో నేత్ర దర్శనం, తిరుప్పావడ, ఆ సాయంత్రం పూలంగి సేవ ఈ స్వామివారికే జరుగుతాయి. ఆ మరునాడు శుక్రవారం పొద్దున సుగంధద్రవ్యాలతో అభిషేకం జరిగేది స్థిరమూర్తి అయిన మూలవిరాట్టునకే.

ప్రతిరోజు రాత్రి బ్రహ్మాది దేవతలు వచ్చి అర్చించే రూపం కూడ ఇదే. ప్రతిరోజు సుప్రభాతానంతరం భక్తులు చేసుకొనే "విశ్వరూప దర్శనం'' శ్రీ స్వామివారి మూలమూర్తిదే. ఈ విగ్రహమూర్తికే వజ్రకిరీటాది ఆభరణాలు, ఎన్నో నగలు, దివ్యమాలలు అలంకరిస్తారు.

**2. కౌతుకబేరం:** మనవాళప్పెరుమాళ్, భోగశ్రీనివాసమూర్తి, కౌతుకమూర్తి అని ఈ విగ్రహానికి పేర్లు. శంఖ చక్రధారియై చతుర్భుజుడైన ఈ భోగమూర్తి అన్ని విధాలా మూలవిరాట్టునకు చిన్న ప్రతిరూపం. ఈ వెండి విగ్రహాన్ని క్రీ.శ.614లో పల్లవరాణి సామవాయి బహూకరించింది. శ్రీస్వామివారి మూలమూర్తి పాదాలముందర వున్న ఈ భోగమూర్తికే ప్రతి బుధవారం ఉదయం బంగారు వాకిలి ముందర సహస్రకలశాభిషేకం, సహస్ర ధారాభిషేకం జరుపబడుతాయి. ఆ సమయంలో శ్రీ స్వామివారి మూలమూర్తితో భోగ శ్రీనివాసమూర్తిని అనుసంధానిస్తూ, బంగారు తీగతోకాని లేదా పట్టుదారంతో కడతారు. అంటే సాక్షాత్తు మూలమూర్తి యొక్క శక్తులను మంత్రపూర్వకంగా ఈ చిన్న విగ్రహానికి ప్రవహింపచేస్తారు.

సుమారు $1^1/_2$ అడుగుల ఎత్తువున్న ఈ భోగ శ్రీనివాసమూర్తికి ప్రతినిత్యం ఆకాశగంగ తీర్థంతో అభిషేకం జరుగుతుంది.

రాత్రి ఏకాంత సేవా సమయంలో శయన మండపంలో పట్టుపాన్పుపై ఈ భోగ శ్రీనివాస మూర్తినే శయనింపజేస్తారు. అయితే ఒక్క ధనుర్మాసంలో 30 రోజులు మాత్రం ఈ శయన భాగ్యం శ్రీకృష్ణ విగ్రహానికి మాత్రమే కలుగుతుంది.

**3. స్నపన బేరం:** ఉగ్రశ్రీనివాస మూర్తి, వేంకటత్తురైవార్, స్నపన మూర్తి అని ఈ స్వామికి పేర్లు. శ్రీదేవి భూదేవి సహితుడైన ఉగ్ర శ్రీనివాసుని పంచలోహ విగ్రహాలు భోగశ్రీనివాసుని కంటే ముందుగానే ఈ ఆలయంలో ఉండి ఆయా ఉత్సవాల్లో పాల్గొన్నట్లు తెలియవస్తున్నది.

కాని ఒకానొక బ్రహ్మోత్సవ సమయంలో కొన్ని భయంకర పరిణామాలు సంఘనటలు జరిగినందువల్ల, ఆయా ఉత్సవాల్లో ఈ ఉగ్ర శ్రీనివాసమూర్తి విగ్రహాలను ఉపయోగించడం మానివేశారు.

అయినా సంవత్సరంలో ఉత్థానైకాదశి, ద్వాదశి, తిరువారాధన అను ప్రత్యేక పర్వదినాల్లో మాత్రమే ఈ స్వామికి ఉత్సవం జరుపబడుతున్నది. సూర్యరశ్మి తగిలితే స్వామికి ఉగ్రత్వం వస్తుందనీ, నేటికీ పై ఉత్సవాలు సూర్యోదయానికి ముందుగానే జరుగుతాయి. ఈ ఉగ్రశ్రీనివాసమూర్తి విగ్రహం సుమారు 18 అంగుళాలు ఎత్తు కలిగి, 7 అంగుళాల పీఠంపై ఏర్పాటు చేయబడింది.

**4. బలిబేరం:** కొలువు శ్రీనివాసమూర్తి, లేఖన శ్రీనివాసమూర్తి, దర్బార్ శ్రీనివాసమూర్తి అని ఈ స్వామివారికి వున్న పేర్లు. ఇంచుమించు వెండి భోగశ్రీనివాసునివలె వున్న పంచలోహ విగ్రహం ఇది.

ప్రతిరోజు తొలి అర్చనకు ముందుగా మూలమూర్తికి తోమాల సేవ (పుష్పమాలాలంకరణ) వైభవంగా జరుగుతుంది. ఆ తర్వాత స్నపన మండపంలో ఈ కొలువు శ్రీనివాసుణ్ణి బంగారు సింహాసనంపై

వేంచేపు చేసి, ఛత్రచామర మర్యాదలతో ఆస్థానం జరుగుతుంది. ఈ కొలువులో స్వామివారికి పంచాంగ శ్రవణం జరుగుతుంది. ఆనాటి తిధి, వార, నక్షత్ర విశేషాలతో పాటు ఉత్సవ విశేషాలు వినిపిస్తారు. అంతేగాక ముందునాటి ఆదాయాన్ని ఆర్జితం టిక్కెట్లవల్ల, హుండీ వల్ల, వచ్చిన ఆదాయాన్ని, బంగారం వెండి నగలు, పాత్రలు మున్నగు సమస్త వస్తువుల విలువను లెక్కలను గట్టి మొత్తం నికరాదాయాన్ని పైసలవరకు కూడ శ్రీస్వామివారికి అత్యంత భక్తి ప్రపత్తులతో చదివి వినిపిస్తారు. ఈ కొలువు శ్రీనివాసమూర్తి దేవస్థానం లెక్కలను పర్యవేక్షించే అధికారమూర్తి.

**5. ఉత్సవ బేరం:** మలయప్పస్వామి, మలయకునియ నిన్ర పెరుమాళ్, ఉత్సవమూర్తి అని ఈ స్వామికి పేర్లు.

ఈ ఉత్సవమూర్తుల ప్రస్తావన క్రీ.శ.1339 నాటి శాసనంలో కనపడుతున్నది. ఆనాటి నుండి కల్యాణోత్సవం వంటి ఉత్సవాల్లోను, ఊరేగింపుల్లోను, వసంతోత్సవం, బ్రహ్మోత్సవం వంటి వార్షిక ఉత్సవాలలోను ఈ మలయప్పస్వామివారే ఉపయోగింపబడేవారు. అయితే ఈయన కంటే ముందుగా శ్రీదేవి భూదేవులతో కూడియున్న ఉగ్రశ్రీనివాసమూర్తి వారే ఉత్సవాల్లో పాల్గొనేవారు. ఈ ఉగ్రశ్రీనివాసమూర్తికి బదులుగా ఈ మలయప్పస్వామి ప్రవేశించటానికి ఒక కథ వినవస్తున్నది.

పూర్వం ఒకానొక బ్రహ్మోత్సవంలో ఉగ్రశ్రీనివాసమూర్తి ఊరేగింపబడుచుండగా తిరుమల గ్రామంలోని ఇండ్లన్నీ తగులబడ్డాయట! ఈ భయంకర ప్రమాదానికి అర్చకులు, తిరుమల గ్రామస్థులు, భక్తులు భయపడి శ్రీస్వామివారిని వేడుకున్నారట. అప్పుడు స్వామివారు ఒకరియందు ఆవేశించి ఇక మీదట ఈ విగ్రహాలను ఉత్సవాల్లో ఉపయోగింపవద్దనీ, అందుకు అనువుగా వుండే వేరే విగ్రహాలు ఈ కొండలోనే వున్నాయనీ, వానిని తెచ్చి

ఉపయోగించవలసిందని ఆదేశించారట. అర్చకులు వానిని వెదకి తెచ్చి నెలకొల్పినారు. పర్వత మైదానాల్లో దొరికినందు వల్ల ఈ విగ్రహాలను 'మలయకునియనిన్ర పెరుమాళ్' అని పిలవడం జరిగింది. ఈ విగ్రహాలు దొరిగిన స్థలాన్ని 'మలయప్పకోన' అంటారు. ఆ నాటినుండి శ్రీదేవి భూదేవిలతో కూడి ఉత్సవాదుల్లో పాల్గొంటున్న ఈ స్వామివారిని మలయప్పస్వామి అంటారు.

ఈ మలయుప్పస్వామివారి విగ్రహం 14 అంగుళాల పద్మపీఠంపై 3 అడుగుల ఎత్తు కలిగి వున్నది. శ్రీస్వామివారికి కుడివైపున 4 అంగుళాల పీఠంపై 30 అంగుళాల ఎత్తు కలిగిన శ్రీదేవి విగ్రహం, ఎడమవైపున అంతే ఎత్తు కలిగిన భూదేవి విగ్రహం వున్నాయి.

శ్రీ వేంకటేశ్వరస్వామి వారి ఈ పంచమూర్తులే గాక తిరుమల ఆలయంలో ఇంకా ఇతర విగ్రహమూర్తులు కూడా చోటు చేసుకున్నాయి. అవి-

1. శ్రీ సుదర్శన చక్రత్తాళ్వారు, 2. శ్రీ సీతారామలక్ష్మణులు, 3. శ్రీ రుక్మిణీ శ్రీకృష్ణులు, 4. శ్రీ వేంకటేశ్వరుని సేవాపరివార దేవతలైన (ఎ) అనంతుడు, (బి) విష్వక్సేనుడు, (సి) గురుత్మంతుడు, 5. శ్రీరాముని సేవా పరివార దేవతలయిన (ఎ) సుగ్రీవుడు (బి) అంగదుడు (సి) ఆజ్ఞాపాలక ఆంజనేయస్వామి - మున్నగు విగ్రహమూర్తులు వున్నాయి. వీటిల్లో రుక్మిణీ శ్రీ కృష్ణుల విగ్రహాలు వెండి మూర్తులు. మిగిలినవన్నీ పంచలోహ ప్రతిమలే.

తిరుమల శ్రీవారి ఆలయంలో శ్రీ వేంకటేశ్వరస్వామివారి మూలమూర్తితోపాటు కొలువైవున్న మూర్తులన్నింటికి ఆయా విశేషదినాల్లో, ఆ యా మూర్తులకు ఉత్సవాలు, సేవలు నిర్వహింపబడుతున్నాయి.

ఇలా తిరుమల శ్రీ వేంకటేశ్వరస్వామి ఆనంద నిలయంలో పంచమూర్తులుగా కొలువై వుండి, భక్తులచే పూజలందుకుంటున్నాడు. నిండుగా అనుగ్రహిస్తున్నాడు. ఇలా పంచబేరాలుగా వెలసివున్న శ్రీనివాసమూర్తికి భక్తులు తమకు ఇష్టమైన రీతుల్లో, తీరుల్లో మొక్కుకొని కైంకర్యం చేస్తుంటారు. తిరుమల స్వామి ఆ అన్ని రూపాల్లో వేంచేసి భక్తుల ఆచార వ్యవహారాల వేర్వేరు అయినా, వారి భాషలు ఒక్కటి కాకపోయినా, వారు మొక్కులను వింత వింతలుగా చెల్లించినా, వాటి నన్నింటిని స్వీకరించి, వారు కోరిన కోరికల నన్నింటినీ తీరుస్తుంటారు. ఒక్క మానవమాత్రులే కాదు. ముక్కోటి దేవతలు సైతం కలియుగ వైకుంఠనాథుని దర్శనానికి వస్తారు. ఇటు రాత్రి బ్రహ్మాది దేవతలచేతా, అటు పగలు మానవుల చేతా నిరంతరం నిరంతరాయంగా సేవింపబడుతూ, తన కడగంటి చూపులతో అందరినీ సంపూర్ణంగా అనుగ్రహిస్తున్న శ్రీనివాస ప్రభువునకు సాటిరాగల దేవుడు ఇంకొకడు లేడు, లేనే లేడు. ఆ దేవునికి సాటి ఆ దేవుడే!

"ఈ మాటా గర్వము కాదు
నీ మహిమే కొనియాడితి గాని"

ఇట్లు
రచయిత
**జూలకంటి బాలసుబ్రహ్మణ్యం**

# కృతజ్ఞతాంజలి

తిరుమల యాత్రికులు, భక్తులు తిరుమలేశుని ఉత్సవాలను గూర్చి వివరంగా తెలుసుకొని తరించవలెననే ఉద్దేశంతో 'శ్రీనివాస వైభవం' గ్రంథాన్ని సరళమైన వచనంలో రచించాను.

ఈ విషయసేకరణలో తిరుమల శ్రీవారి ఆలయం వైఖానస అర్చక వరేణ్యులెందరో తోడ్పడినారు. ముఖ్యంగా తి.తి. దేవస్థానం వైఖానసాగమ సలహాదారులయిన శ్రీమాన్ మాడంబాకం శ్రీనివాస భట్టాచార్యులు మున్నగు వారు మిక్కిలి తోడ్పడ్డారు. వారికి నా కృతజ్ఞతా పూర్వక నమస్కారములు.

తి.తి దేవస్థానంవారి వేంకటాచల మాహాత్మ్య గ్రంథాలు, శ్రీ వేదాంతం జగన్నాథాచార్యులు రచించిన "శ్రీ వేంకటేశ్వర వైభవం" గ్రంథం ఈ రచనకు చాలా తోడ్పడినాయి. ఇంకా శ్రీ సాధుసుబ్రహ్మణ్య శాస్త్రి, శ్రీ టి.కే.టి. వీరరాఘవాచార్యులు వంటి మహనీయులు అనేకులు తిరుమల గురించి గ్రంథాలు వ్రాశారు. వారందరి గ్రంథాలు ఈ రచనకు ఎంతగానో తోడ్పడినాయి. వారందరికీ నమస్కారములు.

తిరుమల తిరుపతి దేవస్థానములోని అన్ని ఆలయాల ఉత్సవాలను, ఊరేగింపులను వైభవంగా నిర్వహింప జేయడంతోపాటు వాటిని గూర్చి తిరుమల భక్తులకు తెలియజేయాలన్న సంకల్పంతో ఈ "శ్రీనివాస వైభవం" గ్రంథాన్ని తి.తి. దేవస్థానంవారి ధార్మిక ప్రచురణగా వెలువరింపజేసి, భక్తలోకానికి కానుక పెట్టిన తిరుమల తిరుపతి దేవస్థానం కార్యనిర్వహణాధికారులు, నిరంతర పరిపాలన కార్యక్రమ నిమగ్నులు భక్తజన సేవాతత్పరులు, సౌమ్యులు, సౌజన్యమూర్తులు అయిన శ్రీ ఎ.పి.వి. నారాయణ శర్మ, ఐ.ఎ.ఎస్., గారికి భక్తి పూర్వక ప్రణామాంజలులు.

పరిపాలనా బాధ్యతలతో నిరంతరం దీక్షగా దేవస్థానంలోని అన్ని శాఖలను తీర్చిదిద్దుతున్నప్పటికీ ప్రత్యేకంగా దేవస్థానం ధార్మిక ప్రచురణలయందు విశేష దృష్టిని సారించిన సాహితీతత్పరులు,

సహృదయమూర్తులు తి.తి. దేవస్థాన సంయుక్త కార్యనిర్వహణాధికారి శ్రీ ఎన్. ముక్తేశ్వరరావు, ఐ.ఎ.ఎస్., గారు, ఈ "శ్రీనివాస వైభవం" ప్రచురణ విషయంలో చాలా ప్రోత్సాహాన్ని అందించారు. వారికి భక్తి పూర్వక నమస్కారములు.

నిరంతరం భక్తజన సేవలో నిమగ్నులయినప్పటికీ, కాల నియమం పాటించకుండా వలసినపుడు శ్రీవారి ఉత్సవాల, సేవల విషయసేకరణలో నిండుగా, మెండుగా సహాయ సహకారాలందించి ఈ పుస్తక రచనకు తోడ్పడిన భక్తితత్పరులు, సహృదయులు తిరుమల శ్రీవారి ఆలయం ప్రత్యేకాధికారులు శ్రీయుతులు శ్రీ ఎ.వి. ధర్మారెడ్డి గారికి కృతజ్ఞతా పూర్వక నమస్కారములు.

ఆధ్యాత్మిక గ్రంథ రచనా విషయంలో ఏమాత్రం అలసత్వం ఉండకూడదని వెన్ను తట్టి ప్రోత్సహిస్తున్న తి.తి.దేవస్థానం పి.ఆర్.ఒ. డా॥ పి. రంగారావుగారికి నమస్కారములు.

ఈ రచన ప్రారంభించినది మొదలు ముద్రణవరకు అనేక విధాలుగా తోడ్పడుతూ సహకరించిన 'సప్తగిరి' ఎడిటర్ డా॥ ఎన్.ఎస్. రామమూర్తి గారికి మరియు నా సహోద్యోగులందరికీ నమస్కారములు.

ఈ గ్రంథాన్ని చక్కగా తీర్చిదిద్ది ముద్రించుటలో అత్యంత శ్రద్ధవహించిన, తి.తి. దేవస్థానం ప్రెస్ మేనేజరు గారికి, డి.టి.పి. సెక్షన్ సిబ్బందికి కృతజ్ఞతలు.

ఈ పరిశీలనలో, రచనలో ఇంకా ఏవైన విశేషాలు, లభ్యమైనచో వీటిని తర్వాతి ముద్రణలో చేర్పించగలనని, అలాగే అచ్చుతప్పులను కూడా సరిదిద్దగలనని తెలియజేస్తున్నాను.

తిరుమలేశుని భక్తులు, యాత్రికులు, 'శ్రీనివాసవైభవం' గ్రంథాన్ని చదివి తద్వారా ఆనందనిలయుని వైభవాన్ని తెలుసుకొని ఆనందించగలరని ఆశిస్తున్నాను.

శ్రీ హనుమజ్జయంతి — ఇట్లు

బుధవారం, 1 జూన్ 2005 — **జూలకంటి బాలసుబ్రహ్మణ్యం**

# ఇందులో...........

* * *



ఆనందనిలయం, విమాన వేంకటేశ్వరస్వామి

# శ్రీనివాస వైభవం

## (శ్రీవారిసేవలు – ఉత్సవాలు)

## ఆనందనిలయుని ఆలయ దినచర్య

తిరుమల శ్రీవేంకటేశ్వరస్వామివారి ఆలయం, ప్రతిరోజు 'సుప్రభాతం' అనబడే 'మేలుకొలుపు' సేవతో కార్యక్రమం ప్రారంభమై బంగారువాకిళ్ళు తెరవబడతాయి. అనంతరం ఉదయం వరుసగా శ్రీవారికి తోమాలసేవ, కొలువు, సహస్రనామార్చన, మొదటిగంట (నైవేద్యం) మళ్ళీ మధ్యాహ్నం అష్టోత్తర శతనామార్చన, రెండవగంట (నైవేద్యం), కల్యాణోత్సవం, వసంతోత్సవం, బ్రహ్మోత్సవం, డోలోత్సవం, సహస్రదీపాలంకర సేవలు మళ్ళీ రాత్రిసేవలుగా, తోమాలసేవ, అష్టోత్తరశతనామార్చన, రాత్రిగంట (నైవేద్యం) కార్యక్రమాలు నిర్వహింపబడతాయి. చివరగా రాత్రి శ్రీస్వామివారికి పవ్వళింపుసేవ (ఏకాంత సేవ )తో నిత్యపూజా కార్యక్రమం పూర్తి అయి ఆలయద్వారం మూసివేయబడుతుంది.

క్రమం తప్పకుండా నిత్యమూ విధిగా జరిగే శ్రీవారి ఆలయకార్యక్రమాన్నీ, ఆ తర్వాత తిరుమలేశునికి జరిగే ఉత్సవాల నన్నింటిని మరింత విపులంగా ఈ గ్రంథంలోని మొదటి అధ్యాయంలో తెలుసుకుందాం.

**సన్నిధిగొల్ల**

తిరుమలలో నేటికి ప్రతిదినం ప్రప్రథమంగా శ్రీస్వామివారి దర్శన భాగ్యాన్ని పొందుతున్న వ్యక్తి 'సన్నిధిగొల్ల'. ఆదిలో శ్రీ వేంకటేశ్వరస్వామివారిచే మొదటి దర్శన భాగ్యాన్ని వరంగా పొందిన ఆనాటి గోపాలకుని (యాదవుని) సంతతికి చెందిన వ్యక్తే ఈ గొల్ల. తిరుమల స్వామివారి సన్నిధి సేవతో సంబంధించినవ్యక్తి కాబట్టి 'సన్నిధి గొల్ల' అని అంటారు.

ప్రతిదినం బ్రాహ్మముహూర్తంలో (తెల్లవారుజామున 2-30 - 3-00 గంటల ప్రాంతంలో) సన్నిధిగొల్ల, శుచిస్నాతుడై తిరునామములు ధరించి, గోవిందనామాన్ని స్మరిస్తూ దివిటీ (పొంజు అంటారు) పట్టుకొని తిరుమల ఉత్తర మాడవీధిలో ఉన్న శ్రీస్వామివారి సేవాకైంకర్యపరులైన వైఖానసులైన అర్చకుల 'తిరుమాళిగ' (ఇంటికి)కు వెళ్లి భక్తిపూర్వకంగా వారికి నమస్కరించి ఆ అర్చకస్వాములను ఆలయానికి ఆహ్వానిస్తాడు.

**శ్రీవారి అర్చకులు**

శ్రీ స్వామివారి అర్చకులు (ఒకరిద్దరు) అప్పటికే కాలకృత్యాలు నెరవేర్చుకొని శుచి స్నాతులై ఊర్ధ్వపుండ్రాలను ధరించి సంధ్యావందనాది అనుష్ఠానాలను పూర్తిచేసికొని 'కుంచెకోల' అనబడే పెద్దకొడవలిలాంటి ఆకారం కలిగిన (ఇనుపకొక్కెం) పరికరాన్ని భుజంపై పెట్టుకొని తాళంచెవులగుత్తిని తీసికొని, మనసులో శ్రీస్వామివారిని ధ్యానిస్తూ, గోవిందనామాన్ని మౌనంగా జపిస్తూ, స్వామివారి కైంకర్యానికి ఆహ్వానించవచ్చిన సన్నిధిగొల్లను అనుసరిస్తారు. అత్యంత శుచిగా, మడిగా శ్రీస్వామివారి అర్చనకు బయలుదేరిన ఆ అర్చకవరులకు దారిలో ఎలాంటి ఇబ్బందులు కలుగకుండా ఇతర వ్యక్తులు వారిని తాకకుండా 'శ్రీవారి కైంకర్యపరులకు దారీ' అని సన్నిధిగొల్ల హెచ్చరిస్తూ దివిటీ వెలుగులలో వారిని దేవాలయానికి పిలుచుకొని వస్తాడు.

అర్చకులు దారిలో శ్రీభూవరాహ స్వామివారి ఆలయ శిఖరానికి భక్తిపూర్వకంగా ఆత్మప్రదక్షిణంచేస్తూ నమస్కరించి, గొల్లను అనుసరిస్తూ శ్రీవారి ఆలయం యొక్క మహాద్వారం (పడికావలి) వద్దకు చేరుకుంటారు. ఇలా అర్చక స్వాములు పడికావలి దగ్గరకు వస్తూండగా, (ఆలయ గోపురానికి ఎదురుగా మెట్లకు దక్షిణంవైపున మేడమీదవున్న నగారా మండపం (నౌబత్‌ఖానా)లో) శ్రీవారి అర్చకుల రాకను తెలియ జేయడానికన్నట్లుగా పెద్దపలక గంట మోగిస్తారు. అప్పుడు మహాద్వారం తెరవబడుతుంది. ఘంటావాదనంతో ఆలయ సిబ్బంది ప్రక్కకు తొలగుతుండగా, గొల్ల ముందుపోతూవుండగా అర్చకులు ప్రధాన ద్వారదేవతలకు మంత్రోచ్చారణ పూర్వకంగా నమస్కరిస్తూ ఆలయప్రవేశం చేస్తారు. ఆ తర్వాత కుంచెకోలను, తాళంచెవులను ధ్వజస్తంభం దగ్గరవున్న క్షేత్రపాలక శిలకు భక్తితో తాకించి, ధ్వజస్తంభం, బలిపీఠాల దగ్గర సాష్టాంగ నమస్కారం చేసి, వాటికి

ప్రదక్షిణంగా వెండివాకిలి (నడిమిపడికావలి) లోనికి వెళ్ళి నేరుగా బంగారువాకిలి దగ్గరకు చేరి మౌనంగా జపం చేసికొంటూ వుంటారు.

**జియ్యంగార్లు**

అర్చకులను పిలుచుకొని వచ్చిన గొల్ల శ్రీస్వామివారి సన్నిధివీధిలో బేడి ఆంజనేయస్వామివారి ఆలయం దగ్గర వున్న శ్రీమాన్ పెద్దజియ్యంగారి మఠానికి వెళ్లి, జియ్యంగారు గానీ, లేదా వారి పరిచారకుడైన 'ఏకాంగి'గాని వెంటరాగా, ఆలయానికి వస్తాడు.

**పేష్కారు**

ఇంతలో ఆలయ అధికారి అయిన పేష్కారు కూడా ఆలయానికి విచ్చేస్తారు.

## "సుప్రభాతం - మేలుకొలుపు'

**సేవాపరులు**

ఆ సమయానికే 'సుప్రభాతం' పఠించే అధ్యాపకులైన ముగ్గురు లేదా నలుగురు వేదపండితులు శుచిస్నాతులై అత్యంత భక్తి ప్రపత్తులతో బంగారువాకిలి వద్దకు విచ్చేసి సంసిద్ధులై ఉంటారు.

అలాగే తాళ్లపాక అన్నమయ్య వంశానికి చెందినవారొకరు తంబురపట్టుకొని 'మేలుకొలుపు' సంకీర్తన పాడటానికి బంగారువాకిలి దగ్గర సిద్ధంగా ఉంటారు.

**సుప్రభాత సేవలో భక్తులు**

ఇంతలో 'సుప్రభాత సేవ'కు నిర్ణీత రుసుమును చెల్లించిన భక్తులను 'వైకుంఠం క్యూ' ద్వారా ఆలయంలోనికి ప్రవేశింపజేస్తారు. వీరంతా బంగారువాకిలి ముందు దక్షిణం వైపు పురుషులు - ఉత్తరం వైపు స్త్రీలు వరుసగా నిలిచి వుంటారు.

**బంగారువాకిలి తాళాలు**

ఇలా అర్చకులు, జియ్యంగార్, ఆలయ అధికారులు అధ్యాపకులు, తాళ్లపాకంవారు, సన్నిధిగొల్ల, సుప్రభాతసేవా భక్తులు ...... వీళ్లందరూ బంగారువాకిలి ముందు చేరి సిద్ధంగా వున్న సమయంలో, ముందుగా అర్చకులు తమ దగ్గరవున్న 'కుంచెకోల'తో బంగారు వాకిలికి గల చిన్నరంధ్రం ద్వారా లోపల

వేసివున్న గడియను బయటినుంచే తీస్తారు. పిమ్మట వాకిలి మధ్యలో గడియకు వేయబడియున్న తాళాన్ని అర్చకులు తమ వద్దగల తాళంచెవితో తీస్తారు.

అటు తర్వాత సన్నిధిగొల్ల పేష్కరు దగ్గరగల సీలువేసిన చిన్నసంచి (తిత్తిని) అందరికి చూపించి దానిని విప్పి, అందులో వున్న తాళంచెవులతో, బంగారు వాకిలికి సీలు వేయబడియున్న మూడు పెద్ద తాళాలను, సీళ్లను అందరికి చూపించి తీస్తాడు. అర్చకులు జియ్యంగారు ఆలయ అధికారులు – ఈ ముగ్గురి సమక్షంలో గొల్ల బంగారు వాకిళ్లకు వున్న తాళాలను తీస్తాడు. ఈ ముగ్గురిలో ఏ ఒక్కరు లేకపోయినా బంగారు వాకిలి తాళాలు తీయడంకానీ, వేయడంకానీ జరగదు.

**మేలుకొలుపు పాట – సుప్రభాతం**

ఇలా బంగారువాకిలి గడియలకు వేసియున్న తాళాలను తీసిన వెంటనే సన్నిధిగొల్ల బంగారు వాకిలిని తెరచి దివిటీతో ముందుగా లోపలికి ప్రవేశిస్తాడు. ఆ వెనువెంటనే శ్రీవారి అర్చకులు బిగ్గరగా

**కౌసల్యా సుప్రజారామ, పూర్వాసంధ్యా ప్రవర్తతే**
**ఉత్తిష్ఠ నరశార్దూల! కర్తవ్యం దైవమాహ్నికమ్.**

అని సుప్రభాత పఠనాన్ని ప్రారంభిస్తూ బంగారువాకిలి లోపల ప్రవేశిస్తారు. ఆ వెనువెంటనే ఏకాంగి మహంతుమఠంవారు తెచ్చిన పాలు, చక్కెర, వెన్న, తాంబూలం – ఈ వస్తువులుగల పళ్లాన్ని స్వీకరించి లోనికి వెళ్లిన వెంటనే బంగారు వాకిళ్లు మళ్లీ దగ్గరికి మూస్తారు.

బంగారు వాకిలి ముందు వున్న అధ్యాపకులు, అర్చకులు ప్రారంభించిన సుప్రభాత పఠనాన్ని వెంటనే అందుకొంటూ శ్రీస్వామివారి సుప్రభాత స్తవాన్ని సుభగంగా పఠిస్తారు. సుప్రభాతం, స్తోత్రం, ప్రపత్తి, మంగళాశాసనం అనే నాలుగు భాగాలుగా ఉన్న శ్రీవేంకటేశ్వర సుప్రభాతస్తుతి శ్లోకాలు తెల్లవారు జామున ప్రశాంత వాతావరణంలో తిరుమల క్షేత్రమంతా ప్రతిధ్వనించి భక్తులందరిని మైమరపింపజేస్తూ వుంటాయి.

## మేలుకొలుపు పాట

అటు ఆచార్యపురుషులు సుప్రభాతాన్ని ప్రారంభించి పఠిస్తూ వుండగా, సరిగ్గా అదే సమయంలో బంగారువాకిలి దగ్గర నిలిచి తంబురా మీటుతూ తాళ్లపాక అన్నమయ్య వంశీయులు ఒకరు భూపాళరాగంలో

మేదిని జీవుల గావ మేలుకోవయ్యా
నీదయే మాకెల్లరక్ష నిద్ర మేలుకోవయ్యా

తగు గోపికల కన్నుదామెరలు వికసించె
మిగుల సూర్యనేత్రుడ మేలుకోవయ్యా!
మిగుల రాక్షసులనే తిమిరము విరియగ
నెగడిన పరంజ్యోతి నిద్ర మేలుకోవయ్యా!

ఘన దురితపు నల్లగలువలు వికసించె
మినుకు శశివర్ణుడ మేలుకోవయ్యా
పనివడి వేదాలను పక్షులెల్లా బలుకగ
జనక యాశ్రిత పారిజాత మేలుకోవయ్యా

వరలక్ష్మీ కుచ చక్రవాకము లొండొంటిరాయ
మెలయు దోషారహిత మేలుకోవయ్యా!
పొలసీ నీవు నిత్యభోగములు భోగించ
నిరతి శ్రీవేంకటేశ నేడు మేలుకోవయ్యా

అంటూ స్వామివారికి మేలుకొలుపులు పాడుతారు.

ఇలా అధ్యాపకులచేత సుప్రభాతం, తాళ్లపాకవారిచే మేలుకొలుపు పాటలు సాగుతుండగా బారులుతీరి నిలిచియున్న భక్తజనం అత్యంత భక్తి శ్రద్ధలతో మైమరచి ఆలకిస్తూ ఎప్పుడెప్పుడా బంగారు వాకిళ్లు తెరిచేది, ఆశ్రిత వత్సలుడైన ఆ దివ్యమంగళమూర్తిని ఎప్పుడెప్పుడా దర్శించేది! అని మేనెల్ల కన్నులు చేసికొని ఆతురతతో బంగారువాకిలివైపు ఎదురుచూస్తూవుంటారు.

## స్వామివారి సన్నిధిలో

అర్చకులు లోపలికి వెళ్లినవెంటనే బంగారువాకిలి వేసిన అనంతరం, సన్నిధి గొల్ల దివిటీతో అర్చకులను సన్నిధివరకు తీసుకొని వెళ్తాడు. అర్చకులు

రాములవారి మేడకు వేసియున్న తలుపు తాళాలను తీసి, శయన మండపంలోపల పాన్పుపై వున్న శ్రీభోగశ్రీనివాసమూర్తికి ప్రదక్షిణంగా వెళ్లి సన్నిధిలో ప్రవేశిస్తారు.

**తొలిదర్శనం**

దివిటీతో ముందుగా లోపలికి వెళ్లిన 'సన్నిధిగొల్ల' కులశేఖరపడికి ఇవతలే నిలిచి వుండి దివిటీ వెలుగులో శ్రీ వేంకటేశ్వర స్వామివారిని తొలిగా దర్శిస్తాడు. ఆ పిదప ఆ వెలుగులో శ్రీవారి అర్చక స్వాములు, ఏకాంగి కులశేఖరపడి దాటి లోపల ప్రవేశిస్తారు.

సన్నిధి సమీప స్థలానికి వెళ్లిన వెంటనే గొల్లచేతిలోని దివిటీని ఏకాంగి తీసుకొని స్వామివారి సన్నిధిలో దీపాలు వెలిగించి మళ్లీ గొల్లకు అందిస్తాడు. అపుడు గొల్ల రాములవారి మేడలోని దీపాలను వెలిగిస్తాడు.

శ్రీవారి అర్చకులు తొలుత శ్రీవేంకటేశ్వర స్వామివారి మూలమూర్తి దగ్గరకు వెళ్లి పాదనమస్కారం చేసికొని, మళ్లీ శయన మండపంలో పవ్వళించివున్న భోగ శ్రీనివాసమూర్తి సమీపానికి వచ్చి నమస్కరించి, చప్పట్లు చరచి శ్రీవారిని మేల్కొనవలసినదిగా ప్రార్థించి భోగ శ్రీనివాసమూర్తి వారిని శ్రీవారిమూలమూర్తి సన్నిధిలో పాదలములచెంత (జీవస్థానంలో) వేంచేపు చేయిస్తారు.

**నవనీత హారతి**

పిదప ఆనందనిలయంలో కులశేఖరపడి వద్ద తెరవేసి, శ్రీస్వామివారికి దంతధావన జిహ్వాలేఖన ఆచమనాది అనుష్ఠాన క్రియలు సమర్పించి, మహంతుమఠం వారు తెచ్చిన నవనీతాన్ని, పాలు, చక్కెర నైవేద్యమిచ్చి సుగంధతాంబూలాన్ని సమర్పిస్తారు.

అనంతరం బంగారువాకిలి ముంగిట్లో అధ్యాపకులు సుప్రభాత మంగళాశాసనాన్ని ముగిస్తూవుండగా, లోపల అర్చకులు శ్రీవారికి నవనీత హారతి ఇస్తూవుండగా బంగారువాకిళ్లు తెరవబడతాయి. ఆ నవనీత హారతి వెలుగుల్లో కొంగొత్త వెలుగు లీనుతూ కలియుగ ప్రత్యక్షదైవమైన శ్రీవేంకటేశ్వరస్వామివారి దివ్యమంగళమూర్తి కన్నులపండువుగా దివ్యదర్శనం ప్రసాదిస్తారు. నవనీత నివేదనతో పాటు ఇచ్చే కర్పూర హారతిని 'నవనీతహారతి' అంటారు. నవనీతహారతి

అయింతర్వాత అర్చకులు తాము రాత్రి బ్రహ్మాదిదేవతలు అర్చించడానికి మూలసన్నిధిలో ఉంచిన తీర్థమును, చందనాన్ని, శఠారిని తొలుదొల్త స్వీకరిస్తారు. ఆ తర్వాత అర్చకులు జియ్యంగారికి, ఏకాంగికి ఇస్తారు. అటుపిమ్మట గొల్లకు తీర్థశఠారితో పాటు నవనీతహారతిలోని తాంబూలం అర్చకులచే ఇవ్వబడుతుంది.

ఈ హారతి అయిన వెంటనే జియ్యంగార్, ఏకాంగి, గొల్ల బంగారువాకిలి వెలుపలికి రాగా దేవస్థానం పరిచారకులు లోనికి వెళ్లి శ్రీవారి పాన్పును, మంచాన్ని తీసి బయటగల సభేరా గదిలోనికి తెచ్చి వుంచుతారు.

**విశ్వరూప సందర్శనం**

అనంతరం సుప్రభాతం పఠించిన అధ్యాపకులు, పిదప అన్నమాచార్య వంశీయుడు, మహంతు, మైసూరు వంతువారు ఇంకా స్వామివారి కైంకర్యంలో పాలుపంచుకొను స్థానీయులు ...... ఇలా వరుసగా శ్రీస్వామివారి సన్నిధిలోనికి క్రమంగా వెళ్లి హారతి, తీర్థం, చందనం, శఠారి మర్యాదలు పొందుతారు. వీరందరికీ స్వామివారికి సమర్పించిన చందనం, వెన్న కొద్ది కొద్దిగా ప్రసాదంగా ఇవ్వబడుతుంది.

ఆ తర్వాత ఆలయ అధికారులు లోనికి ప్రవేశించగా సర్కారు (దేవస్థానం) వారి హారతి జరిపి, తీర్థ, చందన, నవనీతప్రసాద శఠారి మర్యాదలు జరుగుతాయి.

పిదప శ్రీస్వామివారి సుప్రభాత సేవకు వచ్చియున్న భక్తులు శ్రీస్వామివారి సన్నిధికి వెళ్లి శ్రీవారిని సందర్శించి తీర్థశఠారులు స్వీకరించి ధన్యులవుతారు.

సుప్రభాతసేవలో భక్తులకు శ్రీస్వామివారి బంగారు పాద దర్శనం జరుగుతుంది. స్వామివారిపై ఎలాంటి నిర్మాల్యం (పూలు, తులసివగైరా) లేకుండా ఆపాదమస్తకం దివ్య సుందరమూర్తిని దర్శించే ఈ మహదవకాశమును 'విశ్వరూప సందర్శనం' అంటారు. తోమాలసేవకు ముందటి దర్శనం ఇది. ఈ దర్శనం చేస్తే పాపాలన్నీ పోతాయట. అందువల్లే 'పాద దర్శనం పాపవిమోచనం' అని కూడ శ్రీవారి విశ్వరూప దర్శనానికి ప్రసిద్ధి ఏర్పడింది.

**అంగప్రదక్షిణ సేవ**

సాష్టాంగ నమస్కారం చేస్తూవున్న భంగిమలో పొర్లుతూ చేసే ప్రదక్షిణమే అంగప్రదక్షిణం అనీ, పొర్లుదండాలు అనీ అంటారు. ఈ అంగప్రదక్షిణం విమాన ప్రదక్షిణ మార్గంలో చేయబడుతుంది. ఈ సేవకు ఎలాంటి రుసుము ఉండదు, లేదు.

ఈ సేవలో పాల్గొనదలచిన భక్తులు తెల్లవారుజామున రెండున్నర మూడు గంటలవేళ శ్రీస్వామి పుష్కరిణిలో మునిగి తడివస్త్రాలతో మాత్రమే రావలసి వుంటుంది. వీరిని ప్రత్యేకంగా క్యూద్వారా, ఆలయంలోనికి అనుమతిస్తారు.

ప్రతిరోజూ తెల్లవారు జామున మూడు గంటల ప్రాంతంలో అధ్యాపకులు 'కౌసల్యా సుప్రజారామ!.......' అని సుప్రభాత పఠనం ప్రారంభించగానే, దాదాపు మూడింటి ప్రాంతంలో అంగప్రదక్షిణం చెయ్యదలచిన భక్తులను ప్రవేశపెడతారు. ఈ భక్తులు వెండివాకిలిదాటిన పిమ్మట గరుడమండపం వద్దనుండి స్వామివారికి సాష్టాంగ నమస్కారంచేస్తూ, పొర్లుదండాలు పెట్టడం ప్రారంభిస్తారు. విమానప్రదక్షిణ మార్గం గుండా పొర్లుదండాలు చేస్తూ తిరిగి గరుడమండపం వద్దకు చేరుకోగానే, అనగా ఒక్కపర్యాయం చుట్టిరాగానే భక్తుల అంగప్రదక్షిణ సేవ పూర్తి అవుతుంది.

ఈ అంగప్రదక్షిణ సేవలో పాల్గొనదలచిన స్త్రీలకు మాత్రమే తోడుగా మరొక్కరిని అనుమతిస్తారు.

ఈ ప్రదక్షిణ సేవలో పాల్గొన్న భక్తులను, శ్రీ స్వామివారికి 'తోమాల సేవ' జరుగుతున్న సమయంలో వీలునుబట్టి మాత్రమే బంగారు వాకిలి వద్దనుండే శ్రీవారి దర్శనానికి అనుమతిస్తారు. శుక్రవారంనాడు సుప్రభాతం అయిన వెంటనే శ్రీస్వామివారి మూలవిరాట్టునకు అభిషేకం జరుగవలసియున్నందును అంగప్రదక్షిణంలో పాల్గొన్న భక్తులకు శ్రీవారి దర్శన అవకాశం కల్పింపబడదు.

రాత్రివేళ బ్రహ్మాది దేవతలు శ్రీ వేంకటేశ్వర స్వామివారిని అర్చించి, వెళ్లిన వెంటనే అంగప్రదక్షిణ సేవలో పాల్గొంటూ ఆలయం చుట్టూ సాష్టాంగ ప్రదక్షిణం చెయ్యడం ఎంతో శ్రేయోదాయకం. ఎన్నో శరీర రుగ్మతలు, అంతుబట్టని రోగాలు, కాయిలాలు పోతాయనీ, పాపాలన్నీ తొలగి, కోరికలు తీరతాయని పెద్దలమాట, భక్తుల అనుభవంలో వున్న నిత్య సత్యము కూడ!.

**శుద్ధి**

సుప్రభాతానంతరం భక్తులందరూ దర్శించి వెళ్లిన తర్వాత గర్భాలయంలో ఆలయ పరిచారకులు శుద్ధిచేస్తారు. ఆ సమయంలోనే కులశేఖరపడి నుండి గరుడమండపం వరకు ఆలయ సిబ్బంది ఊడ్చి శుభ్రంచేస్తారు.

**తోమాలసేవకు సిద్ధం**

ఆకర్షణీయంగా ఉండే రకరకాల రంగు రంగు పూలతో కూర్చబడు దండలతోను, సుగంధం వెల్లివిరిసే సుమమాలలతోను, తులసీ మాలలతోను శ్రీస్వామివారిని అలంకరిచడమే తోమాలసేవ.

ముందురోజు రాత్రే, గులాబీ, గన్నేరు, మల్లె, సన్నజాజులు, చేమంతులు, సుగంధాలు, సంపెంగలు, మొగలి ...... ఇలా ఆయాకాలాల్లో లభించే వివిధ పరిమళ పుష్పాలతో తయారు చేయబడిన మాలలు ఆలయంలోని 'పుష్పఅర' (ప్రస్తుతం యోగనరసింహస్వామి ఆలయం ప్రక్కన)లో పెద్దవెదురుగంపలో సిద్ధంగా ఉంచబడతాయి.

ఈ మాలలుగల పాత్తం (వెదురుగంప)ను జియ్యంగారు తలపై పెట్టుకొని, ఛత్రచామర దివిటీల సమేతంగా పలకగంట, సన్నడోలు మోగుతుండగా, సన్నిధిగొల్ల దివిటీతో ముందు హెచ్చరిస్తూ నడుస్తుండగా పుష్ప అర నుండి బయలుదేరి ధ్వజస్తంభానికి ప్రదక్షిణం చేస్తూ వెండివాకిలి (నడిమిపడికావలి) లోనికి వచ్చి విమాన ప్రదక్షిణం చేస్తూ, బంగారువాకిలిగుండా వేంచేసి శ్రీవారి సన్నిధిలో సమర్పిస్తారు. ఈ పూలదండలను అర్చకస్వామి నీళ్లుచల్లి శుద్ధి పరుస్తారు.

ఈ రీతిగా తోమాలసేవకు సిద్ధమైన పిమ్మట శ్రీభోగశ్రీనివాసమూర్తికి అభిషేకం ప్రారంభమవుతుంది.

**ఆకాశగంగ తీర్థం**

ఇంతలో, పూర్వం శ్రీవారి నిత్యాభిషేక సేవాకైంకర్యంలో పాలుపంచుకొన్న మహాభక్తుడు తిరుమలనంబివారి వంశీకులు 'ఆకాశగంగతీర్థం' నుండి వెండి బిందెలతో నిర్మల జలాన్ని ఛత్రచామరమంగళవాద్య మర్యాదలతో తీసికొనివస్తారు. ఈ తీర్థాన్ని ఆలయ ప్రదక్షిణం చేస్తూ వెళ్లి స్వామివారి సన్నిధిలో ఉంచుతారు.

## భోగ శ్రీనివాసమూర్తికి అభిషేకం

అర్చకస్వామి తాను ఆచమించి, భక్తి పూర్వకంగా స్వామికి నమస్కరించి కౌతుక మూర్తియగు భోగశ్రీనివాసమూర్తిని వెండి స్నానపీఠంపై వేంచేపు చేసి అర్ఘ్యపాద్యాచమనాది అనుష్ఠాన ఉపచారాలు సమర్పిస్తారు. తర్వాత ఆకాశగంగాతీర్థంనుండి తేబడిన జలంతో అభిషేకం చేస్తారు.

పిదప శ్రీవేంకటేశ్వరస్వామివారి నిజ పాదములపై తొడుగుగా వున్న బంగారు పాదాలను తీసి స్నానవేదికపై ఉంచి ఆకాశ గంగతో అభిషేకం చేస్తారు.

ఇలా భోగశ్రీనివాసమూర్తికి, శ్రీవారి మూలవరుల బంగారుపాదాలకు ఆకాశగంగా తీర్థంతో అభిషేకం జరుగుతుండగా వేద పండితులు పురుషసూక్తం పఠిస్తారు. ఆ తర్వాత అర్చకవర్యులు శ్రీవారి సన్నిధిలో గల నృసింహ, రామ ఇత్యాది సాలగ్రామాలకు అభిషేకం చేస్తారు. అటుపిమ్మట మూలమూర్తికి, వక్షఃస్థల లక్ష్మికి, శ్రీదేవి భూదేవి సహితుడైన మలయప్పస్వామివారికి, ఉగ్రశ్రీనివాసమూర్తికి, కొలువు శ్రీనివాసమూర్తికి..... ఇలా సన్నిధిలో వున్న అన్ని విగ్రహాలకు అభిషేకం చేయించినట్లుగా ఆకాశగంగాతీర్థాన్ని సంప్రోక్షిస్తారు.

ఇలా అభిషేకం జరిగేరోజున రోహిణి నక్షత్రంవున్నట్లయితే, భోగ శ్రీనివాస మూర్తితో పాటు, సన్నిధిలోనేవున్న రుక్మిణీ శ్రీకృష్ణస్వామివారలకు తిరుమజ్జనం (అభిషేకం) జరుపబడుతుంది. అలాగే పునర్వసు నక్షత్రం వున్నట్లయితే శ్రీసీతారామలక్ష్మణులకు, శ్రవణ నక్షత్రం రోజున శ్రీదేవి భూదేవి సమేత శ్రీ మలయప్పస్వామి వారికి అభిషేకం జరుపబడుతుంది.

అభిషేకం పూర్తి అయిన తర్వాత భోగశ్రీనివాసమూర్తికి వస్త్రాలంకరణ, తిలక ధారణంచేసి, అన్ని ఉత్సవమూర్తులకు ఆచమనాది షోడశోపచారాలు సమర్పిస్తూండగా జియ్యర్లు, వైష్ణవస్వాములు దివ్యప్రబంధాన్ని తొండరడిప్పొడి ఆళ్వార్లు గానం చేసిన తిరుప్పళ్లి ఎళుచ్చి అరువది పాశురాలను పారాయణం చేస్తారు. ఈ అభిషేకాదులన్నీ తెరమరగున ఏకాంతంగాజరుపబడతాయి.

ఆ తరువాత అన్నిమూర్తులకు పుష్పాలంకరణ అనే తోమాలసేవ జరుగుతుంది.

**తోమాలసేవ (పుష్పాలంకరణ)**

వివిధరకాలయిన పూలదండలతో తులసిమాలలతో శ్రీస్వామివారిని అలంక రించే విధానం అత్యంత వైభవంగాను, కన్నుల పండువుగాను వుంటుంది.

ఈ సేవను కన్నులారా తిలకించడానికి సోమ, మంగళ, బుధ, గురు వారాలలో మాత్రమే నిర్ణీత (ఆర్జిత) రుసుమును చెల్లించిన భక్తులను వైకుంఠంద్వారా ప్రవేశపెడతారు. వీరంతా కులశేఖరపడి ఈవలినుండి అంటే శయనమండపం నుండి బంగారు వాకిలి ఎదురుగా వున్న గరుడని వరకు బారులుతీరి కూర్చొని ఒళ్లంతా కళ్లు చేసికొని రెప్పవాల్చక తదేకంగా ఆ దివ్యసుందరమూర్తికి జరుగుతున్న పుష్పాలంకరణను తిలకించి పరవశులవుతూ వుంటారు.

శ్రీమాన్ జియ్యంగార్లు పూలమాలల్ని అత్యంత భక్తి ప్రపత్తులతో అందిస్తుండగా అర్చకస్వాములు వాటిని స్వీకరించి ముందుగా భోగశ్రీనివాసమూర్తికి అలంక రింపజేస్తారు. ఆ తర్వాత శ్రీవేంకటేశ్వరస్వామివారికి (మూలవరులకు) కంఠంలోను, హృదయంలోను, శంఖు చక్రాలను కిరీటాన్ని, నందకఖడ్గాన్ని అలంక రిస్తారు. అంతేగాక భుజాలమీదుగా వరుసగా నాభీపర్యంతం వరకు, నడుము వరకు, ఊరువుల దాకా, మోకాళ్ల వరకు, పాదాల వరకు వేలాడునట్లుగా పొడవైన పూల దండలు అలంకరింపబడతాయి. పిదప శ్రీవారి కిరీటం (శిఖామణి) మీదుగా భుజాల నుండి పాదాలవరకు ఇరుప్రక్కలా వేలాడు నట్లుగా పూలదండలు అలంకరింప బడతాయి. ఆ తర్వాత శ్రీవారి హృదయంలోవున్న వక్షఃస్థలంలో కుడివైపున లక్ష్మీదేవికి, ఎడమవైపున భూదేవికి పుష్పాలంకరణ జరుగుతుంది.

ఆ తర్వాత శ్రీదేవి భూదేవి సమేతులైన మలయప్పస్వామివారికి, శ్రీదేవి భూదేవి సహిత ఉగ్ర శ్రీనివాసునకు, కొలువు శ్రీనివాసమూర్తికి, శ్రీసీతాలక్ష్మణ సహిత శ్రీకోదండరామస్వామి వారికి రుక్మిణీ సమేత శ్రీకృష్ణస్వామికి, శ్రీ చక్రత్తాళ్వారునకు, సాలగ్రామాలకు... ఇలా సన్నిధిలో వున్న అన్నిమూర్తులకు పుష్పమాలలు అలంకరింపబడుతూ వుండగా శ్రీవైష్ణవ స్వాములు గోదాదేవి కీర్తించిన తిరుప్పావు స్తోత్ర మందలి పాశురాలను శ్రావ్యంగా గానం చేస్తారు.

ఇలా ఒక్కొక్క మాల సమర్పిస్తూ వుండగా ఒక్కొక్క కొత్త వెలుగుతో దర్శన మిస్తూన్న కల్యాణ చక్రవర్తిని నయనానంద కరంగా (సుమారు అర గంటకు

పైగా) దర్శించి తన్మయులైన భక్తులయొక్క భాగ్యమే మహాభాగ్యము. పుష్పాలంకరణ పూర్తి అయిన తర్వాత వేదపండితులు మంత్రపుష్పాన్ని సమర్పిస్తారు. ఆ తర్వాత ధూప, దీప నక్షత్ర హారతులు ఇస్తారు. చివరగా కర్పూర హారతి శ్రీ స్వామివారికి ఘనంగా జరుగుతుంది.

అటుతర్వాత భక్తులు శ్రీస్వామివారిని దర్శించి శఠారితో ఆశీస్సులను పొంది, ఆనంద నిలయ విమానప్రదక్షిణంచేస్తూ బయటికి వెళతారు.

ఆ వెంటనే శ్రీవేంకటేశ్వరస్వామివారికి దర్బార్ (కొలువు) జరుగుతుంది.

**కొలువు (దర్బార్)**

బంగారువాకిలిని ఆనుకొని లోపలి వైపున ఉన్న గదికి స్నపన మండపమనిపేరు. ఇందులో శ్రీవేంకటేశ్వరస్వామివారికి ఆస్థానం జరుపబడుతుంది. సన్నిధిలోవున్న కొలువు శ్రీనివాసమూర్తి వారిని బంగారు ఛత్ర చామర మంగళవాద్య పురస్సరంగా స్నపన మండపంలో ఉంచిన బంగారు సింహాసనంపై వేంచేపు చేయిస్తారు. ఈ సమయంలో మైసూరు మహారాజా సమర్పించిన బంగారు గొడుగు చామరాలను కొలువు శ్రీనివాసమూర్తికి పరిచారకులు పట్టుకొని సేవచేస్తారు.

ఈ దర్బారులో శ్రీనివాసమూర్తికి ఆచమనాది షోడశ ఉపచారాలు నిర్వహించిన అనంతరం ధూపదీప హారతులు సమర్పిస్తారు. పిమ్మట అర్చకులు నిత్యశ్రీ లీలావిభూతి సంపన్నుడైన శ్రీస్వామివారిచేత తాంబూలం దక్షిణతో కూడిన బియ్యాన్ని (16 కిలోల బియ్యం మరియు 12 పైసల దక్షిణ) దానంగా స్వీకరించి ''నిత్యైశ్వర్యోభవ'' అని శ్రీవేంకటేశ్వర స్వామివారిని ఆశీర్వదిస్తారు. ఆ తర్వాత ఆస్థాన సిద్ధాంతి శ్రీనివాస ప్రభువునకు పంచాంగ శ్రవణం చేయిస్తూ, ఆనాటి తిథివార నక్షత్ర యోగకరణ విశేషాలతోపాటు, మరునాటి తిథివార నక్షత్రాదులను విన్పిస్తారు. ఆనాటి ఉత్సవ విశేషాలు కూడ స్వామివారికి తెలియ జేయబడతాయి. నిత్యాన్నదాన పథకంలో ప్రముఖులైన దాతలపేర్లుకూడ శ్రీస్వామివారికి విన్పింపబడతాయి.

పిదప లెక్కల (బొక్కసం) గుమాస్తావచ్చి ముందు నాటి ఆదాయం ఆర్జితసేవలవల్ల ప్రసాదాల విక్రయంవల్ల వచ్చిన ఆదాయం హుండీ ఆదాయం, బంగారు వెండి, రాగి ఇతర లోహాల పాత్రలు, నగలు వగైరాల నికర ఆదాయం

పైసలవరకు లెక్కగట్టి సర్వ జగత్ప్రభువైన శ్రీశ్రీనివాస సార్వ భౌమునకు వివరంగా వినిపించి ''శ్రీవారు చిత్తగించవలెను'' అని అత్యంత భక్తి ప్రపత్తులతో వినయ విధేయతలతో సాష్టాంగ నమస్కారం చేస్తూ సెలవు తీసుకొంటారు.

తర్వాత కొలువు శ్రీనివాసమూర్తికి , వేయించి బెల్లంతో కలిపి దంచిన నువ్వుల పిండిని (212 గ్రా. నువ్వులు + 120 గ్రా. బెల్లం) నివేదించి కర్పూర హారతి ఇస్తారు. తర్వాత వరుసగా అర్చకులకు, జియ్యంగారికి, దేవాలయ అధికారికి పరివేష్టం (పరివీటం) తలకు చుట్టి శరారి మర్యాదలు జరుగుతాయి. పిదప అక్కడ వున్నవారందరికీ ఆ నువ్వులపిండి ప్రసాదం పంచబడుతుంది. ఇంతటితో శ్రీనివాసుని దర్బార్ ముగుస్తుంది. మళ్లీ కొలువు శ్రీనివాసమూర్తిని ఆనందనిలయంలోపలికి (సన్నిధికి) భక్తి గౌరవాలతో తీసుకెళ్తారు.

ప్రతినిత్యం కొలువు శ్రీనివాసమూర్తికి జరిగే ఈ దర్బార్ (ఆస్థానం) ఏకాంతంగా మాత్రమే జరుపబడుతుంది. బయటివారిని ఎవరిని అనుమతించరు.

ఈ కొలువు సూర్యోదయానికి పూర్వం అయితే బంగారు వాకిలి లోపల స్నపన మండపంలో జరుగుతుంది. సూర్యోదయం అయింతర్వాత అయితే ఈ దర్బార్ బంగారు వాకిలిముందుగల తిరుమామణి (ఘంటా మండపం) మండపంలో గరుడాళ్వారుకు ఎదురుగా జరుగుతుంది. కొలువు తర్వాత మూలమూర్తికి మొదటి అర్చన అని పిలువబడే సహస్ర నామార్చన జరుగుతుంది.

## మొదటి అర్చన (సహస్రనామార్చన)

ఆనందనిలయంలో శ్రీవేంకటేశ్వరస్వామివారికి (మూలమూర్తికి) జరిగే మొదటి అర్చన ఇది. ప్రతిరోజూ తెల్లవారుజామున 4–5 గంటల మధ్యకాలంలో జరుగుతుంది.

ఈ సహస్రనామార్చన సేవలో పాల్గొన దలచిన భక్తులు నిర్ణీత రుసుమును చెల్లించి నట్లైతే వీరిని వైకుంఠం క్యూద్వారా ఆలయం లోనికి ప్రవేశింపజేస్తారు. ఈ భక్తులు స్వామివారికి ఎదురుగా కులశేఖరపడినుండి బంగారువాకిలి వరకు, అభిముఖంగా బారులు తీరి కూర్చొని ఈ సహస్ర నామార్చనను తిలకించ వచ్చును.

అర్చకులు శ్రీస్వామివారి పాదపద్మపీఠానికి దగ్గర కూర్మాసనం (మేడికర్రతో చెయ్యబడిన తాబేలు ఆకారం కలిగిన పీట) పై కూర్చొని ఆచమనాది అనుష్ఠాన ఉపచారాలు నిర్వహిస్తారు. పిదప జియ్యంగార్లు అందించిన తులసిని స్వీకరించి ''ఓం శ్రీవేంకటేశాయ నమః ఓం శ్రీవిరూపాక్షాయనమః, ఓం విశ్వేశాయ నమః...'' అని బ్రహ్మాండపురాణంలో ఉన్న శ్రీవేంకటేశ సహస్రనామావళిని గట్టిగా పఠిస్తూ స్వామివారి దివ్యపాదాలను సమర్చిస్తారు. అర్చన ప్రారంభించగానే అర్చననామావళిని చెప్పే పండితుడు కులశేఖరపడి గడపకు ఈవలి ప్రక్కన శ్రీస్వామివారికి కుడివైపుగా ఆనుకొని నిలబడి, అర్చకులు ప్రారంభించిన నామావళిని అందుకొంటూ ''ఓం శ్రీ వేంకటేశాయనమః, ఓం శ్రీ విరూపాక్షాయ నమః, ఓం విశ్వేశాయ నమః, ఓం విశ్వభావనాయనమః,ఓం విశ్వస్రుజే నమః.....'' ఇత్యాదిగా శ్రీవేంకటేశ సహస్ర నామావళిని సుశ్రావ్యంగా పఠిస్తారు.

ఈ శ్రీవేంకటేశ్వరుని సహస్రనామావళి, పవిత్రమైన బ్రాహ్మముహూర్తంలో తిరుమల పుణ్యక్షేత్రమంతటా నినదిస్తూ భక్తుల హృదయాలను మరింత భక్తిరస ప్లావితంచేస్తూ, దివ్యప్రశాంతిని వెదజల్లుతూ ఉంటుంది.

ఇలా ఈ సహస్రనామావళి సుమారు నలువది ఐదు నిమిషాలపాటు సాగి ''ఓం బ్రహ్మాండాంతర్బహిర్వ్యాప్తాయ నమః, ఓం వేంకటాద్రి గదాధరాయనమః'' అని సమాప్త మవుతుంది.

ఆ తర్వాత అర్చకులు శ్రీస్వామివారి పాదాలను అర్చించిన తులసీదళాలను గైకొని, శ్రీస్వామివారి వక్షః స్థలంలో నెలకొన్న శ్రీమహాలక్ష్మీ అమ్మవారిని ''ఓం శ్రియైనమః ఓం లోక ధాత్ర్యైనమః, ఓం బ్రహ్మమాత్రే నమః.....'' అని వరాహ పురాణంలోని మహాలక్ష్మీ చతుర్వింశతి (24) నామావళిని ఉచ్చరిస్తూ అర్చన ప్రారంభిస్తారు. మళ్లీ నామాలనుచెప్పే మిరాశి దారుడగు పండితుడు లక్ష్మీ నామావళిని అందుకొని పఠిస్తూ వుండగా అర్చకులు వక్షః స్థల లక్ష్మీ అమ్మవారిని అర్చిస్తారు. ఇలా శ్రీస్వామివారికి, అమ్మవారికి అర్చన పూర్తి కాగానే నేతిలో తడిపిన ఇరవై ఏడువత్తులు గల దీపపు సెమ్మెతో నక్షత్రహారతిని ఇస్తారు. ఆ పిదప టెంకాయకొట్టి, పండ్లు నివేదనచేసి కర్పూర హారతి ఇస్తారు.

శ్రీస్వామివారి ఎదురుగా బారులుతీరి కూర్చొండిన భక్తుల మనస్సులు, నయనానందకరంగా శ్రీస్వామివారి దివ్యమంగళ విగ్రహాన్ని కన్నుల కరువుదీర తిలకిస్తూ, వీనులవిందుగా, సహస్ర నామావళిని ఆలకిస్తూ ఆధ్యాత్మిక డోలికల్లో ఊగుతూ ఉండగా, చివరగా స్వామివారిని, సమీపాన దర్శించి దివ్యానుభూతితో మైమరచి మరలి వెళ్లలేక తిరిగి తిరిగి నిక్కి నిక్కి చూస్తూ బయటకు నడుస్తారు.

ఈ అర్చనసేవలో సోమ మంగళ బుధ గురువారాలలో మాత్రమే ఆర్జితం చెల్లించిన భక్తులకు ప్రవేశం వుంటుంది.

**ఆమంత్రణోత్సవం**

తోమాలసేవ, అర్చన -- ఈ రెండింటిని కలిపి ఆమంత్రణోత్సవం అంటారు. తోమాల సేవ, అర్చనకు కలిపి ఆమంత్ర ణోత్సవం పేరిట భక్తులు నిర్ణీతరుసుమును చెల్లించి పై రెండు సేవలలోనూ పాల్గొనవచ్చు. లేదా తోమాల సేవకు గాని అర్చనకుగాని పాల్గొనదలచిన భక్తులు తమ ఇష్టానుసారం ప్రత్యేకంగా రుసుమును చెల్లించి ఏ రోజైనా ఆ ఒక్కసేవలో మాత్రమే పాల్గొనవచ్చు. శుక్ర, శని, ఆది వారాలలో తప్ప మిగిలిన దినాల్లో ఈ ఆర్జిత సేవలో పాల్గొనవచ్చు. ఈ అర్చన సేవలో సోమ మంగళ బుధ గురు వారాలలో మాత్రమే ఆర్జితం చెల్లించిన భక్తులకు ప్రవేశం వుంటుంది. (సూచన: ఇటీవల కాలంలో ''ఆమంత్రణోత్సవం'' రద్దుచేయబడింది).

**లఘుశుద్ధి**

భక్తులు శ్రీవారి సహస్రనామార్చనను సందర్శించి వెళ్లిన వెనువెంటనే శ్రీవారి సన్నిధి నుండి బంగారు వాకిలి వరకు శుద్ధి చేస్తారు.

**వంటలు సిద్ధం**

వెంటనే శ్రీస్వామివారి పరిచారకుడు ఒకరు బంగారువాకిలివద్దకు వచ్చి, బంగారు బావికి ఆనుకొనివున్న వంటశాల వైపు తిరిగి చూస్తూ ''తళిగో!'' అని అంటూ, వంట శాలలోని వారికి హెచ్చరికగా ఒక గట్టి కేక వేస్తాడు. అంటే శ్రీస్వామివారి నివేదనకు తళిగల (గంగాళాల) నిండా సిద్ధపరచిన మధుర ఆహారపదార్థాలను, పిండివంటలను తీసుకొని రమ్మని అన్నట్లుగా పరిచారకుని ఆదేశమన్న మాట. అప్పటికే వంటలను సిద్ధంచేసి, కాచుకొని ఉన్న వంటశాల

పరిచారకులు ఈ కేకను విన్న వెంటనే సమాయత్తమై చక్కెర పొంగలి, పులిహోర, పొంగలి.... మున్నగు అన్న ప్రసాదాల గంగాళాలను, లడ్లు, వడలు...... మొదలగు పణ్యారాలు (పిండివంటలు) గల వెదురు గంపలను బంగారు వాకిలి లోపలికి తీసుకొనివెళ్ళి, శ్రీస్వామివారికి ఎదురుగా కులశేఖరపడి గడప దగ్గర శయనమండపంలో ఏర్పాటు చేస్తారు.

**తొలినివేదన**

అంతకు ముందుగానే ఒక పరిచారకుడు శ్రీ స్వామివారి వంటశాలనుండి ప్రసాదాలను ఛత్రచామర మంగళ వాద్య, పురస్సరంగా, దివిటీతోకూడ ఆలయం వీడి వరాహస్వామిఆలయానికి బయలుదేరతాడు. తిరుమల క్షేత్రసంప్రదాయం ప్రకారం శ్రీవరాహ స్వామి వారికి తొలిగా ఈ పదార్థాలు నివేదింప బడతాయి. అక్కడ నివేదన జరుగుతూ వుండగా, ఇక్కడ శ్రీ వేంకటేశ్వరస్వామి ఆలయంలో నివేదనకు ప్రసాద పణ్యారాలను సిద్ధపరచడం జరుగుతుంది.

**ఓడు ప్రసాదం**

శ్రీవరాహస్వామికి అక్కడ నివేదన జరుగుతూ వుండగా, ఇక్కడ శ్రీస్వామివారి సన్నిధిని శయనమండపంలో వంటకాలన్నీ ఏర్పాటు చేస్తారు. ఇంతలో ప్రధాన గమేకారు (వంటశాల మిరాశిదారుడు)''ఓడు'' అనబడే పగిలిన కొత్తమట్టి కుండలో మాతృదధ్యోదనం అనే వెన్నమీగడలతోకూడిన పెరుగు అన్నాన్ని స్వయంగా ఆనందనిలయంలోనికి వెళ్ళి సమర్పించి బయటికి వస్తాడు. ఈ ఓడులోని మాతృదధ్యోదనం అనబడే అన్నప్రసాదం తప్ప, ఆనంద నిలయంలోనికి మరేలాంటి అన్న ప్రసాదాలుగానీ, పిండివంటలుగానీ తీసుకొని పోబడవు. మిగిలిన ప్రసాదాలన్నీ స్వామివారి చూపు ఆనేట్లుగా కులశేఖరపడి దగ్గర గడపకు ఇవతలే ఉంచడం జరుగు తుంది. ఇలా ప్రసాదాలను పణ్యారాలను ఏర్పాటుచేసి పరిచారకులు బయటికిరాగా నివేదన చేసే అర్చకులు బంగారువాకిళ్లను వేస్తారు. వెంటనే ''మొదటిగంట'' అనబడే ఉదయంపూట నివేదన మొదలవుతుంది.

**ఘంటానాదం (మొదటి గంట)**

వెంటనే బంగారువాకిలి ప్రక్కనే వున్న రెండు పెద్ద ఘంటలను ఆలయ పరిచారకుడు (ఘంటాపాణి) గంభీరధ్వనులు ఉప్పతిల్లేట్లుగా ఒకేస్థాయిలో

సొంపుగా మ్రోగిస్తూవుండగా ఆలయం లోపల శ్రీస్వామివారికి నివేదన ప్రారంభ మవుతుంది. అర్చకులు ముందుగా స్వామి వారికి ఆచమనాది ఉపచారాలు సమర్పించి, ప్రసాదాలను నివేదిస్తారు. ఘంటాపాణి మోగిస్తున్న ఘంటలనాదం శ్రీస్వామివారి విందు ఆరగింపునకు చిహ్నమన్నమాట. ఈ గంటల ధ్వనుల తరంగాలు తిరుమల కొండల్లో కోనల్లో వింతైన సొంపుతో మధురమంద్రంగా మార్మోగుతూ వుంటాయి. ఇలా ఘంటలు మోగుతూ వుండగా ఆనంద నిలయంలోని మూలమూర్తికి, ఉత్సవర్లకు, సాలగ్రామాది సకలమూర్తులకు నివేదన జరుగుతుంది.

### తాంబూల సమర్పణ

నైవేద్యం అయింతర్వాత అర్చకులు శ్రీస్వామివారికి సుగంధ ద్రవ్య పూరితమైన తాంబూలాన్ని భక్తినమ్రంగా సమర్పిస్తారు. అటుతర్వాత నివేదిత ప్రసాదాల్లో దేవుని భాగంగా తమకు లభ్యమయ్యే ''హళ్లు'' ను స్వీకరించి తదుపరి వాకిళ్లు తీస్తారు. వెంటనే ఘంటానాదం ఆపివేయబడుతుంది. బయట కాచుకొని వున్న పరిచారకులు, అలా స్వామివారికి నివేదింపబడ్డ ప్రసాదపణ్యారాలను భక్తులకు వినియోగించే స్థలాలకు చేరవేస్తారు.

### యాగం

అటుపిమ్మట అర్చకులు శ్రీవారి యాగశాలలో శ్రీస్వామివారిని గూర్చి, అష్టదిక్పాలుర నుద్దేశించి హోమం నిర్వహిస్తారు.

### బలి

నివేదన పూర్తి అయి, హోమం జరుగుతూ వుండగా జయవిజయులకు (ద్వార పాలకులకు) గరుత్మంతునికి, విమాన ప్రదక్షిణంలో అన్ని దిక్కుల్లోను ధ్వజ స్తంభందగ్గర బలిపీఠంమీద, క్షేత్రపాలక శిలమీద శుద్ధాన్నం బలిగా వేయబడుతుంది. ఆహారాన్ని ఆశించే యక్ష, రాక్షస పిశాచాది గణాలనుద్దేశించి మంత్రపూర్వకంగా ఇవ్వబడే నివేదనే బలి అనబడుతుంది.

ఆలయ విమానప్రదక్షిణ మార్గంలో బలి సమర్పణ జరుగుతూవున్న ఆ సమయం లోనే విమానప్రదక్షిణంలో వున్న చుట్టుగుళ్లలోని యోగనరసింహస్వామి,

వరదరాజస్వామి, విష్వక్సేనులవారికి నివేదన జరుగుతుంది. శ్రీస్వామివారికి నివేదింపబడిన దధ్యోదనం, చక్కెరపొంగలి ప్రసాదాలు కొన్ని భాష్యకారు లయిన రామానుజులకు మళ్లీ నివేదింప బడుతాయి.

శ్రీస్వామివారికి నివేదన అయిన వెంటనే ఆలయంలో బలి నిర్వహిస్తున్న సమయంలోనే సన్నిధి వీధిలో ఎదురుగావున్న శ్రీబేడి ఆంజనేయస్వామివారికి కూడ ఛత్రచామర మంగళవాద్యపురస్సరంగా నైవేద్యం పంపబడుతుంది.

ఇలా అన్నిచోట్ల, ప్రధాన, పరివార దేవతలకు, యక్ష, రాక్షస పిశాచాది గణాలకు నివేదనపూర్తికాగానే ''శాత్తుమొర''ప్రారంభ మవు తుంది.

**శాత్తుమొర**

జియ్యంగార్లు, ఏకాంగి, వైష్ణవ స్వాములు తమిళ దివ్యప్రబంధ పాశురాలను గానం చేస్తూ శ్రీవేంకటేశ్వరుణ్ణి కీర్తించడమే 'శాత్తుమొర' అంటారు. ఈ 'శాత్తుమొర' దర్శనానికి ఏకాంగివారు పరిశీలించి అంగీకరించిన, శ్రీవైష్ణవులు మాత్రమే అనుమతింపబడతారు. వీరంతా మొదటి గంట (నైవేద్యం) అయిన వెంటనే మహాద్వారం గుండానే శాత్తుమొరకు ప్రవేశింపజేయబడతారు.

శ్రీస్వామివారి సన్నిధిలో జియ్యంగార్లు, ఏకాంగులు, వైష్ణవస్వాములు ఆండాళ్ చెప్పిన తిరుప్పావై దివ్యప్రబంధాన్ని పారాయణం చేస్తారు. చివరగా కర్పూరహారతి జరిగిన తర్వాత తీర్థ, శఠారి మర్యాదలు జరుపబడతాయి. తదుపరి శ్రీవారికి ముందుగా నివేదన చెయ్య బడి, మళ్లీ దానినే శ్రీరామానుజులవారికి నివేదింప పడిన'దధ్యోదన' ప్రసాదం 'శాత్తు మొర'లో పాల్గొన్న వైష్ణవులందరికి పంచబడు తుంది.

ఈ శాత్తుమొర పూర్తి అయ్యేటప్పటికి తూర్పున తెల తెలవారుతూ వుంటుంది.

**హరికొలువు**

శ్రీస్వామివారి ఆలయంలో తెల్లవారు జామున 3 గంటలనుంచి అనగా పవిత్ర బ్రాహ్మ ముహూర్తంలో సుప్రభాతాది సేవలు వరుసగా నిర్వహింపబడుతుంటాయి. అలాంటి శుభ సమయంలో లోకబాంధవుడైన

శ్రీసూర్య భగవానుడు ఉదయిస్తూ, తన లేత అరుణ కిరణాలను ప్రసరింపజేసి వేంకటాద్రి శిఖ రాలను, ఆనందనిలయ విమానాన్ని అత్యంత భక్తి ప్రపత్తులతో సమర్చిస్తూవుంటాడు. అలాంటి శుభతరుణాన్ని పురస్కరించుకొని, ప్రాతఃసంధ్యలో బాలభానుని శుభోదయాన్ని సూచించ డానికన్నట్లుగా ప్రతి ఉదయం 6 - 6-30 గంటల మధ్య శ్రీవారి ఆలయంలోని తిరుమల రాయమండపంలో మంగళ వాయిద్యాలు శుభప్రదంగా మోగింపబడ తాయి. సర్వజగత్సార్వభౌముడైన శ్రీశ్రీనివాస చక్రవర్తి కొలువులో ప్రతి సూర్యోదయం వేళలో మోగింపబడే మంగళకరమైన కొలువు మేళాన్ని ''హరికొలువు'' అంటారు.

ఇలా ఆలయంలో ''హరికొలువు'' మంగళవాద్యం మోగింపబడుతున్న సమయం లోనే, ఆలయానికి ఎదురుగా మేడపై వున్న ''నగారామండపం'' (నౌబత్ ఖానా )లో నగా రాలు కూడా సూర్యోదయాన్ని సూచిస్తూ మోగింపబడతాయి. ప్రస్తుతం ఈ నగా రాలు కూడ ఈ తిరుమల రాయ మండపంలోనే మోగింపబడుతున్నవి.

## సర్వదర్శనం

మొదటిగంట నైవేద్యం, బలి, శాత్తు మొర అయిన వెంటనే వైకుంఠం క్యూల ద్వారా, భక్తులను శ్రీవారి సర్వదర్శనానికి ప్రవేశింపజేస్తారు. ఈ సర్వ దర్శనం మధ్యాహ్నం 11 గంటలవరకు కొనసాగుతుంది.

## శుద్ధి

ఆ తర్వాత సర్వదర్శనాన్ని నిలిపివేసి శ్రీస్వామివారి ఆలయంలో సన్నిధినుండి బంగారువాకిలి వరకు శుద్ధికార్యక్రమం నిర్వహిస్తారు.

## రెండవ అర్చన (అష్టోత్తర శత నామార్చన)

శుద్ధి అయిన వెంటనే అర్చకులు శ్రీవేంకటేశ్వరస్వామివారికి, ఇతర దేవతలకు మధ్యాహ్న సమయంలో చేయబడే ఉపచారాలను చేసి పూజకు ఉపక్రమిస్తారు. పిదప జియ్యంగార్లు తీసుకొనివచ్చిన తులసిని తీసుకొని అర్చకులు శ్రీస్వామివారి పాదాలను వరాహ పురాణంలోని''ఓం శ్రీవేంకటేశాయ నమః, శ్రీ వేంకటేశాయనమః, ఓం శేషాద్రి నిలయాయ, శ్రీవేంకటేశాయనమః..... అని శ్రీవేంకటేశ్వరస్వామివారి అష్టోత్తర శతనామాలతో అర్చన ప్రారంభిస్తారు. వెంటనే

మిరాశిదారైన శ్రీవైష్ణవాచార్యుడు, ఆ నామంతో అనుసంధిస్తూ అత్యంత భక్తి పూర్వకంగా ''ఓం శ్రీ శేషాద్రి నిలయాయ, శ్రీవేంకటేశాయ నమః, ఓం వృషద్ద్రు గ్గోచరాయ, శ్రీవేంకటేశాయనమః, ఓం విష్ణవే శ్రీ వేంకటేశాయనమః..... ఇత్యాది క్రమంలో అష్టోత్తరశతనామాలను పఠిస్తూ వుండగా అర్చకులు తులసితో శ్రీస్వామివారి దివ్య పాదాలను అర్చిస్తారు. ఈ అష్టోత్తరం ముగియ గానే శ్రీస్వామివారి పాదాలపై ఉన్న తులసిని అర్చకులు స్వీకరించి, ఆ తులసితో శ్రీవారి హృదయంలో కొలువై వున్న శ్రీమహాలక్ష్మి అమ్మవారికి 'ఓం శ్రియైనమః....' అని అర్చన ప్రారంభించ గానే, పండితుడు వరాహపురాణంలోని లక్ష్మీచతుర్వింశతి నామావళిని పఠిస్తుండగా అమ్మవారికి అర్చన జరుగుతుంది. అమ్మవారికి ఈ అర్చన పూర్తి అయిన వెంటనే నక్షత్ర హారతి, కర్పూరహారతులు ఇస్తారు.

ఈ రెండవ అర్చన ఒక్క మంగళవారంనాడు తప్ప మిగిలిన రోజుల్లో ఏకాంతంగానే జరుపుతారు. ప్రతి మంగళవారం నాడు ఈ అర్చన ''అష్టదళపాదపద్మా రాధన'' అనే పేరుతో 108 బంగారు కమలాలతో అష్టోత్తర శత నామార్చన చేస్తారు. పిదప శ్రీవారి పాదాలపై ఉన్న తులసితో హృదయలక్ష్మికి అర్చన జరుగుతుంది. ఈ ఒక్కనాడు మాత్రమే నిర్ణీత రుసుమును చెల్లించి భక్తులు ఈ సేవను తిలకించవచ్చు. అర్చన పూర్తికాగానే ఘంటా నాదంతో రెండవ నైవేద్యం ప్రారంభమవుతుంది.

**రెండవ గంట (మధ్యాహ్నం నివేదన)**

మొదటిగంట మాదిరిగానే ముందుగా శ్రీ వరాహస్వామివారికి ముందుగా వంటకాలు పంపబడి నివేదన చెయ్యబడతాయి. ఆ తర్వాత, గంటలు మోగింప బడుతుండగా శ్రీవేంకటేశ్వరస్వామివారికి శుద్ధాన్నం, పులిహోర, పొంగలి, చక్కెర పొంగలి, లడ్లు, వడలు...... ఇలా ఎన్నో నివేదింపబడతాయి. ఇవిగాక, భక్తులు మొక్కుబడులుగా స్వామివారికి నివేదింపదలచుకొన్న అన్నప్రసాదాలు పణ్యారాలు కూడ మధ్యాహ్నం పూట జరిగే రెండవ గంట సమయంలోనే నివేదిస్తారు. ప్రతి గురువారం ఈ రెండవ నైవేద్యమే తిరుప్పావడ సేవగా జరుగుతుంది.

గంటలు మోగుతుండగా బంగారు వాకిళ్ల తెరలు వేయబడి శ్రీస్వామివారికి ఆరగింపు పూర్తి అయిన తరువాత తాంబూలాన్ని సమర్పిస్తారు. ఈ ఆరగింపు అయిన వెంటనే ఆలయ ఆవరణలోని అష్ట దిక్కుల్లోను బలి వేయబడుతుంది.

ఈ బలిని సమర్పించే సమయంలోనే బేడి ఆంజనేయస్వామివారికి కూడా నైవేద్యం పంపబడుతుంది. పిదప శ్రీస్వామివారికి నివేదింపబడిన శుద్ధాన్న ప్రసాదం మళ్ళీ రామానుజులవారికి నివేదన చేస్తారు.

**తరలి రాక!**

రెండవ అర్చన, గంట నివేదన పూర్తి అయిన వెంటనే శ్రీదేవి భూదేవి సమేతంగా శ్రీమలయప్పస్వామి (ఉత్సవ మూర్తులు) శ్రీ పీఠాన్ని ఎక్కి ఛత్ర చామర మంగళ వాయిద్య సహిత సకల రాచ మర్యాదలతో ఆనంద నిలయాన్ని వీడి విమాన ప్రదక్షిణ చేస్తూ వెండివాకిలిని దాటి ధ్వజస్తంభానికి ప్రదక్షిణంగా వెళ్లి సంపెగ ప్రదక్షిణంలోగల కల్యాణమండపానికి తరలివస్తారు. ఇలా మలయప్పస్వామి కల్యాణ మండపం చేరుకోగానే సర్వదర్శనం ప్రారంభ మవుతుంది. ఈ సర్వదర్శనం సాయంకాలం దాకా, అంటే ఈ ఉత్సవమూర్తులు సన్నిధిలోనికి వెళ్లేంతవరకు కొనసాగుతుంది.

**నిత్య కల్యాణం**

సంపెంగ ప్రదక్షిణంలోని కల్యాణ మండపంలో ప్రతిరోజు శ్రీదేవి భూదేవులతో శ్రీమలయప్పస్వామివారికి వైభవంగా నిత్య కల్యాణోత్సవం జరుగుతుంది. ఇందువల్లనే శ్రీనివాసుడు "నిత్యకల్యాణచక్రవర్తి'' అనీ, తిరుమల క్షేత్రం ''నిత్య (నిప్పులు) కల్యాణం పచ్చ(ల) తోరణం''గా వెలుగుతుంటుందనే ప్రశస్తి ఏర్పడింది.

ఈ కల్యాణోత్సవంలో నిర్ణీత రుసుములను చెల్లించి భక్తులు పాల్గొనవచ్చు. ప్రతిరోజు మధ్యాహ్నం 12 – 1 గంటల మధ్య సమయంలో ఈ నిత్య కల్యాణం నిర్వహిస్తారు.

కల్యాణోత్సవం ముగిసిన తర్వాత భక్తులకు వస్త్ర బహుమానం, ప్రసాద వితరణ చేస్తారు. ఆ తర్వాత శ్రీస్వామివారు ఉభయదేవేరులతో కూడి అద్దాల మండపానికి తరలి వస్తారు.

**డోలోత్సవం**

ఈ సేవకై నిర్ణీత రుసుమును చెల్లించిన గృహస్థుల ప్రార్థనపై శ్రీదేవి భూదేవి సమేత శ్రీ వేంకటేశ్వరస్వామి రంగనాయక మండపానికి ఎదురుగా వున్న అద్దాల

మహల్‌కు వస్తారు. ఆ మండపం మధ్యలో వున్న డోల (ఉయ్యాల)లో శ్రీస్వామివారిని ఉంచటం జరుగుతుంది. ఈ అద్దాల మండపంలో అన్నివైపుల అనంతుడై వ్యాపించి తానే నిండియున్నట్లు భక్తులకు దివ్య దర్శనాన్ని అనుగ్రహిస్తారు. అనంతరం కర్పూర నీరాజనం, ప్రసాద వితరణ జరుగుతుంది. ఈ సేవ ప్రతిరోజు భక్తుల కోరిక మేరకు మధ్యాహ్నం 1 గం॥ల నుండి 2 గం॥ల మధ్య అద్దాల మండపంలో చేస్తారు.

**ఆర్జిత బ్రహ్మోత్సవం**

రంగనాయక మండపంలో దేవేరులతో కూడి వున్న శ్రీనివాసునకు రుసుములు చెల్లించిన భక్తుల కోరిక మేరకు ఆర్జిత బ్రహ్మోత్సవాలను, వాహన సేవలను సంక్షిప్తంగా నిర్వహిస్తారు. ప్రతి రోజు మధ్యాహ్నం 2 - 3 గంటల మధ్య నిర్వహిస్తారు.

**ఆర్జిత వసంతోత్సవం**

ఈ రంగమండపంలోనే నిర్ణీత రుసుమును చెల్లించిన ఆర్జిత గృహస్థుల కోరిక మేరకు ప్రతిరోజు సాయంత్రం 3 గం॥ - 4 గం॥ ల మధ్య వసంతోత్సవం నిర్వహింపబడుతుంది. ఈ వసంతోత్సవం అయిన పిమ్మట శ్రీస్వామివారిని, దేవేరులతోకూడ, సర్వాభరణాలతో రంగు రంగుల పుష్పమాలలతోను సర్వ శోభావహంగా అలంకరిస్తారు.

**సహస్ర దీపాలంకార సేవ**

ఉభయ దేవేరులతోకూడి శ్రీస్వామివారు సర్వాలంకృతులై ఆలయం వెలుపల వున్న కొలువు మండపానికి విచ్చేస్తారు. ఆ మండపంలో సహస్ర దీపాల మధ్య దేదీప్య మానంగా ప్రకాశిస్తూ ఊయలపై వేంచేసి భక్తులకు దర్శన మిస్తారు. ఈ సహస్ర దీపాలంకార సేవను వేలాది మంది తిలకిస్తారు. ప్రతిరోజు సాయంత్రం 5-30 గంటల నుండి ఒక గంటపాటు కొనసాగే ఈ సహస్ర దీపాలంకార సేవలో నిర్ణీత రుసుమును చెల్లించిన గృహస్థులు కూడ పాల్గొనవచ్చు.

సహస్ర దీపాలంకార సేవ ముగించుకొన్న తదనంతరం శ్రీస్వామివారు నేరుగా శ్రీ బేడి ఆంజనేయస్వామివద్దకు వెళ్ళి, తన పూలమాలతోను, శేష

హారతితోను శ్రీఆంజనేయస్వామిని సత్కరించిన తరువాత తిరిగి ఆలయంలో ప్రవేశించి సన్నిధి చేరుకొంటారు.

ప్రతి శుక్రవారంనాడు, ప్రతి శ్రవణనక్షత్రంనాడు, సహస్ర దీపాలంకార సేవానంతరం - తిరుమల వీధుల్లో ఊరేగింపబడిన అనంతరం శ్రీస్వామివారు ఆలయ ప్రవేశం చేస్తారు.

ప్రతి ఆరుద్ర నక్షత్రం రోజున శ్రీస్వామివారితోపాటు, సహస్ర దీపాలంకార సేవానంతరం - ఊరేగింపులో శ్రీరామానుజ స్వామివారు పాల్గొంటారు.

ప్రతి రోహిణి నక్షత్రం రోజున రుక్మిణీ శ్రీకృష్ణులు మాత్రమే సహస్ర దీపాలంకారసేవలో పాల్గొని, ఆలయం చుట్టూ ఊరేగింపబడతారు. అలాగే పునర్వసు నక్షత్రం రోజున సహస్ర దీపాలంకార సేవలో శ్రీ సీతాలక్ష్మణ హనుమత్సమేత కోదండరాములవారు పాల్గొని ఊరేగింపబడతారు. రోహిణి, పునర్వసు రోజులలో శ్రీవేంకటేశ్వరస్వామివారు ఆలయం వెలుపలికి రారు.

శ్రీ స్వామివారు సన్నిధి చేరుకొన్న పిదప సర్వదర్శనం నిలిపి వేయబడి సన్నిధిలో శుద్ధి చేయబడుతుంది.

**సందె కొలువు**

ప్రతి సాయంత్రం పూట 5-30 - 6 గంటల మధ్య సూర్యాస్తమయ సందర్భంలో తిరుమలరాయమండపంలో కొలువుమేళం మంగళప్రదంగా శ్రీవారికి విన్పించబడుతుంది. దీనినే సందె కొలువు అంటారు.

**సాయంకాల పూజ**

సాయంకాలం కూడా సన్నిధి గొల్ల వెంటరాగా శ్రీ స్వామివారి అర్చకులు సంధ్యా వందనాది అనుష్ఠాన క్రియలు ముగించుకొని ఆలయానికి వస్తారు. ఆ తర్వాత శ్రీ స్వామివారికి ఆచమనాది ఉపచారాలు సమర్పించి సాయంకాలం జరుపబడే తోమాలసేవ అనబడే పుష్పాలంకరణకు సిద్ధంగా వుంటారు.

**తోమాలసేవ**

ఇంతలో పుష్ప అర నుండి జియ్యంగార్లు పూలమాలలు గల వెదురు గంపను (పాత్రం) తలపై ఉంచుకొని గుండ్రని పలక గంట మ్రోగిస్తూ వుండగా, సన్నిధి

గొల్ల దివిటీ పట్టుకొని ముందు నడవగా ఛత్ర చామర మర్యాదతో ధ్వజస్తంభ ప్రదక్షిణం చేస్తూ, ఆనంద నిలయ విమానం ప్రదక్షిణం చేసి, సన్నిధిలో వాటిని సమర్పిస్తారు. అనంతరం అర్చకులు ఆ పూలమీద నీళ్లు సంప్రోక్షించి శుద్ధి చేసి పుష్పాలంకరణకు ఉపక్రమిస్తారు. అర్చకులు శ్రీస్వామివారికి కంఠసీమలోను, శంఖు చక్రాలకు, వక్షః స్థల లక్ష్మీదేవికి, భూదేవికి, ఖడ్గానికి ఇలా పూలమాలలతో అలంకరిస్తూ వుండగ, జియ్యంగారు, ఏకాంగి మున్నగు వైష్ణవ స్వాములు దివ్య ప్రబంధ పారాయణం చేస్తారు. ఈ తోమాలసేవ చివర వేద పండితులు మంత్ర పుష్పాన్ని పఠిస్తారు. తర్వాత శ్రీస్వామివారికి నక్షత్ర హారతి, కర్పూరహారతి ఘనంగా సమర్పింపబడతాయి.

**పూలంగి సమర్పణ**

ప్రతి గురువారం సాయంత్రం పూట జరిగే, ఈ తోమాలసేవలో, శ్రీ వేంకటేశ్వర స్వామివారి దివ్యమంగళ విగ్రహమూర్తికి నిలువెత్తుగా, పూర్తిగా దివ్య పుష్పహారాలు అలంకరింప బడతాయి. విగ్రహంపైన ఎలాంటి ఆభరణాలు లేకుండా కేవలం పూలమాలలతో అలంకరింపబడిన స్వామి నిలువెత్తు పూల అంగీని ధరించినట్లుగా దర్శనమిచ్చి భక్తులను పులకింప చేస్తారు. అందువల్లే ప్రతి గురువారం సాయంత్రం తోమాలసేవను, పూలంగి సమర్పణ, పూలంగి సేవ అంటారు. ఈ సేవను ఎలాంటి రుసుము చెల్లించకుండానే ఉచితంగా భక్తులు దర్శించవచ్చు.

సాయంకాలం పూట జరిగే ఈ తోమాల సేవను పూర్తిగా ఏకాంతంగా నిర్వహిస్తారు.

**అర్చన**

తోమాలసేవ జరిగిన పిదప, మధ్యాహ్న సమయంలో జరిపినట్లుగానే శ్రీస్వామివారికి అష్టోత్తర శత నామార్చన, వక్షః స్థల మహాలక్ష్మికి చతుర్వింశతి నామాలతో అర్చన చేస్తారు. ఆ తర్వాత శుద్ధి జరిగిన తర్వాత మళ్లీ నివేదన చేస్తారు.

**రాత్రిగంట (రాత్రి నైవేద్యం)**

సాయంకాలం తోమాలసేవ – అర్చన పూర్తి అయిన వెంటనే పరిచారకులు సిద్ధం చేసిన దోసెలు, అన్న ప్రసాదాలు, పణ్యారాలు తెచ్చి స్వామివారి ముందు

కులశేఖరపడివద్ద ఉంచి వెళ్తారు. అర్చక స్వాములు తలుపులు మూయగానే ఘంటలు మోగిస్తారు. శ్రీస్వామివారి ఆరగింపుతోపాటు, వకుళ మాలిక, వరదరాజస్వామి, యోగనరసింహ స్వామి, విష్వక్సేనులవారికి కూడ నివేదన చేస్తారు. పిదప ఆ ప్రసాదాలు వితరణ చేసే స్థలానికి చేరవేస్తారు. ఆ తర్వాత శ్రీస్వామివారికి 'తిరువీసం' గంట అనబడే నివేదన సమర్పిస్తారు.

**తిరువీసం (గంట)**

రాత్రి (నైవేద్యం) గంట అయిన వెంటనే శ్రీ వేంకటేశ్వరస్వామివారికి తిరువీసం అనబడే చక్కెరపొంగలి ప్రసాదాన్ని నివేదిస్తారు. దీనిని ఆనంద నిలయంలోని స్వామివారికి నివేదించేటపుడు, బంగారు వాకిలి లోపలగల స్నపన మండపంలో వున్న చిన్న గంటను మోగిస్తారు. శ్రీనివాసస్వామికి నివేదన అయిన తరువాత దీన్ని సన్నిధి భాష్యకారులైన శ్రీరామానుజుల వారికి నివేదిస్తారు. అందువల్లే ప్రసాదాన్ని "తిరువీసం భాష్యకార్ల తళిహ(గ)" అని అంటారు. అనంతరం ఆ ప్రసాదాన్ని అర్చకులు, గమేకార్లు (వంటవాళ్లు) భాష్యకార్ల గుడి, జియ్యంగార్, దేవస్థానం వాళ్లు పంచుకునేవారు. ప్రస్తుతం యాత్రికులకు పంచబడుతుంది.

ఆ తర్వాత ఏకాంతంగా జరిగే 'శాత్తుమొర' లో జియ్యంగార్, ఏకాంగి మాత్రమే పాల్గొంటారు.

**సర్వదర్శనం**

రాత్రి గంట పూర్తి అయిన వెంటనే వళ్లీ సర్వ దర్శనం ప్రారంభమవుతుంది. ఇది యాత్రికుల రద్దీని బట్టి రాత్రి 10 గంటల నుంచి 12 గంటలకు కూడ కొనసాగించ బడుతుంది. ఈ సర్వదర్శనం పూర్తి అయిన తర్వాత ఏకాంత సేవకు ఏర్పాట్లు చేస్తారు.

**అమ్మవారి పాయసం**

ఒకవైపు ఆలయంలో ఏకాంతసేవకు ఏర్పాట్లు జరుగుతుండగా, మరోవైపు శ్రీస్వామివారి (మూలమూర్తి) పాదాలమీది పూలహారాన్ని తెచ్చి విమాన ప్రదక్షిణంలో వున్న వంటశాలలోని వకుళమాలికకు అలంక రిస్తారు. పిదప

అమ్మవారి పాయసమని పిలువబడే చక్కెరపొంగలిని వకుళమాలికకు నివేదిస్తారు. నివేదనానంతరం ఈ అమ్మవారి పాయస ప్రసాదాన్ని జియ్యంగారు, అర్చకులు, గమేకారు, సన్నిధిగొల్ల, తరిగొండవారు పంచుకొనగా మిగిలిన ప్రసాదాన్ని యాత్రికులకు వితరణ చేస్తారు.

పూర్వం ఈ అమ్మవారి పాయసాన్ని ''ఏకాంత సేవానంతరం'' వకుళమాతకు నివేదించడం జరిగేది. కాని ఇటీవల ''ఏకాంత సేవ'', యాత్రికుల రద్దీ దృష్ట్యా ఆలస్యంగా జరుగుతున్నందున ఏకాంతసేవకు ముందే నివేదింపబడి యాత్రికులకు పంచబడు తున్నది.

**ఏకాంత సేవ**

ఏకాంతసేవకు వేళ కాగానే సర్వదర్శనం నిలిపి వేయబడుతుంది. పిదప ఆనంద నిలయంలోను, శయన మండపంలోను శుద్ధి చేస్తారు. కులశేఖరపడి దగ్గర తెరలు వేస్తారు. లోపల అర్చకులు శ్రీస్వామివారికి నమస్కారం చేసికొని, శ్రీస్వామివారి మీద వున్న నిర్మాల్యాన్ని పూర్తిగా తొలగిస్తారు. దీన్నే 'నిర్మాల్య శోధన' అంటారు. ఇంతలో ఆలయ పరిచారకులు 'సభేరా' గదినుండి, బంగారు పట్టెమంచాన్ని (బంగారు తూగుటుయ్యాల) తెచ్చి శయన మండపం (ఆనంద నిలయానికి ముందున్న గది)లో వెండి గొలుసులతో వ్రేలాడ దీస్తారు. దానిపై పట్టు పరుపు పరచి దిండ్లను ఏర్పాటు చేస్తారు.

పిదప శ్రీ వేంకటేశ్వరుని పరమ భక్తురాలైన తరిగొండ వెంగమాంబగారి వంశంవారు వచ్చి శ్రీస్వామివారి పట్టెమంచం చుట్టూ రంగవల్లులు (ముగ్గులు) తీర్చి దిద్ది, ''వెంగమాంబగారి ముత్యాలహారతి'' తట్టను ఏకాంగివారికి ఇచ్చి బయటికి వస్తారు. సన్నిధి గొల్ల ఈ మంచం ముందు రెండు దీపాలను వెలిగించి బయటికి వస్తాడు. ఆ తర్వాత అర్చకులు రాములవారిమేడ తలుపులు దగ్గరికి వేస్తారు. బంగారువాకిలికి కూడ తెర వేస్తారు. ఇలా వాకిళ్లు దగ్గరకి వేసి, తెరలు వేయగానే, బంగారు వాకిలి ఎదురుగా, గరుడమండపం దగ్గర 'స్వర్ణ' అనబడే సన్నాయి మేళం మోగింపబడుతుంది. ఇలా బంగారువాకిలి దగ్గర శ్రుతికింపైన వాద్యం వినవస్తుండగా, ఆలయం లోపల అర్చకులు శ్రీస్వామివారికి ఆచమనాది ఉపచారాలు పూర్తి చేస్తారు. పిదప, వివిధ ఫలాలతో చక్కెర, తేనె కలిపి తయారు

చేయబడ్డ 'మేవా' అనే ప్రసాదాన్ని, చెక్కెర, జీడిపప్పు, బాదం పప్పు పలుకులు, ఎండుద్రాక్ష, ఏలకులు, గస గసాలు, ఎండుకొబ్బరి ముక్కలు కలిపి తయారు చేసిన 'పంచకజ్జాయం' అనే ప్రసాదాన్ని, చెక్కెర కలిపిన వేడిపాలను నివేదిస్తారు. పిదప సుగంధ పరిమళ తాంబూలాన్ని సమర్పించి కర్పూర నీరాజనాలు ఏకాంతంగా చేస్తారు.

తదుపరి అర్చకులు శ్రీస్వామివారి మూలమూర్తి పాదాలకు సేవ (పాద నమ స్కారం) చేసి, శ్రీ భోగ శ్రీనివాసమూర్తి (మనవాళ పెరుమాళ్) వారిని శయనముపైకి వేంచేయ వలసిందని భక్తిపూర్వకంగా ప్రార్థిస్తూ, పట్టె మంచంపైన భక్తులను చూస్తున్నట్లుగా దక్షిణం తలాపుగా శయనింప జేస్తారు.

పిదప అప్పటికప్పుడు పరిచారకులు నూరి తీసిన చందనపు ముద్దలను శ్రీస్వామి వారి పాదాలపై సమర్పిస్తారు. శ్రీస్వామివారి బంగారు పాద కవచాలను తీసి, పాదాలపై ఒక కొత్త వస్త్రాన్ని పరచి, రెండు చందనపు ముద్దలను సమర్పిస్తారు. శ్రీస్వామివారి వక్షః స్థల లక్ష్మికి ఒక ముద్ద చందనాన్ని సమర్పిస్తారు. ఆ తర్వాత అర ముద్ద చందనాన్ని శయనించియున్న భోగమూర్తి హృదయంపైన ఉంచుతారు. మరొక అరముద్ద చందనాన్ని బ్రహ్మదేవుడు అర్చించడానికిగాను శ్రీవారి ముందర బంగారు పళ్లెంలో వుంచుతారు.

ఇలా ఆలయంలోపల ఏకాంత సేవకు ఏర్పాట్లు జరుగుతుండగా, ఈ సేవకు నిర్ణీత రుసుమును చెల్లించిన భక్తులను వైకుంఠం క్యూ ద్వారా ప్రవేశపెడతారు. వీరంతా బంగారు వాకిలి ముందర కూర్చొని ఎప్పుడెప్పుడా తెరలు తీసేది. ఎప్పుడెప్పుడా శ్రీస్వామివారి దర్శనం చేసేది అని వాకిలివైపు కన్నార్పక చూస్తుంటారు. ఇంతలో ఆలయం అధికారులు శ్రీస్వామివారి హుండీని జాగ్రత్తగా విప్పి, దానిని భక్తులందరి సమక్షంలో సీళ్లు వేసి బిగిస్తారు. ఆ తర్వాత సీళ్ళు వేసిన ఈ హుండీని బంగారు వాకిలి లోపల కుడివైపునగల 'శ్రీభాండార' మనే గదిలో భద్ర పరుస్తారు. ఇది ముగిసిన వెంటనే ఏకాంత సేవ అర్జిత భక్తులు బంగారు వాకిలి లోపల గల రాములవారి మేడ వద్ద వచ్చి కూర్చుంటారు. శ్రీస్వామివారి దివ్యమంగళ విగ్రహ సౌందర్య దర్శనంతో పాటు భోగ శ్రీనివాస మూర్తి పాన్పుమీద శేష శాయి వలె పవ్వళించి వున్న దివ్య దృశ్యాన్ని ఎప్పుడెప్పుడా దర్శించేది అని ఆతురతతోను, భక్తితోను వాకిలివైపు కన్నార్పకుండా ఎదురు చూస్తుంటారు.

ఇంతలో అర్చక స్వాములు అన్ని ఉపచారాలను పూర్తి చేసి, స్వామివారిని పాన్పుపై పవ్వళింపజేసి వాకిలి తీస్తారు.

**జోలపాట**

ఆ సమయంలో కన్నుల పండువుగా భక్తులందరికీ శ్రీవారి దివ్యదర్శనం అవుతుంది. ఇంతలో పరమభక్తుడైన తాళ్లపాక అన్నమాచార్యులవారి వంశీకులు ఒకరు రాములవారి మేడ నడవలో, శ్రీస్వామివారికి ఎదురుగా కూర్చొని తంబూర మీటుతూ--

జో అచ్యుతానంద! జోజో ముకుందా!
రావె పరమానంద! రామగోవిందా!

అంగజుని గన్న మాయన్న యిటురారా!
బంగారుగిన్నెలోఁ బాలుని బాలు పోసేరా!
దొంగ నీవని బాలు పోసేరా!
ముంగిట నాడరా మోహనాకారా!

గోవర్ధనం బెల్ల గొడుగుగాఁ బట్టి
కావరమ్మున నున్న కంసుఁ బడగొట్టి
నీవు మధురాపురము నేలఁ జేపట్టి
ఠీవితో నేలిన దేవకి పట్టి

అంగుగాఁ దాళ్లపాకన్నయ్య చాల
శృంగార రచనగాఁ జెప్పె నీ జోల
సంగతిగ సకల సంపదల నీ వేళ
మంగళము తిరుపట్ల మదనగోపాల!

అనే లాలిపాటను భక్తితో గానం చేస్తూ వుండగా శ్రీ వేంకటేశ్వరస్వామి మైమరచి ఆనందంగా వింటూ, మెల్లగా ఊగుతూ యోగ నిద్రకు ఉపక్రమిస్తాడు.

**ముత్యాల హారతి**

ఇలా తాళ్లపాకవారి లాలిపాట పూర్తి అయిన వెంటనే మాత్ర శ్రీ తరిగొండ వెంగమాంబగారి ముత్యాలహారతి అటు సన్నిధిలోపల శ్రీస్వామివారి మూలమూర్తికి, పిమ్మట బంగారు మంచంపై శయనించిన భోగమూర్తికి అర్చకులచే ఇవ్వబడుతుంది.

తరిగొండవారి కర్పూరహారతి వెలుగులలో శ్రీస్వామివారి దివ్యమంగళ విగ్రహ సౌందర్యం వర్ణించడానికి మాటలు చాలవు. భక్తులందరూ అవ్యక్తానందంతో కర్పూర హారతిని భక్తితో కనులకద్దుకొని స్వామివారిని తిరిగి తిరిగి చూస్తూ బయటికి వస్తారు. పిదప శ్రీవారికి నివేదింపబడిన తీయని వేడిపాలను, పంచకజ్జాయ ప్రసాదాన్ని, మేవా ప్రసాదాన్ని స్వీకరించి హుండీ వున్న మార్గంద్వారా బయటికి వచ్చి ఆనంద నిలయ గోపురానికి నమస్కరించి వెళ్తారు. ఏకాంతసేవానంతరం విమాన ప్రదక్షిణంలోనికి ఎవ్వరూ ప్రవేశింపరు. అక్కడ దేవతా సంచారం ఉంటుందని ప్రతీతి.

ఇలా భక్తులంతా వెళ్లిన తర్వాత అర్చక స్వాములు లోపల మూలసన్నిధిలో, రాత్రి బ్రహ్మాది దేవతలు వచ్చి అర్చించడానికి వీలుగా, ఒక పెద్ద బంగారు గిన్నెతో నీళ్లు పెడతారు. ఇంతలో ఏకాంగి ఆనంద నిలయంలోను రాములవారి మేడలోను వున్న దీపాలను శాంతింపజేస్తారు. ఆనంద నిలయంలో శ్రీస్వామివారికి కుడి వైపున ఆగ్నేయమూలకు బ్రహ్మ అఖండం అనే జ్యోతి మాత్రం ఎప్పుడూ అఖండంగా వెలుగుతూ వుంటుంది. ఈ దీపాన్ని బ్రహ్మ దేవుడు వెలిగించినాడని పురాణ ప్రశస్తి!

తదుపరి అర్చకస్వాములు అందరిని బయటికి పంపి, లోపల ఎవ్వరూ లేకుండా శోధించిన తర్వాత శ్రీస్వామివారికి భక్తి పూర్వకంగా పాద నమస్కారం చేసి, బయటకు వచ్చి భోగమూర్తికి చేతులు జోడించి ప్రార్థిస్తారు. పిదప రాములవారి మేడ తలుపులు వేసి తాళాలు బంధించి, బంగారువాకిలి బయటికి వస్తారు. అర్చకులు వెలుపలికి వచ్చిన వెంటనే బంగారు వాకిళ్లు మూయ బడతవి.

అర్చకులు తమ దగ్గర వున్న కుంచెకోల అనే పరికరం సహాయంతో, వెలుపలి నుంచే రంధ్రంద్వారా బంగారు వాకిలి లోపల వున్న గడియను వేస్తారు. పిదప వాకిలికి గడియపెట్టి ఒక తాళం కూడ అర్చకులు వేస్తారు.

ఆ తర్వాత సన్నిధి గొల్ల, ''అర్చకులు-జియ్యంగారు- అధికారులు'' వీళ్లందరి సమక్షంలో బంగారు వాకిళ్లకు వున్న మొత్తం నాలుగు గడియలను వేసి, వాటికి పెద్ద పెద్ద తాళాలు వేస్తాడు. ఆ పిదప ఆ తాళాలను మూతులవరకు చిన్న సంచులలో దూర్చి కట్టి లక్కతో సీళ్లు వేస్తారు.

ఇలా ఈ బంగారు వాకిళ్ల తాళాలను తీయాలన్నా, వేయాలన్నా అర్చకులు – జియ్యంగార్లు దేవస్థానం అధికారులు తప్పక వుండవలసిందే! వీరిలో ఏ ఒక్కరు లేక పోయినా బంగారు వాకిళ్ల తాళాలు తీయ బడవు! వేయబడవు!

బంగారు వాకిళ్లను బంధించిన తర్వాత అందరూ, హుండీ మార్గం ద్వారా బయటికి వచ్చి, ఆనంద నిలయ విమాన దర్శనం చేసికొని ధ్వజస్తంభం దగ్గరకు రాగానే వెండి వాకిళ్లను (నడిమి పడి కావలి) బంధించి తాళాలు వేసి సీళ్లు వేస్తారు.

ఆలయ సిబ్బంది, రక్షకులు, పహరా సిబ్బంది అందరూ ఈ వెండి వాకిలికి ఇవతలే రాత్రంతా కాపలా కాస్తుంటారు.

అర్చకులు వెండివాకిలి దగ్గరవున్న ధ్వజస్తంభ బలిపీఠాలకు ప్రదక్షిణంగా బయటికి వెళ్తూ, నమస్కరించి, తమ తాళాలను కుంచెకోలను అక్కడేవున్న క్షేత్ర పాలక శిలకు మూడుమారులు తాకించి, సెలవిమ్మని భక్తితో ప్రార్థించి, బయటికి వస్తూ, మహాద్వారం వద్దగల ద్వార దేవతలకూ నమస్కరిస్తారు. పిదప 'తిరుమాళిగ' అనబడే తమ నివాస గృహానికి అర్చకులు చేరుకొంటారు. దీనితో తిరుమల శ్రీనివాస స్వామివారి ఆలయ దినచర్య పూర్తి అవుతుంది.

అర్చకులు ఇండ్లకు వెళ్లి పోగానే మహాద్వారం తలుపులు కూడా మూసి వేస్తారు. ఈ మహాద్వారం తలుపులో ఒక చిన్న వాకిలి ఏర్పాటు చెయ్యబడింది. ఈ చిన్న వాకిలి గుండా, వెండి వాకిలినుండి మహాద్వారం వరకు కాపలా కాస్తున్న సిబ్బంది మాత్రమే రాకపోకలు సాగిస్తూ వుంటారు.

మహాద్వారం అనబడే పడికావలి తలుపులు మూసిన వెంటనే తిరుమల క్షేత్రం అంతటా నిశ్శబ్దం అలుముకొని వుంటుంది!

ఇక ఆ నిశ్శబ్ద నిశీధ ప్రశాంత సమయంలో బ్రహ్మాది దేవతలూ, యక్ష కిన్నర గంధర్వాదులు....... ఇలా ఎందరో.... ఎందరెందరో వచ్చి శ్రీ శ్రీనివాస ప్రభువును సేవించి వెళతారని పురాణ ప్రశస్తి! అనూచానంగా మహనీయులు ఎందరో చెప్తూవున్న సత్యమైన వాక్కు!

ఇటు రాత్రి బ్రహ్మాది దేవతల చేతా, అటు పగలు మానవుల చేతా నిరంతరం నిరంతరాయంగా సేవింపబడుతూ తన కడగంటి చూపులతో అందరినీ సంపూర్ణంగా అనుగ్రహిస్తూవున్న శ్రీనివాసప్రభువునకు సాటి రాగల దేవుడు ఇంకొకడు లేడు! లేడు! లేనే లేడు! ఆ దేవునికి సాటి ఆ దేవుడే!!

**శ్రియః కాంతాయ కల్యాణ,**
**నిధయే నిధ యేర్థినామ్**
**శ్రీ వేంకట నివాసాయ,**
**శ్రీనివాసాయ మంగళమ్.**

★★★



**ధర్మగిరి**

# నిత్యకల్యాణ చక్రవర్తి నిత్యవైభవం

సృష్టికర్త బ్రహ్మదేవుడు మొదలుకొని సామాన్య మానవులదాకా శ్రీ వేంకటేశ్వరస్వామి వారికి ఉత్సవాలు, ఊరేగింపులు, ఆరాధనలు, నివేదనలు..... ఇలా తమ తమ ఇష్టానుసారం తృప్తిగా చేయిస్తారు. ఆనందంగా మొక్కులు సమర్పించు కొంటారు. కనుకనే ఇక్కడ ఎప్పుడూ ఏదో ఒక వేడుక కొనసాగుతూనే వుంటుంది. అందువల్లే సర్వదేవతలకూ, సిద్ధులకూ, పరమ యోగులకూ సాధకులకు ఆలవాలమై నిరంతరం నిరంతరాయంగా భక్తజన సందోహంతో కిట కిట లాడుతూ ఈ క్షేత్రం ''నిత్యకల్యాణం పచ్చతోరణం''గా భాసిస్తూ ఉంటుంది.

ఇలా ఏడుకొండలస్వామికి ఏడాది పొడవునా ఎన్నో ఉత్సవాలు మరెన్నెన్నో సేవలు జరుగుతునే వుంటాయి. ఇలా ''న భూతో న భవిష్యతి'' అన్నట్లుగా జరుగుతున్న ఆనంద నిలయుని ఆలయ ఉత్సవ వైభవాన్ని క్రింద చూపినట్లు ఐదు విధాలుగా విభజించుకొని పరిశీలించుదాం.

## 1. నిత్య కల్యాణ చక్రవర్తి నిత్యోత్సవాలు:

ప్రతిరోజు తెల్లవారుజామున బంగారు వాకిళ్లు తెరచినప్పటి నుంచి రాత్రి బంగారు వాకిళ్లు మూసేంతవరకు విధిగా జరిగే సుప్రభాతాదిగా సేవలు, ఉత్సవాలు చాల వున్నాయి. ఇలా విధిగా ప్రతిరోజూ జరిగే ఉత్సవాలను నిత్యోత్సవాలు అంటారు.

## 2. వెంకన్న వారోత్సవాలు

ఒక వారంలోని ఏడు రోజుల్లో ఒక్కొక్క రోజు విధిగా విశేషంగా వారోత్సవాల పేరిట ఉత్సవాలు జరుగుతున్నాయి. సోమవారం నాడు విశేషపూజ, మంగళవారంనాడు అష్టదళ పాదపద్మారాధన, బుధవారంనాడు సహస్ర కలశాభిషేకం, గురువారంనాడు తిరుప్పావడ, నేత్ర దర్శనం, పూలంగిసేవ, శుక్రవారంనాడు అభిషేకం..... ఇలా ఒక్కొక్కరోజు ఒక్కొక్క విధంగా శ్రీస్వామివారికి ఉత్సవాలు జరుగుతున్నాయి. వారానికి ఒక్కరోజు నియమితంగా జరిగే వీటిని వారోత్సవాలు అంటారు.

### 3. పరంధాముని పక్షోత్సవాలు

ప్రతి నెలా శుక్లపక్షంలోను, కృష్ణపక్షంలోను ఏకాదశి, అమావాస్య లాంటి దినాల్లో ఆలయంలో విధిగా కొన్ని కార్యక్రమాలు జరుపబడుతున్నాయి. వీటిని పక్షోత్సవాలంటారు.

### 4. తిరుమలేశుని తిరునక్షత్రోత్సవాలు

తిరుమలేశునికి ప్రతినెలా రోహిణి, ఆర్ద్ర, పునర్వసు, శ్రవణం నక్షత్రం వచ్చిన దినాల్లో విశేషంగా శ్రీస్వామివారికి ఉత్సవాలు, ఊరేగింపులు జరుపబడుతున్నాయి. వీటిని నక్షత్రోత్సవాలని అంటారు.

### 5. సప్తగిరీశుని సంవత్సరోత్సవాలు

ప్రతి సంవత్సరం ఉగాది నుంచి ప్రారంభమై మళ్లీ ఉగాది వరకు ఏడాదిపాటూ ఏడుకొండలవాడికి, కోయిల్ ఆళ్వారు తిరుమంజనం, ఉగాది ఆస్థానం, నిత్యోత్సవం, ఆణివార ఆస్థానం, దీపావళి ఆస్థానం, కృష్ణాష్టమి, జ్యేష్ఠాభిషేకం, పవిత్రోత్సవం, బ్రహ్మోత్సవం, పుష్పయాగం, ధనుర్మాసం వంటి సంవత్సరోత్సవాలు అత్యంత వైభవంగా జరుగుతున్నాయి.

ఇలా సంవత్సరంపాటు సప్తగిరీశునికి సుమారు 400కు పైగా సేవలు, ఉత్సవాలు జరుగుతున్నాయి. తిరుమల క్షేత్రంలో ప్రతి రోజూ పండగనే, ప్రతిపూటా పరమాణ్ణాలే పాయసాలే. ఆనంద నిలయుడు ఉత్సవ ప్రియుడట! అంతకంటె భక్త ప్రియుడట ! ఆ స్వామివారికున్న భక్త వాత్సల్యం ఇంతా అంతా అని చెప్పటానికి సాధ్యం కాదట. తనను చేరవచ్చిన భక్తులచేత ఉత్సవాలు చేయించుకొంటాడట! మొక్కులు చెల్లించుకొంటాడట! ఊరేగింపులు చేయించుకొంటాడట! తనకు ఉత్సవాలు, ఊరేగింపులు చేయించిన భక్తులకు ఎనలేని కల్యాణ పరంపరలు, శుభ పరంపరలు కలిగిస్తాడట. అసలు ఉత్సవాలు చేయించక పోయినా పర్వాలేదట! ఆ కొండలరాయని కొండంత వైభవాన్ని, మహోత్సవాలను కన్నులారా తిలకిస్తే చాలట! పాపాలు పోతాయి, కోరికలన్నీ సిద్ధిస్తాయి. ఆనంద నిలయుని దర్శిస్తే చాలట బ్రహ్మానందం కలుగుతుంది.

అందువల్ల మనం అందరం ఆ అడుగడుగు దండాలవాణ్ణి, ఆపద మొక్కులవాణ్ణి, కోరిన వరాల రాయణ్ణి అడుగడుగునా స్మరిస్తూ ఆ జగత్కల్యాణ చక్రవర్తికి నిత్యమూ జరిగే నిత్యోత్సవాలను గూర్చి వరుసగా తెలుసుకుందాం.

# నిత్యకల్యాణ చక్రవర్తి నిత్యోత్సవాలు

తిరుమల క్షేత్రంలో నిత్య కల్యాణ చక్రవర్తి అయిన శ్రీ వేంకటేశ్వర స్వామివారికి నిత్యమూ అంటే ప్రతి రోజూ సూర్యోదయానికి ముందునుంచి సూర్యాస్తమానం అయిన తర్వాత రాత్రి పొద్దుపోయేంతవరకు ఎన్నో ఎన్నో దైనందిన కార్యక్రమాలు, ఉత్సవాలు జరుగుతూ వుంటాయి. అనగా ఒక రోజులో విధిగా జరిగే ఉత్సవాలను నిత్యోత్సవాలని అంటారు. వాటిలో ప్రధానంగా మొదట సుప్రభాతసేవతో ప్రారంభమై, ఆ తర్వాత వరుసగా తోమాలసేవ, సహస్రనామార్చన, ఆమంత్రణోత్సవం, కల్యాణోత్సవం, డోలోత్సవం, ఆర్జిత బ్రహ్మోత్సవం, వాహన సేవలు, ఆర్జిత వసంతోత్సవం, సహస్ర దీపాలంకారసేవ ఇలా జరుగుతూ రాత్రి చివరగా ఏకాంతసేవతో నిత్యోత్సవాలు పూర్తవుతాయి. ఇలా ఒక రోజు నిత్యమూ జరిగే ఈ సేవలను వివరంగా వరుసగా తెలుసుకొందాం. ముందుగా ''సుప్రభాత సేవ'' ను గురించి వివరించుకునే ముందు ఒక్కసారి ఆ శ్రియఃపతికి అడుగడుగు దండాలు సమర్పించుదాం.

అడుగడుగు దండాలవాడా!
గోవిందా! గోవిందా!! గోవింద!!!

## 1. సుప్రభాత సేవ

తిరుమలేశుని సన్నిధిలో ప్రతిరోజూ తొట్టతొలిగా ప్రారంభమయ్యే సేవ ''సుప్రభాత సేవ''. సుప్రభాతం అనగా ''మేలు కొలుపు'' అని అర్థం. శయన మండపంలో బంగారు పట్టె మంచంపై సుతిమెత్తని పట్టు పరుపులపై యోగ నిద్రలో వున్న సర్వజగత్ప్రభువు అయిన సప్తగిరీశుని మేల్కొల్పడమనే కార్యక్రమమే ''సుప్రభాతసేవ''. సు= మంచి; ప్రభాతం= ఉదయం - అనగా శుభోదయమని అర్థం. ఎవరికి శుభోదయం అంటే ఆ స్వామి ఆనంద నిలయుడు యోగ నిద్రనుండి శుభోదయాన మేల్కొంటే సర్వజగాలకు శుభోదయం అన్నమాట. సుప్రభాతాన్ని తమిళంలో ''తిరుప్పళి యెళిచ్చి'' అని అంటారు. దీన్నే సంస్కృతంలో 'ప్రాభాతిక స్తవం' అంటారు అంటే ప్రభాత సమయంలో చేసే మంగళప్రదమైన కీర్తన.

ప్రస్తుతం దేశమంతటా విశేష ప్రాచుర్యాన్ని పొందిన తిరుమల శ్రీ వేంకటేశ్వర సుప్రభాతాన్ని 15 వ శతాబ్దంలో మనవాళ మహాముని శిష్యులైన ప్రతివాది భయంకర అణ్ణన్ అనువారు రచించారు.

తిరుమల క్షేత్రంలో పవిత్రమైన ప్రశాంతమైన బ్రాహ్మీ ముహూర్తంలో అంటే ప్రతిరోజు తెల్లవారు జామున 2-30 నుంచి 3-00 గంటల సమయంలో బంగారు వాకిలి ముందర సుప్రభాత స్తోత్రాలను, మేలుకొలుపు పాటలను పఠిస్తూ అఖిలాండ కోటి బ్రహ్మాండనాయకుడైన శ్రీ వేంకటేశ్వరస్వామివారిని నిద్రలేపటమనే కార్యక్రమం అత్యంత శోభాయమానంగా వుంటుంది.

శ్రీస్వామివారి కైంకర్యపరులైన అర్చకులు, జియ్యంగార్లు, ఏకాంగులు, సన్నిధి గొల్ల, సుప్రభాతం పఠించే ఆచార్య పురుషులు, మేలు కొలుపు పాటలు గానం చేసే తాళ్ళపాకంవారు, దేవస్థానం అధికారులు, ఈ సుప్రభాత సేవలో పాల్గొనటానికి నిర్ణీత రుసుమును చెల్లించి ప్రవేశం పొందిన భక్తులు...... ఇలా అందరూ బంగారు వాకిలి ముందర, తెల్లవారు జామున 2-30 గంటలకు ఒక క్రమ పద్ధతిలో చేరి నిలిచి వుంటారు.

ముందుగా ఆలయ అర్చక స్వామి బంగారువాకిలికి లోపలివైపున వేసి వున్న గడియను కుంచెకోల అనే పరికరంతో, వాకిలికున్న చిన్న రంధ్రం ద్వారా బయటినుంచే తీస్తారు. ఆ తర్వాత 'సన్నిధిగొల్ల' అధికారుల అనుమతితో బంగారు వాకిలికివున్న తాళాల నన్నింటిని తీస్తాడు. పిదప గొల్ల దివిటీ పట్టుకొని బంగారు వాకిలిని కొద్దిగా తెరచి లోపల ప్రవేశించగా, ఆ వెను వెంటనే అర్చకస్వామి ''కౌసల్యా సుప్రజా రామ!...... '' అంటూ గట్టిగా సుప్రభాతాన్ని పఠిస్తూ లోపలికి వెళతారు. ఆ వెంటనే ఏకాంగి కూడ బంగారు వాకిలి దగ్గర సిద్ధంగా వున్న మహంతుమఠం వారి నవనీత హారతి పళ్లాన్ని తీసుకొని లోనికి వెళ్లిన వెంటనే బంగారు వాకిళ్లు మళ్లీ దగ్గరికి వేస్తారు.

ఇంతలో బంగారు వాకిలి ముందర నిలిచి వున్న నలుగురైదుగురు ఆచార్య పురుషులు, అర్చకులు బంగారు వాకిలి లోనికి వెళుతూ పఠించిన సుప్రభాతాన్ని అందుకొంటూ --

**కౌసల్యా సుప్రజారామ! పూర్వా సంధ్యా ప్రవర్తతే**
**ఉత్తిష్ఠ నర శార్దూల కర్తవ్యం దైవ మాహ్నికమ్.**

అంటూ ప్రారంభించి వరుసగా 29 శ్లోకాలున్న సుప్రభాతాన్ని, 11 శ్లోకాలున్న శ్రీ వేంకటేశ స్తోత్రాన్ని, 16 శ్లోకాలున్న శ్రీ వేంకటేశ ప్రపత్తిని, 14 శ్లోకాలున్న శ్రీ వేంకటేశ మంగళా శాసనాన్ని శ్రుతి మధురంగా, హృదయంగమంగా పఠిస్తారు. ఈ సుప్రభాతం తిరుమల అంతటా ప్రతిరోజు తెల్లవారు జామున ఆహ్లాదంగా వినిపిస్తుంది.

సరిగ్గా ఇదే సమయంలోనే బంగారు వాకిలికి దగ్గర ఆనుకొని తాళ్లపాక అన్నమాచార్యుల వంశీయు లొకరు--

**శ్రీగురుం డర్థితో శేషాద్రియందు**
**యోగనిద్రాకేళి నున్న యత్తఱిని**
**వనజాసనాది దేవత లేగుదెంచి**
**వినుతించి రప్పు డవ్విధ మెట్టిదనిన**

## బ్రహ్మాది దేవతల వినుతి

**శ్రీకర! వేంకట క్షితి ధరావాస!**
**నాకేశ నుత! రమానాథ! మేల్కొనుము!**
**వసుదేవకీ వరగర్భజాత!**
**కిసలయాధర! రామకృష్ణ! మేల్కొనుము**
**తపము పెంపున యశోదా నందులకును**
**కృపతోడ శిశువైన కృష్ణ మేల్కొనుము**
**పూతనా కైతవ స్ఫురిత దుర్వార**
**చైతన్య హరణ ప్రశస్త! మేల్కొనుము**
**అఱి ముఱి శకటాసురాంగంబులెల్ల**
**విఱుగదన్నిన యదువీర మేల్కొనుము**
**సుడిగాలి రక్కసు స్రుక్కంగ బట్టి**
**కెడపిన యదు బాలకృష్ణ! మేల్కొనుము**

......................................

అంటూ మేలుకొలుపు ద్విపదనుగానీ, లేదా ''మేలుకో! శృంగారరాయ! మేలుకో మేటి మదనగోపాల..........'' అంటూ కీర్తనలు గాని గానం చేస్తారు.

ఇలా బంగారు వాకిలిముందర సుప్రభాతం, మేలుకొలుపులు పాడుతూ వుండగా లోనికి వెళ్లిన అర్చకస్వాములు శయనంపై వేంచేసి వున్న భోగ శ్రీనివాస మూర్తిని నిద్ర మేల్కొల్పి ఆనంద నిలయం లోనికి వేంచేపు చేసి అన్ని ఉపచారాలు సమర్పిస్తారు. ఇంతలో బయట--

*శ్రీమత్సుందర జామాతృముని మానసవాసినే*
*సర్వలోక నివాసాయ శ్రీనివాసాయ మంగళమ్*
*మంగళా శాసన పరైర్మదాచార్య పురోగమైః*
*సర్వైశ్చ పూర్వైరాచార్యైః సత్కృతాయాస్తు మంగళమ్*

అంటూ సుప్రభాత పఠన పూర్తి కాగానే శ్రీ వేంకటేశ్వరస్వామివారికి పాలు, వెన్న నివేదన చేసి కర్పూరహారతి ఇస్తుండగా బంగారు వాకిళ్లు తెరవబడతాయి. శ్రీస్వామివారి దర్శనం కోసం అర్రులు చాస్తున్న భక్తులను, ఆ కర్పూర హారతి వెలుగుల్లో శ్రీస్వామివారి దివ్య తేజస్సు మరింత ప్రస్ఫుటమై మైమరపిస్తుంది.

పిదప అర్చకులు, రాత్రి బ్రహ్మాది దేవతలు అర్చించటానికి పెట్టిన బ్రహ్మ తీర్థాన్ని ముందుగా తాము స్వీకరించి, పిదప జియ్యంగార్లు, ఏకాంగికి, గొల్లకు ఇస్తాడు. ఆ తర్వాత ఆచార్య పురుషులు తాళ్లపాకంవారు, అధికారులు, భక్తులు ఇలా వరుసగా బంగారు వాకిలి లోనికి వెళ్లి శ్రీవారి దివ్య మంగళ విగ్రహ సౌందర్యాన్ని ఆపాదమస్తకం కన్నులారా దర్శిస్తారు. ప్రతిరోజు ఈ సుప్రభాత దర్శనంలో మాత్రమే శ్రీస్వామివారి సువర్ణ పాద దర్శనం అవుతుంది. అంతేగాక ఎలాంటి పూలు, తులసి వంటి నిర్మాల్యం లేకుండా కేవలం ఆభరణాలతో మాత్రమే శ్రీస్వామివారు దివ్య దర్శనం ఇస్తారు. ఇలా ఆపాద మస్తకం కలిగే శ్రీవారి దివ్య దర్శనాన్ని ''విశ్వరూప దర్శనం'' అంటారు. ఈ విశ్వ రూప దర్శనంలో శ్రీవారి పాద దర్శనం చేస్తే పాపాలన్నీ పోతాయట! సంకటాలన్నీ తొలగుతాయట! ఇష్టార్థ సిద్ధి కలుగుతుందట. అందువల్లే ''పాద దర్శనం పాప విమోచనం'' అన్న ప్రసిద్ధి ఏర్పడింది.

ప్రతిరోజు తెల్లవారుజామున 2-30 గంటలకు తొలిసేవగా జరిగే ఈ ''సుప్రభాత సేవ''లో నిర్ణీత రుసుమును చెల్లించి భక్తులు పాల్గొనవచ్చు. బంగారువాకిలి ముందర చాలినంత స్థలం లేనందువల్ల సుప్రభాత ఆర్జిత భక్తుల సంఖ్య పరిమితం చెయ్యబడింది.

## ఎలా పాల్గొనాలి?

ఈ సుప్రభాతంలో పాల్గొనదలచిన భక్తులు నిర్దేశించిన రుసుమును (ప్రస్తుతం 120 రూ. ఒక్కరికి మాత్రమే) ఏ జాతీయ బ్యాంకులోనైనా డిమాండుడ్రాఫ్టును ''ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు, తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి'' వారి పేర తీసి, దానిని ''డిప్యూటి ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు, తిరుమల శ్రీవారి ఆలయం, తిరుమల''కు వారికి కావలసిన తేదికి 90 రోజులు ముందుగానే పంపుతూ, అనుమతిని పొందవచ్చు. ఈ అనుమతిని ధ్రువీకరణ పత్రం ద్వారా ముందుగానే భక్తులకు తెలియజేయ బడుతుంది. అయినా ఆ రోజుకు, అప్పటికి వున్న అవకాశాన్నిబట్టి మాత్రమే వీలు కల్పించబడుతుంది. ఈ సుప్రభాతం టికెట్టుగల భక్తులను ప్రతి రోజు తెల్లవారుజామున 2 గంటలకు 'వైకుంఠం క్యూ'' ద్వారా మాత్రమే ఆలయంలోనికి అనుమతిస్తారు. ఈ సుప్రభాతసేవలో పాల్గొన్న భక్తునికి ఒకరికి ప్రస్తుతం రెండు లడ్లు ప్రసాదంగా ఇవ్వబడుతున్నాయి.

## తిరుమలలో తిరుప్పావై

ఈ సుప్రభాతసేవ సంవత్సరంలో ఒక నెలరోజుల పాటు మాత్రం ఉండదు, జరుగదు. కాని ప్రతిరోజు తాళ్లపాకంవారి ''మేలుకొలుపు'' పాట మాత్రం యధావిధిగా కొనసాగుతుంది. అంతేగాక ధనుర్మాస మనబడే డిశంబరు 15 నుండి జనవరి 14 వరకు ఒక్క నెలపాటు గోదాదేవి గానం చేసిన 30 పాశురాల తిరుప్పావై పఠన ఏకాంతంగా జరుగుతుంది. ఈ నెలరోజులపాటు భోగశ్రీనివాసమూర్తికి బదులుగా శ్రీకృష్ణస్వామి (వెన్నముద్ద కృష్ణుని వెండి విగ్రహం) మాత్రమే శయనిస్తారు. అర్చకులు, జియ్యంగార్లు మాత్రమే ఈ తిరుప్పావై పఠనంలో పాల్గొంటారు. ఇతరులెవ్వరికీ ప్రవేశం వుండదు.

* * *

# ౨. తోమాలసేవ

శ్రీవారి సుప్రభాతసేవ అయిన తర్వాత భక్తులు శ్రీస్వామివారి విశ్వరూప దర్శనాన్ని కన్నులారా ఆపాద మస్తకం చేసికొంటూ ఒక వింత తృప్తితో మైమరచి బయటికి వెళ్లి శ్రీవారి తీర్థాన్ని స్వీకరిస్తారు. అనంతరం బంగారు వాకిలి నుండి శ్రీవారి సన్నిధివరకు శుద్ధి చేస్తారు.

అనంతరం పూల అరలో సిద్ధంగా ఉంచబడిన పూలమాలల బుట్టను జియ్యంగార్ లేదా ఏకాంగి తలపై పెట్టుకొని మంగళవాద్యాలతో ఊరేగింపుగా ధ్వజస్తంభ ప్రదక్షిణం చేస్తూ, లోపల ఆనందనిలయ విమాన ప్రదక్షిణాన్ని పూర్తిచేసి, సన్నిధిలో సమర్పిస్తారు.

ఆ వెంటనే 'ఉదయాస్తమాన సర్వ సేవా పథకం'లో పాల్గొనే ఆర్జిత భక్తులను, మరియు తోమాలసేవలో పాల్గొనే ఆర్జిత భక్తులను మాత్రమే లోనికి ప్రవేశపెట్టి శ్రీవారి శయన మండపం నుంచి బంగారు వాకిలి వరకు ఒకరి వెనుక ఒకరిని కూర్చొండ బెడతారు.

**సంకల్పం**

ఉదయం సుప్రభాతం నుంచి రాత్రి ఏకాంతసేవ వరకు అన్ని సేవల్లో పాల్గొనే ఉదయాస్తమాన సర్వ సేవా ఆర్జిత భక్తులచేత మాత్రమే అర్చకులు తొలిగా సంకల్పం చెప్పిస్తారు.

ఆ తర్వాత భోగశ్రీనివాసమూర్తికి అభిషేకాన్ని ప్రారంభిస్తారు.

**అభిషేకం**

భక్తులందరూ కన్నులారా చూస్తూ వుండగా భోగశ్రీనివాసమూర్తిని వెండి స్నాన పీఠంపై వేంచేపుచేసి అభిషేకాన్ని ప్రారంభిస్తారు. ముందుగా తిరుమలనంబి వంశీయులు తెచ్చిన ఆకాశగంగా తీర్థ జలంతో అభిషేకించిన తర్వాత ఆవుపాలతోను (గోక్షీరం) పరిమళంతోను మంగళ స్నానం జరుగుతూవుండగా వేదపండితులు పురుష సూక్తాదులను పఠిస్తుంటారు. అదే సమయంలో తెరవేసి శ్రీవారిమూలవిరాట్టు పాదాలకు వున్న బంగారు పాద కవచాలను స్నానం పీఠంపై

వుంచి అభిషేకం చేస్తారు. అభిషేకం పూర్తి అయిన తర్వాత పక్కన వుండే సాలగ్రామాలకు కూడ అభిషేకం పూర్తి చేసిన తర్వాత తుడుస్తున్న సమయంలో జియ్యంగార్లు వైష్ణవాచార్యులు తమిళ దివ్య ప్రబంధంలోని నీరాట్టం పది పాశురాలను శ్రవణపేయంగా గానం చేస్తారు.

''నాయనా! చిన్ని కన్నయ్యా, నీకు చక్కగా లాలపోసి ముద్దుగా అలంకరించాను. మళ్లీ మన్నులో ఆడుకోవద్దు. ఒళ్లంతా దుమ్ము కొట్టుకోవద్దురా నా చిన్ని కృష్ణా!'' అని మురిపెంగా యశోదాదేవి బుజ్జగిస్తున్న సుకుమార సుందర భావాలు ఉట్టిపడే మాటలతో కూడిన విష్ణుచిత్తుని (పెరియాళ్వారు) నీరాట్టం పదిపాశురాల గానం సాగుతూ వుండగా తెరలోపల అర్చక స్వాములు భోగ శ్రీనివాసమూర్తికి తడిని తుడిచి వస్త్రాలంకారం చేస్తారు. అలాగే సాలగ్రామాలను తుడుస్తారు.

తోమాలసేవ ప్రారంభానికి ముందు శ్రీ భోగ శ్రీనివాసమూర్తికి జరిగే నిత్యాభిషేకం రోజున, శ్రవణనక్షత్రం కూడినట్లయితే భోగ శ్రీనివాసమూర్తితోపాటు శ్రీదేవి భూదేవి సమేతంగా శ్రీమలయప్పస్వామివారికి, రోహిణీనక్షత్రం ఉండినట్లయితే శ్రీరుక్మిణీ శ్రీ కృష్ణులకు, పునర్వసునక్షత్రం ఉండినట్లయితే శ్రీసీతారామలక్ష్మణులకు అభిషేకం చేస్తారు. ఇదిగాక ధనుర్మాసంలో ప్రత్యేకంగా ఒక నెలపాటు భోగ శ్రీనివాసమూర్తికి బదులుగా శ్రీకృష్ణస్వామికి ఏకాంతసేవలో శయన భాగ్యం కలుగుతుంది. తదుపరి ఈ కృష్ణునికే తోమాలసేవకు ముందు అభిషేకం జరుగుతుంది. పిదప అర్చకులు ''భూత శుద్ధి'' అనే వైఖానస ప్రక్రియను ఏకాంతంగా నిర్వహిస్తారు. అనగా, మనసా వాచా కర్మణా ఆ పరమాత్మను ఆవాహనం చేసికొని అక్కడ వుండే అన్ని బింబమూర్తులను వరుసగా అర్చిస్తారు. ముందుగా తెరనుతీసి శ్రీస్వామివారి మూలమూర్తికి, వక్షఃస్థల మహాలక్ష్మికి, భోగశ్రీనివాసమూర్తికి, ఉత్సవమూర్తికి, కొలువుమూర్తికి, ఉగ్రశ్రీనివాసమూర్తికి, విమాన వేంకటేశ్వరస్వామికి, సాల గ్రామాలకు, చక్రత్తాళ్వారుకు, శ్రీ సీతారామ లక్ష్మణులకు, రుక్మిణీ శ్రీకృష్ణులకు అర్ఘ్య పాద్యాచమనాదులు సమర్పించుచుండగా 'తిరుప్పళ్లి యెళుచ్చి' 'తిరుప్పావై' పఠన సాగుతుంది. ఆ తర్వాత పుష్పాలంకరణమనే ''తోమాలసేవ'' జరుగుతుంది.

ఇలాగ తిరుమల ఆనంద నిలయుడైన శ్రీ వేంకటేశ్వరస్వామివారి మూల విరాట్టును, ఇతర ఉత్సవమూర్తులను, ఇతర విగ్రహాలను పుష్పమాలలతో, తులసి మాలలతో అలంకరించే కార్యక్రమాన్నే 'తోమాలసేవ' అంటారు. ''తోమాల'' ను 'తోళ్‌మాల' అని తమిళంలో అంటారు. తోళ్ అనగా భుజమని అర్థం. భుజాలమీదుగా వేలాడేట్లుగా అలంకరించే శ్రీవారి పుష్పాలంకరణే 'తోమాల సేవ' అని కొందరి భావన.

పుష్పాలంకరణ శ్రీవారి పాదాలతో ప్రారంభమవుతుంది. పాదాలకు, కంఠంలో వక్షః స్థల లక్ష్మికి, భూదేవికి, నందకఖడ్గానికి, శంఖచక్రాలకు అలంకరిస్తారు. శ్రీస్వామి వారి మూలమూర్తికి అలంకరించే స్థానాలనుబట్టి కూడా పూలమాలలకు కొన్ని స్థిరమైన పేర్లు కలిగి వుండడం ఒక విశేషం.

## శ్రీవారి మూలమూర్తిని నిత్యమూ అలంకరించే దండలు

### 1. శిఖామణి

కిరీటం మీదినుంచి రెండు భుజాలమీది వరకు అలంకరింపబడే ఒకే ఒక దండను 'శిఖామణి' అంటారు. ఇది 8 మూరల దండ.

### 2. సాలిగ్రామ మాల

శ్రీవారి భుజాల నుండి ఇరువైపులా పాదాలవరకు వేలాడుతూవున్న సాలిగ్రామాల మాలలకు ఆనుకొని వేలాడదీస్తూ అలంకరింపబడే పొడవైన పూలమాలలు. ఇవి రెండు మాలలు. ఒక్కొక్కటి సుమారు 4 మూరలు.

### 3. కంఠసరి

మెడలో రెండు పోర్వలుగా రెండు భుజాలమీదికి అలంకరింపబడే దండ ఒకటి. 3 1/2 మూరలు.

### 4. వక్షః స్థల లక్ష్మి

శ్రీస్వామివారి వక్షః స్థలంలో వున్న శ్రీదేవి భూదేవులకు రెండు దండలు. ఒక్కొక్కటి 1 1/2 మూర.

**5. శంఖు చక్రం**

శంఖుచక్రాలకు రెండు దండలు. ఒక్కొక్కటి ఒక మూర.

**6. కఠారిసరం**

శ్రీస్వామివారి బొడ్డునవున్న నందక ఖడ్గానికి అలంకరించే దండ ఒకటి రెండు మూరలు.

**7. తావళములు**

రెండు మోచేతులకింద, నడుము నుండి మోకాళ్లపై హారాలుగా, మోకాళ్లనుండి పాదాలవరకు జీరాడుతూ వ్రేలాడదీసే మూడు దండలు – 1) మూడు మూరలు, 2) 3½ మూరలు, 3) 4 మూరలు.

**8. తిరువడి దండలు**

శ్రీస్వామివారి పాదాల్లపై చుట్టూ అలంకరించే రెండు దండలు. ఒక్కొక్కటి ఒక్క మూర.

ప్రతి గురువారం సాయంత్రం జరిగే ''పూలంగి సేవ''లో మాత్రమే శ్రీస్వామివారికి ఆభరణాలన్నీ తీసివేసి, పైన పేర్కొన్న మాలలతోపాటు నిలువెల్ల స్వామివారిని విశేషంగా పూలమాలలతో అలంకరిస్తారు.

ఇవిగాక శ్రీవారి ఆనంద నిలయంలోని వివిధ ఉత్సవ మూర్తులకు కూడా ఈ క్రింది విధంగా మాలలు సిద్ధంగా చేయబడి అలంకరింపబడతాయి.

**ఉత్సవమూర్తులకు నిత్యమూ అలంకరింపబడే దండల వివరం**

| | | |
|---|---|---|
| భోగశ్రీనివాసమూర్తికి | – | ఒక దండ |
| కొలువు శ్రీనివాసమూర్తికి | – | ఒకటి |
| శ్రీదేవి భూదేవి సహిత మలయప్ప స్వామికి | – | 3దండలు. |
| శ్రీదేవి భూదేవి సహిత ఉగ్ర శ్రీనివాస మూర్తికి | – | 3 దండలు. |
| శ్రీ సీతారామ లక్ష్మణులకు | – | 3 దండలు. |
| శ్రీ రుక్మిణీ శ్రీకృష్ణులకు | – | 2 దండలు |
| చక్రత్తాళ్వారుకు (సుదర్శనుడు) | – | ఒక దండ. |

| | | |
|---|---|---|
| అనంత గరుడ విష్వక్సేనులకు | – | 3 దండలు. |
| సుగ్రీవ అంగద హనుమంతులకు | – | 3 దండలు. |

**ఇతర విగ్రహమూర్తులకు నిత్యమూ అలంకరించే పూలదండలు**

| | | |
|---|---|---|
| బంగారు వాకిలి ద్వారపాలకులకు | – | 2 దండలు. |
| గరుడాళ్వారుకు | – | 1 దండ. |
| వరదరాజస్వామికి | – | 1 దండ. |
| వకుళమాతకు | – | 1 దండ. |
| భగవద్రామానుజుల (మూలమూర్తి, ఉత్సవమూర్తి)కు | – | 2 దండలు. |
| యోగనరసింహస్వామికి | – | 1 దండ. |
| విష్వక్సేనులవారికి | – | 1దండ. |
| పోటుతాయారుకు | – | 1 దండ. |
| బేడి ఆంజనేయస్వామికి | – | 1 దండ. |
| శ్రీ వరాహస్వామికి | – | 3 దండలు. |
| కోనేటిగట్టు ఆంజనేయస్వామికి (ప్రతి ఆదివారం మాత్రమే) | – | 1 దండ |

ఇటీవల కొంతకాలం నుంచీ ప్రతి రోజు కూడ శ్రీ బేడీ ఆంజనేయస్వామి పుష్ప మాలలతో అలంకరింపబడుతున్నాడు.

తిరుమల క్షేత్రంలో తులసి, చామంతులు, గన్నేరులు, సన్నజాజులు, మల్లెలు, మొల్లలు, మొగిలి, కమలం (తామర), కలువ, రోజాలు, గులాబీలు, సంపెంగలు, సుగంధాలు, మామిడాకులు, తమలపాకులు, పచ్చి పసుపుచెట్లు, కనకాంబరం, మరువం, మాచీపత్రం, దవనం, బిలువం (మారేడు) ఇలా రంగు రంగులతో సుగంధపరిమళాలను వెదజల్లే ఎన్నో పుష్ప జాతులను, పత్రాలను శ్రీవారి పుష్పకైంకర్యాలలో వినియోగిస్తారు.

ప్రతిరోజు ఉదయం, సాయంత్రం రెండుపూటలా శ్రీ స్వామివారికి జరిగే తోమాల సేవ (పుష్పకైంకర్యం)కు గాను ఈ పుష్ప అర నుండి సిద్ధం చేయబడిన పూలమాలలను, జియ్యంగారులు తలపైపెట్టుకొని బాజా భజంత్రీలతో ఛత్రచామర

మర్యాదలతో వేదమంత్రోచ్చారణలతో ఊరేగింపుగా బయలుదేరి ధ్వజస్తంభానికి ప్రదక్షిణంగా వచ్చి విమాన ప్రదక్షిణం చేస్తూ శ్రీవారి సన్నిధిలో సమర్పించడం జరుగుతుంది.

ఇలా శ్రీ వేంకటేశ్వరస్వామివారి మూలమూర్తికి, ఉత్సవమూర్తులకు సుమారు అరగంటసేపు కన్నులపండువుగా జరిగే పుష్పమాలాలంకరణమనే తోమాలసేవలో భక్తులు మైమరచి పులకిస్తారు. ఒక్కొక్క దండ అలంకరణలో ఒక్కొక్క విధంగా అందాలు సంతరించుకొంటున్న ఆనందనిలయుని అద్భుత సౌందర్యం కన్నులారా చూచి తీరవలసిందే కాని వర్ణించడానికి సాధ్యం కాదు. పూలమాలలను అలంకరించిన అనంతరం వేదపండితులు మంత్రపుష్పాన్ని పఠించిన తర్వాత అర్చకులు శ్రీవారి పాదాలమీద తులసిని సమర్పిస్తారు. పిదప అర్చక స్వాములు శ్రీవారి పాద సేవ చేసుకొని ఆలవట్టంచేత వీస్తారు. అనగా ''ఓ స్వామీ! పుష్పాలంకరణమనే ఈ సేవలో ఏమైనా దోషాలు వుంటే మన్నించి అనుగ్రహించ వలసిందని శ్రీవారి పాదపద్మాలను తమ చేతులతో పట్టుకొని ప్రార్థిస్తారు. పిదప ఆలవట్టం (విసనకర్ర)తో శ్రీస్వామివారికి వీస్తూ సేవించిన తర్వాత 27 వత్తులను దొంతర్లుగా అమర్చిన వెండి దీపం వెలిగించి 27 జ్యోతులతో ''నక్షత్రహారతి''ని ఇస్తారు. పిదప వెంటనే కర్పూర హారతి కూడ ఇవ్వబడు తుంది. నక్షత్ర హారతి వెలుగుల్లో శ్రీస్వామివారి మూలమూర్తి ఆపాదమస్తకం వింత వింత తేజస్సులతో అలరారుతూ వుండగా ఈ సేవలో పాల్గొన్న భక్తులందరూ కన్నులార్పక దర్శిస్తూ ఎప్పుడో ఏనాడో చేసికొన్న మహద్భాగ్యం చేత ఈ సువర్ణ అవకాశం కల్గింది కదా అనుకొంటూ క్షణం వ్యర్థం చెయ్యకుండా శ్రీవారిని దర్శిస్తారు.

ప్రతి రోజు తెల్లవారు జామున 3-30 గంటలకు మళ్లీ సాయంత్రం 7 గంటలకు ఇలా రెండుమారులు శ్రీవారికి ''తోమాల సేవ'' జరుగుతుంది. ఉదయం పూట జరిగే 'తోమాలసేవ'లో మాత్రమే ఆర్జితం చెల్లించిన భక్తులు పాల్గొనవచ్చును. సాయంత్రం పూట జరిగే 'తోమాలసేవ'ను ఏకాంతగా అర్చకులు, జియ్యంగార్లు మాత్రమే నిర్వహిస్తారు. భక్తులు ఎవరూ పాల్గొనడానికి వీలులేదు.

**ఎలా పాల్గొనాలి**

తోమాలసేవలో పాల్గొనదలచిన భక్తులు నిర్ణీత రుసుమును డిమాండు డ్రాఫ్టును ఏ జాతీయ బ్యాంకులోనైనా ''ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు, తి.తి. దేవస్థానములు, తిరుపతి'' వారి పేర తీసి దానిని '' డిప్యూటి ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు, తిరుమల శ్రీవారి ఆలయం, తిరుమల'' వారికి కావలసిన తేదీకి 90 రోజులు ముందుగా పంపుతూ, ఆ తేదీకి అనుమతి పత్రాన్ని పొందవచ్చు. ఈ అనుమతిని ధ్రువపత్రం ద్వారా ముందుగనే భక్తులకు తెలియజేయబడుతుంది. అయినా అప్పటికి, ఆ తేదీకివున్న అవకాశాన్నిబట్టి మాత్రమే వీలు కల్పించబడుతుంది.

తోమాలసేవ టికెట్లుగల భక్తులు ప్రతి రోజు తెల్లవారుజామున 3-00 గంటలకు 'వైకుంఠం క్యూ'' కాంప్లెక్సు భవనం ద్వారా మాత్రమే ఆలయంలోనికి అనుమతింప బడతారు. ఈ భక్తులు అందరూ శ్రీ వేంకటేశ్వరస్వామివారికి ఎదురుగా వున్న కులశేఖరపడి (మొదటి గడప) నుండి బంగారు వాకిలి ఎదురుగా గరుత్మంతుని మండపం వరకు బారులుగా తీరి కూర్చుండి పుష్పాలంకరణలో తేజస్సుతో వున్న శ్రీవారి దివ్యమంగళ విగ్రహ సౌందర్యాన్ని దర్శించవచ్చు.

ప్రతి శుక్రవారంనాడు మాత్రం అభిషేకానంతరం జరిగే తోమాల సేవతోపాటు, వెంటనే జరిగే ''అర్చన''లో కూడ భక్తులు తప్పక పాల్గొనవలసి వుంటుంది. ఒక్క శుక్రవారంనాడు మాత్రం ప్రత్యేకంగా 'తోమాల సేవ'ను గానీ, ప్రత్యేకంగా 'అర్చన'ను గాని దర్శించడానికి వీలులేదు. ఈ రెండింటికి కలిపి 420 రూ॥లు చెల్లించి పై విధంగానే ఉత్తర్వు పొందవలసి వుంటుంది.

'తోమాలసేవ' పూర్తి అయిన వెంటనే శ్రీ కొలువు శ్రీనివాసమూర్తికి స్నపన మండపంలో బంగారు సింహాసనంలో కొలువు జరుగుతుంది. ఈ కొలువులో దర్బార్ శ్రీనివాసమూర్తికి ముందునాటి ఆదాయ వ్యయాలు, పంచాంగ శ్రవణం జరిగిన తర్వాత నువ్వుల పిండిని నివేదించి, కర్పూర హారతిని సమర్పించడం జరుగుతుంది. పిదప కొలువు శ్రీనివాసమూర్తి గర్భాలయంలోనికి వెళ్లడంతో కొలువు ముగిసి ''సహస్ర నామార్చన'' అనే ఉదయం పూట జరిగే శ్రీవారి అర్చన సేవ ప్రారంభమవుతుంది.

* * *

# 3. శ్రీవారి సహస్రనామార్చన

అనంతంగా వ్యాపించి, అనంత నామాలతో పిలువబడుతూ అనంత రూపాల్లో ప్రకాశిస్తూ వున్న అఖిలాండ కోటి బ్రహ్మాండనాయకుడైన శ్రీ వేంకటేశ్వర స్వామివారిని అర్చించడం, ఆరాధించడం బ్రహ్మాది దేవతలకు కూడ సాధ్యం కాని పని. మరి మానవులు ఏ పాటి? అందువల్లే సాక్షాత్తు శ్రీ వైకుంఠవాసుడు భూలోక వైకుంఠమైన ఈ వేంకటాచల క్షేత్రంలో మానవులకోసం, ముఖ్యంగా కలియుగ మానవులకోసం కలౌ వేంకటనాయకః అనే బిరుదంతో అర్చా రూపంలో వెలసి సహస్రనామావళితో ఆరాధింపబడుతూ భక్తులను ఆనందింప జేస్తూ తరింప జేస్తున్నాడు.

తిరుమల క్షేత్రంలో శ్రీ వేంకటేశ్వర స్వామివారికి (మూలవరులకు) ప్రతిరోజు ఉదయం, మధ్యాహ్నం సాయంత్రం ఇలా మూడుమారులు అర్చన జరుగుతున్నది. ప్రతిరోజూ ఉదయం 'తోమాలసేవ' అనబడే పుష్పాలంకరణ అయినతర్వాత 'కొలువు' జరుగుతుంది. పిదప సహస్రనామార్చన అనబడే 'అర్చన' సేవ జరుగుతుంది. ఈ మొదటి అర్చనలో మాత్రమే ''సహస్ర నామావళి''తో శ్రీస్వామివారు అర్చింపబడతారు. ఇక మిగిలిన మధ్యాహ్నపు, సాయంత్రపు అర్చనల్లో ''అష్టోత్తర శతనామావళి'' తో మాత్రమే శ్రీవారు అర్చింపబడతారు. ప్రతి రోజు శ్రీస్వామివారికి తొలిగా జరిగే ''సహస్రనామార్చన'' లో భక్తులు తగిన రుసుమును చెల్లించి పాల్గొనవచ్చు. అంతేకాక ఒక్క మంగళవారంనాడు మధ్యాహ్నం జరిగే రెండవ అర్చన అష్టోత్తర శతనామార్చనగా జరుపబడే ''అష్టదళ పాద పద్మారాధన'' లో కూడా ఆర్జిత రుసుమును చెల్లించి శ్రీ స్వామివారిని దర్శించవచ్చు.

కాని, ఒక్క శుక్రవారంనాడు మాత్రం శ్రీస్వామివారి మూలమూర్తికి అభిషేకం జరుగుతుంది. కనుక సుప్రభాతానంతరం 'తోమాలసేవ' లఘువుగా జరిగిన తర్వాత తొలి అర్చనగా '' అష్టోత్తర శత నామార్చన'' మాత్రమే ఏకాంతంగా నిర్వహించ బడుతుంది. ఆ తర్వాత అభిషేకానంతరం రెండవ అర్చనగా ''సహస్రనామార్చన'' జరుగుతుంది.

**శ్రీ వేంకటేశ సహస్రనామావళి**

బ్రహ్మాండపురాణంలో పేర్కొనబడిన శ్రీ వేంకటాచల మాహాత్మ్యంలోని శ్రీ వేంకటేశ సహస్రనామస్తోత్రాధ్యాయంలో పేర్కొనబడిన నామావళితో ప్రతిరోజూ శ్రీ వేంకటేశ్వరస్వామి అర్చింపబడుతూ వున్నాడు. ఈ నామాలను వశిష్ఠ మహర్షి కోరికపై నారదమహర్షి తెలిపినట్లుగా పేర్కొనబడింది.

**వేంకటేశో విరూపాక్షోవిశ్వేశో విశ్వ భావనః**
**విశ్వ సృడ్విశ్వ సంహర్తావిశ్వప్రాణో విరాడ్వపుః**
**శేషాద్రి నిలయో శేష భక్త దుఃఖ ప్రణాశనః**
**శేషస్తుత్య శేష శాయీ విశేషజ్ఞో విభు స్స్వభూః**
**...................................................**
**............................................**
**శ్రీపతిర్భూమిజానిశ్చ విమలాద్యభి సంవృతః**
**జగత్కుటుంబ జనితా రక్షకః కౌమిత ప్రదః**
**అవస్థాత్రయం తా చ విశ్వ తేజ స్స్వరూపవాన్**
**జ్ఞప్తిర్జ్ఞేయో జ్ఞానగమ్యో జ్ఞానాతీత స్సురాతిగః**
**బ్రహ్మాండాంతర్బహిర్వ్యాప్తో వేంకటాద్రిగదాధరః.**

అని దేవర్షియైన నారదమునీంద్రులు వశిష్ఠమహర్షికి శ్రీ వేంకటేశ్వరుని సహస్రనామ స్తోత్రాన్ని ఉపదేశించాడు.

**ఏవం శ్రీ వేంకటేశస్య కీర్తితం పరమాద్భుతమ్**
**నామ్నాం సహస్రం సంశ్రావ్యం పవిత్రం పుణ్య వర్ధనమ్**
**శ్రవణాత్సర్వదోషఘ్నం రోగఘ్నం మృత్యునాశనమ్**
**దారిద్ర్యభేదనం ధర్మం సర్వైశ్వర్య ఫలప్రదమ్**
**కాలాహి విషవిచ్ఛేది జ్వరాపస్మార భంజనమ్**
**శత్రుక్షయకరం రాజ గ్రహపీడా నివారణమ్**
**బ్రహ్మ రాక్షస కూశ్మాండ భేతాళ భయ భంజనమ్.**

శ్రీ వేంకటేశుని సహస్రనామావళి పఠనంవల్ల , శ్రవణంవల్ల, అర్చించడం వల్ల పుణ్యం కలుగుతుందనీ సర్వదోషాలు పోతాయనీ, రోగాలు నశిస్తాయని,

వ్యుత్యునాశనమవుతుందని, దారిద్ర్యం తొలగి సంపన్నులవుతారని, కాలసర్పదోషాలు తొలగుతాయని, శత్రుక్షయం, అధికార, గ్రహపీడలు తొలగుతాయని బ్రహ్మరాక్షసాది, భూతప్రేత పిశాచ దోషాలు నిర్మూలింప బడతాయనీ అనేక విధాలుగా ఈ నామావళి మాహాత్మ్యాన్ని నారద మహర్షి కీర్తించినాడు.

శ్రీ వేంకటేశ్వరస్వామివారికి ఆంతరంగిక భక్తుడైన తొండమాను చక్రవర్తి ప్రత్యక్షంగా శ్రీ వేంకటేశ్వరస్వామివారితో నిత్యమూ సంభాషించేవాడు. అంతటి పరమభక్తుడు కాబట్టే అన్నమాచార్యులు కూడ--

**కొండలలో నెలకొన్న కోనేటి రాయడు వాడు**
**కొండలంత వరములు గుప్పెడువాడు**

..................................................

**దొమ్ములు సేసినయట్టి తొండమాంజక్కుర వర్తి**
**రమ్మన్న చోటికి వచ్చి నమ్మిన వాడు.**

అని తొండమానుని పరమభక్తి తత్త్వాన్ని కీర్తిస్తాడు. కాని ఒకసారి తొండమానుడు చేసిన పాపంవల్ల శ్రీనివాసుడు ఆ రాజుతో మాట్లాడలేదట! దర్శనం ఇవ్వలేదట! దీనికి నేనేం పాపం చేశానో ఎట్లా స్వామి అనుగ్రహిస్తాడో! ఎలా మాట్లాడుతాడో అని పెక్కు విధాల వగచి ఏదో ఉపాయం చెప్పమని చివరకు అంగీరసాది మునులను ప్రార్థిస్తాడు. అప్పుడు అంగీరసాది మహామునులు "ఓ రాజా! సర్వదోష నివారకమూ సర్వ శ్రేయోదాయకమైన శ్రీ వేంకటేశ్వరుని సహస్రనామావళితో శ్రీనివాసుని అర్చించడంతప్ప మరోమార్గం లేదని" చెప్పారట. ఆ సమయంలో తొండమాను చక్రవర్తి వేయిబంగారు తులసిదళాలతో శ్రీ స్వామివారిని అర్చించి పాప విముక్తుడైనట్లు వేంకటాచల మాహాత్మ్యం చెబుతోంది. అయినా ఆ తర్వాత తొండమానుడు తన మాదిరి బంగారు తులసి దళాలతో అర్చించే భక్తుడు మరొకడుండడు గదా అని అహంకరించినాడట. అంతే మరు రోజు శ్రీ స్వామివారి పాదాలమీద ఆ బంగారు తులసి దళాలు తొలగి, కురవనంబి సమర్పించిన మట్టిపూలు కన్పించాయట! తర్వాత మరింత భక్తి వినమ్రుడుగా మారినాడట ఆ రాజు. అందువల్లే శ్రీస్వామివారు అత్యంత పుష్ప ప్రియుడనీ,

అంతకంటే మించిన తులసీప్రియుడని, అన్నింటిని మించిన భక్త ప్రియుడనీ ప్రసిద్ధి పొందాడు.

క్రీస్తు శకం 1517 లో శ్రీ కృష్ణదేవరాయలు, 1527లో శరణుశెట్టి అనే భక్తుడు, 1533 లో అచ్యుతరాయలు, 1551 లో సదాశివరాయలు.... ఇలా ఎందరెందరో ప్రభువరేణ్యులు..... మరెందరో భక్తులు భక్తవరదుడైన శ్రీ వేంకటేశ్వరస్వామి వారికి సహస్ర నామార్చనలు ఘనంగా నిర్వహింప జేసి, విరాళాలు నివేదనలు, ఆభరణాలు, గ్రామాలు, విరాళంగా సమర్పించినట్లుగా శాసనాలు పేర్కొంటున్నాయి.

ఇలా తిరుమల క్షేత్రంలో ఎంతో ప్రాచీనతను, ఔన్నత్యాన్ని సంతరించుకున్న 'శ్రీ వేంకటేశ్వరుని సహస్ర నామార్చన' నేటికీ భక్త లోకంలో విశేష ప్రాముఖ్యాన్ని పొందడమే గాక పాప దూరులను, పాప విముక్తులను చేస్తూ అనేక మంది భక్తులను ఆకర్షిస్తూ వుంది.

ప్రస్తుతం ఆనందనిలయంలో శ్రీ వేంకటేశ్వరస్వామివారికి (మూల మూర్తికి) జరిగే మొదటి అర్చన ఇది. ప్రతిరోజూ తెల్లవారు జామున 4-5 గంటల మధ్య కాలంలో జరుగుతుంది ఈ సహస్రనామార్చన, ఒక్క శుక్రవారంనాడు మాత్రం రెండవ అర్చనగా ఉదయం 5-6 గంటల మధ్య జరుగుతుంది.

ఈ అర్చన సేవలో రుసుమును చెల్లించి పాల్గొన్న భక్తులను, వైకుంఠం క్యూ ద్వారా శ్రీవారి ఆలయంలోనికి ప్రవేశింప జేస్తారు. ఈ భక్తులు స్వామివారికి ఎదురుగా కులశేఖరపడి నుండి బంగారు వాకిలి వరకు బారులుగా ఒకరి వెనుక ఒకరు కూర్చొని సహస్రనామార్చనను తిలకించవచ్చు.

వైఖానసార్చక స్వాములు శ్రీస్వామి వారి పాదపద్మపీఠానికి దగ్గర కూర్మాసనం (మేడి కర్రతో చెయ్యబడినపీట) మీద కూర్చొని ప్రాణాయామాదులు జేసి, లోక కల్యాణార్థం సంకల్పించి ''ఓం అస్య శ్రీ దేవ దేవస్య భగవతో నారాయణస్య శ్రీ మదఖిలాండ కోటి బ్రహ్మాండనాయకస్య శ్రియః పతే పురుషోత్తమస్య అలర్మేల్మంగా సమేతస్య శ్రీ శ్రీనివాసస్వామి దివ్య చరణారవిందయోః శ్రీ లక్ష్మీ వేంకటేశ్వర సహస్రనామ తులసీ దళార్చనం

కరిష్యామహే'' అంటూ ఓం కేశవాయ నమః, ఓం నారాయణాయ నమః, ఓం మాధవాయ నమః అంటూ కేశవాది చతుర్వింశతి నామాలతోను ఆ తర్వాత శ్రీ వేంకటేశ్వర సహస్రనామావళితో శ్రీ స్వామివారిని ఇలా అర్చిస్తారు. ''ఓం శ్రీ వేంకటేశాయనమః, ఓం విరూపాక్షాయనమః, ఓం విశ్వేశాయ నమః.......'' అని బ్రహ్మాండ పురాణంలో వున్న శ్రీ వేంకటేశ సహస్రనామావళిని గట్టిగా పఠిస్తూ శ్రీ స్వామివారి దివ్యపాదపద్మాలను సమర్చిస్తారు. ఇలా అర్చన ప్రారంభించగానే అర్చన మిరాశిదారుడైన (అర్చన నామావళిని చెప్పే) పండితుడు కులశేఖరపడి గడపకు బయటివైపున శ్రీస్వామివారికి కుడివైపుగా ఆనుకొని నిలబడి అర్చకులు ప్రారంభించిన నామావళిని అందుకొంటూ-- ''ఓం శ్రీ వేంకటేశాయ నమః, ఓం శ్రీ విరూపాక్షాయ నమః, ఓం శ్రీ విశ్వేశాయనమః, ఓం శ్రీ విశ్వ భావనాయ నమః, ఓం శ్రీ విశ్వసృజే నమః.......'' ఇత్యాదిగా శ్రీ వేంకటేశ సహస్ర నామావళిని సుశ్రావ్యంగా పఠిస్తారు.

శ్రీ వేంకటేశ్వరుని సహస్రనామావళి పవిత్రమైన బ్రాహ్మ ముహూర్తంలో ఆలయంలోనే గాక తిరుమల పుణ్య క్షేత్రమంతటా నినదిస్తూ భక్తుల హృదయాలను మరింత భక్తి రస ప్లావితం చేస్తూ దివ్యప్రశాంతిని వెదచల్లుతూ ఉంటుంది.

ఇలా సహస్రనామావళి అర్చన జరుగుతుండగా ఎదురుగా కన్నార్పకుండా స్వామివారిని దర్శిస్తున్న భక్త జనుల పారవశ్యం అంతా ఇంతా కాదు.

పెద్ద కిరీటముతో, పీతాంబరాలతో, కౌస్తుభమణితో, ముత్తేల నామంతో, శంఖు చక్రాల హస్తాలతో, కటిహస్త, వరద హస్తాలతో, అందెల పాదాలతో, మకర కుండలాలతో కడియాలతో, నగవుజూపులతో నాభికమలంతో మొలనూళ్లతో, వక్షఃస్థల లక్ష్మితో-- కోటి మన్మథాకారంతో, కమనీయ వేషంతో దర్శన మిస్తూ, భక్తులకు వింత వింత అనుభూతుల్ని ప్రసాదిస్తున్న స్వామివారిని రెప్పవాల్చకుండా తిలకిస్తూ సహస్రనామార్చనలో భక్తజనం పరవశులవుతారు.

ఇలా ఈ సహస్రనామావళి సుమారు నలువది నిమిషాలపాటు సాగి ''ఓం జ్ఞానగమ్యాయనమః, ఓం జ్ఞానాతీతాయ నమః, ఓం సురాతిగాయ నమః, ఓం బ్రహ్మాండాంతర్బహిర్వ్యాప్తాయ నమః, ఓం వేంకటాద్రి గదా ధరాయనమః'' అని సమాప్త మవుతుంది.

ఆ తర్వాత అర్చకులు శ్రీస్వామివారి పాదాలను అర్చించిన తులసి దళాలను గైకొని శ్రీస్వామివారి వక్షఃస్థలంలో నెలకొన్న శ్రీ మహాలక్ష్మీ అమ్మవారిని ''ఓం శ్రియై నమః, ఓం లోకధాత్ర్యై నమః, ఓం బ్రహ్మమాత్రే నమః.....'' అని వరాహ పురాణంలోని మహాలక్ష్మీ చతుర్వింశతి (24) నామావళిని ఉచ్చరిస్తూ అర్చన ప్రారంభిస్తారు. మళ్లీ అర్చన నామావళిని చెప్పే పండితుడు లక్ష్మీ నామావళిని అందుకొని పఠిస్తూ వుండగా అర్చకులు వక్షఃస్థల లక్ష్మి, అమ్మవారిని అర్చిస్తారు. ఇలా శ్రీస్వామివారికి, లక్ష్మీదేవి అర్చన పూర్తవగానే నేతితో తడిపిన ఇరువది ఏడు వత్తులు గల దీపపు సెమ్మెతో శ్రీస్వామివారికి నక్షత్ర హారతి ఇస్తారు. పిదప టెంకాయ కొట్టి, అరటిపండ్లు నివేదన చేసి కర్పూర హారతి ఇస్తారు. కర్పూర హారతి భక్తులందరికి చూపిస్తారు. దీనితో సహస్రనామార్చన పూర్తవుతుంది.

ప్రతి ధనుర్మాసంలో ఒక్క నెలమాత్రం శ్రీవారి అర్చనలో తులసికి బదులుగా బిలువ (మారేడు) దళాలను ఉపయోగిస్తారు.

శ్రీ స్వామివారి ఎదురుగా బారులు తీరి కూర్చొండిన భక్తులు నయనానంద కరంగా శ్రీ వేంకటేశ్వరుని దివ్య మంగళ విగ్రహాన్ని కన్నుల కరవుదీర తిలకిస్తూ, వీనుల విందుగా సహస్ర నామావళిని ఆలకిస్తూ, ఆనంద డోలికల్లో ఊగుతూ, చివరగా కర్పూరహారతి వెలుగుల్లో శ్రీస్వామివారి అంగాంగ సౌందర్యాన్ని వీక్షించి, వరుసగా అందరూ స్వామివారి సమీపానికి వెళ్ళి దర్శించి దివ్యానుభూతితో మైమరచి మరలలేక మరలి మరలి స్వామివారిని చూస్తూ వెళ్లుతారు. ఆ తర్వాత శ్రీవారి ఆలయంలో బంగారు వాకిలి వరకు శుద్ధి జరిగిన తర్వాత అన్న ప్రసాదాలు లడ్డులు వగైరా శ్రీస్వామివారికి నివేదనలు జరుగుతవి.

ప్రతి రోజూ తెల్లవారు జామున 4-30 గంటలకు ప్రారంభమై సుమారు నలభై నిమిషాలపాటు కన్నులకింపుగా శ్రుతి మధురంగా శ్రీస్వామివారి మూలమూర్తికి జరిగే సహస్రనామార్చనలో (ప్రస్తుతం ఒకరికి రు.220-00లు) ఆర్జిత రుసుమును చెల్లించి పాల్గొని దర్శించవచ్చు.

**ఎలా పాల్గొనాలి**

అర్చన సేవలో పాల్గొనదలచిన భక్తులు ''ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు, తి.తి. దేవస్థానములు, తిరుపతి'' వారి పేర ఏ బాంకులో అయినా సరే నిర్ణీతరూసుమును

డిమాండు డ్రాఫ్టును తీసి దానిని ''డిప్యూటి ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు, తిరుమల శ్రీవారి ఆలయం, తిరుమల-517 504'' వారికి, కావలసిన రోజుకు 90 రోజులు ముందుగా పంపి సహస్రనామార్చన సేవలో పాల్గొనడానికి అనుమతిని పొందవచ్చు.

అనుమతిని ముందుగానే ధ్రువీకరణ పత్రం ద్వారా భక్తునికి తెలియజేయబడుతుంది. అయినా, అప్పటికి వున్న అవకాశాన్ని బట్టి మాత్రమే అనుమతి పత్రం ఇవ్వబడుతుంది.

సహస్రనామార్చనకు అనుమతి గల భక్తులు ప్రతి రోజు తెల్లవారు జామున 3-30 గంటలకు ''వైకుంఠం క్యూ కాంప్లెక్సు'' ద్వారా మాత్రమే ఆలయం లోనికి అనుమతింపబడతారు.

ప్రతి శుక్రవారంనాడు మాత్రం కేవలం ఒక్క అర్చనలో మాత్రం పాల్గొనడానికి వీలు లేదు. శుక్రవారంనాడు శ్రీస్వామివారి అభిషేకానంతరం జరిగే ''తోమాల సేవ, అర్చన'' రెండింటికి కలిపి ఉదయం 5-00 గంటలకు భక్తులను అనుమతింపజేస్తారు. శుక్రవారంనాడు మాత్రం ప్రత్యేకంగా తోమాలసేవకుగాని, ప్రత్యేకంగా అర్చనకు గాని అనుమతింపబడరు. శుక్రవారంనాడు ఈ రెండు సేవలకు కలిపి రు.420-00ల టిక్కెట్టుపై ఒక్కరిని మాత్రమే అనుమతింప జేస్తారు. ఈ టికెట్టును పైమాదిరే 90 రోజులు ముందుగానే పొందవలసి వుంటుంది.

* * *

# శ్రీపద్మావతీశ్రీనివాసుల పరిణయం

శ్రీ వేంకటాచలపతికి శ్రీపద్మావతి అమ్మవారికి పూర్వం ఐదువేల ఏండ్ల కిందట వివాహం జరిగింది.

**శ్రుత్వాబ్రవీత్స ధిషణస్తయోరుత్తర ఫల్గునీ**
**సమ్మతా స్సుఖ వృధ్ధ్యర్థంప్రోచ్యతే దైవ చింతకైః**
**తయోరుత్తర ఫల్గున్యాంవివాహః క్రియతామితి**
**వైశాఖమాసే విధివత్క్రియతా మితి సోబ్రవీత్.**

అని దేవగురువు అయిన బృహస్పతి శ్రీపద్మావతీ శ్రీనివాసుల పరిణయ ముహూర్తం వైశాఖ మాసంలో ఉత్తరఫల్గునీ నక్షత్రంగా నిశ్చయించి, ఆ ముహూర్తం వధూవరుల కిరువురికి పరస్పరం అభివృద్ధి కారకమని సుఖాభివృద్ధి కారకమని నిర్ణయించినాడు. తిరుమలేశుని పరమభక్తురాలైన తరిగొండ వేంగమాంబకూడ శ్రీపద్మావతీ శ్రీనివాసులకు కల్యాణ ఘడియలగు ''సురుచిర వైశాఖ శుక్ల దశమి శుక్రవారము నాడు శుభముహూర్తంబున'' వివాహం జరిగినట్లు వేంకటాచల మాహాత్మ్య కావ్యంలో పేర్కొనింది. ఆనాడు జరిగిన శ్రీవారి కల్యాణ వేడుకలకు గుర్తుగా తిరుమల క్షేత్రంలో ఇటీవలివరకు ఏలాంటి గుర్తింపు లేకుండా వుండింది. కాని 1992 వైశాఖ మాసం నుంచి ఆనాటి పద్మావతీ వేంకటేశ్వరుల కల్యాణోత్సవానికి గుర్తుగా ''శ్రీ పద్మావతీ పరిణయోత్సవం'' పేరిట ప్రతి సంవత్సరం వైశాఖ శుద్ధ నవమి, దశమి, ఏకాదశిలు- ఇలా మూడురోజులపాటు నిర్వహింపబడు తున్నాయి. సంవత్సరానికి ఒకమారు మూడురోజులపాటు జరిగే పద్మావతీ పరిణయోత్సవాలను గురించి, తర్వాత తెలుసుకుందాం. ఇది కాకుండ ప్రస్తుతం ప్రతిరోజూ శ్రీ వేంకటేశ్వర స్వామివారికి నిత్యకల్యాణం జరుగుతున్నది.

## 4. నిత్య కల్యాణోత్సవం

తిరుమల క్షేత్రం 'నిత్య కల్యాణం పచ్చ తోరణం' గా ప్రసిద్ధిని పొందింది. అందుకు అనుగుణంగా తిరుమలలో ప్రతి రోజు శ్రీవేంకటేశ్వరస్వామివారికి కల్యాణోత్సవం జరుగుతుంది. అందుకు గాను శ్రీవారి మహా ద్వారంలోను,

కల్యాణ మండపంలోను ప్రతిరోజు మామిడాకుల పచ్చతోరణాలు అలంకరించడం జరుగుతుంది.

శ్రీ వేంకటేశ్వరస్వామి కోరినవారికి కోరినట్లుగా, అడిగినవారికి అడిగినట్లుగా వరాలను ఇస్తూ ''కోరిన వరాల రాయడు'' అని పేరు పొందినాడు. ఇలా భక్తులు కోరిన సంతానం, వివాహాలు, ఉద్యోగాలు, గృహ నిర్మాణాది శుభకార్యాలను సంపూర్ణంగా నెరవేరుస్తూ ఆ భక్తుల చేత తాను నిత్య కల్యాణం చేయించుకోవడం ఏడుకొండల వాడికి భలే ఇష్టం! అలాంటి శుభ పరంపరలు అనుగ్రహించడానికే భక్తుల చేత కల్యాణం చేయించుకుంటాడట స్వామివారు. కనుకనే తిరుమలలో శ్రీదేవి భూదేవులతో శ్రీ వేంకటేశ్వరస్వామివారికి నిత్యమూ కల్యాణోత్సవం జరుగుతుంది. నిత్యమూ జరిగే ఈ కల్యాణోత్సవంలో శ్రీవారి ఉత్సవ మూర్తులైన శ్రీదేవి భూదేవి సహిత శ్రీ మలయప్పస్వామి పాల్గొంటారు. తిరుమలలో ప్రతి రోజూ జరిగే ఈ కల్యాణోత్సవం పూర్వం విశేషపర్వదినాల్లోను, బ్రహ్మోత్సవాల్లో మాత్రమే జరిగేది. కాని ఆ తర్వాత తాళ్లపాక అన్నమాచార్యులవారు తిరుమలలో నిత్య కల్యాణాన్ని ఏర్పాటుచేసి, స్వయంగా తాను కన్యాదాతగా కూడ నిర్వహించినాడు. అందువల్లే తాళ్లపాక అన్నమాచార్యులకు శ్రీనివాసుడు అల్లుడైనాడని కూడ శకుంతలా పరిణయం అనే కావ్యంలో అన్నమయ్య దౌహిత్రుడైన రేవణూరి వేంకటాచార్యులు--

''అమ్మహాదేవుండు మదీయ మాతామహ వంశ శిఖారత్నంబగు నన్నమాచార్యునకు జామాతరుండనిపించుకొని'' నాడని పేర్కొంటూ -- ఇంకా ''శ్రీ పాణురేణు ప్రభావం'' అనే కావ్యంలో ఆయనే--

*''శ్రీలలరంగ మంగమను శ్రీహరి కెన్నడు ధారవోయుచో*
*దాళులపాక యన్నమయ దా గడి గెం బదముల్ ధరిత్రి.''*

అని అన్నమయ్య శ్రీనివాసుని కాళ్లు కడిగి కన్యాదానం చేసినట్లు పేర్కొన్నాడు.

విశేషం ఏమంటే శ్రీ వేంకటేశ్వరస్వామివారిది భరద్వాజ గోత్రం. మరి అన్నమా చార్యులవారిదీ భారద్వాజగోత్రమే. సగోత్రీ కులకు కన్యాదానం

చెయ్యకూడ దంటారు కదా! అయినా జగత్కల్యాణ చక్రవర్తికి కన్యాదానం చేసి పెళ్ళి చేయించిన కన్యాదాత తాళ్ళపాక అన్నమాచార్యులు. ఆనంద నిలయుడు నిత్య పెండ్లికొడుకు! అయితే అన్నమాచార్యులు నిత్య నూతన కన్యాదాత! నేటికీ ఈ నాటికీ తిరుమల శ్రీవారి కల్యాణోత్సవంలో అన్నమయ్య వంశీయులు కల్యాణ పరంపరలు గుప్పించే కొండల రాయునికి నిత్యమూ కన్యాదానం చేస్తూ కన్యాదాతలుగా ప్రముఖ పాత్ర వహిస్తూ సముచిత సత్కారం పొందుతూనే వున్నారు.

తాళ్లపాక అన్నమాచార్యులు తాను నిత్యమూ కన్యాదానం చేస్తూ, శ్రీనివాసునికి కల్యాణోత్సవం చేయించడమేగాక, ఆ పెండ్లి వేడుకలను గూర్చి కూడ అనేక సంకీర్తనలను గానం చేసి తరించినాడు అంటూ పెండ్లి కూతురైన అమ్మవారిని గూర్చి--

"పిడికిటి తలంబ్రాల పెండ్లికూతురు కొంత
పెడమరలి నవ్వీనే పెండ్లి కూతురు

వేడుకల జవరాలె పెండ్లికూతురు పెద్ద
పేరుల ముత్యాలమెడ పెండ్లికూతురు
పేరంటాండ్ల నడిమి పెండ్లికూతురు విభు
పేరు కుచ్చ సిగ్గు వడీ పెండ్లికూతురు."

అలాగే పెండ్లికొడుకైన స్వామివారిని గూర్చి--

"పెట్టని కోటిందరికి పెండ్లికొడుకు బొమ్మ
బెట్టి నసురులకెల్ల బెండ్లి కొడుకు

పెల్లగించి భూమెత్తీ బెండ్లి కొడుకు వాడె
పిల్లగోవిరాగాల పెండ్లి కొడుకు
పెల్లైన యీవుల పెండ్లి కొడుకు వాడె
పిల్ల దీపు పెన్నుద్ది పెండ్లికొడుకు."

"పసిడి అక్షంతలివి పట్టరో వేగమే వారో
దెసల బేరటాండ్లు దేవుని పెండ్లికని

**అదె వేంకటపతి కలమేలుమంగకును**
**మొదలి తిరునాళ్లకు మొక్కెము నేడు''.**

15వ శతాబ్దంలో తాళ్లపాక అన్నమాచార్యులు ఏర్పాటు చేసిన ఈ నిత్య కల్యాణోత్సవం నేటికీ నిర్విఘ్నంగా నిరాటకంగా కొనసాగుతూ తద్ద్వారా ఆ జగత్కల్యాణ చక్రవర్తి అయిన శ్రీనివాస ప్రభువుల సంపూర్ణమైన అనుగ్రహ పరం పరలను పొందడానికి అత్యంత శుభప్రదమైన విశిష్ట సేవగా యావత్ ప్రపంచంలోని భక్త లోకంలో గుర్తింపు పొందింది. ఆ తర్వాత కూడ తాళ్లపాక వంశీయులు ఈ కల్యాణోత్సవ నిర్వహణ కోసం అనేక గ్రామాలు యినాములుగా సమర్పించినట్లు శాసనాలు తెలుపు తున్నాయి.

తిరుమల క్షేత్రంలో భక్తులు అత్యధికంగా పాల్గొనే సేవ కూడ నిత్య కల్యాణోత్సవం ఒక్కటే.

కూటికే గడవని అతిపేదవారి నుంచి కోటీశ్వరులైన సంపన్నులవరకు అందరూ పాల్గొనే ఈ నిత్య కల్యాణోత్సవంలో భక్తుల సంఖ్య నానాటికీ పెరుగుతునే వుంది.

పూర్వం బంగారు వాకిళ్ల ముందర కల్యాణోత్సవం జరిగేదని, తర్వాత విమాన ప్రదక్షిణంలో వున్న కల్యాణ మండపంలోను పిదప, శ్రీ రంగనాయకమండపంలోను జరిగేది. రోజు రోజుకు కల్యాణోత్సవంలో పాల్గొనే భక్తుల సంఖ్య పెరుగుతున్నందు వల్ల ప్రస్తుతం సంపంగి ప్రదక్షిణంలో దక్షిణం దిక్కున వున్న శ్రీ వేంకటరమణస్వామి కల్యాణమండపం'' అనే పేర ప్రత్యేకంగా కల్యాణ వేదిక ఏర్పాటు చేయబడి నిర్వహింప బడుతున్నది.

ఆనందనిలయంలో ప్రతిరోజు శ్రీ వేంకటేశ్వర స్వామివారికి నిత్యోత్సవాలైన సుప్రభాతం, తోమాలసేవ, కొలువు, సహస్ర నామార్చనలు జరిగిన తర్వాత మొదటి నివేదన జరుగుతుంది. మళ్లీ మాధ్యాహ్నిక ఆరాధన ప్రారంభం చేస్తారు. ఈ మాధ్యాహ్నిక ఆరాధనలో శ్రీనివాసస్వామివారికి అష్టోత్తర శతనామార్చన, రెండవమారు నివేదన జరుగుతుంది. ఆ తరువాత శ్రీదేవి భూదేవి సమేతంగా శ్రీ మలయప్పస్వామి బంగారు శ్రీ పీఠాన్ని అధిరోహించి ఆనందనిలయాన్ని వీడి ఛత్ర చామర మంగళ వాద్య సహితంగా విమాన ప్రదక్షిణం

చేస్తూ వెండి వాకిలిగుండా బయటికి వస్తూ ధ్వజస్తంభానికి, బలిపీఠానికి ప్రదక్షిణంగా వెళ్ళి సంపెంగి ప్రదక్షిణంలో దక్షిణం దిక్కున వున్న "శ్రీ వేంకటరమణ స్వామి కల్యాణ మండపం" లోనికి తరలి వస్తారు.

సంపంగి ప్రదక్షిణ మార్గంలో దక్షిణం దిక్కున రేకులతో దీర్ఘ చతురస్రమైన కల్యాణ మండపం నిర్మింపబడింది. దీన్నే 'శ్రీవేంకట రమణస్వామి కల్యాణ మండపం' అని అంటారు. ఈ కల్యాణ మండపంలో రెండు అడుగుల ఎత్తువున్న కల్యాణ వేదిక, దానికి ముందు భాగంలో సభా ప్రాంగణం ఏర్పాటు చేయబడినాయి. వేదిక ముందు కూర్చొన్న భక్తులు కల్యాణోత్సవాన్ని కన్నులారా తిలకించడానికి వీలుగా కల్యాణ వేదికపై తూర్పుముఖంగా ఎత్తైన వెండి పీఠంపైన శ్రీస్వామివారిని, అలాగే శ్రీస్వామివారికి కుడివైపున మరొక వెండి పీఠంపై శ్రీదేవి భూదేవులను వేంచేపు చేస్తారు.

ఇంతలో కల్యాణోత్సవానికి ఆర్జిత రుసుమును చెల్లించిన భక్తులు వైకుంఠం క్యూ ద్వారా ఆలయంలోనికి ప్రవేశ పెడతారు. కల్యాణ వేదిక నుండి గృహస్థులను వరుసగా ఒకరి వెనుక ఒకరిని ఆసీనుల్ని చేస్తారు. ఆ తర్వాత కల్యాణోత్సవ వేడుకలు ప్రారంభమవుతాయి.

అర్చక స్వాములు వైఖానసాగమ శాస్త్రోక్తంగా పుణ్యావాచనం, అంకురార్పణ చేసి, శ్రీపద్మావతీ శ్రీనివాసుల కల్యాణం నిర్విఘ్నంగా జరుగుటకుగాను ముందుగా విష్వక్సేనులవారిని అర్చిస్తారు. అనంతరం శ్రీ వేంకటేశ్వరస్వామివారికి శ్రీదేవి భూదేవులకు అర్ఘ్య పాద్యాచమనాది ఉపచారాలు చేసి యధావిధిగా నూతన వస్త్రాలంకార సమర్పణ కావిస్తారు. ఆ తర్వాత కల్యాణ కంకణాల ప్రతిష్ఠ, పూజ నిర్వహించిన తర్వాత నూతన వధూవరులైన శ్రీ మలయప్ప స్వామివారికి శ్రీదేవి భూదేవులకు కల్యాణ కంకణాలను ధరింపచేస్తారు. తర్వాత వేద మంత్రాలతో అగ్ని ప్రతిష్ఠ చేసి హోమం చేస్తారు. పిదప ఆర్జిత రుసుమును చెల్లించి కల్యాణోత్సవంలో పాల్గొన్న గృహస్థులను క్రమంగా ఒక్కొక్క దంపతులను వేదికపైకి రావించి శ్రీ స్వామివారి ఎదురుగా సంకల్పం (దత్తం) చెప్పిస్తారు. సంకల్పం చెప్పుకొన్న భక్తులు వేదికను దిగుతూ, అక్కడ పెద్ద వెండి పళ్లెంలో కొబ్బరికాయపై పెట్టివుంచిన రెండు పవిత్ర మంగళ సూత్రాలను తాకుతూ కళ్ల కద్దుకొని భక్తిగా

నమస్కరించుకొంటూ అలనాడు బ్రహ్మాది దేవతలు, ఆకాశరాజు స్వయంగా కల్యాణం చేయించినట్లుగా సాక్షాత్తు పద్మావతీ శ్రీనివాసుల కల్యాణోత్సవం చేయించే మహద్భాగ్యం కలిగింది కదా! అని భావిస్తూ వింత వింత అనుభూతులను పొందుతూ మళ్లీ యథాస్థానాల్లో వచ్చి కూర్చుంటారు. వైఖాన సార్చక స్వాములు మహా సంకల్పం చేయించి ప్రవరలు చెప్పిస్తూ తాళ్లపాక అన్నమాచార్యుల వంశీయులచేత కన్యాదానం చేయిస్తారు.

ఆంగీరసబార్హస్పత్య భారద్వాజ త్ర్యార్షేయ ప్రవరాన్విత భరద్వాజస గోత్రాయ, అచింత్యాద్భుత నిత్యయౌవన స్వభావ లావణ్య రత్నాకరాయ శ్రీ శ్రీనివాస పరం బ్రహ్మణే వరాయ చతుస్సాగర పర్యంతం గోబ్రహ్మణేభ్యః శుభం భవతు'' అని శ్రీస్వామి వారి ప్రవర చెప్పుతూ పిదప శ్రీదేవి భూదేవులకు ప్రవరలు ఇలా చెప్తారు.

''భార్గవచ్యావన అప్నవాన ఔర్వవైదల పంచార్షేయప్రవరాన్విత భార్గవస గోత్రోద్భవీం మూల ప్రకృతి రూపాం అయోనిజాం కల్పనా భృగుపుత్రీం శ్రీదేవీనామ్నీ మిమాం కన్యాం బ్రహ్మ త్నుభ్యైదదామి''.

''కాశ్యప ఆవత్సార నైధ్రువ త్ర్యార్షేయ ప్రవరాన్విత కాశ్యపస గోత్రోద్భవీం విష్ణోః పురాణ మహిషీం ప్రకృత్యంశ సంభూతా కశ్యప ప్రజాపతేః సంకల్పతనయాం భూదేవీనామ్నీ మిమాం కన్యాం బ్రహ్మ త్నుభ్యై దదామి'' అంటూ ప్రవర చదువుతూ శ్రీస్వామివారికి శ్రీదేవి భూదేవులను కన్యాదానం చేస్తారు.

ఆ తర్వాత ప్రధాన ఘట్టం మాంగల్య ధారణ. భక్తులందరు స్వయంగా తాకి నమస్కరించుకొన్న పెద్ద మంగళ సూత్రాలను పూజించిన తర్వాత, భక్తులందరికీ చూపించిన తర్వాత, వాటిని శ్రీస్వామివారి చేతులకు తాకించి అర్చక స్వాములు శ్రీస్వామివారి తరుపున మొదటి మంగళసూత్రాన్ని శ్రీదేవి మెడలోను, రెండవదానిని భూదేవి మెడలోను అలంకరిస్తారు. ఆ తర్వాత లాజహోమం నిర్వహింపబడుతుంది. ఈ సమయంలో అన్నమయ్య వంశీయులు అప్పాలు అందించగా, అర్చకస్వాములు వాటిని స్వామివారికి, అమ్మవారలకు తాకించి హోమంలో వేస్తారు. పిదప పూర్ణాహుతి చేసిన తర్వాత కన్యాదాత (అన్నమయ్య వంశీయులకు) కు తాంబూలాన్ని ఇస్తారు.

పిదప పూలబంతులాట. ఇక్కడ పూల బంతులకు బదులుగా కొబ్బరికాయలు దొర్లించడం జరుగుతుంది. అమ్మవారి తరుపున తాళ్లపాక అన్నమయ్య వంశీయులు, శ్రీస్వామి వారి తరుపున అర్చకస్వాములు టెంకాయలను ఎదురెదురుగా కూర్చొని మూడుసార్లు దొర్లిస్తారు. ఆ తర్వాతి ఘట్టం మాలలు మార్చుకోవడం. శ్రీస్వామివారి మాలలను శ్రీదేవి భూదేవులకు మళ్ళీ వారి మాలలు స్వామివారికి అలంకరిస్తారు. ఇలా మూడు మార్లు నిర్వహిస్తారు. పిదప శ్రీదేవి భూదేవులను ఇద్దరిని, శ్రీస్వామివారికి ఇరు వైపులా ఒకే పీఠంపై వేంచేపు చేసి, అక్షతారోపణ చేస్తారు. అనగా తలంబ్రాల (పసుపు కలిపిన బియ్యాన్ని) కార్యక్రమాన్ని అర్చకులు జరిపిస్తారు. తలంబ్రాల వేడుక అయిన వెంటనే మంగళ హారతి ఇస్తారు. పిదప నూతన వధూవరులైన శ్రీదేవి భూదేవి సమేత శ్రీమలయప్పస్వామి వారికి నివేదనలు తాంబూలాలు సమర్పించి కర్పూర నీరాజనాన్ని ఇస్తారు. ముందుగా కల్యాణోత్సవాన్ని నిర్వహించిన అర్చకులకు శఠారి చందన తాంబూల సత్కారాలు జరుగుతాయి. ఆ తర్వాత కన్యాదాత అయిన అన్నమాచార్యుల వంశీయులకు తాంబూల సత్కారం జరుగుతుంది. ఆ తర్వాత జియ్యంగారికి, కల్యాణోత్సవంలో పాల్గొన్న గృహస్థులందరికి తాంబూలంతో పాటు శ్రీవారి కల్యాణాక్షతలను ప్రసాదంగా ఇస్తారు. ఇంతటితో కల్యాణోత్సవం పూర్తవుతుంది. తర్వాత కల్యాణోత్సవంలో పాల్గొన్న భక్తుల నందరిని శ్రీవారి దర్శనానికిగాను ఆలయం లోనికి అనుమతిస్తారు.

తిరుమలస్వామివారికి ప్రతినిత్యం జరుగుతున్న నిత్య కల్యాణోత్సవంలో నిర్ణీత రుసుము చెల్లించిన భక్తులు పాల్గొనవచ్చు.

శ్రీస్వామివారి కల్యాణోత్సవంలో పాల్గొన దలచిన భక్తులు శుచిస్నాతులై దంపతులిద్దరూ శుభ్రమైన వస్త్రాలు ధరించ వలసి వుంటుంది. ముఖ్యంగా పురుషులు ధోవతిని, ఉత్తరీయాన్ని తప్పక ధరించవలెను.

**ఎలా పాల్గొనాలి**

శ్రీవారి నిత్యకల్యాణోత్సవంలో పాల్గొన దలచిన భక్తులు రు.1,000/-లు ఏ జాతీయ బ్యాంకులోనైనా ''ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు, తి.తి. దేవస్థానములు, తిరుపతి'' వారి పేర డిమాండు డ్రాఫ్టును తీసి, దానిని ''డిప్యూటి

ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు, తిరుమల శ్రీవారి ఆలయం, తిరుమల'' వారికి, కావలసిన తేదీకి 90 రోజులముందుగా పంపుతూ ఆ తేదీకి అనుమతి పత్రాన్ని పొందవచ్చు. ఈ అనుమతిని ''ధ్రువపత్రం'' ద్వారా ముందుగనే భక్తులకు తెలియ జేయబడుతుంది. అయినా అప్పటికి, ఆ తేదీకి వున్న అవకాశాన్నిబట్టి మాత్రమే వీలు కల్పించ బడుతుంది. ప్రస్తుతం సుమారు 300 మంది కల్యాణోత్సవాలు మాత్రమే అనుమతింప బడుతున్నాయి.

కల్యాణోత్సవం టికెట్లుగల భక్తులను ప్రతిరోజూ ఉదయం 9-00 గంటల నుంచి 'వైకుంఠం క్యూ కాంప్లెక్సు'' భవనం ద్వారా మాత్రమే ఆలయంలోని కల్యాణ మండపానికి అనుమతింపబడతారు.

బ్రహ్మోత్సవాల్లోను, పవిత్రోత్సవం, జ్యేష్ఠాభిషేకం, పుష్పయాగం, వార్షిక వసంతోత్సవం జరిగే మూడు రోజుల్లోను..... ఇలా కొన్ని విశేష సందర్భాల్లో ఈ నిత్య కల్యాణోత్సవం జరుపబడదు.

భక్తులు కోరిన ఉద్యోగాలు, వివాహాలు, సర్వకార్యాలు నెరవేర్చి వారి చేత నిత్యమూ కల్యాణోత్సవం చేయించుకుంటూ వున్న నిత్య నూతన వధూవరులైన శ్రీ అలమేలు మంగా శ్రీదేవి భూదేవి సమేతంగా శ్రీ వేంకటేశ్వరస్వామివారలకు మంగళమగు గాక! జయమంగళమగుగాక!! నిత్య శుభ మంగళ మగుగాక!!!

* * *

# 5. డోలోత్సవము

శ్రీ వేంకటరమణస్వామి కల్యాణ మండపంలో శ్రీదేవి భూదేవి సమేతంగా శ్రీ మలయప్ప స్వామివారికి నిత్య కల్యాణోత్సవం పూర్తి అయిన వెంటనే పల్లకిలో మధ్యాహ్నం 2 గంటల సమయంలో రంగనాయకుల మండపానికి వేంచేస్తారు.

పిదప భక్తులు ఎవరైనా అద్దాల మండపంలో జరిగే శ్రీవారి డోలోత్సవం కోసం ఆర్జిత రుసుమును చెల్లించివుంటే, వారి కోసం మాత్రమే ఉభయదేవేరులతో కూడ శ్రీ మలయప్పస్వామి రంగనాయక మండపానికి ఎదురుగా వున్న అద్దాలమండపం (అయినా మహల్) లోనికి వేంచేస్తారు. భక్తులు ఆర్జితం చెల్లించినట్లయితేనే ఈ డోలోత్సవం జరుప బడుతుంది. లేనిచో ఈ సేవ నిర్వహింపబడదు.

రంగనానాయకుల మండపానికి ఎదురుగా వున్న మండపమే అద్దాల మండపం. ఈ మండపం ముఖ మండపం, అంతరాళం అని రెండు భాగాలుగా నిర్మింపబడింది. ఈ మండపంలో తూర్పు ముఖంగా 42' x 42' కొలతలతో నిర్మింప బడిన అంతరాళమే డోలోత్సవం జరిగే 'అయినా మహల్.' ఈ అంతరాళం మధ్యలో నాలుగు స్తంభాల చతురస్ర మండపం వుంది. అందులో డోలోత్సవానికి అనువుగా గొలుసులు వేలాడదీయబడి వున్నాయి. ఈ చతురస్ర మండపం చుట్టూ ప్రదక్షిణ మార్గం ఏర్పాటు చేయబడి వుంది. ఈ చతురస్ర మండపం చుట్టూ వున్న గోడలకు, పై కప్పునకు ఇలా అన్ని మూలల్లో అంతటా అన్నివైపులా పెద్ద పెద్దల అద్దాలు బిగింప బడ్డాయి. ఈ మండపంలో గొలుసుల ద్వారా వేలాడదీసిన డోల (ఊయల)లో వేంచేసి ఊగుతున్న శ్రీస్వామివారి రూపం అద్దాల్లో అన్ని వైపులా ప్రతిబింబించి శ్రీ వేంకటేశ్వర స్వామివారి సర్వ వ్యాపకత్వం ద్యోతకమవుతూ, భక్తులు శ్రీవారి విశ్వరూపాన్ని దర్శించినట్లుగా ఒక దివ్యానుభూతికి లోనవుతారు. అప్పటి అద్భుత సన్నివేశం చూచి తీరవల సిందే కాని వర్ణించడానికి సాధ్యం కాదు.

రంగనాయక మండపంనుండి ఆర్జిత భక్తుల కోరిక మేరకు ఉభయదేవేరులతో కూడివున్న శ్రీస్వామివారు మంగళవాద్య పురస్సరంగా ఛత్రచామరాలతో వేద పారాయణలు సాగుతుండగా అద్దాల మండపంలోని, డోలలోనికి వేంచేస్తారు. ముందుగా అర్చక స్వాములు ఈ సేవలో పాల్గొన్న భక్తులచేత సంకల్పం చేయిస్తారు. పిదప మంగళ వాయిద్యాలు మోగుతుండగా వేదపారాయణలు సాగుతుండగా దేవేరులతో కూడిన స్వామివారు ఊయలలో సొబగుగా ఊగుతారు. ఇలా కొద్దిసేపు ఊగిన తర్వాత స్వామి వారికి పంచకజ్జాయం అనబడే ప్రసాదాన్ని నివేదిస్తారు. (గసగసాలు, జీడిపప్పు, బాదంపప్పు, ఎండుకొబ్బరికోరు, కలకండ, చక్కెర మిశ్రమాన్నే పంచకజ్జాయం అంటారు). నివేదన అయిన వెంటనే 27 వత్తులువున్న వెండి సెమ్మెతో నక్షత్ర హారతిని ఇస్తారు. తర్వాత కర్పూర హారతిని కూడ ఇస్తారు. భక్తులు హారతిని కళ్లకద్దుకున్న తర్వాత డోలోత్సవంమీదవున్న శ్రీస్వామివారికి ప్రదక్షిణం చేస్తూ వెలుపలికి వస్తారు. ఈ సేవలో పాల్గొన్న గృహస్థుకు ఒక ఉత్తరీయం, ఒక రవికగుడ్డ బహుమానంగా ప్రసాదించ బడుతుంది. ఆ తర్వాత వీరికి శ్రీ వేంకటేశ్వర స్వామివారి మూలవరుల దర్శనం కల్గించ బడుతుంది. ఆ తర్వాత శ్రీస్వామివారు శ్రీ రంగనాయక మండపానికి వేంచేస్తారు.

ఆర్జిత భక్తుల కోరిక మేరకు జరిగే డోలోత్సవం బ్రహ్మోత్సవాలు, పుష్పయాగం, జ్యేష్ఠాభిషేకం, పవిత్రోత్సవం మున్నగు విశేష దినాల్లో జరుపబడదు.

ప్రస్తుతం ఈ సేవ చేయించదలచినచో ఒక్క వెయ్యి రూపాయలు చెల్లించినట్లయితే గృహస్థుతో (భార్య, భర్త) కలిసి మొత్తం ఐదుమందిని అనుమతిస్తారు. వీరిని మధ్యాహ్నం 1 గంట సమయంలో వైకుంఠం క్యూ ద్వారా మాత్రమే ఆలయంలోనికి అనుమతిస్తారు. ఈ సేవలో పాల్గొనే గృహస్థు పంచ, ఉత్తరీయం ధరించి రావలయును.

శ్రీస్వామివారి అనుగ్రహంచేత సంతానం కలిగినవాళ్లు, లేదా సంతానం కోసం శ్రీస్వామివారిని ప్రార్థించేవాళ్లు లేదా తమ పిల్లల ఆరోగ్యం కోసం కూడా భక్తులు ఈ డోలోత్సవాన్ని చేయిస్తారు.

**ఎలా పాల్గొనాలి**

ప్రతి రోజు మధ్యాహ్నం 2 గంటల సమయంలో అద్దాల మండపంలో జరిగే డోలోత్సవాన్ని చేయించదలచిన భక్తులు రు.1,000-00 ల డిమాండు డ్రాఫ్టును ఏ బ్యాంకులోనైనా సరే ''ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు, తి.తి. దేవస్థానములు, తిరుపతి'' వారి పేర తీసి దానిని ''డిప్యూటి ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు, శ్రీవారి ఆలయం, తిరుమల'' వారికి-- కావలసిన తేదీకి 90 రోజులు ముందుగానే పంపుతూ, అనుమతిని పొందవచ్చు. ఈ అనుమతిని ధ్రువీకరణ పత్రం ద్వారా ముందుగానే భక్తులకు తెలియ జేయబడుతుంది. అయినా అప్పటికి వున్న అవకాశాన్ని బట్టి మాత్రమే వీలు కల్పించ బడుతుంది. ఈ టికెట్టు కలిగిన భక్తులను మధ్యాహ్నం ఒంటి గంట సమయంలో వైకుంఠం క్యూ ద్వారా ఆలయంలోనికి అనుమతిస్తారు.

***



**డోలోత్సవం**

# 6. ఆర్జిత బ్రహ్మోత్సవం

అద్దాల మండపంలో డోలోత్సవంలో పాల్గొన్న శ్రీస్వామివారు తిరిగి రంగనాయక మండపానికి చేరుకొంటారు.

ఆర్జిత బ్రహ్మోత్సవం కూడ నిర్ణీత ఆర్జిత రుసుమును చెల్లించిన భక్తుల కోరిక మేరకే నిర్వహింపబడుతుంది.

భక్తుల కోరిక మేరకు నిర్వహింపబడే ఈ అర్జిత బ్రహ్మోత్సవంలో ప్రధానంగా పెద్ద శేష వాహనం, వెండి గరుడవాహనం, వెండి హనుమంత వాహనం – ఇలా ఈ మూడు వాహనాలు మాత్రమే నిర్వహింపబడతవి. ప్రస్తుతం ఈ ఆర్జిత బ్రహ్మోత్సవం రుసుము రు. 1,000-00 లు చెల్లించిన గృహస్థు (భార్య, భర్త) తో కలిసి మొత్తం ఐదుమందిని మధ్యాహ్నం 1 గంట సమయంలో వైకుంఠం క్యూ ద్వారా ప్రవేశింపజేస్తారు. వీరు రంగ నాయక మండపంలో ఆసీనులు కాగానే ముందుగా వీరి చేత అర్చక స్వాములు సంకల్పం చేయిస్తారు. పిదప శ్రీదేవి భూదేవి సమేతంగా శ్రీమలయప్పస్వామివారిని పెద్దశేషవాహనంపై వేంచేపు చేసి, వేదనాదాల మధ్య మంగళవాద్యాలు మోగుతుండగా గృహస్థు లకు వెండి దండాన్ని ఇచ్చి శ్రీ స్వామివారు వేంచేసిన పెద్ద శేష వాహనం చుట్టూ మూడు మార్లు ప్రదక్షిణం చేయిస్తారు. ఆ తర్వాత శ్రీమలయప్పస్వామివారిని ఒక్కరిని మాత్రమే వెండి గరుడవాహనంపైన వేంచేపు చేసి భక్తులచేత ప్రదక్షిణం చేయిస్తారు. అలాగే చివరగా శ్రీస్వామివారిని వెండి హనుమంత వాహనంపైన వేంచేపు చేసి ప్రదక్షిణం చేయిస్తారు. ప్రతి వాహనానికి హారతిని ఇచ్చి భక్తులకు ఇస్తారు. తర్వాత శఠారితో భక్తులకు ఆశీర్వచనం ఇస్తారు. దీనితో ఆర్జిత బ్రహ్మోత్సవం పూర్తి అవుతుంది. ఈ సేవలో పాల్గొన్న గృహస్థులకు ఒక ఉత్తరీయం ఒక రవికగుడ్డ బహుమానంగా ఇవ్వబడతవి. బ్రహ్మోత్సవానంతరం భక్తులను శ్రీస్వామివారి దర్శనానికి అనుమతిస్తారు. సేవలో పాల్గొనే గృహస్థు పంచ, ఉత్తరీయం ధరించి రావలయును.

పై సేవలకు మాదిరే ఆర్జిత బ్రహ్మోత్స వంలో పాల్గొనదలచిన భక్తులు 90 రోజులకు ముందుగా డి.డి.ని పంపి అనుమతిని పొంద వలసి వుంటుంది.

పాపవిముక్తు లగుటకు కోరికలు నెరవేరుటకుగాను భక్తులు బ్రహ్మోత్సవం చేయిస్తారు.

# 7. ఆర్జిత వసంతోత్సవం

భక్తుల సౌకర్యార్థం దేవేరులతో కూడిన శ్రీ వేంకటేశ్వరస్వామివారికి నిత్య వసంతోత్సవాలు నిర్వహింపబడుతూ ఆర్జిత సేవగా ఏర్పాటుచేశారు. ప్రతిరోజూ శ్రీవారి ఆలయంలోని రంగనాయక మండపంలో మధ్యాహ్నం 3-00 గంటల సమయంలో జరుపబడే వసంతోత్సవంలో నిర్ణీత రుసుమును (ప్రస్తుతం రు.3,000లు) చెల్లించిన భక్తుల కోరిక మేరకే ఈ వసంతోత్సవం ప్రతి రోజూ మధ్యాహ్నం జరుపబడుతుంది. నిత్యమూ విధిగా మాత్రం జరుపబడదు.

డోలోత్సవం, ఆర్జిత బ్రహ్మోత్సవం అయిన తర్వాత చివరగా రంగనాయక మండపంలోనే ఆర్జిత వసంతోత్సవం జరుప బడుతుంది.

ముందుగా శ్రీదేవి, భూదేవి సమేత శ్రీమలయప్పస్వామివారి మూర్తులకు ఆభరణాలు అలంకారాలు తీసివేసి, స్నానం పీఠంపై వేంచేపు చేసి స్నాన వస్త్రాలు ధరింప చేస్తారు. ఇంతలో వసంతోత్సవానికి అవసర మయ్యే పరిమళ ద్రవ్యాలు సిద్ధం చేయబడతవి.

ముందుగా అర్చకులు ఆర్జిత గృహస్థులచేత శ్రీవారి వసంతోత్సవానికి సంకల్పం చెప్పిస్తారు. ఆ తర్వాత భజంత్రీలు మోగుతుండగా శ్రీస్వామివారలకు అర్ఘ్య పాద్యాచమనాది ఉపచారాలు సమర్పించి, ధూప దీప హారతు లిచ్చి, టెంకాయ, పండ్లు నివేదించి కర్పూర హారతి ఇస్తారు. తర్వాత వేదపండితులు పురుష సూక్తం, శ్రీ సూక్తం మున్నగు వేద మంత్రాలను శ్రుతి మధురంగా పారాయణం చేస్తుండగా వెండి శంఖంతో జియ్యంగారు శుద్ధ జలాన్ని అందిస్తుండగా అర్చకులు శ్రీ స్వామివారికి, అమ్మవారలకు అభిషేకం చేస్తారు. ఆ తర్వాత బంగారు శంఖంతో పాలను అందించగా అర్చకస్వామి పాలతో అభిషేకం చేస్తాడు. ఇలా క్షీరాభిషేకం అయింతర్వాత శుద్ధ జలంతో అభిషేకించి, ధూపదీప హారతు లిస్తారు.

ఇలా పాలు అయిన తర్వాత మళ్లీ వరుసగా పెరుగు, తేనె, పసుపు అభిషేకాలు చేస్తారు. చివరగా చందనాన్ని శ్రీవారి వంటి నిండా (ముఖమునకు తప్ప) అలదుతారు. అట్లే శ్రీదేవి, భూదేవులకు కూడా. ఈ చందనా లంకారంమీదే

స్వామివారలకు తులసి మాలల్ని వేసి, తిలకధారణ చేసి, అర్ఘ్య పాద్యాచమానాది ఉపచారాలు సమర్పించి ధూపదీప నక్షత్ర హారతులిస్తారు. పిదప దృష్టి దోష పరిహారణార్థం కుంభహారతి ఇస్తారు. పిదప టెంకాయ, పండ్లు నైవేద్య మిచ్చి కర్పూర హారతిని ఇస్తారు.

ఆ తర్వాత శ్రీస్వామివారలకు బంగారు తట్టతో సహ స్రధారాభిషేకం చేస్తారు. చిట్ట చివరగా, కలశంలోని జలంతో అభిషేకించి, ఆ జలాన్ని అందరిమీద 'పూతో భవ' అని చల్లుతారు. దీనితో అభిషేకం పూర్తవుతుంది. అక్కడ చేరిన భక్తులకు శ్రీవారి చందనాన్ని ప్రసాదంగా ఇస్తారు.

శ్రీస్వామివారికి జరిగే వసంతోత్సవంలో రు.3,000-00 లు చెల్లించి, గృహస్థుతో పాటు 10 మంది పాల్గొని తిలకించవచ్చు. వీరికి, వస్త్రం, వడలు, దోసెలు, దధ్యోనం, పులిహోర, పొంగలి, చక్కెర పొంగలి ప్రసాదాలు బహుమానంగా ఇవ్వబడతాయి.

**ఎలా పాల్గొనాలి?**

వసంతోత్సవం చేయించదలచిన భక్తులు రు.3,000-00 లు డి.డి. ని ఏ బ్యాంకులో అయినా సరే, ''ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు, తి.తి. దేవస్థానములు, తిరుపతి'' వారి పేర తీసి, దానిని ''డిప్యూటి ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు, తిరుమల శ్రీవారి ఆలయం, తిరుమల-517 504'' వారికి 90 రోజులు ముందుగా పంపుతూ, కావలసిన రోజున, వసంతోత్సవాన్ని ధ్రువపరచుకోవచ్చు. అనుమతిని ధ్రువపత్రం ద్వారా ముందుగానే గృహస్థులకు తెలియజేయబడుతుంది. అయినా, అవకాశాన్నిబట్టి మాత్రమే వీలు కల్పింపబడుతుంది.

శ్రీస్వామివారి దయతో ఆరోగ్యం కలిగినవారు లేదా ఆరోగ్యాన్ని కోరుతున్నవారు వసంతోత్సవాలను చేయిస్తారు.

వసంతోత్సవం చేయించదలచిన భక్తులు తాము కోరిన రోజున ఆలయంలో జరిగే వసంతోత్సవాన్ని తిలకించడానికి మధ్యాహ్నం ఒంటి గంట సమయంలో వైకుంఠం క్యూ ద్వారా మాత్రమే ఆలయం లోనికి అనుమతింపబడతారు. ఉత్సవం చేయించ దలచిన గృహస్థు తప్పనిసరిగా ధోవతి, ఉత్తరీయం మాత్రమే ధరించవలెను.



సహస్రదీపాలంకారసేవ



తిరుచ్చి (శ్రీపీఠం)లో తిరుమలేశుడు

# 8. సహస్రదీపాలంకార సేవ

ప్రతి రోజు సాయంత్రం 6 గంటలకు శ్రీవారిఆలయం వెలుపల ఆగ్నేయ మూలలో వున్న కొలువు మండపంలో సహస్ర దీపాలంకార సేవ వైభవంగా జరుపబడు తుంది. ఇటీవలకాలంలో ప్రవేశపెట్టబడిన సేవ ఇది.

ప్రతిరోజు కల్యాణోత్సవం, ఆర్జిత బ్రహ్మోత్సవం, వసంతోత్సవం..... ఇత్యాది ఉత్సవాలన్నీ పూర్తి అయిన తర్వాత శ్రీదేవి, భూదేవులతో కూడిన శ్రీమలయప్పస్వామి శ్రీ పీఠాన్ని (తిరుచ్చి) ఎక్కి ఆలయ వెలుపల వున్న కొలువు మండపానికి ఛత్రచామర మంగళ వాద్య సమేతంగా తరలివస్తారు. ఆ కొలువు మండపంలో ఆ సమయానికి 1008నేతి వత్తులను వెలిగిస్తారు. ఆ నేతి దీపాల మధ్యలో శ్రీస్వామి వారి తిరుచ్చిని గొలుసులతో వేలాడదీసి ఊపుతారు. మంగళ వాద్యాలు మోగుతుండగా వేదమంత్రాల మధ్య శ్రీస్వామివారు అటు, ఇటు ఊగుతారు.

సహస్ర దీపాల మధ్య శ్రీస్వామివారు ఉభయ దేవేరులతోకూడి వింత వింత తేజస్సులతో వెలుగుతూ వేలాది మంది భక్తులకు దర్శన మిస్తూ అనుగ్రహిస్తారు. వేయి దీపాల మధ్య దేవేరులతో ఊగుతూ వున్న శ్రీ స్వామివారిని వేద పండితులు ఇలా కీర్తిస్తారు.

వృషశైలాధిప ఏవదైవతం నః
వృషభాద్రీశ్వర ఏవదైవతం నః
ఫణిశైలాధిప ఏవదైవతం నః
భగవాన్ వేంకట ఏవదైవతం నః.
శ్రీ శ్రీనివాసః పర దైవతం నః
శ్రీ శ్రీనివాసః పరమం ధనం నః
శ్రీ శ్రీనివాసః కులదైవతం నః
శ్రీ శ్రీనివాసః పరమా గతిర్నః

వక్త్రాబ్జే భాగ్యలక్ష్మీః కరకమలే (కరతల కమలే) సర్వదా దానలక్ష్మీః, దోర్దండే వీరలక్ష్మీః, హృదయ సరసిజే భూతకారుణ్య లక్ష్మీః, ఖడ్గాగ్రే శౌర్యలక్ష్మీః, సర్వాంగే సౌమ్యలక్ష్మీః, నిఖిల గుణ గణాడంబరే కీర్తి లక్ష్మీః మయితు విజయతాం

సర్వ సామ్రాజ్యలక్ష్మీః, శ్రీ ర్వర్చస్య మాయుష్య మారోగ్య మావిధాచ్ఫోభమానం మహీయతే ధాన్యం, ధనం, పశుం బహుపుత్ర లాభం శత సంవత్సరం దీర్ఘమాయుః.''

ఇలా వేదగానం సాగగానే గాయకులు అన్నమయ్య కీర్తనలను గానం చేస్తూ కీర్తిస్తారు. శ్రీ స్వామివారు ఊయలలో వూగుతుండగా ఇలా--

**అలర చంచలమైన ఆత్మలందుండ నీ**
**యలవాటు సేసె నీ వుయ్యాల**
**పలుమారు నుచ్ఛ్వాసపవనమందుండ నీ**
**భవంబు దెలిపె నీవుయ్యాల**
**ఉదయాస్త శైలంబు లొనర గంభములైన**
**వుడు మండలము మోచె నీవుయ్యాల**
**అదన నాకాశపద మడ్డదూలంబైన**
**పదిలముగ వేదములు బంగారుచేరులై**
**పట్టె వెరపై తోచె నుయ్యాల**
**వదల కిటు ధర్మదేవత పీఠమై మిగుల**
**వర్ధింప నరుదాయ నుయ్యాల.....**
**కమలకును భూసతికి కదలు**
**కదలుకు మిమ్ము**
**గౌగిలింపగ జేసె నుయ్యాల.**

అని కీర్తిస్తారు. ఇలా ఒకటి రెండు కీర్తనలు పాడిన తర్వాత భజంత్రీలు మోగు తుండగా శ్రీస్వామివారికి పంచ కజ్జాయం (చక్కెర, గసగసాలు, ఎండు ద్రాక్ష, జీడి పప్పు, బాదం పప్పు కలిపిన పొడి పొడిగా వున్న ప్రసాదం) నివేదన చేసి నక్షత్ర హారతి ఇస్తారు. పిదప కర్పూర హారతి ఇస్తారు. అనంతరం సహస్రదీపాలంకార సేవకు నిర్ణీత రుసుమును చెల్లించి పాల్గొన్న ఆర్జిత గృహస్థులను ఉత్తరీయం, రవికె గుడ్డ, వస్త్ర బహుమానంతో ఆశీర్వచనం చేస్తారు. తర్వాత ఈ సేవలో పాల్గొన్న ఆర్జిత గృహస్థులను 'వైకుంఠం క్యూ'ద్వారా శ్రీవారిదర్శనానికి అనుమతిస్తారు.

సహస్ర దీపాలంకార సేవ పూర్తి అయిన వెంటనే శ్రీస్వామివారు మంగళవాద్య పురస్సరంగా ఆలయం ప్రవేశిస్తారు.

శ్రీస్వామివారి జన్మ నక్షత్రమైన శ్రవణం రోజున మాత్రం సహస్రదీపాలంకార సేవ అయిన తర్వాత శ్రీస్వామివారు ఆలయం చుట్టూ వున్న పురవీధుల్లో ప్రదక్షిణంగా ఊరేగుతూ ఆలయం ప్రవేశిస్తారు.

అంతేగాక శ్రీకృష్ణుని జన్మనక్షత్రమైన రోహిణి నక్షత్రం రోజున శ్రీ వేంకటేశ్వర స్వామి వారికి బదులుగా శ్రీ రుక్మిణీ సమేత కృష్ణస్వామి వచ్చి సహస్ర దీపాలంకార సేవలో పాల్గొని, పిదప పుర వీధుల్లో ఊరేగి ఆలయం ప్రవేశిస్తారు.

అలాగే రాములవారి జన్మ నక్షత్రమైన పునర్వసు నక్షత్రం రోజున శ్రీనివాసస్వామికి బదులుగా శ్రీ సీతారామలక్ష్మణులు తిరుచ్చి నెక్కి వచ్చి సహస్రదీపాలంకార సేవలో పాల్గొంటారు. తిరుమల వీధుల్లో సంచరిస్తూ చివరకు శ్రీవారి ఆలయానికి ఎదురుగా వున్న బేడి ఆంజనేయస్వామివారి వద్దకు వస్తారు. అక్కడ శ్రీరాముని మీది పూలమాలను, బేడి ఆంజనేయునికి సమర్పించి, శ్రీ కోదండ రాములకు హారతిని ఆంజనేయస్వామికి ఇచ్చిన తర్వాత తిరిగి ఆలయం చేరు కొంటారు.

వేలాదిమంది యాత్రికులు, భక్తులు దర్శించే వీలుగా ప్రతిరోజు సాయంత్రం 5-30 గంటలకు ఆలయం వెలుపల కొలువు మండపంలో ''సహస్ర దీపాలంకార సేవ''ను దేవస్థానంవారు ఆర్జిత భక్తులు లేక పోయినా విధిగా తప్పనిసరిగా జరుపుతారు.

ఈ 'సహస్ర దీపాలంకారసేవ' లో పాల్గొన దలచిన భక్తులు రు.1,000/- ల డిమాండు డ్రాఫ్టును, ఏ బ్యాంకులోనైనా సరే ''ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు, తి.తి.దే., తిరుపతి'' వారి పేర తీసి, దానిని ''డిప్యూటి ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు, తిరుమల శ్రీవారి ఆలయం, తిరుమల-517 504'', కావలసిన రోజుకు 90 రోజులముందుగా పంపుతూ ఖాయ పరచుకోవచ్చును. అనుమతిని 'ధ్రువ పత్రం' ద్వారా ముందుగనే తెలియజేయ బడుతుంది.

సహస్రదీపాలంకార సేవానంతరం సేవలో పాల్గొన్న గృహస్థుతోపాటు 5 మందిని 'వైకుంఠం క్యూ'' ద్వారా మాత్రమే శ్రీవారి దర్శనానికి అనుమతిస్తారు.

* * *

# 9. ఏకాంతసేవ

ఏకాంతసేవకే 'పాన్పుసేవ' అని, 'పవ్వళింపుసేవ' అని కూడ అంటారు. తిరుమల శ్రీస్వామివారి ఆలయ రోజువారీ కార్యక్రమాల్లో ప్రధానమైన చివరి ఘట్టం ఏకాంతసేవ. ఏకాంతసేవ పూర్తి అయిన వెంటనే ఆలయాన్ని మూసి వేస్తారు. ఇది తిరుమలలో శ్రీవారికి జరుగుతున్న ప్రాచీనమైన సేవగా చెప్పబడుతున్నది.

ఇంతటి ప్రాచీనతను సంతరించుకున్న ఏకాంతసేవను ఎక్కడ నిర్వహిస్తారో, ఎలా నిర్వహిస్తారో, ఎవరికి నిర్వహిస్తారో కాస్త పరిశీలించి తెలుసుకుందాం.

ప్రతి రోజు రాత్రి చివరగా శయనమండపంలో శ్రీ భోగ శ్రీనివాసమూర్తికి ఏకాంతసేవను నిర్వహిస్తారు. వైఖానసాగమం ప్రకారం భోగ శ్రీనివాసమూర్తిని ''కౌతుకమూర్తి, పురుష బేరము'' అని అంటారు. ఈ మూర్తినే ''మనవాళ ప్పెరుమాళ్'' అని అంటారు. మనవాళన్ అనగా పెండ్లికొడుకు. ఎలాంటి పెండ్లి కొడుకు అంటే నిత్య పెళ్లికొడుకు! అందుకే ప్రతిరోజు రాత్రి ఏకాంతసేవా సమయంలో పట్టుపాన్పుపై శయనించే నిత్యశోభనమూర్తిగా యోగనిద్రకుపక్రమిస్తూ దర్శనమిస్తూవున్న దివ్యమూర్తి భవ్యమూర్తి ఈ భోగశ్రీనివాసుడు. సుమారు ఒకటిన్నర అడుగుల ఎత్తుతో శ్రీవారి మూలమూర్తికి నకలు ప్రతిమగా చెప్పబడుతున్న ఈ వెండి విగ్రహాన్ని క్రీ.శ. 614 లో పల్లవరాణి సామవాయి శ్రీవారి ఆలయంలో ప్రతిష్ఠింపజేసిందట. ఆనాటి నుండి ''భోగ శ్రీనివాసమూర్తి'', ''మనవాళప్పెరుమాళ్'' అనే పేర్లతో ఏకాంతసేవలో పాల్గొంటున్న శయనమూర్తి.

ప్రతి రాత్రి ఏకాంతసేవకు వేళకాగానే సర్వదర్శనం నిలిపివేయబడుతుంది.

ఏకాంతసేవకు వేళకాగానే సర్వ దర్శనం నిలిపివేయబడుతుంది. ఇది సాధారణ దినాల్లో అయితే రాత్రి 10-30 గంటలకు ప్రారంభమవుతుంది. జనం ఎక్కువగా వున్న రోజుల్లో 12 గంటలకు కూడా జరుపబడుతుంది.

**నిర్మాల్య శోధన**

రాత్రిపూట చివరలో సర్వదర్శనం నిలిపి వేసిన వెంటనే శ్రీవారి గర్భాలయంలోను, శయన మండపంలోను శుద్ధి జరుగుతుంది. కులశేఖరపడి

గడపదగ్గర తెరలువేసి లోపల అర్చకులు శ్రీస్వామివారికి నమస్కారం చేసికొని శ్రీస్వామివారి మీద వున్న నిర్మాల్యాన్ని పూర్తిగా తొలగిస్తారు. అనగా శ్రీ స్వామివారి మూలవిరాణ్మూర్తికి అలంకరింప బడివున్న పూలమాలలు అన్నీ తొలగిస్తారన్నమాట. దీన్నే నిర్మాల్య శోధన అంటారు.

**పట్టుపాన్పు ఏర్పాటు**

ఇంతలో ఆలయ పరిచారకులు ''సభేరాగది'' లో వున్న బంగారు నవార పట్టె మంచాన్ని, పట్టు పరుపులను తీసుకొని వస్తారు. పిదప 'కులశేఖరపడి' గడపకు ముందు వున్న 'శయన మండపం' లో వెండి గొలుసులతో మంచాన్ని వేలాడదీసి, దానిపై పట్టు పరుపులను పరచి దిండులను ఏర్పాటు చేస్తారు.

**ముత్యాల ముగ్గులు**

ఇంతలో శ్రీ వేంకటేశ్వర స్వామివారి భక్తురాలైన తరిగొండ వెంగమాంబగారి తరుపున ఆమె వంశీయులొకరు వచ్చి, శ్రీవారి పట్టెమంచం చుట్టూ నేలపై రంగవల్లులు (ముగ్గులు) తీర్చిదిద్ది వెంగమాంబగారి 'ముత్యాల హారతి' తట్టను ఏకాంగివారికిచ్చి బయటికి వచ్చి నిలుస్తారు. పిదప ''సన్నిధిగొల్ల'' ఈ మంచం ముందర రెండు దీపం సెమ్మెలను వెలిగించి బయటికి వస్తాడు.

**పాన్పుపై పరంధాముడు**

తర్వాత అర్చకులు రాములవారిమేడ తలుపు వేస్తారు. వెంటనే బంగారువాకిలి దగ్గర ఆలయంలోని భజంత్రీ సిబ్బందిలోని ఒక వ్యక్తిచేత స్వర్ణ (సన్నాయి మేళం) అనే వాద్యం నోటితో వాయింపబడుతుండగా లోపల అర్చకులు శ్రీస్వామివారికి ఆచమనాది ఉపచారాలు పూర్తి చేసి, అనేకరకాలయిన పండ్లతో చక్కెర, తేనె కలిపి తయారు చేయబడిన పంచామృతంలాంటి 'మేవా' అనే ప్రసాదాన్ని, గసగసాలు, ఎండుద్రాక్ష, జీడిపప్పు, బాదంపప్పు, చక్కెర, ఏలకులు మున్నగు వస్తువులు కలిపి తయారుచేసిన 'పంచకజ్జాయం' అనే ప్రసాదాన్ని మరియు చక్కెర కలిపిన వేడిపాలను నివేదించి సుగంధ పరిమళ తాంబూలాన్ని సమర్పించి కర్పూర నీరాజనాన్ని ఏకాంతంగా నిర్వహిస్తారు. తదుపరి అర్చకులు శ్రీస్వామివారి (మూలమూర్తి) పాదాలకు సేవ (పాద నమస్కారం) చేసి, శ్రీస్వామివారి సాక్షాత్

ప్రతిరూపమైన భోగ శ్రీనివాసమూర్తిని శయనముపైకి వేంచేయవలసిందని భక్తి పూర్వకంగా ప్రార్థిస్తూ, పట్టెమంచంపైన భక్తులను చూస్తూ అనుగ్రహిస్తున్నట్లుగా దక్షిణం తలాపుగా శయనింపజేస్తారు. (సంవత్సరంలో ఒక్క ధనుర్మాసం 30 రోజుల్లో మాత్రం భోగ శ్రీనివాసమూర్తికి బదులుగా బాలకృష్ణుని వెండి విగ్రహమూర్తిని శయనింప చేస్తారు. కృష్ణుని శయనింపు జేసిన ఈ ధనుర్మాసంలో ఉదయం సుప్రభాతానికి బదులుగా ''తిరుప్పావై'' పఠన ఏకాంతంగా జరుగుతుంది.) తదుపరి మెత్తని చందనపు ముద్దలను (ఒక్క ముద్ద, - చిన్న కప్పు పరిమాణం) లెక్కప్రకారంగా, శ్రీస్వామివారి మూలమూర్తి పాదాలపైన వున్న బంగారు పాద కవచాలను తొలగించి, స్వామివారి నిజపాదాలపైన రెండు చందనపు ముద్దలను, శ్రీస్వామివారి వక్షః స్థల లక్ష్మికి పావుభాగం చందనపు ముద్దను, అలాగే పాన్పుపై పవ్వళించి వున్న శ్రీ భోగశ్రీనివాసమూర్తి వక్షఃస్థలంపై సగం చందనపు బిళ్లను సమర్పిస్తారు. మిగిలి పావు భాగం చందనపు ముద్దను, శ్రీ వేంకటేశ్వరస్వామివారి ముందు బంగారు పళ్లెంలో వుంచుతారు. దీనితోపాటు ఒక బంగారుగిన్నెలో జలం కూడా వుంచ బడుతుంది. ఆ రాత్రి బ్రహ్మాది దేవతలు ఈ చందనం, జలాలతో శ్రీస్వామివారిని అర్చిస్తారని ప్రతీతి! పిదప ఆ తెల్లవారు జామున సుప్రభాత సమయంలో భక్తులకు ఈ చందన తీర్థాల్ని బ్రహ్మతీర్థంగా ఇవ్వ బడుతుంది.

ఇలా అర్చకులు లోపల ఏకాంతసేవ ఉపచారాలు సమర్పిస్తుండగా ఏకాంతసేవకు నిర్ణీత రుసుమును చెల్లించిన భక్తులను ప్రవేశపెట్టి బంగారు వాకిలి దగ్గర బారులుగా ఆసీనుల్ని జేస్తారు.

**తీర్మానం**

ఇలా శ్రీస్వామి వారికి లోపల ఏకాంతసేవా సమయపు ఉపచారాలు జరుగు తుండగా, బంగారు వాకిలి దగ్గర భక్తుల (యాత్రికుల) సమక్షంలో శ్రీస్వామివారి హుండీని జాగ్రత్తగా విప్పి దానిని అందరి సమక్షంలో పెద్ద గోనె సంచిలో బిగించి సీలు వేస్తారు.ఆ తర్వాత ఈ సీలు వేసిన బస్తాను, బంగారు వాకిలి లోపల కుడివైపు వున్న శ్రీ భాండారమను గదిలో భద్రపరుస్తారు. ఇది ముగిసిన వెంటనే భక్తులు బంగారు వాకిలి లోపల ప్రవేశించి రాముల వారిమేడ వద్ద నుండి వరుసగా కూర్చుంటారు. శ్రీ స్వామివారి దివ్యమంగళ విగ్రహసౌందర్య దర్శనంతో

పాటు, శ్రీవారు పాన్పుపై శేషశాయివలె పవ్వళించి వున్న దివ్య దృశ్యాన్ని ఎప్పుడెప్పుడా తిలకించేది అని ఆతురతతోను భక్తితోను వాకిలివైపు కన్నార్పకుండా ఎదురు చూస్తుంటారు.

**తాళ్లపాకవారి లాలి పాట**

ఇంతలో అర్చకస్వాములు అన్ని ఉపచారాలు పూర్తిచేసి స్వామివారిని పాన్పుపై పవ్వళింపజేసి, వాకిలి తీస్తారు.

ఆ సమయంలో కన్నుల పండువుగా భక్తులందరికీ శ్రీవారి దివ్య దర్శనం జరుగుతుండగా తాళ్లపాక అన్నమాచార్యుల వారి వంశీయులు ఒకరు రాములవారి మేడ నడవలో శ్రీస్వామివారికి ఎదురుగా కూర్చొని తంబూరమీటుతూ--

**''జో అచ్యుతానంద జోజో ముకుందా**
**రావె పరమానంద రామ గోవింద''**
**అంగజుని గన్న మాయన్న యిటు రారా**
**బంగారు గిన్నెలో. బాలు పోసేరా**
**దొంగ నీవని సతులు పొంగుచున్నారా**
**ముంగిట నాడరా మోహనాకారా**

....................

అనే లాలి పాటలను భక్తితో గానం చేస్తుండగా, శ్రీ వేంకటేశ్వరస్వామి మైమరచి ఆ పాటను వింటూ, భక్తులకు దర్శనమిస్తూ నిద్రకు ఉపక్రమిస్తారు.

**తరిగొండవారి హారతి**

ఇలా తాళ్లపాకవారి లాలిపాట పూర్తి అయిన వెంటనే శ్రీస్వామివారి పరమభక్తురాలైన తరిగొండ వెంగమాంబ ''ముత్యాలహారతి''ని అటు శ్రీస్వామివారి మూలమూర్తికి, ఇటు బంగారు పాన్పుపై శయనించివున్న భోగమూర్తికి అర్చకులచేత ఇవ్వబడుతుంది. ప్రతిరోజూ శ్రీస్వామివారికి ఇవ్వబడే హారతే ఈ తరిగొండ ముత్యాల హారతి. తరిగొండవారి కర్పూర హారతి వెలుగులో శ్రీస్వామివారి దివ్య మంగళ విగ్రహ సౌందర్యాన్ని కన్నులారా చూచి ఆనందించ వలసిందేకాని

వర్ణించడానికి మాటలు చాలవు. భక్తులందరూ, ఈ కర్పూర హారతిని భక్తితో కళ్లకద్దుకొని, స్వామివారిని తిరిగి తిరిగి చూస్తూ, బయటికి వచ్చి శ్రీవారికి నివేదింప బడిన తీయని వేడిపాలను, పంచకజ్జాయ ప్రసాదాన్ని, మేవా ప్రసాదాన్ని స్వీకరించి, బంగారు వాకిలి దగ్గరనుండి హుండీ వున్న వైపుగా బయటికి వచ్చి ఆనంద నిలయ గోపురానికి నమస్కరించి వెళ్తారు. ఏకాంత సేవానంతరం విమాన ప్రదక్షిణంలోనికి ఎవ్వరూ ప్రవేశింపరు. అక్కడ దేవతా సంచారం వుంటుందని ప్రతీతి!

ఆ తర్వాత బంగారు వాకిళ్లు మూయు డంతో ఆనాటి ఆలయ కార్యక్రమాలు పూర్తవుతాయి.

ఇలా ఏకాంత సేవలో పాల్గొన్న భక్తులు శ్రీస్వామివారి మూలమూర్తితోపాటు, శయన మూర్తిని ఒకే సమయంలో దర్శించవచ్చు. రు. 120/- లు ఆర్జితం టికెట్టుపై ఒక్కరు మాత్రమే ఏకాంతసేవను దర్శించ వీలవుతుంది.

**ఎలా పాల్గొనాలి?**

తిరుమలలో ప్రతి రాత్రి జరిగే ''శ్రీవారి ఏకాంతసేవ'' కు మాత్రం ముందుగా సురక్షితం (రిజర్వు) చేసుకునే సౌకర్యం లేదు. ఏ రోజు కారోజు రాత్రి 10 గంటల సమయంలో ''వైకుంఠం క్యూ కాంప్లెక్సు'' భవనానికి ఎదురుగా వున్న విజయాబ్యాంకులో ఏకాంతసేవా టికెట్లు విక్రయింపబడతాయి. ముందు వచ్చినవారికి ముందు అనే పద్ధతిపై ఈ టికెట్లు ఇవ్వబడతాయి. ఒక టిక్కెట్టు రు. 120/- లు. ఒక్క టికెట్టుపై ఒక్కరికి మాత్రమే ప్రవేశం వుంటుంది. తిరుమల క్షేత్రంలో శ్రీవారి దర్శనానికి వేచివున్న భక్త జనాన్ని దృష్టిలో వుంచుకొని, కొన్ని రద్దీ సమయాల్లో ఏకాంతసేవ ఏకాంతంగానే నిర్వహింప బడుతుంది. భక్తులకు ప్రవేశం కల్పించ బడదు. ఈ సేవలో పాల్గొన్న భక్తునికి రెండు లడ్డులు ప్రసాదంగా ఇవ్వబడతవి.

**ఏడుకొండలవాడా! వేంకట రమణ**

**గోవిందా! గోవిందా! గోవింద!!**

* * *

# వేంకన్న వారోత్సవాలు

మనం ఇంతవరకు తిరుమల సన్నిదానంలో కొలువై వుంటూ కోరినవారికి కోరినట్లుగా వరాలను గుప్పిస్తూ వున్న నిత్య కల్యాణ చక్రవర్తి నిత్యోత్సవాలను గూర్చి తెలుసుకున్నాం. ప్రస్తుతం వెంకన్న వారోత్సవాలను గూర్చి చర్చించుకుందాం

వారానికి ఒకసారి జరిగే ఉత్సవాలు లేదా సేవలను వారోత్సవాలని అంటారు. అంతేకాదు. ఆయా వారాలలో నిర్ణీతంగా జరిగే సేవలు, ఉత్సవాలు కూడా వారోత్సవాలు అని కూడా పిలువబడు తున్నాయి.

ఒక్కవారం రోజులలో వారానికి ఒకసారి ప్రతి సోమవారంనాడు సప్తగిరీశునకు ''విశేష పూజ'' జరుపబడుతున్నది అలాగే ప్రతి మంగళవారంనాడు ''అష్టదళ పాద పద్మారాధన'', ప్రతి బుధవారంనాడు ''సహస్ర కలశాబిషేకం'', ప్రతి గురువారంనాటి ఉదయం ''తిరుప్పావడ'', 'నేత్ర దర్శనం'', ఆ సాయంత్రం ''పూలంగి సేవ'', ప్రతి శుక్రవారంనాడు ''అభిషేకం''... . ఇలా ఒక్కొక్క రోజు ఒక్కొక్క విధంగా ఒక్కొక్క సేవగాని, ఉత్సవంగాని తిరుమల స్వామివారికి నిర్వహింపబడుతున్నాయి. వారంలో ఒక్క శనివారం, ఆదివారం రెండురోజులు తప్ప మిగిలిన ఐదురోజుల్లో విధిగా వారోత్సవాలు జరుపబడుతున్నాయి. అందులో మొదటిది ప్రతి సోమవారంనాడు జరిగే ''విశేషపూజ'' ను గూర్చి తెలుసుకుందాం తెలుసుకునే ముందుగా తిరుమలేశునికి ఒక్కసారి జయ జయ ధ్వానాలు చేద్దాం

**జయ జయ గోవిందా! తిరుమల గోవిందా!**

**గోవిందా! గోవిందా!! గోవింద!!!**

* * *

# 1. సోమవారం - విశేష పూజ

తిరుమల దివ్య క్షేత్రంలో శ్రీ వేంకటేశ్వరస్వామివారికి ప్రతి సోమవారం ఉదయం జరిగే ప్రధాన సేవ ''విశేష పూజ''. ఈ సేవ శ్రీస్వామివారి ఉత్సవమూర్తులైన శ్రీ మలయప్పస్వామివారికి శ్రీదేవి భూదేవి సమేతంగా జరుగుతుంది. ఈ సేవ నిత్య కల్యాణోత్సవ మండపమైన శ్రీ వెంకటరమణస్వామి కల్యాణ మండపంలో ఆర్జితసేవగా జరుపబడుతున్నది.

ప్రతి సోమవారంనాడు మాత్రమే జరుపబడే ఈ విశేషపూజ తొలిసారిగా 1991 ఏప్రిల్ 8వ తేదీ సోమవారంనాడు ప్రవేశపెట్టబడి ఆనాటినుండి క్రమంగా జరుపబడుతున్నది.

ప్రతిరోజు మాదిరిగానే సోమవారం నాడు యథా ప్రకారంగా సుప్రభాతం, తోమాలసేవ, కొలువు, సహస్ర నామార్చన మొదటి నైవేద్యం (మొదటి గంట) జరుగుతాయి. మళ్లీ ఆ వెనువెంటనే శ్రీస్వామి వారికి రెండవ అర్చనగా అష్టోత్తర శత నామార్చన, రెండవసారి నివేదన (రెండవ గంట) నిర్వహింపబడతాయి. ఇలా రెండవమారు నైవేద్యం పూర్తి అయిన వెంటనే శ్రీ మలయప్ప స్వామివారు ఉభయ దేవేరులైన శ్రీదేవి భూదేవులతో కూడి శ్రీ పీఠాన్ని (తిరుచ్చి) ఎక్కి, ఛత్రచామర బాజా భజంత్రీలతో, వేదపారాయణలతో ఆనంద నిలయాన్ని వీడి, విమాన ప్రదక్షిణం చేస్తూ, బయట ధ్వజస్తంభానికి ప్రదక్షిణంగా వెళ్లి సంపంగి ప్రదక్షిణ మార్గంలో వున్న కల్యాణ మండపాన్ని చేరుకుంటారు. పిదప ఈ మూర్తులకు అలంకారాలు, పట్టు వస్త్రాలను తొలగించి స్నాన వస్త్రాలను ధరింపజేసి, స్నాన పీఠంపై తూర్పు ముఖంగా వేంచేపు చేస్తారు.

తొలిగా దీక్షాధారులైన ఋత్త్విక్కులు (వైఖానసార్చక స్వాములు) వేదికపై నవ కలశాలను ప్రతిష్ఠిస్తారు. ముందుగా ఋత్త్విక్కులు గంటానాదం చేస్తూ హోమగుండంలో అగ్నిని ప్రతిష్ఠిస్తారు. పిదప పుణ్యాహ వాచనంతో స్థల శుద్ధి, పరిసర శుద్ధి చేస్తారు.

ఆ తర్వాత కంకణ ప్రతిష్ఠ చేసి, ఆ కంకణాలను అర్చించిన పిదప వాటిని శ్రీదేవి భూదేవి మలయప్ప స్వామివారలకు అర్ఘ్య పాద్యాచమనాది ఉపచారాలను సమర్పించి కంకణాలను సమర్పిస్తారు. అనగా కంకణ ధారణ చేయిస్తారన్నమాట.

తర్వాత అర్చకస్వాములు తిథి వార నక్షత్ర సహితంగా సంకల్పం చెప్తూ హోమాన్ని నిర్వహిస్తారు. ఆర్జితం చెల్లించిన గృహస్థుల చేత (భార్యా భర్త) కూడ సంకల్పం చేయిస్తారు. ఆ తర్వాత నవ కలశ పూజ నివేదన, పూర్ణాహుతిని చేసి హోమతిలకాన్ని శ్రీ స్వామివారి ఉత్సవ మూర్తులకు ధరింప జేస్తారు. ఆ హోమ తిలకశేషాన్ని భక్తులకు కూడ ఇవ్వడం జరుగుతుంది.

ఆ తర్వాత స్నాన పీఠంపై వున్న శ్రీదేవి భూదేవి సమేతంగా శ్రీస్వామివారికి స్నపన తిరుమంజనం ప్రారంభింపబడుతుంది.

కల్యాణ మండప ప్రాంగణంలో మంగళవాద్యాలు మోగుతుండగా వేద పారాయణలు సాగుతుండగా ముందుగా శుద్ధ జలంతో శ్రీవారి మూర్తులకు అభిషేకం జరుగుతుంది. పిదప ఆవుపాల (క్షీరం)తో అభిషేకం చేస్తారు. వెంటనే శుద్ధ జలంతో అభిషేకించి, ధూపదీప నివేదనలను సమర్పిస్తారు. ఆ తర్వాత పెరుగుతో అభిషేకం చేసిన తర్వాత మళ్లీ శుద్ధ జలంతో అభిషేకాన్ని నిర్వహించి ధూపదీప హారతులను సమర్పిస్తారు. ఇలా వరుసగా తేనె, కొబ్బరి నీరు, పసుపు, చందనం, మున్నగు ద్రవ్యాలతో అభిషేకం చేస్తున్నంతసేపు వేదపండితులు పురుషసూక్తం, శ్రీసూక్తం, భూ నీళా సూక్తాలు పంచ సూక్తాలను పఠిస్తూనే వుంటారు. మరోవైపు మంగళ వాద్యాలు మోగుతునే వుంటాయి.

చివరగా నవకలశాలలోని జలంతో బంగారు పళ్లెంతో సహస్ర ధారాభిషేకం చేస్తారు. నవ కలశాలతో చేసే సహస్ర ధారాభిషేక తీర్థ జలాన్ని ముందుగా అర్చకస్వాములు తాము చల్లుకొని, అక్కడవున్న అందరిమీదా ''పూతో భవ'' అంటూ భక్తుల మీద సంప్రోక్షిస్తారు.

పిదప తెరలు వేసి శ్రీస్వామివారి మూర్తులను శుభ్రంగా తుడిచి పట్టు వస్త్రాలు, పూలమాలలో అలంకరించి పెద్ద వడలు, లడ్డులు, అన్న ప్రసాదాలు

మున్నగు వాటిని నివేదిస్తారు. తెరలు తీసి కర్పూర నీరాజనం సమర్పిస్తారు. హారతి అయిన తర్వాత ఈ సేవలో పాల్గొన్న భక్తులకు వస్త్ర బహుమానం జరగడంతో ఈ విశేష పూజ పూర్తి అవుతుంది. వెంటనే ఈ ఆర్జిత సేవలో పాల్గొన్న భక్తు లందరిని శ్రీస్వామివారి మూల విరాణ్మూర్తి దర్శనానికి ఆలయంలోనికి అనుమతిస్తారు.

విశేష పూజకు అనుమతి పొందిన ఆర్జిత గృహస్థులను ప్రతి సోమవారం ఉదయం 5 గంటలకు వైకుంఠం క్యూ ద్వారా మాత్రమే శ్రీవారి ఆలయం లోనికి అనుమతిస్తారు.

ప్రతి సోమవారం విశేషంగా, ప్రధానంగా శ్రీదేవి భూదేవులతో కూడి వున్న శ్రీ మలయప్ప స్వామి వారికి (ఉత్సవ మూర్తులకు) జరిగే సేవ '' విశేష పూజ''. ఈ సేవలో పాల్గొన్న భక్తులకు సుమారు ఒక గంటకు పైగా శ్రీస్వామివారి విశేష పూజ దర్శించే అవకాశం కలుగుతుంది.

* * *

# ౨. మంగళవారం - అష్టదళపాద పద్మారాధన

తిరుమల ఆనందనిలయంలో శ్రీ వేంకటేశ్వరస్వామివారి మూలవిరాణ్మూర్తికి ప్రతి రోజూ మూడు మారులు అర్చన జరుగుతున్నది. తెల్లవారు జామున 4-30 గంటల సమయంలో 1008 నామాలతో శ్రీవారికి "సహస్ర నామార్చన" జరుగుతుంది. పిదప ఉదయం 6 గంటల సమయంలో రెండవ అర్చనగా ఆ తర్వాత రాత్రి 8 గంటల సమయంలో మూడవ అర్చనగా అష్టోత్తర శతనామాలతో (108) అర్చనలు జరుగుతాయి.

ప్రతి రోజు తెల్లవారు జామున నిర్ణీత రుసుమును చెల్లించిన భక్తులు దర్శించగలిగే "శ్రీవారి సహస్రనామార్చన"ను గూర్చి ఇంతకు ముందే విపులంగా తెలుసుకున్నాం. ఇక మిగిలిన అష్టోత్తర శతనామార్చనల్లో మాత్రం భక్తులు పాల్గొని దర్శించడానికి వీలు పడదు. ఎందు చేతనంటే ఆ రెండు అర్చనలు ఏకాంతంగా జరుపబడుతున్నాయి. కాని ప్రతి మంగళవారం నాడు మాత్రం రెండవ అర్చనగా ఉదయం 6 గంటల సమయంలో "అష్టదళ పాద పద్మారాధన" పేరుతో ఆర్జిత సేవగా జరుగుతున్నది. ఈ అర్చనలో మాత్రమే భక్తులు నిర్ణీత రుసుమును చెల్లించి సుమారు 20 నిమిషాలపాటు శ్రీస్వామివారి మూలమూర్తికి జరిగే అష్టోత్తర శత నామ అర్చనలో పాల్గొని కన్నులారా దర్శించవచ్చు. అలా ప్రతి రోజూ రెండవ, మూడవ అర్చనలుగా అష్టోత్తర శత నామార్చన ఏకాంతంగా జరుగుతూ, ఒక్క మంగళవారంనాడు మాత్రం రెండవ అర్చనగా ఆర్జిత సేవగా జరిగే "అష్టదళ పాద పద్మారాధన" గూర్చి తెలుసుకుందాం.

* * *

శ్రీ వేంకటేశ్వరస్వామి అత్యంత అలంకార ప్రియుడు. ఎంతటి అలంకార ప్రియుడో అంతటి అర్చన ప్రియుడు. ఎంతటి అర్చన ప్రియుడో అంతకంటే ఎక్కువగా భక్తి ప్రియుడట! ఆయనకు భక్తులంటే భలే ఆనందం. అందువల్లే భక్తులను విడిచి వుండలేనని శ్రీ వైకుంఠాన్ని వదలి భూలోక వైకుంఠమైన ఈ

వేంకటాచలంలో ప్రత్యక్షంగా అర్చామూర్తిగా నిలిచివున్నాడు. కోరిన కోరికల నన్నింటిని తీరుస్తూ 'కోరిన వరాల రాయడని' ప్రసిద్ధి పొంది వున్నాడు.

ఒకానొకప్పుడు నైమిశారణ్యంలో వున్న శౌనకాది మునులందరూ సూత మహర్షిని అడిగారట. వేంకటాచలంలో ప్రత్యక్ష దైవంగా అర్చామూర్తిగా నిలిచివున్న స్వామిని ఎలా ఆరాధిస్తే భక్తుల కోరికలన్ని తీరతాంయి. వహాకు తెలియజేయవలసిందని ప్రార్దించారట! ఇలా వారి ప్రార్దనను విన్న సూతుడు ఇలా విన్పించాడు.

**అస్తి కించి న్మ హా గోప్యం భగవత్ప్రీతి కారకమ్**
**పురా శేషేణ కధితం కపిలాయ మహాత్మనే**

**నామ్నా మష్టశతం పుణ్యం పవిత్రం పాపనాశనమ్**
**ఆదాయ హేమపద్మాని స్వర్ణ దీ సంభవాని చ**

**బ్రహ్మాతు పూర్వ మభ్యర్చ్య శ్రీ మద్వేంకట నాయకమ్**
**అష్టోత్తరశతై ర్దివ్యైః నామభిః ముని పూజితైః**

**స్వాభీష్టం లబ్ధవాన్ బ్రహ్మా సర్వలోక పితామహ**
**భవద్భిర పి పద్మై శ్చ సమర్చ్యః తైశ్చ నామభిః**

చాలా పూర్వం క్రిందట ఆదిశేషుడు కపిలమహర్షికి శ్రీనివాసునికి ప్రీతిని కల్గించే అత్యంత రహస్యాన్ని తెలియజేసినాడు. అత్యంత గోప్యమైన ఆ పవిత్ర కార్యం ఏమంటే పవిత్రమూ, పాపనాశనకరమగు అష్టోత్తర శతనామాలతో స్వర్ణంతో తయారు చేసిన పద్మాలతో సాక్షాత్తుగా బ్రహ్మ దేవుడు శ్రీ వేంకటాచలపతిని అర్చించి తన యభీష్టాలను నెరవేర్చుకొన్నాడు. కావున భక్తులందరూ తమ తమ కోరికల కోసం అష్టోత్తర శతనామాలతో శ్రీ వేంకట ప్రభువులవారిని అర్చించడం ఎంతైనా శ్రేయస్కరం, ఉత్తమోత్తమం అని అంటూ శ్రీ శేష శైలవాసుడగు శ్రీ వేంకటేశ్వరస్వామిని అలరింప జేయగల అష్టోత్తర శతనామాలను వివరించినాడు.

**తేషాం శేషనగాధీశ మానసోల్లాస కారిణామ్**
**నామ్నా మష్టశతం వక్ష్యే వేంకటాద్రి నివాసినః**

*ఆయురారోగ్య దం పుంసాం ధన ధాన్య సుఖప్రదమ్*
*జ్ఞాన ప్రదం విశేషేణ మహదైశ్వర్య కారకమ్*

అష్టోత్తర శతనామావళితో అర్చించిన వారికి ఆయురారోగ్యములు కలుగుతాయి. ధన ధాన్య సుఖాలు కలగడమే కాకుండా విశేషంగా జ్ఞానంతో పాటు మహదైశ్వర్యాలు చేకూరు తాయని రహస్యమైన శ్రీనివాసుని శతనామాలను, ఆదిశేషుడు కపిలమహర్షికి చెప్పగా, వాటిని తాను కపిలమహర్షిచే విన్నానని అంటూ సూతుడు మహర్షులకు తెలియ జేసినాడు.

*అర్చయేత్ నామభి ర్దివ్యైః వేంకటేశ పదాంకితైః*
*నామ్నామష్ట శతస్యాస్య ఋషి బ్రహ్మ ప్రకీర్తితః*

*ఛందో నుష్టుప్ తథా దేవో వేంకటేశ ఉదాహృతః*
*నీలగోక్షీర సంభూతో బీజమిత్యుచ్యతే బుధైః*

*శ్రీనివాస స్తథా శక్తిః హృదయం వేంకటాధిపః*
*వినియోగ స్తథా భీష్ట సిద్ధ్యర్థ్యే చ నిగద్యతే.*

'శ్రీ వేంకటేశ' పద చిహ్నాలతో కూడిన దివ్య నామావళితో శ్రీనివాసుని ఆరాధించ వలయును. ఈ శతనామావళికి ఋషి బ్రహ్మదేవుడు. అనుష్టుప్ ఛందము. పరమాత్మ శ్రీ వేంకటేశ్వరస్వామి. నీల గోక్షీరసంభూతు డగు శ్రీనివాసుడు బీజము. శ్రీనివాసుడే శక్తి. వేంకటాచలపతి హృదయము. అభీష్టాలను పొందుటలో వినియోగము అని అంటూ సూతమహర్షి వేంకటాచల క్షేత్రంలో శ్రీనివాసుని అర్చించే శతనామాలను వరుసగా తెలియ జేసినాడు. ఇలా ఈ నామావళిని గూర్చిన ఈ వృత్తాంతం వరాహపురాణంలో చెప్ప బడింది. తిరుమల క్షేత్రంలో అనాదిగా వరాహ పురాణా ంతర్గత శ్రీ వేంకటేశ అష్టోత్తర శతనామావళితో అర్చన జరుగుతున్నది.

అన్ని రోజుల్లో ఏకాంతంగా జరిగే అష్టోత్తర శతనామార్చనను 1984 వ సంవత్సరంలో జరిగిన దేవస్థానం స్వర్ణోత్సవాల సందర్భంగా ప్రతి మంగళవారంనాడు ఉదయం అర్చనను మాత్రం ''అష్టదళ పాద పద్మారాధన'' పేరుతో ఆర్జిత సేవగా తిరుమల తిరుపతి దేవస్థానం ప్రవేశ పెట్టింది. ఇందుకు

అవసరమైన 1 0 8 బంగారు కమలాలను హైదరాబాదుకు చెందిన ఒక అజ్ఞాత మహమ్మదీయ భక్తుడు శ్రీస్వామి వారికి కానుక పెట్టుకొన్నాడు.

ముందుగా ప్రతి మంగళవారంనాడు ''అష్టదళ పాద పద్మారాధన'' ను దర్శించ డానికి అనుమతించబడిన ఆర్జిత గృహస్థులను శ్రీస్వామివారి దగ్గర వున్న 'కులశేఖర పడి' గడప నుండి శ్రీవారికి ఎదురుగా ఒకరి వెనుక మరొకరిని బంగారు వాకిలి వరకు కూర్చొన బెడతారు. ఆ తర్వాత అర్చక స్వాములు ఒకేసారి భక్తులందరి చేత సంకల్పం చెప్పిస్తారు.

మొదట శ్రీవారి అర్చక స్వాములు శ్రీ వేంకటేశ్వరస్వామివారికి అర్ఘ్య పాద్యాచమనాది అనుష్ఠాన ఉపచారాలు సమర్పించిన తర్వాత శ్రీ శ్రీనివాసస్వామివారి చెంత కూర్మాసనంపై కూర్చొని అర్చన చేయుటకు సిద్ధంగా వుంటారు ఆ సమయంలో శ్రీమాన్ జియ్యం గారు అందించిన బంగారు పద్మాలను స్వీకరించి--

*ఓం వేంకటేశాయ నమః శ్రీ వేంకటేశాయ నమః*
*ఓం శేషాద్రి నిలయాయ శ్రీ వేంకటేశాయ నమః*
*ఓం వృషదృగ్గోచరాయ శ్రీ వేంకటేశాయ నమః*
*ఓం విష్ణవే శ్రీ వేంకటేశాయ నమః*
*ఓం సదంజన గిరీశాయ శ్రీ వేంకటేశాయ నమః*

అని అష్టోత్తర శతనామాలను ఉచ్చరిస్తూ శ్రీస్వామివారి పాద పద్మాలకు అర్చన ప్రారంభిస్తారు. వెంటనే కులశేఖరపడి గడపకు బయట ఆనుకొని నిలిచివున్న ఆచార్యులు ఒకరు అర్చకస్వామి ప్రారంభించిన ''శ్రీ వేంకటేశ్వర అష్టోత్తర శతనామావళి'' ని అందుకొంటూ--

*ఓం వృషాద్రి పతయే శ్రీ వేంకటేశాయ నమః*
*ఓం మేరు పుత్ర గిరీశాయ శ్రీ వేంకటేశాయ నమః*
*ఓం సరస్స్వామి తటీ జుషే శ్రీ వేంకటేశాయ నమః*
*ఓం కుమారాకల్ప సేవ్యాయ శ్రీ వేంకటేశాయ నమః*
*ఓం వజ్రిదృగ్విషయాయ శ్రీ వేంకటేశాయ నమః*
*ఓం సువర్చలా సుతన్యస్త సైనాపత్యభరాయ శ్రీ వేంకటేశాయ నమః*

ఓం రామాయ శ్రీవేంకటేశాయ నమః
ఓం పద్మనాభాయ శ్రీ వేంకటేశాయ నమః
ఓం సదా వాయుస్తుతాయ శ్రీ వేంకటేశాయ నమః
ఓం త్యక్తవైకుంఠ లోకాయ శ్రీ వేంకటేశాయ నమః
ఓం గిరికుంజ విహారిణే శ్రీ వేంకటేశాయ నమః
ఓం హరిచందన గోత్రేందస్వామినే శ్రీ వేంకటేశాయ నమః
ఓం శంఖరాజన్య నేత్రాబ్జవిషయాయ శ్రీ వేంకటేశాయ నమః

ఇత్యాదిగా శ్రీ వేంకటేశ అష్టోత్తర శతనామావళిని సుశ్రావ్యంగా చదువుతూ చివరగా క్రింది నామాలతో పూర్తి చేస్తారు.

శ్రీవారి పాదాలపైవున్న తులసిదళాలను స్వీకరించి శ్రీ వేంకటేశ్వరస్వామివారి వక్షః స్థలంలో కొలువై వున్న శ్రీ మహాలక్ష్మి అమ్మవారిని--

ఓం శ్రియై నమః
ఓం లోకధాత్ర్యై నమః
ఓం బ్రహ్మమాత్రే నమః

అని వరాహపురాణంలోని శ్రీమహా లక్ష్మీ చతుర్వింశతి (24) నామావళిని ఉచ్చరిస్తూ అర్చన ప్రారంభిస్తారు. వెంటనే అర్చన నామావళిని పఠించే పండితుడు లక్ష్మి నామావళిని అందుకొని చెప్తూ వుండగా, అర్చకులు శ్రీవారి వక్షః స్థల మహాలక్ష్మి అమ్మవారిని తులసితో అర్చిస్తారు. ఇలాగ శ్రీస్వామివారికి, వక్షః స్థల మహాలక్ష్మికి అర్చన పూర్తవగానే శ్రీస్వామివారికి శ్రీ గంధ ధూపం వేస్తారు. తర్వాత ఆవు నేతితో తడిపిన 27 వత్తులు గల వెండి దీపపు సెమ్మెతో శ్రీస్వామి వారికి నక్షత్ర హారతి ఇస్తారు. పిదప కొబ్బరికాయ కొట్టి పండ్లు నైవేద్యమిచ్చి కర్పూర హారతి ఇస్తారు. ఈ కర్పూర హారతిని అర్చకస్వాములు శ్రీస్వామివారి పాదాలు, వైకుంఠ హస్తం (వరద హస్తం), చక్రం, శ్రీవారి ముఖారవిందం, తిరునామాలు, శంఖం, కటిహస్తం, శ్రీవారి పాదాలు, నందక ఖడ్గం, ఆ తర్వాత వక్షః స్థల మహాలక్ష్మికి ఇలా వరుసగా ఇస్తారు. ఈ హారతి వెలుగుల్లో వింత వింతలుగా ప్రకాశిస్తూ దర్శన మిస్తూ వున్న శ్రీస్వామివారి దివ్య రూపాన్ని దర్శించి తీరవలసిందేకాని వర్ణించడానికి సాధ్యం కాదు. ఈ కర్పూర హారతిని భక్తులందరికీ

చూపించబడుతుంది. భక్తులందరు కళ్లకద్దుకొంటూ ఎప్పుడో, ఏనాడో, ఏ జన్మలోనో చేసికొన్న మహద్భాగ్యంవల్ల నేడు మనం ప్రత్యక్షంగా శ్రీవారి దర్శనం చేసికొంటున్నాం కదా అంటూ ఒక దివ్యానందానికి లోనవుతారు ఒక మధురానుభూతితో తన్మయులవుతారు ఒక ఆత్మతృప్తిని చవిచూస్తారు.

హారతి అయిన వెంటనే అర్చక స్వామి ఆలవట్టం (విసనకర్ర)తో శ్రీవేంకటేశ్వర స్వామివారికి విసరుతూ సేద దీరుస్తారు. ఆ తర్వాత శ్రీస్వామివారి దివ్య పాద పద్మాలకు తమ హస్తములను తాకించి నమస్కరించిన తర్వాత ఇతర అర్చక స్వాములద్వారా తాను శరారి స్వీకరించుతారు. ఆ తర్వాత అర్చకస్వాములు ఈ ఆర్జిత సేవలో పాల్గొన్న భక్తులందరి తరుపున శ్రీస్వామివారికి కర్పూరహారతిని ఇస్తారు. తర్వాత వీరందరూ వరుసగా లోనికి వెళుతూ శ్రీస్వామివారి దివ్యమూలమూర్తిని దర్శిస్తూ అర్చకులు అను గ్రహించిన శరారితో ఆశీస్సులను స్వీకరించి వెలుపలికి వస్తారు. ఇలా అర్చన అయిన వెంటనే శ్రీస్వామివారికి మధ్యాహ్న నివేదన జరుగుతుంది. ఈ నివేదన జరిగిన తర్వాతనే ఆనంద నిలయం నుండి శ్రీవారి ఉత్సవమూర్తి అయిన మలయప్పస్వామి ఉభయదేవేరులతో కలిసి కల్యాణోత్సవాదులలో భక్తులకు దర్శన మిచ్చుటకు బయటికి వస్తారు.

ప్రతి మంగళవారం ఆర్జిత సేవగా నిర్వహించబడే ఈ ''అష్టదళ పాద పద్మారాధన'' లో పాల్గొన్న గృహస్థునకు ఒక ఉత్తరీయం, ఒక రవికగుడ్డతోపాటు 10 పెద్దలడ్డులు, 10 వడలు ప్రసాదంగా ఇవ్వబడతవి.

ఈ అష్టదళ పాద పద్మారాధన, ప్రతి మంగళవారంనాడు ఉదయం 6 గంటల సమయంలో విధిగా జరుపబడుతుంది. ఈ సేవ మూలవిరాణ్మూర్తికి జరిగే సేవ కాబట్టి తప్పక జరుగుతుంది. కొన్ని సమయాల్లో అంటే కోయిల్ ఆళ్వార్ తిరుమంజనం జరిగే మంగళవారాల్లో మాత్రం ఈ 'అష్టదళ పాద పద్మారాధన' అర్చన సేవ మధ్యాహ్నం 1 గంట సమయంలో జరుగుతుంది. సంవత్సరంలో ఉగాది పండుగకు ముందు వచ్చే మంగళవారంనాడు, ఆణివార ఆస్థానం (జూలై 16) కు ముందు వచ్చే మంగళవారం నాడు, బ్రహ్మోత్సవాలకు ముందు వచ్చే మంగళవారంనాడు, అలాగే వైకుంఠ ఏకాదశికి ముందు వచ్చే మంగళవారం నాడు ఇలా సంవత్సరంలో నాలుగు మారులు తిరుమల శ్రీవారి ఆలయంలో ''కోయిల్ ఆళ్వార్ తిరుమంజనం'' అనబడే ఆలయశుద్ధి కార్యక్రమం జరుగుతుంది. ఈ

ఆలయ శుద్ధి కార్యక్రమం మంగళవారాల్లోనే ఉదయం 6 గంటల నుంచి మధ్యాహ్నం 12 గంటలవరకు జరుగుతుంది. ఇది పూర్తి అయిన తరువాతనే ''అష్టదళ పాద పద్మారాధన'' సేవ మధ్యాహ్నం 1 గంట సమయంలో జరుపబడు తుంది. కొన్ని సందర్భాల్లో అంటే ఉగాది, ఆణివార ఆస్థానం కూడిన మంగళవారాల్లో ఈ ''అష్టదళ పాద పద్మారాధన సేవ'' ఏకాంతంగా జరుప బడుతుంది.

**ఎలా పాల్గొనాలి?**

ప్రతి మంగళవారంనాడు ఉదయం 6 గంటలకు రెండవ అర్చనగా జరుపబడే ''అష్టదళ పాదపద్మారాధన'' సేవలో పాల్గొనే గృహస్థులు రు. 2,500లు (ప్రస్తుత రుసుము) డిమాండు డ్రాఫ్టును ఏ జాతీయ బ్యాంకులో అయినా సరే ''ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు, తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి'' వారి పేర తీసి, దానిని ''డిప్యూటి ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు, శ్రీవారి ఆలయం, తిరుమల -- 517 504 వారికి, కావలసిన తేదికి అనగా మంగళవారంనాటికి 90 రోజులు ముందుగా పంపుతూ ''అష్టదళ పాద పద్మారాధన''సేవకు అనుమతి పత్రాన్ని పొందవచ్చును. ఈ అనుమతి పత్రాన్ని ముందుగానే ధ్రువీకరణ పత్రం ద్వారా భక్తులకు తెలియజేయ బడుతుంది. అయినా అప్పటికి వున్న అవకాశాన్ని బట్టి మాత్రమే వీలు కల్పించబడుతుంది.

నిర్ణీత ఆర్జిత రుసమును చెల్లించిన గృహస్థు (భార్య, భర్త)ను మాత్రం ఈ సేవలో పాల్గొనే అవకాశం కల్పించబడుతుంది. వీరు, అనుమతి పొందిన తేదీ మంగళవారంనాడు తెల్లవారు జామున 5 గంటలకు ''వైకుంఠం క్యూకాంప్లెక్సు'' ద్వారా మాత్రమే ఆలయంలోనికి అనుమతింపబడతారు. ఈ సేవలో పాల్గొన దలచిన గృహస్థు పంచ, ఉత్తరీయాన్ని మాత్రమే ధరించవలయును.

ఇలా శ్రీ వేంకటేశ్వరస్వామివారికి ''అష్టోత్తర శతనామార్చనను చేయించినా, దర్శించినా విశేష ఫలముంటుంది!''

**అష్టోత్తర శతం నామ్నాం చతుర్థ్యా నమ సా న్వితమ్**
**యః పఠేచ్ఛృణు యాన్నిత్యం శ్రద్ధా భక్తి సమన్వితః**
**తస్య శ్రీ వేంకటేశస్తు ప్రసన్నో భవతి ధ్రువమ్**

**అర్చనాయాం విశేషేణ గ్రాహ్యమష్టోత్తరం శతమ్**
**వేంకటేశాభి ధేయైర్యో వేంకటాద్రి నివాసినమ్**
**అర్చయేన్నామభిస్తస్య ఫలం ముక్తిః న సంశయః**

ప్రతి నామానికి చివర చతుర్థి విభక్తితోను నమః పదముతోను కూడిన ఈ అష్టోత్తర శతనామాలను శ్రద్ధా భక్తులతో నిత్యం చదివినా, విన్నా శ్రీ శ్రీనివాసస్వామి తప్పక ప్రసన్నుడవుతాడు. తిరుమలేశునికి జరిగే అర్చనల్లో అన్నింటా అష్టోత్తర శతనామార్చన చాలా విశేషమయిందే గాక అత్యంత ప్రధానమయింది. శ్రీ వేంకటేశాష్టోత్తర నామాలతో అర్చించేవారికి మోక్షం కూడ కలుగుతుందనేందుకు ఏ మాత్రం సందేహం లేదు అని ఈ విధంగా సూతమహర్షి శౌనకాదులకు శ్రీవారి అష్టోత్తర శతనామాల మహిమను గూర్చి వివరిస్తూ గోవింద నామాన్ని ఇలా స్మరించినాడు.

**గోవిందా! గోవిందా!! గోవింద!!!**

తిరుమల శ్రీ వేంకటేశ్వరస్వామివారికి ప్రతి బుధవారంనాటి ఉదయంపూట జరిగే ప్రధాన వారోత్సవం సహస్రకలశాభిషేకం.

శ్రీ వేంకటేశ్వరస్వామివారి ఉత్సవమూర్తులకు జరిగే వారోత్సవాలలో రెం డవదీ, అతి ప్రధానమైనది ప్రతిబుధవారం ఉదయం జరిగే సహస్రకలశాభిషేక ం.ప్రతి సోమవారం ఉదయము శ్రీవారి ఉత్సవమూర్తి శ్రీ మలయప్పస్వామివారికి జరిగే మొదటి వారోత్సవమైన ''విశేషపూజ'' గురించి ఇంతకుముందే తెలుసుకు న్నాం. ఈ రెండూ కాక ఇక మిగిలిన వారోత్సవాలైన మంగళవారం జరిగే అష్టదళ పాదపద్మారాధన, గురువారంనాటి తిరుప్పావడ సేవ – నేత్రదర్శనం, పూలంగిసేవ, శుక్రవారం అభిషేకం – ఇవన్నీ ఆనందనిలయంలోవున్న శ్రీ స్వామివారి మూల విరాణ్మూర్తి (ధ్రువమూర్తికి) జరుపబడేవి.

ప్రస్తుతం ప్రతి బుధవారం ఉదయం 6 గంటల సమయంలో బంగారు వాకిలి ముందు జరిగే ప్రధానవారోత్సవమైన 'సహస్ర కలశాభిషేకము''ను గూర్చి తెలుసుకొందాం.

* * *

# 3. బుధవారం - సహస్ర కలశాభిషేకం

తిరుమల క్షేత్రంలో బ్రహ్మాండ నాయకుని ఆలయ ప్రాంగణంలో బంగారు వాకిలిముందు వున్న గంటా మండపంలో ప్రతి బుధవారంనాడు జరిగే ప్రధానసేవ సహస్ర కలశాభిషేకం. మిగిలిన అన్ని సేవలకంటే విశిష్టమైందేగాక, అత్యంత ప్రాచీనకాలంనుంచీ జరుగుతున్న వారోత్సవం కూడ ఈ ''సహస్ర కలశాభిషేకం'' అని చెప్పవచ్చును.

శ్రీ వేంకటేశ్వరస్వామివారికి తిరుమల ఆనందనిలయంలో 1 మూలవిరాణ్మూర్తి (ధ్రువమూర్తి,) 2.మనవాళప్పెరుమాళ్ అని పిలువబడే భోగశ్రీనివాసమూర్తి 3. కొలువు శ్రీనివాసమూర్తి 4. ఉగ్ర శ్రీనివాసమూర్తి 5. మలయప్పస్వామి అని పిలువబడే ఉత్సవ శ్రీనివాసమూర్తి అని ఐదు రకాలైన మూర్తులు వున్నట్లుగా మనం ఇంతకు పూర్వం తెలుసుకొన్నాం. వాటినే పంచ బేరాలు (ఐదు మూర్తులు) అనికూడ అంటారు.

పై మూర్తులలో ప్రతి బుధవారంనాడు జరిగే వారోత్సవమైన సహస్ర కలశాభిషేకంలో భోగ శ్రీనివాసమూర్తితోపాటు శ్రీదేవి భూవి సమేతంగా మలయప్పస్వామి పాల్గొంటారు. అంతేగాక శ్రీస్వామివారి సేనాధిపతి అయిన శ్రీ విష్వక్సేనులు (పంచలోహమూర్తి) కూడ ఇందులో పాల్గొంటారు.

క్రీ.శ. 614 నాటిదని చెప్పబడుతున్న శ్రీ భోగశ్రీనివాసమూర్తికి వైఖానసాగమం ప్రకారం కౌతుకమూర్తి, పురుషబేరం అని కూడ వ్యవహార నామాలు వున్నాయి. శ్రీవారి ఆలయంలో ప్రతిరాత్రి ఏకాంతసేవా సమయంలో శయన భాగ్యాన్ని పొందుతూ వున్న ఈ భోగమూర్తే ''మనవాళ ప్పెరుమాళ్''అని కూడ పిలువబడుతున్నాడు. మనవాళన్ అనగా పెండ్లి కొడుకు అని అర్థం. సుమారు 1½ అడుగుల ఎత్తుతో విరాజిల్లుతూ శ్రీవారి మూలమూర్తికి నకలు ప్రతిమగా చెప్పబడుతున్న ఈ భోగశ్రీనివాసుని వెండి విగ్రహాన్ని ప్రతిరోజూ పగలు ఆనందనిలయంలో శ్రీ వేంకటేశ్వర స్వామివారి పాదాలముందు చూడవచ్చు. అంతేగాక ప్రతిరాత్రి ఏకాంత సేవా సమయంలో గర్భాలయానికి ముందువున్న శయనమండపంలో వెండి గొలుసులతో వేలాడదీసిన మంచంపైనకూడ ఈ

భోగమూర్తిని దర్శించవచ్చు. ఈ భోగశ్రీనివాసమూర్తికే ఆకాశగంగా తీర్థంతో ప్రతిరోజు నిత్యాభిషేకం జరుపబడుతుంది.

ఇలాగ భోగశ్రీనివాసమూర్తి ప్రతిమ ఎప్పుడు బంగారువాకిలి దాటి బయటికి తేబడదు. కాని ఒక్క బుధవారము మాత్రం సహస్రకలశాభిషేకం జరిపించుకోడానికి బంగారువాకిలి దాటి గంటా మండపంలోనికి వేంచేస్తాడు ఈ మనవాళ పెరుమాళ్.

ఇక ఈ సహస్ర కలశాభిషేకంలో పాల్గొనే రెండవమూర్తి శ్రీ మలయప్పస్వామి. శ్రీదేవి భూదేవి సమేతంగావున్న ఉత్సవ శ్రీనివాసమూర్తినే మలయప్పస్వామి అంటారు. బంగారువాకిలి వెలుపలజరిగే కల్యాణోత్సవాదులు బ్రహ్మోత్సవాదులు మున్నగు అన్ని సేవల్లో ఉత్సవాల్లో తిరుమల పురవీధుల్లో ఊరేగుతూ భక్తులందరితో సన్నిహితంగా వుంటూ అందరినీ అలరిస్తూ, ఆనందింపజేస్తూవున్న స్వామి శ్రీ మలయప్పస్వామి.

శ్రీనివాసుని పై రెండు మూర్తులతో పాటు స్వామివారి సేనాధిపతి అయిన విష్వక్సేనుని పంచలోహమూర్తికి కూడ ఈ సహస్రకలశాభిషేకం నిర్వహింపబడుతుంది. ఇంతటి ప్రాధాన్యాన్ని సంతరించుకున్న సహస్రకలశాభిషేకం తిరుమలక్షేత్రంలో చాలా పూర్వంనుంచి జరుగుతున్నట్లు చరిత్ర, శాసనాలు స్పష్టం చేస్తున్నాయి.

క్రీస్తుశకం 1511లో శ్రీకృష్ణదేవరాయుల సైన్యాధికారి అప్పాపిళ్లై (ఉత్తరమేరూరు) సహస్ర కలశాభిషేకం జరిగేనాటి ఉదయంపూట శ్రీవేంకటేశ్వరస్వామివారికి ''అతిరసంపడి'' నివేదన చేయించాడట. క్రీస్తుశకం 1524 సంవత్సరంనాట ఏటా ఐదు సహస్ర కలశాభిషేకాలు జరిగేవని శ్రీవ్యాస రాయలకు సంబంధించిన శాసనం పేర్కొంటోంది. ఆ తర్వాత క్రీస్తుశకం 1562లో జరిగిన సహస్ర కలశాభిషేకంలో ఎత్తూరు తిరుమలైనంబి శ్రీనివాస అయ్యంగార్ అనుభక్తుడు శ్రీస్వామివారికి ఒక అతిరసంపడిని నివేదన చేశాడట.

ఇలా అత్యంత ప్రాచీనతను సంతరించుకున్న సహస్రకలశాభిషేకం ప్రతి బుధవారం బంగారువాకిలిముందుగల తిరుమామణి మండపంలోనేటికీ వైభవంగా జరుప బడుతున్నది.

ప్రతిరోజు మాదిరిగానే బుధవారం నాడు ఉదయం శ్రీ వేంకటేశ్వరస్వామి వారికి సుప్రభాతం, తోమాలసేవ, కొలువు - అర్చన మొదటిగంట నైవేద్యం జరుగుతాయి. ఆ తర్వాత

బంగారువాకిలి ముందు గంటా మండపంలో బంగారువాకిలికి దక్షిణంవైపు స్నానపీఠంపై ఉత్తరాభిముఖంగా బంగారు వాకిలికి ఉత్తరంవైపున శ్రీ మలయప్పస్వామి వారిని వేంచేపు చేస్తారు. పిదప బంగారు వాకిలికి ఉత్తరంవైపున శ్రీ మలయప్పస్వామికి అభిముఖంగా అంటే దక్షిణాభిముఖంగా స్నానపీఠంపై శ్రీ విష్వక్సేనులవారిని ఆసీనుల్ని చేస్తారు. ఇక వాకిలిముందర శ్రీ మలయప్పస్వామికి, శ్రీ విష్వక్సేనులకు మధ్య ఎదురుగా వున్న గరుడాళ్వారునకు అభిముఖంగా మరొక స్నానపీఠంపై శ్రీ భోగ శ్రీనివాసమూర్తిని వేంచేపు చేస్తారు. బంగారువాకిలిముందువున్న శ్రీ భోగ శ్రీనివాసమూర్తి విగ్రహాన్నీ, ఆనంద నిలయంలోని శ్రీస్వామివారి మూలమూర్తిని అనుసంధానిస్తూ పొడవైన, సన్నని బంగారుతీగతోకాని, పట్టుదారంతో కాని కడతారు. ఈ దారాన్ని (తీగను) '' సంబంధ కూర్చం'' అంటారు. అంటే భోగ శ్రీనివాసమూర్తికి జరిగే ఈసేవ సాక్షాత్తు మూలవిరాట్టునకు జరిగినట్లన్నమాట.

ఇక భోగశ్రీనివాసమూర్తికి ఎదురుగా, గరుడాళ్వారు మండపానికి మధ్యన నేలపై ధాన్యం (వడ్లు)పై 1 0 0 8 వెండి కలశాలను సుగంధ ద్రవ్యాలు కలిపిన జలంతో నింపి ప్రతిష్ఠిస్తారు.

భోగశ్రీనివాసమూర్తికి ఎడమ వైపున విష్వక్సేనులకు ప్రక్కన ఒకపీఠంపై ''నవ కలశాలను'' ఏర్పాటు చేస్తారు.

ఈ మండపంలోనే ఇలా ఏర్పాటైన ఉత్సవమూర్తులకు దగ్గరలో ఆగ్నేయదిశలో 'యజ్ఞవేదిక' ఏర్పాటు చేయబడుతుంది.

ఇలా అన్నీ సిద్ధంగా ఏర్పాటు చేయబడివున్న తరుణంలో ఈ సేవలో పాల్గొనే ఆర్జిత భక్తులను ప్రవేశింప చేస్తారు. ఈ సేవను తిలకించడానికి అనువుగా ఉత్సవమూర్తులకు రెండు వైపులా భక్తుల్ని ఆసీనుల్ని జేస్తారు. భజంత్రీలు ప్రారంభ మౌతాయి.

ముందుగా దీక్షాధారులైన ఋత్త్విక్కులు గంటానాదంచేసి హోమ గుండంలో అగ్నిప్రతిష్ఠాపన చేస్తారు. పిదప పుణ్యాహవాచనం చేస్తారు. అంటే కలశాన్ని ప్రతిష్ఠించి అందులో సమస్త నదుల పుణ్య తీర్థజలాలను ఆవాహనంచేసి ధూపదీప కర్పూర నీరాజనాలిచ్చి అక్షతారోపణం చేసినతర్వాత ఆ కలశంలోని పవిత్ర ఉదకాన్ని అన్నివైపులా చల్లుతారు. దీనితో పుణ్యాహవాచనం పూర్తవుతుంది.

**కంకణపూజ – కంకణధారణ**

ఋత్త్విక్కులు హోమవేదిక దగ్గర కంకణాలను (పసుపులో అద్దిన తోరాలు) ఒక చేటలో పీచువున్న కొబ్బరి కాయపై ప్రతిష్ఠించి కుంకుమాక్షతలతోను, ధూప దీప నీరాజనాలతో పూజిస్తారు.

పిదప దీక్షాధారియైన ప్రధాన అర్చకులు భోగశ్రీనివాసమూర్తి దగ్గరకెళ్లి భక్తితో పాదసేవ (పాదాలు తాకి నమస్కరించడం) చేస్తారు. తర్వాత, అర్ఘ్యపాద్యాచమనాది అనుష్ఠాన క్రియలు సలుపుతారు. పిదప తులసిని సమర్పించి, భోగ శ్రీనివాసమూర్తికి కంకణం కడతారు.

అలాగే వరుసగా శ్రీదేవి భూదేవి సహిత మలయప్పస్వామివారలకు ముగ్గురికి, విష్వక్సేనులవారికి, నవకలశాల్లోని ప్రధాన కలశానికి ఆచమనాది క్రియలైన తర్వాత కంకణాలను ధరింపచేస్తారు.

**హోమం**

ఆ తర్వాత తిథి వార నక్షత్ర సహితంగా సంకల్పం చెప్తూ హోమం చేస్తారు. ముక్కోటి దేవతలు, అష్టదిక్పాలుర నుద్దేశించి ఈ హోమం చెయ్యబడుతుంది.

**సంకల్పం**

సహస్రకలశాభిషేకంలో నిర్ణీత రుసుమును చెల్లించిన భక్తులచేత అర్చకులు వారివారి నక్షత్ర గోత్ర సహితంగా సంకల్పం చెప్పిస్తారు.

**సహస్రకలశపూజ**

అభిషేకంకోసం ధాన్యంపై ప్రతిష్ఠించిన సహస్ర కలశాలకు, పీఠంపై ప్రతిష్ఠించిన నవకలశాలకు ఆవాహనాది క్రియలుచేసి, ధూపదీప హారతు లిచ్చి పూజిస్తారు.

**నివేదన - హోమం**

ఈ సందర్భంలో హోమగుండం దగ్గర, అప్పాలు, శుద్ధాన్నం నివేదన చేస్తారు. తర్వాత ఈ అప్పాలతో, అన్నంతోను, నెయ్యితో హోమం చేస్తారు. చివరగా పూర్ణాహుతి జరుగుతుంది. ఆ తర్వాత హోమతిలకాన్ని భోగశ్రీనివాసమూర్తికి, శ్రీదేవి భూదేవి మలయప్పస్వామికి, విష్వక్సేనులకు నొసటన దిద్ధి, ఆతర్వాత భక్తులకు కూడ ఇస్తారు.

**సహస్రకలశ అభిషేక ప్రారంభం**

ముందుగా భోగమూర్తికి, శ్రీదేవి భూదేవి సమేత మలయప్పకు, విష్వక్సేనునికి తులసిని సమర్పించి, ధూపదీప హారతులిస్తారు. పిదప అభిషేకం ప్రారంభ మవుతుంది.

ఒకవైపు భజంత్రీలు మోగు తుంటాయి. మరోవైపు వేదపండితులు పురుషసూక్తం శ్రీసూక్తం, భూసూక్తం మున్నగు పంచసూక్తులు శ్రుతి మధురంగా పారాయణం చేస్తుండగా సహస్ర కలశాలలోని శుద్ధజలం, పాలు, పెరుగు, తేనె, పసుపు, చందనం మున్నగు ద్రవ్యాలలో భోగమూర్తికి, ఉత్సవమూర్తికి సేనాపతికి అభిషేకం జరుపబడుతుంది.

చివరగా అన్ని మూర్తులకు, తులసి మాలలు అలంకరించి, నవకలశాల్లోని జలంతో బంగారుపళ్లెంతో సహస్రధారాభిషేకం చేస్తారు. చివరగా నవకలశాలతో చేసే సహస్రధారాభిషేక జలాన్ని అర్చకులు ముందుగా తాము చల్లుకొని, అక్కడవున్న జియ్యంగార్, ఏకాంగి, భక్తులు అందరి మీదా''పూతోభవ'' అని చల్లుతారు. ఆ తరువాత శ్రీస్వామివారి మూర్తుల చుట్టూ తెరలువేసి, పట్టు వస్త్రాలలో పూలమాలలో అలంకరించి, క్షీరాన్నం, అప్పాలు, మున్నగువానిని నివేదనచేసిన తర్వాత తెరలుతీసి, అక్షతారోపణ (అక్షతలు) చేసి కర్పూర హారతి ఇస్తారు. పిదప ఈ సేవలో పాల్గొన్న భక్తులకు వస్త్ర బహుమానం జరిగినతర్వాత భోగ శ్రీనివాసమూర్తిని, దేవేరులతో కూడిన మలయప్పను, విష్వక్సేనులవారిని ఆనందనిలయంలోనికి వేంచేపు చేస్తారు. వెంటనే ఈ భక్తులు ఆనందనిలయంలోనికి వెళ్లి స్వామివారి మూలమూర్తిని దర్శించడానికి అనుమతిస్తారు.

ఆ తర్వాత వెంటనే మద్యాహ్నం జరిగే రెండవ అర్చన (అష్టోత్తర శతనామావళి) రెండవగంట (నివేదన) ఏకాంతంగా జరుపబడుతాయి. నైవేద్యం అయిన వెంటనే దేవేరులలో కూడిన మలయప్పస్వామి శ్రీపీఠాన్ని ఎక్కి కల్యాణోత్సవాలకై విమాన ప్రదక్షిణంగా తరలివెళ్తారు.

ప్రతి బుధవారం ఉదయంపూట ఒకగంటపాటు జరిగే ''సహస్ర కల శాబిషేకం''లో అర్జితరుసుము రు.5000/- లు చెల్లించి పాల్గొన్న గృహస్థుతోపాటు 6 మందికి అనుమతి లభిస్తుంది. వీరికి ప్రసాదంగా ఒక వస్త్రం 7 పెద్ద లడ్లు, 7 వడలు, 7 అప్పాలు, దోసెలు 5, దధ్యోదనం, పులిహోర, పొంగలి, చక్కెర పొంగలి, పాయసం ఇవ్వబడతాయి.

ప్రతి బుధవారం ఉదయం జరిగే కలశాబిషేకంలో పాల్గొనదలచిన భక్తులు రు.5000/-లు డిమాండుడ్రాఫ్టును, ఏ బాంకులోనైనా సరే '' ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు, తి.తి.దేవస్థానములు, తిరుపతి''వారిపేర తీసి, దానిని ''డిప్యూటి ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు, తిరుమల శ్రీవారి ఆలయం, తిరుమల-517 504'' వారికి 90 రోజులు ముందుగా పంపించి, కావలసిన తేదీ (బుధవారం)కి ఖాయపరచుకోవచ్చును. దీనిని ధ్రువపత్రం ద్వారా ముందుగానే గృహస్థుకు తెలుప బడుతుంది.

అయినా అప్పటికి, ఆతేదీకి వున్న అవకాశాన్నిబట్టి మాత్రమే వీలు కల్పించబడుతుంది.

ఉగాది, ఆణివార ఆస్థానం, పవిత్రోత్సవాలు, పుష్పయాగం, జ్యేష్ఠాబిషేకం, బ్రహ్మోత్సవాలువంటి విశేష ఉత్సవాలు కూడిన బుధవారాలలోమాత్రం సహస్ర కలశాభిషేకం జరుపబడదు.

సహస్రకలశాభిషేకంలో పాల్గొన దలచిన భక్తులను బుధవారం ఉదయం 5-30 గంటలకు వైకుంఠం క్యూ ద్వారా మాత్రమే ఆలయంలోనికి ప్రవేశింపజేస్తారు. ఈ సేవలో పాల్గొన దలచిన గృహస్థులు పంచ ఉత్తరీయం ధరించి రావలయును.

సహస్రకలశాభిషేకంలో పాల్గొని, ఒకవైపు భోగమూర్తిని, మరోవైపు దేవేరులతో కూడి వున్న మలయప్పస్వామివారిని ఇంకోవైపు స్వామివారి సేనాపతిని, ఇలా అందరినీ ఒక్కసారిగా సహస్రకలశాలతో అబిషేకాలు జరుగుతుండగా దర్శించడం, భక్తుల పూర్వజన్మసుకృతం! అంతేగాదు అభిషేకానంతరం బంగారువాకిలి లోనికి వెళ్లి మూలమూర్తి వారిని కన్నులారా దర్శించడం మరింత ఆనందించి అనుభవించదగిన అద్భుత ఘట్టము. అలాంటి యోగం ఎంతో పుణ్యం చేసినవారలకో గదా అబ్బుతుంది!

**గోవిందా! గోవిందా!! గోవింద!!!**



**సహస్రకలశాభిషేకం**

# 4. గురువారం నాటి సేవలు

తిరుమల క్షేత్రంలో ప్రతి ''గురువారం'' ఒక వైశిష్ట్యాన్ని ఒక ప్రాధాన్యాన్ని సంతరించుకుంది. ఈ క్షేత్రంలో ఈ రోజు కున్న విశిష్టత, ప్రత్యేకత ముఖ్యంగా శ్రీవారి దర్శనంలోనూ, శ్రీస్వామివారికి సమర్పించే నివేదన, అలంకారాలలోను కొట్టవచ్చినట్టు భక్తులకు కనపడుతుంది.

ప్రతి గురువారం ఉదయం రెండవ అర్చన అయిన తర్వాత శ్రీస్వామివారు ఎలాంటి ఆభరణాలు, అలంకారాలు లేకుండా ఆర్భాటం లేకుండా అతి నిరాడంబర స్వరూపంతో దర్శన మిస్తారు. కేవలం ఆభరణాలే కాకుండా నొసటన చాల సన్నని నామాన్ని (ఊర్ధ్వ పుండ్రాలు) కలిగి వుంటాడు. అందువల్లే ఏ నాడూ ఏ వేళలోను భక్తులకు కనపడని శ్రీవారి నేత్రాలు గురువారం నాడు మాత్రం రెండవ అర్చన మొదలు ఆ రోజంతా కన్పిస్తాయి. అందువల్లే గురువారం నాడు భక్తులందరికీ శ్రీవారి ''నేత్ర దర్శనం'' చేసుకొనే మహద్భాగ్యం కలుగుతుంది.

ఆ తర్వాత రెండవ నివేదనగా అనగా మధ్యాహ్నపు నివేదనగా ''తిరుప్పావడ సేవ'' అనబడే ప్రత్యేకమైన పులిహోర నివేదన పెద్ద ఎత్తున జరుగుతుంది.

ఇక ఆ రాత్రి తోమాలసేవ మూడవ అర్చన నివేదన అయిన తర్వాత శ్రీస్వామివారు ''పూలంగి సేవ''లో దర్శనమిస్తారు.

ఇలాగ గురువారంనాడు మాత్రమే తెల్లవారు జామున సర్వాభరణాలతోను, రెండవ అర్చన నివేదన అయిన తర్వాత ఎలాంటి ఆభరణాలూ, అలంకారాలు లేకుండా సన్నటి నామంతో నేత్ర దర్శనం తోను, ఆ రాత్రి కేవలం పుష్పాలంకరణతో అనగా నిలువెత్తు ''పూలంగి సేవ'' లోను మూడు రకాలుగా శ్రీస్వామివారు దివ్య దర్శన మిస్తారు. వాటిని గురించి వరుసగా విపులంగా తెలుసుకొందాం.

**గోవిందా! గోవిందా!! గోవింద!!!**

* * *

# శ్రీవారి నేత్ర దర్శనం

ప్రతి గురువారంనాడు ఉదయం యదా ప్రకారంగా సుప్రభాతం, తోమాలసేవ, కొలువు, మొదటి సహస్రనామార్చన, నైవేద్యం ఒకదాని తరువాత ఒకటి మామూలుగానే సాగుతాయి.

ఆ తర్వాత కిందటి శుక్రవారం అభిషేకానంతరం శ్రీ వేంకటేశ్వరస్వామివారి మూల విరాణ్మూర్తికి అలంకరించిన ఆభరణాలు, నగలూ అన్నీ తీయటం జరుగుతుంది. ఇలా నిలువెత్తుగా అలంకరింపబడిన ఆభరణాలు విడదీయటాన్ని సళ్లింపు (సడలింపు) అంటారు. ఆభరణాలతోపాటు శ్రీస్వామివారి నొసటిపై పెద్దగా వున్న పచ్చ కర్పూరపు నామాన్ని (ఊర్ధ్వ పుండ్రాలను) కూడా బాగా తగ్గించి వేయడంతో శ్రీస్వామివారి నేత్రాలు స్పష్టంగా భక్తులకు దర్శనమవుతాయి. అందువల్లే శ్రీస్వామివారి నేత్రాలను కర్పూరనామం అడ్డులేకుండా బాగా చూడగలిగే గురువారంనాటి దర్శనాన్ని ''నేత్ర దర్శనం'' అంటారు.

ఇలా ఆభరణాలు తీసివేసిన తర్వాత శ్రీస్వామివారి మూలమూర్తికి 24' x 4' కొలతలుగల పెద్ద సరిగంచు పట్టు ధోవతిని అతి సుందరంగా ధరింపజేస్తారు. 12' x 2' కొలతలుగల పట్టు ఉత్తరీయాన్ని యజ్ఞోపవీతం మాదిరిగా ఎడమ భుజం మీది నుంచి వేలాడునట్లుగా అలంకరిస్తారు. ఆ తర్వాత శ్రీస్వామివారి హస్తములకు బంగారు శంఖ చక్రాలను, వరదకటి హస్తాలను బంగారు కర్ణభూషణాలను, సువర్ణ సాలగ్రామ హారాలను అలంకరిస్తారు. శిరస్సుపై కిరీటాన్ని తీసివేసి ఒక పట్టు వస్త్రాన్ని కిరీటం మాదిరిగా తలపాగాను సొంపుగా చుడతారు. మెడలో వక్షః స్థల బంగారు అలమేల మంగహారం కూడ వుంటుంది. కాళ్లకు కడియాలు, పాదాలకు బంగారు తొడుగులు (కవచాలు) అలంకరిస్తారు.

ప్రతి గురువారంనాడు జరిగే 'నేత్ర దర్శనోత్సవం' లో శ్రీ వేంకటేశ్వరస్వామి వారు (మూలవిరాట్టు) ఎలాంటి ఆభరణాలు లేకుండా కేవలం దోవతితో, పై వల్లెవాటుతో, మెడలో రెండు కంటెలతో, నొసటన సన్నని నామంతో, బుగ్గన పచ్చ కప్పురపు చుక్కతో, తలకు చుట్టూ సొగసుగా చుట్టబడిన తల గుడ్డ (పరివీటం, పరివేష్ఠనం) తో, నిగ నిగలాడుతూ వున్న నల్లనైన మేనితో చిరు నవ్వులు

చిందిస్తూ సాక్షాత్తు ద్వాపరయుగంనాటి నల్లని కృష్ణయ్యే ఈ వేంకటాద్రి గోవిందుడేమోనన్న ఆశ్చర్యాన్ని ఆనందాన్ని ఒక తన్మయత్వాన్నీ, ఒక మైమరపునూ కలిగిస్తూ భక్తులకు దర్శన మిస్తాడు స్వామి. అందుకనే ప్రతి గురువారంనాటి తిరుమల గోవిందుని నేత్ర దర్శనోత్సవాన్ని ''గోపాలుని వేషం'' అనీ, ద్వాపరంయుగంనాటి 'గొల్లని వేషం' అనీ అనుకుంటూ భక్తులు సాక్షాత్తు శ్రీ కృష్ణ దర్శనమయ్యిందని మురిసిపోతూ వుంటారు. అంతమాత్రమే కాదు ఈ గురువారంనాడు కొందరికి ''ఖబడ్దార్'' అని హెచ్చరిస్తూ కోపంగా కనిపించి భయపెడతాడు. తాము చేసిన తప్పుల్ని సరిదిద్దుకోమన్నట్లుగా హెచ్చరించినట్లుగా గోచరిస్తాడు. మరి కొందరికి చిన్నబాలునిగా, ఆనందంగా నవ్వుతూ కేరింతలుకొడుతూ వున్నట్లుగా ఆశ్చర్యాన్నీ, ఆనందాన్నీ కలిగిస్తాడు. మీ మీ కోరికలన్నింటినీ తీరుస్తూ గొప్పదాతగా మీ కివ్వడమేగాక, మీరిచ్చే కొద్దిపాటి దానంతోపాటు మీ మీ పాపాలను కూడా అణచే వామనుణ్ణి నేనే నంటూ ప్రతి గురువారంనాటి నేత్ర దర్శనోత్సవంలో చాలా పొట్టివాడుగా అత్యంత గట్టివాడుగా దర్శనమిస్తూ అందరికీ అందుబాటులో వుంటూ ఆనందింపజేస్తాడు ఆనంద నిలయుడు. శ్రీవారి నేత్రదర్శనాన్ని ప్రతిగురువారం ఉదయం 9-00 గంటల నుండి సాయంత్రం 6-00 గంటలవరకు భక్తులు దర్శించవచ్చు. అయితే ఉగాది, ఆణివర ఆస్థానం వంటి విశేషగురువారాలలో మాత్రం నేత్రదర్శనం వుండదు. శ్రీస్వామివారు విశేషపర్వదినాల్లో సర్వాభరణాలు, పుష్పహారాలతో అందంగా అలంకరించుకొని దర్శనమిస్తారు.

* * *

## తిరుప్పావడ సేవ

ఇలాగ శ్రీస్వామివారి మూలమూర్తికి ఆభరణాలు, నామాలను సడలించిన తర్వాత మధ్యాహ్న సమయపు ఆరాధన ప్రారంభ మవుతుంది. రెండవ అర్చన వరాహపురాణాంతర్గత అష్టోత్తర శత నామాలతో శ్రీస్వామివారి పాదాలకు తులసి దళాలతో--

ఓం శ్రీ వేంకటేశాయ నమః శ్రీ వేంకటేశాయ నమః

ఓం శేషాద్రి నిలయాయ శ్రీ వేంకటేశాయ నమః

................

అని అర్చన జరుగుతుంది. పిదప శ్రీ స్వామివారి వక్షః స్థల లక్ష్మిని--

ఓం శ్రియై నమః
ఓం లోకధాత్ర్యై నమః
ఓం బ్రహ్మమాత్రే నమః.

అంటూ వరాహపురాణాంతర్గత శ్రీ మహాలక్ష్మి చతుర్వింశతి (24) నామాలతో అర్చిస్తారు. ఆ తర్వాత రెండవ నివేదన (రెండవ గంట) ప్రారంభమవుతుంది.

తిరుమలలో శ్రీ వేంకటేశ్వరస్వామి వారికి ప్రతి గురువారం రెండవ అర్చన జరిగిన తర్వాత చేయబడే నివేదనోత్సవాన్ని ''తిరుప్పావడసేవ'' అనీ, అన్న కూటోత్సవ మని అంటారు. ఆనందనిలయంలోని శ్రీ వేంకటేశ్వరునకు బంగారువాకిలి వద్దనుండి నేరుగా సమర్పించే అన్న నివేదన ఇది. అనగా బంగారు వాకిళ్ల ముందర మండపంలో నిర్వహింపబడే సేవ ''తిరుప్పావడ సేవ''

చాల పూర్వం నుంచీ తిరుమల పుణ్య క్షేత్రంలో జరుప బడుతున్న ''తిరుప్పావడ సేవ'' ప్రధానంగా తిరుమల యాత్రికుల ఆకలిని తీర్చడానికి దాతలద్వారా ప్రవేశపెట్ట బడిందని తలంప బడుతున్నది. అనగా ఈ సేవలో పెద్ద ఎత్తున ''పులిహోర'' అన్నం శ్రీస్వామివారికి నివేదింప బడిన తర్వాత యాత్రికులకు వితరణ చేయబడుతుంది.

చాలాకాలం నుంచీ ఈ సేవ ఆర్జిత సేవగా నిర్వహింప బడుతున్నది.

'తిరుప్పావడసేవ' కు గాను నిర్ణీత రుసుమును చెల్లించి అనుమతి పొందిన భక్తులను వైకుంఠం క్యూ ద్వారా ఉదయం 5-30 గంటల సమయంలో ఆలయంలోనికి ప్రవేశ పెడతారు. వీరినందరినీ బంగారు వాకిలి ముందర నడుమవున్న స్తంభాలకు ఇరు వైపులా కూర్చొన బెడతారు.

శ్రీస్వామివారికి ఎదురుగా బంగారు వాకిలి ముందు గరుత్మంతునికి ఎదురుగా నాలుగు స్తంభాల మధ్య నేలపై వెదురు చాపలపై సుమారు 6 బస్తాల బియ్యం (450 కిలోలు) తో తయారు చేయబడిన పులిహోరను 'రాశి' గా పోస్తారు. స్తంభాలకు చుట్టూ తెరలు గట్టి ఈ 'రాశి' ని ఒక పెద్ద శిఖరం లాగా దానికి చుట్టూ

ఎనిమిది దిక్కులా చిన్న శిఖరాలుగాను తీర్చి దిద్దుతారు. ఇలా తీర్చి దిద్దిన 'పులిహోర రాశి' ఇంచు మించుగా 'ఆనంద నిలయ విమానాన్ని' పోలి వుంటుంది.

ఇలా శ్రీ వేంకటేశ్వరస్వామివారికి ఎదురుగా బంగారు వాకిలి ముందు తెరలమాటున ఏర్పాటుచేసిన ఈ పులిహోర రాశిని, పూలహారాలతో అలంకరిస్తారు. ఈ రాశి ముందు దీపపు సెమ్మెలను (జ్యోతులను) వెలిగిస్తారు. ధూపం వేస్తారు. ఇలా శోభాయ మానంగా తీర్చిదిద్దిన ఈ అన్నపు రాశిని తులసితో అర్చించి టెంకాయ కొట్టి పండ్లు, తాంబూలాన్ని సమర్పించి, దూప దీప కర్పూరంతో పూజిస్తారు. ఆ తర్వాత ఈ అన్నపురాశిని బంగారు వాకిలినుండే లోపలవున్న శ్రీవారి మూలమూర్తికి నివేదిస్తారు. ఇవేగాక తిరుప్పావడసేవ జరిగే సమయంలో విశేషంగా జిలేబి, తేనెతొళ (మురుకు) దోసె, అప్పం, పాయసం, లడ్లు, వడలు మున్నగు ప్రసాదాలు అన్నీ కులశేఖరపడి గడపకు ఇవతల శ్రీస్వామివారి చూపు పడేట్లుగా ఏర్పాటు చేసి వుంటారు. ఇలా బంగారు వాకిలివద్ద పులిహోర రాశిని, లోపల అమర్చివున్న ప్రసాదాలు బంగారు వాకిలి వద్దనున్న పెద్ద నైవేద్య ఘంటలను మోగిస్తుండగా వైఖానస అర్చక శిఖామణులు శ్రీస్వామి వారికి నివేదిస్తారు.

ఈ ప్రసాదాల ఏర్పాటు, అన్నపు రాసి రూపకల్పన, నివేదన అన్నీ తెరలమాటున స్తంభాలమధ్య ఏకాంతంగా అర్చకస్వాములు నిర్వహిస్తారు. ఆ తర్వాత ఇటు అన్నపురాసికి, అటు లోపల శ్రీస్వామివారికి బంగారు వాకిలి వద్దనుండే ఘనంగా మంగళహారతి సమర్పింపబడు తుండగా ఇరువైపుల కట్టిన తెరలను తొలగిస్తారు.

పిదప ముందుగానే అక్కడికి వచ్చి కూర్చున్న ఆర్జిత గృహస్థుల చేత బంగారు వాకిలిముందు శ్రీస్వామివారికి, పులిహోర రాశికి మధ్యలో అర్చకులు సంకల్పం చెప్పిస్తారు. ఇలా భక్తులందరిచేత సంకల్పం పూర్తి అయిన తరువాత వేద పండితులు వేద పారాయణంతోపాటు శ్రీనివాస గద్యను ఇలా పఠిస్తారు.

''శ్రీ మదఖిల మహీమండల మండనధరణి ధర మండలా ఖండలస్య.'' నిఖిల సురాసుర వందిత వరాహక్షేత్ర విభూషణస్య, శేషాచల గరుడాచల సింహాచల

వృషభాచల నారాయణాచలాంజనాచలాది శిఖరిమాలాకులస్య. నాథముఖ బోధనిధి వీధి గుణసాభరణ సత్త్వనిధి తత్త్వనిధి భక్తిగుణ పూర్ణ శ్రీశైలపూర్ణ గుణ వశంవద పరమ పురుష కృపాపూర విభ్రమదతుంగ శృంగ గళద్గగన గంగాసమా లింగితస్య, సీమాతి గుణ రామానుజ ముని నామాంకిత బహు భూమాశ్రయసుర ధామాలయ వనరామాయత వనసీమాపరివృత విశంకట తట నిరంతర విజృంభిత భక్తి రస నిర్భరానంతార్యాహార్య ప్రస్రవణ ధారాపూర విభ్రమద సలిల భరభరిత మహా తటాక మండితస్య.

ఇలా శ్రీనివాసగద్య పఠనం పూర్తి అయిన తర్వాత అర్చకులు బంగారు వాకిలి ముందునుండే ఆనందనిలయంలో నేత్ర దర్శనంతో వింత వింతలుగా దర్శనమిస్తూ వున్న శ్రీ వేంకటేశ్వర స్వామివారి మూల వరులకూ, అదే హారతిని ఇటు పులిహోర రాశికిని ఇస్తారు. పిదప ఆ హారతిని ఆర్జిత భక్తులందరికీ చూపిస్తారు. ఆ తర్వాత గృహస్థులకు వస్త్ర బహుమానం చేయబడుతుంది. పిదప పులిహోరరాశిని ప్రసాదవితరణకు తరలించి ఆ స్థలాన్ని శుద్ధి చేసిన తర్వాత భక్తులను ఆనందనిలయంలోని శ్రీవారి దర్శనానికి అనుమతిస్తారు.

ఇటీవలికాలంలో శ్రీవారి దర్శనానికి వేచివుండే భక్తజన సమ్మర్దం పెరుగుతున్న దృష్ట్యా తిరుప్పావడసేవ జరిగిన వెంటనే ఆలస్యం జరగకుండా ఉండేందుకైనేలపై కాకుండా ఒక వెండి పీఠంపై తిరుప్పావడ పులిహోరరాశి ఏర్పాటు చేయబడుతున్నది. తిరుప్పావడసేవ అయిన వెంటనే ప్రసాదంతో పాటు ఆ పీఠాన్ని తొలగించి భక్తులను దర్శనానికి అనుమతించడం జరుగు తున్నది.

ఆ తర్వాత తిరుప్పావడసేవలో పాల్గొన్న భక్తులు శ్రీస్వామివారి దర్శనంతో పాటు తీర్థ శఠారుల్ని స్వీకరించి ఆనంద నిలయ విమాన ప్రదక్షిణం చేస్తూ, విమాన వేంకటేశ్వరుని కన్నులారా దర్శించి, హుండీలో కానుకల నర్పించి సేనాపతి భాష్యకారులను యోగనరసింహుని సేవించి ఒక దివ్యాను భూతితో బయలుదేరుతారు.

ప్రతి గురువారం ఉదయం 6 గంటలకు బంగారువాకిలి ముందు శ్రీస్వామివారి మూలమూర్తికి జరుపబడే వారోత్సవమ్మైన ''తిరుప్పావడసేవ'' లో రు.5,000/- లు ఆర్జిత రుసుముగా చెల్లించిన పాల్గొన్న గృహస్థుతోపాటు మొత్తం

6 మందిని అనుమతిస్తారు. గృహస్థునకు వస్త్ర బహుమానంతోపాటు 5 పెద్ద లడ్లు, 5 వడలు, 5 అప్పాలు, 5 దోసెలు, 5 జిలేబిలు, 5 తేనెతొళలు (మురుకులు) పులిహోర, పాయసం ప్రసాదంగా ఇవ్వబడుతవి.

**ఎలా పాల్గొనాలి?**

గురువారంనాడు ఉదయం జరిగే ''తిరుప్పావడ సేవ'' లో పాల్గొన దలచిన భక్తులు రు.5,000/- (ప్రస్తుత రుసుము) ల డిమాండు డ్రాఫ్టును ఏ బ్యాంకులోనైనా సరే ''ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు, తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి'' వారి పేర తీసి, దానిని కావలసిన గురువారంనాటికి 90 రోజులు ముందుగా ''డిప్యూటి ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు, శ్రీవారి ఆలయం, తిరుమల-- 517 504'' వారికి పంపించి స్థిరపరచుకోవచ్చును. అయినా అప్పటికి వున్న అవకాశాన్ని బట్టి మాత్రమే వీలు కల్పించబడుతుంది.

ఈ సేవలో పాల్గొనదలచిన గృహస్థు పంచ, ఉత్తరీయం తప్పక ధరించవలయును.

''తిరుప్పావడ సేవ'' ఆర్జిత భక్తులు శ్రీవారి దర్శనం చేసికొని బయటికి రాగానే సర్వదర్శనం ప్రారంభమగును. ఈ సర్వ దర్శనం ఉదయం నుంచి మళ్లీ రాత్రి 8 గంటలవరకు అనగా ఆ రాత్రి జరిగే పూలంగి తోమాలసేవవరకు నేత్ర దర్శనంతో శ్రీస్వామివారు భక్తులను ఆనందింపజేసి మైమరపిస్తారు. ఇక ఆ తర్వాత అంటే ఆ రాత్రి శ్రీవారికి ''పూలంగి సేవ'' జరుగుతుంది. ప్రతి గురువారం రాత్రి 8 గంటల తర్వాత దర్శనానికి వెళ్లే భక్తులకందరికీ పూలంగిసేవలో వున్న శ్రీస్వామివారి దర్శనం కలుగుతుంది. ఆ వివరాలను తరువాత తెలుసుకుందాం.

**గోవిందా! గోవిందా!! గోవింద!!!**

* * *

## పూలంగి సేవ

ప్రతి గురువారం సాయంత్రం శ్రీ స్వామివారికి జరుపబడే తోమాలసేవనే పూలంగి సేవ అంటారు. ప్రతి రోజు సాయంకాలంలో జరిగే తోమాలసేవలో పూల మాలల అలంకరణ కొదిగా మాత్రమే వుంటుంది. కాని గురువారం జరిగే తోమాల

సేవలో పూలవూల అలంకరణ ఎక్కువగా వుంటుంది. అయితే ప్రతి సాయంత్రంపూట జరిగే ''తోమాలసేవ'' ఏకాంతంగా మాత్రమే జరుపబడుతుంది. పూలమాలల్ని అంగీ (వస్త్రం) లాగా ధరింపజేస్తారు. కనుక 'పూలంగి సేవ' అంటారు.

గురువారం సాయంత్రం 6 గంటలకు ఆలయాన్ని శుద్ధి చేస్తారు. సాయంకాల పూజకు గాను అర్చకులు శుచిస్నాతులై తిరుమాళిగ (ఇంటి సన్నిధి నుండి) గొల్ల వెంట రాగా బయలుదేరి ఆలయంలోని శ్రీవారి సన్నిధిని చేరుకుంటారు.

పిదప జియ్యంగార్లు, ఏకాంగి ''యమునోత్తై'' అను 'పూలఅర' కు వెళ్లి అప్పటికి సిద్ధంగా పూలను, మాలలుగా కట్టి ఉంచబడిన రెండు పెద్ద వెదురు బుట్టలను (పోత్తం) తమ తలపై నిడికొని బాజా భజంత్రీలతో, ఛత్రచామర మర్యాదలతో, పలక గంట మ్రోగిస్తుండగా దివిటీలతో బయలుదేరి, ధ్వజస్తంభ ప్రదక్షిణంగాలోనికి వచ్చి, విమాన ప్రదక్షిణం చేస్తూ, చివరకు బంగారు వాకిలి దగ్గర వాద్యాలు అన్నీ మోగింపబడుతుండగా శ్రీవారి సన్నిధిలో వాటిని సమర్పిస్తారు.

ఇంతలో అర్చకులు శ్రీస్వామివారికి అలంకరింపబడివున్న కొద్దిపాటి స్వర్ణాభరణాలు కూడా తీసివేస్తారు. పిదప బంగారు తీగెలతో కూడివున్న ఒక ముఖమల్ గౌను శ్రీస్వామివారికి ధరింపజేస్తారు. శిరస్సుపై కిరీటం కూడ తీసివేసి, ఒక పట్టు వస్త్రాన్ని కిరీటంలాగా చుట్టుతారు. జియ్యంగార్లు నిలువబడి పట్టు విసనకర్రతో (ఆలవట్టం) శ్రీస్వామివారికి విసరుతూ సేవ చేస్తుండగా అర్చకులు శ్రీస్వామివారికి అర్ఘ్య పాద్యా చమనాది ఉపచారాలు సమర్పించి పూలంగి తోమాలను ప్రారంభిస్తుండగా కులశేఖరపడికి తెరలువేస్తారు. లోపల స్వామివారికి ''పూలంగి సమర్పణ'' జరుగుతుండగా పిదప జియ్యంగార్లు బయటికి వచ్చి స్నపన మండపంలో ఆసీనులై దివ్యప్రబంధాన్ని గానం చేస్తారు. ఈ ప్రబంధ పారాయణంలో వైష్ణవాచార్యులు, ఆచార్య పురుషులు కూడ పాలుపంచుకొంటారు.

ఇలా స్నపన మండపంలో దివ్య ప్రబంధ పారాయణ సాగుతుండగా బంగారు వాకిలి ముందు మంగళ వాయిద్యాలు మోగుతుండగా కులశేఖరపడికి తెరలు వేసి లోపల అర్చకులు ఏకాంతంగా పుష్పమాలాలం కరణ చేస్తుంటారు.

ఈ అలంకరణలో అర్చకులు చిత్ర విచిత్రమైన ఎంతో వింత సొగసులతో సొంపుగా కట్టిన రంగు రంగుల పూలమాలల్ని కిరీటంగా, శంఖు చక్రాలుగా, నాగాభరణంగా, వస్త్రంగా, పైవల్లెవాటుగా, ఆభరణాలుగా, పైనుంచి కింది వరకు, ఆపాదమస్తకం అలంకరిస్తారు. ఈ పుష్పాలంకరణలో శ్రీ వేంకటేశ్వరస్వామివారు పూలఅంగీని ధరించినట్లుగా నయనానందకరంగా దర్శనమిస్తారు. అందువల్లే 'పూలంగిసేవ' అని అంటున్నారు. ఆ తర్వాత 'సూర్య కఠారి' ఖడ్గాన్ని శ్రీస్వామి ఎడమచేతిలో ధరించినట్లుగా అలంకరిస్తారు. ఈ పూలంగిసేవ అలంకారం పూర్తి అయిన వెంటనే అర్చకులు స్వామికి కర్పూర హారతి ఇస్తూవుండగా తెరలు తీస్తారు. ఇంతలో దివ్యప్రబంధ పారాయణ చేస్తూ వున్న జియ్యంగార్లు, అధ్యాపకులు, వైష్ణవాచార్యులు కులశేఖరపడివద్దకు వెళ్లి, గానాన్ని పూర్తి చేస్తారు. గానం పూర్తి అయిన వెంటనే మళ్లీ కర్పూరహారతి ఇస్తారు. ఆ తర్వాత వేద పండితులు శ్రీస్వామివారికి 'మంత్ర పుష్పం' సమర్పిస్తారు. మళ్లీ కర్పూర హారతి ఇవ్వడం జరుగుతుంది.

ఆ తర్వాత యథాప్రకారంగా శ్రీస్వామి వారికి అష్టోత్తర శతనామార్చన జరిగిన తర్వాత వక్షః స్థల లక్ష్మికి కూడ 24 నామాలతో అర్చన జరిగిన తర్వాత రాత్రి నైవేద్యం జరుగుతుంది.

రాత్రి నివేదన అయిన వెంటనే ''పూలంగి సేవ'' సర్వ దర్శనం జరుగుతుంది.

గురువారంనాడు కళ్లు తెరచి (నేత్ర దర్శనం) ఖడ్గాన్ని ధరించి రౌద్రంగా వుంటాడనీ, ఆ రౌద్రాన్ని తగ్గించి శాంతింప చేయడానికే ఆ స్వామివారికి నిలువెత్తుగా పుష్పాలంకరణ పూలంగి సమర్పణ జరుగుతున్నదని పెద్దలమాట! పూర్వం గురువారంనాటి శ్రీస్వామివారి రౌద్ర స్వరూపాన్ని తీవ్రతను తగ్గించడానికే వ్యాసరాయలవారు పూలంగిసేవను ప్రవేశ పెట్టినట్లుకూడా అనుచానంగా వినవస్తున్న మాట. ఈ వ్యాసరాయలవారు శ్రీస్వామివారిని 12 ఏండ్లపాటు అర్చించినారని కూడ ప్రసిద్ధి.

ప్రతి గురువారం రాత్రి 8 గంటల నుండి ఏకాంతసేవ వరకు కూడ భక్తులు శ్రీవారి పూలంగి అలంకారాన్ని ఏలాంటి ఆర్జితం టికెట్టు లేకుండా అందరూ దర్శింపవచ్చును.

పుష్పప్రియుడైన శ్రీ వేంకటేశుని ''పూలంగి'' ని దర్శించిన భక్తులు పులకితగాత్రులై పరవశిస్తుంటారు. తమ కన్నులచూపులను పుష్పాలుగా శ్రీస్వామి వారిని ఆపాదమస్తకం అలంకరించి తమ జన్మ ధన్యమైందని తలుస్తూ తిరిగి తిరిగి చూస్తూ వెనుదిరిగి విమాన వేంకటేశ్వరుని దర్శనం చేస్తూ హుండీలో మొక్కులు చెల్లించి అవ్యక్తానందాన్ని పొందుతారు.

**గోవిందా ! గోవిందా!! గోవిందా!!!**

సర్వాభరణాలతోను, మధ్యాహ్నం అతి కొద్ది ఆభరణాలతో సన్నని నామంతో నేత్ర దర్శనోత్సవంలోను, ఇక ఆ రాత్రి నిలువెత్తు పూలంగితోను శ్రీ వేంకటేశ్వరస్వామివారు వివిధ అలంకారాల్లో దర్శనస్తారు.

ఇక ఆ నాటి రాత్రి ఏకాంతసేవలో శ్రీ స్వామివారికి అలంకరించిన పూలంగిని కూడా పూర్తిగా తొలగిస్తారు. ఏకాంతసేవ పూర్తి చేసిన తర్వాత ఆలయాన్ని మూసి వేస్తారు. ఇక ఆ మరునాడు శుక్రవారం సుప్రభాతానంతరం జరిగే శుక్రవారాభిషేకాన్ని గూర్చి వివరంగా తెలుసుకుందాం.

**గోవిందా ! గోవిందా!! గోవిందా!!!**

* * *

# 5. శుక్రవారాభిషేకం

ప్రతి శుక్రవారం ఉదయం శ్రీ వేంకటేశ్వరస్వామివారికి జరిగే విశేష సేవ 'అభిషేకం'. ఈ అభిషేకం శ్రీ వైకుంఠంనుండి వక్షఃస్థల లక్ష్మితోకూడ స్వయంభువుగా వెలసిన శ్రీస్వామివారి మూలమూర్తికి జరుప బడుతుంది. ఎలాంటి ఆభరణాలుగానీ, అలంకరణలుగానీ లేకుండ శ్రీస్వామివారి మూలవిరాట్టు దివ్యమంగళ విగ్రహసౌందర్యాన్ని సుమారు ఒక గంట సేపు దర్శింపవీలు కలిగే ఈ శుక్రవారాభిషేకోత్సవం అనేక మంది భక్తులను విశేషంగా ఆకర్షిస్తోంది.

ప్రతి శుక్రవారంనాడు విశేషోత్సవంగా జరుపబడే ఈ అభిషేకం తిరుమలలో ప్రాచీన కాలంనుండే ప్రారంభింపబడిందని తెలుస్తోంది. క్రీస్తు శకం 614 లో పల్లవరాణి 'సామవై' (పేరిందేవి) తిరుమల ఆలయానికి "భోగ శ్రీనివాసమూర్తి" వెండి విగ్రహాన్ని సమర్పించిన రోజు శుక్రవారం అయినందువల్ల ఈ భోగమూర్తితోపాటు అటు మూలమూర్తికి అభిషేకం జరుపబడిందట! అప్పటినుంచి శుక్రవారాలు కలిసి వచ్చిన విశిష్టపర్వదినాల్లో అభిషేకాలు జరుగుతూ వుండేవి. కాల క్రమేణ పదహైదు రోజుల కొకసారి శుక్రవారంనాడు అభిషేకం జరుపబడేది. రాను రాను విజయనగరరాజుల కాలంలో ప్రతి శుక్రవారం అభిషేకం జరగడానికి ఏర్పాటయింది.

మరో విషయం, భగవద్రామానుజుల వారు క్రీస్తు శకం 11 వ శతాబ్దంలో శ్రీస్వామి వారి వక్షఃస్థలంలో అలంకారంగా ఉండేట్లు "బంగారు అలమేలుమంగ" ను సమర్పించిన రోజు కూడా శుక్రవారమే అయినందున ఆనాడు అభిషేకాలు ఘనంగా జరిగాయి. ఆనాటి నుండి శుక్రవారంనాడు మూలమూర్తికి అభిషేకం అయిన అనంతరం బంగారు అలమేలు మంగతాయారుకు కూడ ప్రత్యేకంగా అభిషేకం జరుపబడునటుల నిర్ణయించడం చేత, తిరుమల దేవాలయంలోని పూజా కార్యక్రమాలలో ఈ శుక్రవారాభిషేకం ఒక విశిష్టతను సంతరించు కొన్నదని చెప్పవచ్చు.

ప్రతిరోజు మాదిరే, శుక్రవారంనాడు తెల్లవారుజామున 'సుప్రభాతం' జరుగు తుంది. ఈ సుప్రభాతసేవకు అర్జిత భక్తుల్ని అనుమతిస్తారు. ఆ తర్వాత

కొలువు, అర్చన (అష్టోత్తరం) ఏకాంతంగా నిర్వహిస్తారు. అటు పిమ్మట మొదటి గంట, నైవేద్యం జరుగుతుంది. నివేదన అయినవెంటనే అభిషేకానికి సిద్ధం చేస్తారు.

**అభిషేకానికి సిద్ధం**

తెల్లవారు జామున సుమారు నాలుగు గంటల వేళ పవిత్ర బ్రాహ్మ ముహూర్తంలో అర్చకస్వామి తొలుత శ్రీస్వామివారికి పాద నమస్కారం చేసి, అభిషేకానికి అనుమతి నివ్వమని ప్రార్థించి, సంకల్పం చేస్తారు. పిదప శ్రీస్వామివారికి అష్టోత్తర శతనామార్చన చేస్తారు. ఆ తర్వాత స్వామివారి నొసటన వున్న సన్నని పచ్చకర్పూరపు నామాన్ని బాగా తగ్గించి సూక్ష్మంగా నామ మాత్రంగా ఉంచుతారు. ఆభరణాలన్నిటిని, పట్టువస్త్రాలను తీసివేస్తారు. స్నాన వస్త్రంగా తెల్లని కౌపీనాన్ని (గోణాన్ని) ధరింపజేసి దంత ధావన అర్ఘ్య పాద్యాచమనాది ఉపచారాలు సమర్పించి తిరు వేంకటేశునకు శిరసాదిగా పునుగు తైలాన్ని అలది అభిషేకానికి సిద్ధమై వుంటారు.

ఇంతలో పరిచారకులు రెండు పెద్ద వెండి గంగాళాల్లో బంగారు బావి జలాన్ని నింపి సిద్ధంగా వుంచుతారు.

**పరిమళంతో జియ్యంగార్లు**

ఇంతలో జియ్యంగార్లు, ఏకాంగి, అధికారులు ఆచార్య పురుషులు, వేద పండితులు, ఆర్జిత సేవా పరాయణులగు భక్తులు విమాన ప్రదక్షిణంలో శ్రీ యోగ నరసింహస్వామి ఆలయం ప్రక్కన గల 'పరిమళం అర' దగ్గరకు చేరుకుంటారు.

అప్పటికే పరిమళ అరలో సిద్ధంచేసి వుంచిన శ్రీస్వామివారి నామానికి ఉపయోగించే పచ్చ కర్పూరం, కస్తూరివున్న వెండి గిన్నెను జియ్యంగారు, కుంకుమ పువ్వును కలిపిన నలుగు బిళ్లలు, చందనం బిళ్లలు వున్న వెండి గిన్నెను దేవస్థానం అధికారులు; పట్టు వస్త్రాలను సమర్పింపదలచిన భక్తుడు ఆ వస్త్రాలు ఉంచిన వెండిపళ్లేన్ని; ఆయా ఆర్జిత భక్తులు తాము చెల్లించిన రుసుమును బట్టి గంబూరా (పచ్చ కర్పూరం) గిన్నె, పునుగు గిన్నె, కస్తూరి గిన్నె....... ఇలా ఆయా గిన్నెలను స్వీకరిస్తారు. మంగళవాద్యాలు మ్రోగుతూ వుండగా అందరూ పరిమళం గిన్నెలతో, ఛత్ర చామర మర్యాదలతో వేద పండితులు శ్రుతి సుభగంగా పారాయణం చేస్తూ వుండగా శ్రీ స్వామివారికి ''పరిమళం'' తీసికొనివెళ్లే ఉత్సవం ప్రారంభమవుతుంది.

వీరంతా వెండి వాకిలి ముందర ఉన్న ధ్వజ స్తంభానికి ప్రదక్షిణంగా వచ్చి, తర్వాత విమాన ప్రదక్షిణం చేస్తూ వచ్చి శ్రీవారి సన్నిధి చేరుకొంటారు.

జియ్యంగార్లు, ఏకాంగులు మాత్రం కులశేఖరపడి దాటి గర్భాలయంలోనికి వెళ్లుతారు. మిగిలిన అధికారులు భక్తులు తమ గిన్నెలను అర్చకులకు అందించి కులశేఖరపడి (గర్భాలయం గడప) నుండి బంగారు వాకిలి దాటి గరుడాళ్వారువరకు వరుసగా మధ్యలో దారి వదలి పురుషులు ఒకవైపు, స్త్రీలు ఒకవైపు ఒకరి వెనుక మరొకరు బారులుగా కూర్చుంటారు.

**అభిషేక ప్రారంభం**

అర్చక వరుడు వేదమంత్రోచ్చారణ చేసే సమయాన శ్రీస్వామివారివైపు తన శ్వాస పొరకుండా, నోటి తుంపురులు పడకుండా ఒకపట్టు సెల్లాను తలకు, నోటికి, ముక్కుకు (ఉష్ణీషం) అడ్డంగా రమణీయంగా చుట్టుకొని శ్రీ శ్రీనివాస స్వామివారి పాదాలకు నమస్కరించి వక్షః స్థల లక్ష్మీదేవి అమ్మవారికి నమస్కరించి అభిషేకానికి అనుమతి నిమ్మని ప్రార్థించి, అభిషేకం చేయటానికి అనువై ఎత్తుగా వున్న పీఠాన్ని ఎక్కి (భక్తులకు ఇబ్బంది లేకుండా) శ్రీవారి వైకుంఠ (వరద) హస్తం దగ్గర నిలుస్తారు.

అలనాడు ఆ శ్రియఃపతి కైంకర్యంలో సేవలందించే భాగ్యాన్ని పొందిన భగవద్రామానుజులవారికి ప్రతినిధిగా శ్రీమాన్ పెద్దజియ్యంగార్, అర్చకస్వామివలెనే నోటికి, ముక్కుకు పట్టు వస్త్రాన్ని చుట్టుకొని శ్రీస్వామివారి మూలమూర్తి విగ్రహం ఎదుట ఒకవారకు నిలిచి వుంటారు.

**ఆకాశగంగాతీర్థం**

తొలుత జియ్యంగారు భక్తి ప్రపత్తులతో బంగారు శంఖంతో ఆకాశ గంగా తీర్థాన్ని అర్చకులకు అందిస్తారు. అర్చకులు ఆ బంగారు శంఖంలోని ఆకాశ గంగా తీర్థాన్ని శ్రీస్వామివారి శిరస్సుపై పోస్తూ, ''హరిః ఓం సహస్ర శీర్షా పురుషః'' అని పురుషసూక్తాన్ని ప్రారంభించగా, కులశేఖరపడి ఇవతలవున్న వేద పండితులు పురుషసూక్తాన్ని అందుకొని గట్టిగా పఠిస్తూ వుంటారు. ఈ అభిషేక సమయంలో చివరివరకు వేదపండితులు పురుషసూక్తం, శ్రీసూక్తం, భూసూక్తం మొదలైన పంచ సూక్తులు, పంచోపనిషత్తులు వరుసగా పారాయణం చేస్తూనే వుంటారు.

శ్రీస్వామివారికి ఎదురుగా కులశేఖరపడి నుండి బంగారు వాకిలి దాటి గరుడాళ్వారువరకు బారులు తీరి కూర్చున్న భక్తులు భూలోక వైకుంటమైన ఈ తిరుమల క్షేత్రంలో స్వయంభువై నిలిచిన దివ్యమూర్తి ఈయనే కదా! అని కన్నులారా తిలకిస్తూ అర్చకస్వామి చేస్తున్న ఆకాశ గంగా తీర్థాభిషేకాన్ని తామే చేస్తున్నట్లుగా అనుక్షణం భావిస్తూ ఆనందంతో తన్మయులవుతూ ఉంటారు.

**గోవిందా! గోవిందా!! గోవింద!!!**

**క్షీరాభిషేకం**

ఆకాశగంగా తీర్థంతో అభిషేకం ముగిసినవెంటనే జియ్యంగారు వెండి గిన్నెలతో ఆవుపాలను అందిస్తారు. అర్చకులు వాటిని స్వీకరించి మొదట శ్రీస్వామివారి కిరీటంపై అభిషేకిస్తారు.

ఆహా! ఏమీ దివ్య సౌందర్యం! ఆ నల్లని మేను మీద తెల్లని చిక్కని గోక్షీరం చారలు చారలుగా జాలువారుతూ వుండగా వింత వింతలుగా కాంతులీనుతూ వున్న శ్రీవారి ముఖ సౌందర్యాన్ని భక్తులు పారవశ్యంతో మైమరచి దర్శిస్తూ వుంటారు.

జియ్యంగారు అందించిన ఆవుపాలతో అర్చకులు శ్రీస్వామివారి కిరీటం, శంఖచక్రాలు, కటివరద హస్తాలు, నందక ఖడ్గం, వక్షః స్థల లక్ష్మి...... ఇలా అన్నిచోట్ల విడివిడిగా అభిషేకిస్తారు. శ్రీస్వామివరద, వైకుంఠ హస్తాల్ని అభిషేకించినపుడు ఆక్షీరాన్ని ప్రత్యేకంగా సేకరించి, అభిషేకానంతరం భక్తులకు తీర్థంగా ఇస్తారు.

**బంగారు బావి జలంతో**

ఈ విధంగా రెండు గంగాళాల ఆవుపాలతో అభిషేకం పూర్తికాగానే బంగారు బావి శుద్ధజలంతో అభిషేకం జరుగుతుంది. ఇలా కొంతసేపు శుద్ధజలంతో అభిషేకం జరిగిన తరువాత అర్చకులు, జియ్యంగార్లు అందించిన పసుపుముద్దలను శ్రీస్వామివారి వక్షఃస్థల లక్ష్మీదేవికి సమర్పించి (ఒత్తి) ఇస్తారు. వక్షః స్థల అమ్మవారి రూపం పడిన ఆ పసుపు ముద్దలను అర్చకులు కళ్లకద్దుకొని అక్కడి నుండే అందరికీ చూపిసారు.

**పరిమళంతో నలుగు (ఉద్వర్తనం)**

అటుతర్వాత శ్రీస్వామివారి కౌపీన వస్త్రాన్ని తీసివేసి జియ్యంగార్ అందించిన పరిమళం (పచ్చకర్పూరం + చందనం + కుంకుమ పువ్వు - ఈ మూడింటి మిశ్రమం) తో అర్చకులు శిరసాదిగా శ్రీస్వామివారి మేను అంతటా చక్కగా అలదుతారు. ఇలా నలుగు పెట్టటాన్నే 'ఉద్వర్తనం' అని అంటారు.

మూలమూర్తికి మెల్ల మెల్లగా పరిమళాన్ని పూస్తూ నలుగు పెడుతూవున్న అర్చకస్వామి వారి భాగ్యం ఏమని వర్ణించగలం?

ఒకప్పటి త్రేతాయుగంలో బాలరామునికి కౌసల్య నలుగుపెట్టి వున్న దృశ్యం! అలాగే ద్వాపరయుగంలో చిన్నికృష్ణునికి ఆనాడు యశోద నలుగుపెట్టిన దృశ్యం! ఇత్యాది దృశ్యాలు యధాశక్తి భావించ దగినవే కాని, ఈనాటి వారెవ్వరికీ తిలకించడానికి వీలులేనివికదా! అయినా భూలోక వైకుంఠమైన తిరుమల పుణ్యక్షేత్రంలో ఆనాటి త్రేతాయుగ ద్వాపరయుగాలనాటి నీలమేఘశ్యాములైన రామకృష్ణులే ఈనాటి ఘనవేంకటేశుడై నిలిచి భక్తులందరి ఎదుటా నలుగు పెట్టించుకుంటూ వున్నప్పుడు చూచినవారికి ఆ తనివి తీరుతుంది!

మెత్తగా, సుతిమెత్తగా స్వామివారి కన్నులను (కంట్లోపడకుండా) అలదుతూ, చెక్కిళ్లను నిమురుతూ, చేతులను, కాళ్లను, భుజాలను, ఇలా ఒళ్లంతా నలుగు పెడుతూ ఆనందిస్తున్న అర్చకస్వామి సాక్షాత్తు కౌసల్యా యశోదల అంశమే అని చూపరులకు స్ఫురిస్తూవుంటుంది! ఆ సమయంలో అక్కడ చేరిన ప్రతి భక్తుడూ తానే స్వామివారికి నలుగుపెడుతున్నట్లుగా అనుభూతి పొందుతాడు. ఆ సమయంలో ఆ నలుగు పరిమళపు సువాసనలు గుప్పు గుప్పున ఆనంద నిలయం అంతా వ్యాపించి, ఆ వాతావరణాన్ని మరింత పునీతం చేస్తూంటాయి.

ఇలా తెల్లని నలుగు మైపూతలో సొంపులీనే స్వామివారి దివ్యమంగళ మూర్తిని, శ్రీ వేంకటేశ్వరస్వామివారి అంతరంగిక భక్తుడైన తాళ్లపాక అన్నమాచార్యులు ఈ రీతిగా ప్రస్తుతించారు.

**శుక్రవారాభిషేక దర్శనం**

**కంటి శుక్రవారంబు గడియ లేడింట**

అంటి అలమేల్మంగ అండనుండే స్వామిని

సొమ్ములన్నీ కడ.బెట్టి సొంపుతో గోణముగట్టి
కమ్మని కదంబము కప్పు పన్నీరు
చెమ్మతోన వేష్టువలు రొమ్ముతల మొలచుట్టి
తుమ్మెద మైచాయతోన నెమ్మదినుండే స్వామిని.

పచ్చకప్పురమె నూఱి పసి.డి గిన్నెల నించి
తెచ్చి శిరసాదిగ దిగనల.ది
అచ్చెర పడిచూడ అందరికన్నుల కింపై
నిచ్చమల్లె పూవువలె నిటు తానుండే స్వామిని.

తట్టు పును.గె కూర్చి చట్టలు చేరిచి నిప్పు
పట్టి కరగించి వెండిపళ్యాల నించి
దట్టముగ మేను నిండ పట్టించి దిద్ది
బిట్టు వేడక మురియుచుండే బిత్తరిస్వామిని.

ఇలా శ్రీస్వామివారి శుక్రవారాభిషేక సమయంలో తాళ్లపాకవారు దగ్గరవుండి నలుగు పాటలు, అభిషేకపాటలు గానం చేసేవారు. ఇలా 15 వ శతాబ్దంనాటి అభిషేకాదులను వర్ణిస్తూ తాళ్లపాక కవులు అనేక కీర్తనలు రాశారు.

నలుగు మైపూత పూర్తి అయినవెంటనే శ్రీస్వామివారికి బంగారుతట్టతో పచ్చ కర్పూరపు హారతి ఇవ్వబడుతుంది. ఆ కర్పూర హారతి వెలుగులో శ్రీస్వామి ముఖం, కిరీటం, శంఖ చక్రాలు, వరద కటి హస్తాలు, పాదాలు, నందకఖడ్గం, వక్షః స్థల లక్ష్మి........ ఇలా ఆ పాద మస్తకం స్వామివారి అంగాంగముల సౌందర్యాన్ని భక్తులు తదేకంగా కన్ను లార్పకుండా దర్శిస్తారు. ఆ హారతిని దూరం నుంచే భక్తులందరికి చూపిస్తారు.

**శ్రీపాద తీర్థం**

ఆ తర్వాత శుద్ధజలంతో స్వామివారికి అభిషేకం చేస్తారు, ఆ అభిషేక జలంతో కలిసి కిందికి జాలువారుతున్న పరిమళాన్ని శంఖ చక్రాలు, వైకుంఠ వరదహసాలు ఇలా అన్ని అంగములనుండి క్రిందకు జాలువారుతూ వున్న పరిమళ

తీర్థాన్ని విడివిడిగా పాత్రలలో సేకరించి అర్చకులు, జియ్యంగార్లు, అధికారులు, పరిచారకులు.... ఆనవాయితీ ప్రకారం వారి వారికి వచ్చే తీర్థ భాగాలను స్వీకరిస్తారు. అందులో వైకుంఠ వరద హస్తాలనుండి జారే పరిమళ తీర్థ భాగాన్ని భక్తులకు తీర్థంగా ఇస్తారు.

ఇలా శ్రీస్వామివారి మూర్తియందు శిరసాదిగా జలాభిషేకంతో జాలువారుతున్న పరిమళ తీర్థాన్ని "శ్రీపాద తీర్థం" అంటారు. ఈ శ్రీహరిపాద తీర్థం అద్భుతమైన మహిమ గలది. ఈ తీర్థ మహిమను గూర్చి పద కవితా పితామహుడైన తాళ్లపాక అన్నమాచార్యులు ఇలా కీర్తించినాడు.

**శంకరాభరణం**

శ్రీహరి పాద తీర్థంబే చెడనిమందు
మోహపాశాలు గోసి మోక్షమిచ్చే మందు
కారమై కంటగించని కడు. జల్లనిమందు
నూఱని కాచని యట్టి నున్నని మందు
కోరికతో వెలవెట్టి కొని తే వల్లని మందు
వేరు వెల్లంకులు కూర్చనట్టి వెందువోని మందు
గుఱితైన రోగములు గుణము చేసే మందు
దురితములు పెడ.బాపే దొడ్డమందు
నిరతము బ్రహ్మాదులు నేరుపుతో సేవించే మందు
నరకము సొరనట్టి నయమైన మందు
పొంకముతో భయములు పొందనియ్యని మందు
మంకుబుద్ధులు మాన్పి మన్నించే మందు
పంకజాక్ష వేంకటరమణ ప్రపన్నుని మందు
సెంకించక తన దాసుల. జేపట్టే మందు

ఇలాంటి అద్భుతమైన శ్రీపాద తీర్థాన్ని అర్చకస్వాములు పాత్రలలో సేకరించిన తర్వాత మరికొంతసేపు శుద్ధజలంతో అభిషేకం చేస్తారు.

**శ్రీమహాలక్ష్మికి మంగళాభిషేకం**

ఆ తర్వాత వెండిగిన్నెలో నీళ్లలో కలిపిన పసుపుతో శ్రీస్వామివారి వక్షఃస్థలంపై వ్యూహలక్ష్మిగా కొలువై వున్న శ్రీమహాలక్ష్మీ అమ్మవారికి అభిషేకం చేస్తారు. ఈ సమయంలో ఒక పరిచారకుడు భక్తులను ఉద్దేశించి బిగ్గరగా ''ఇపుడు శ్రీస్వామివారి వక్షః స్థలంలోని శ్రీమహాలక్ష్మీ అమ్మవారికి పసుపుతో తిరుమంజనం (అభిషేకం) జరుగుతున్నది కన్నులారా దర్శించి ఆనందించండి'' అని హెచ్చరిక చేయటంతో, భక్తులలో ఒక విధమైన కల కలం బయలుదేరి, అందరూ తలలు నిక్కించి పసుపుతో అభిషేకింపబడుతున్న శ్రీనివాసుని వక్షఃస్థలంమీది లక్ష్మీఅమ్మవారిని కన్నులారా దర్శిస్తారు. శ్రీవారి నల్లని మేనిమీద పసుపు పచ్చని అభిషేక జలంతో మరింత స్పష్టంగా దర్శనమిస్తూ, శోభాయమానంగా ప్రకాశిస్తూ వున్న అమ్మవారిని రెప్పవాల్చక తిలకిస్తారు.

''తల్లీ! జగన్మాతా! నీవు వైకుంఠం నుండి తరలి రావటం వల్లే కదా! ఇటు నీ దర్శనంతోపాటు శ్రీవారి దర్శన భాగ్యం మాకు కలిగింది కదా! ఈ తిరుమల క్షేత్రం కలియుగ వైకుంఠంగా విరాజిల్లుతోంది కదా!

అమ్మా! తిరుమలస్వామి నాగా భరణాలు ధరించి వున్నందువల్ల శివుడేమో? పద్మపీఠంలో నిలిచి వున్నందువల్ల బ్రహ్మదేవుడేమో? శుక్రవారంనాడు అభిషేకం జరుగుతున్నదిగాన శక్తిదేవత అయిన పార్వతియా? లేక కుమారస్వామి అవతారమా?....... అని ఇలా అనేక విధాలుగా అల్పజ్ఞులమైన మేము సందేహిస్తూ వుండగా ఓ పద్మావతీ! ఓ అలమేలు మంగా!! నీవు శ్రీస్వామి వక్షః స్థలంలో కొలువైవుండి వింత వింత శోభతో దర్శనమిస్తున్నందువల్లనే మా సంశయాలన్నీ పటా పంచలయినాయి. తిరుమలప్పుడు శ్రీమహా వైకుంఠం నుండి భువికి తరలి వచ్చిన సాక్షాత్తు శ్రీమహావిష్ణవే! అని రూఢి అవుతున్నది తల్లీ!'' అని భక్తితో, ఆనందంతో ప్రార్థిస్తూ వుండగా హరిద్రాభిషేకం పూర్తి అవుతుంది. హరిద్రాభిషేకానంతరం అమ్మవారికి శుద్ధ జలంతో అభిషేకం చేస్తారు.

**ఆకాశగంగాతీర్థం**

ఇలా బంగారు బావి జలంతో శ్రీస్వామివారిని శిరసాదిగా పాదపర్యంతంగా అభిషేకించిన పిమ్మట చివర్లో మళ్లీ బంగారు శంఖంతో ఆకాశగంగా తీర్థంతో అభిషేకించి, ఆ జలాన్ని పాత్రలలో సేకరిస్తారు.

ఎన్నో జన్మల సుకృతఫలం చేత శ్రీనివాస సార్వభౌముని అభిషేక కైంకర్యంలో స్వయంగా పాలుపంచుకొన్న అర్చకస్వామి అంతవరకు తాను నిలిచివున్న పీఠం నుండి దిగి, తొలుత ఆ తీర్థ జలాన్ని తన శిరస్సుపై చల్లుకొని, తర్వాత జియ్యంగార్లు, ఏకాంగి, ఆచార్య పురుషులు, అధికారులు, భక్తులు, ఇలా అక్కడ చేరివున్న అందరిమీదా ''పూతోభవ'' అని అంటూ ప్రోక్షిస్తారు.

ఈ అభిషేక తీర్థం యొక్క స్పర్శతో మా జన్మలు ధన్యములయ్యాయని ఎవరికి వారు స్వామిని చూస్తూ ధన్యములయ్యాయని స్తుతించే టంతలో కులశేఖరపడి చెంత తెర వేయబడుతుంది. ఆ సమయంలో వేదమూర్తులు వేదపారాయణాన్ని పూర్తి చేస్తూ ''ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః'' అని స్వస్తి వాచనం పలుకుతారు.

**నీరాట్టం (దివ్యప్రబంధం) గానం**

అనంతరం తెరలోపల ఆనంద నిలయంలో అర్చకులు వట్టి గుడ్డతో తడిలేకుండా శ్రీస్వామివారిని తుడుస్తూ వుండగా శ్రీ జియ్యంగార్ ద్రావిడ వేదంలోని 'నీరాట్టం' పది పాశురాల గానం ప్రారంభించగా, కులశేఖరపడి ఇవతలవున్న శ్రీ వైష్ణవ ఆచార్య పురుషులు ఆ గానాన్ని అనుసంధానిస్తూ ఆ పది పాశురాలను శ్రవణ పేయంగా పఠిస్తారు.

''నాయనా చిన్నికృష్ణా! నీకు చక్కగా లాల (నీళ్లు) పోసి ముద్దుగా అలంకరించాను. మళ్లీ మట్టిలోకి వెళ్లకు! వెళ్లి ఆడుకోవద్దు! ఒళ్లంతా దుమ్ము పూసుకోవద్దురా! నా నల్లని కన్నయ్యా!!'' అని మురిపెంగా యశోదాదేవి లాలిస్తూవున్న సుకుమార భావాలు ఉట్టిపడే పలుకులతో కూడిన తమిళపాశురాలగానం సాగుతూవుండగా, లోపల అర్చకులు స్వామి వారికి తడినంతా తుడిచి ఇరువది నాలుగు (24) మూరల సరిగంచు పెద్ద పట్టు వస్త్రాన్ని అంతరీయం (ధోవతి) గాను, పంద్రెండు (12) మూరల పట్టు వస్త్రాన్ని ఉత్తరీయంగాను రమణీయంగా ధరింపజేస్తారు. ఆ తర్వాత అర్చకులు సాలగ్రామమాల, లక్ష్మీహారం, ఇత్యాది ఆభరణాలను క్లుప్తంగా స్వామివారికి అలంకరిస్తారు. ఒకపట్టువస్త్రాన్ని శిరస్సుకు కిరీటంవలె చుట్టి అలంకరిస్తారు. శ్రీవారి

ఫాల ప్రదేశంపై పలుచగా పచ్చకర్పూరం కస్తూరీలతో ఊర్ధ్వపుండ్రాన్ని సుతారంగా తీర్చి దిద్దుతారు.

ఇలా అర్చకస్వామి అలంకరిస్తూ వుండగా జియ్యంగార్ ఆలవట్టం (పట్టు విసనకర్ర) తో స్వామివారికి విసురుతూ సేవ చేస్తారు. ఇలా లఘువుగా అలంకరణ ముగిసేటప్పటికి దివ్య ప్రబంధ పారాయణ పూర్తి అవుతుంది. వెంటనే శ్రీవేంకటేశ్వర స్వామివారికి వెన్న, పంచదారను నివేదన చేసి తాంబూలం సమర్పించి బంగారు తట్టలో ''పచ్చకర్పూర హారతి'' సమర్పిస్తారు. ఈ హారతి జరుగుతూ వుండగా కులశేఖరపడి తెరను తీస్తారు.

**శ్రీవారి మహాప్రసాదం**

అంతవరకు బారులు తీరి కూర్చొని శ్రీస్వామివారి దివ్యమంగళమూర్తి సౌందర్యాన్ని దర్శించటానికి ఎదురుచూస్తూవున్న భక్తుల్లో ఒక విధమైన ఉత్సాహము బయలుదేరి, అందరూ లేచి నిలబడి కర్పూర హారతి వెలుగుల్లో శ్రీవారి సౌందర్యాన్ని కన్నులారా తిలకించి అనిర్వచనీయమైన సంతృప్తిని శాంతిని ఆనందంతో కూడిన దివ్యాను భూతిని పొందుతారు.

అభిషేకం పూర్తి అయినందువల్ల జియ్యంగారు, అధికారులు, ఆచార్య పురుషులు బయటికివచ్చి, బంగారువాకిలి దగ్గర నిల్చొని వుంటారు. ఆ సమయంలో బారులు తీరి నిలిచియున్న భక్తులు క్రమంగా స్వామివారికి దగ్గరగా వెళ్లి దర్శిస్తూ జరుగుతూ వుండగా అర్చకులు శ్రీస్వామివారి అభిషేక తీర్థాన్ని అందరిపైనా ప్రోక్షిస్తారు. ఆ పవిత్ర తీర్థంతో పునీతులైన భక్తులు స్వామివారి (తొడుగు లేకుండా వున్న) నిజపాదాలనుండి కిరీటందాకా సందర్శిస్తూ ఆ చోటు వీడటానికి మనసొప్పక, చిరుమందహాసంతో ప్రకాశిస్తూ వున్న శ్రీనివాసుని ముఖారవిందాన్ని మరల మరల వెనక్కు తిరిగి చూస్తూ, బంగారు వాకిలి వద్దకు రాగా, ఆలయాధికారులు, వారలకు ''శ్రీపాదరేణువు చందనం'' అనబడే శ్రీవారి మహా ప్రసాదాన్ని అందజేస్తారు. దానిని అత్యంత భక్తితో కళ్లకద్దుకొని స్వీకరించిన భక్తులు ఇంకా వెలుపలికి వచ్చి శ్రీస్వామివారి క్షీరాభిషేక తీర్థాన్ని కూడ స్వీకరించి పరమ

పవిత్రులై, ఆనంద నిలయ విమాన ప్రదక్షిణం చేస్తూ, కోటి దివ్యకాంతులీనుతున్న బంగారు విమానాన్ని విమాన వేంకటేశ్వరుని శిరసెత్తి చూచి, రెండు కన్నులు చాలక చేతులెత్తి నమస్కరిస్తూ మళ్లీ ఎప్పుడో ఈ దర్శన అవకాశం కలిగేది అనుకొంటూ ముందుకు సాగి హుండీలో మ్రొక్కులు చెల్లించుకొని విష్వక్సేనులకు శ్రీరామానుజులవారికి, యోగ నరసింహస్వామికి వందనాలు సమర్పించి వెండి వాకిలి దరిన స్వామివారికి సాష్టాంగపడి, బయటికి నడచి శ్రీస్వామివారి ప్రసాదాన్ని మనసారా స్వీకరించి మనోరథం సిద్ధించిన మహదానందంతో భక్తులు తమ తమ బసలకు చేరుకొంటారు.

**గోవిందా! గోవిందా!! గోవింద!!!**

## వస్త్రాలంకరణ సేవ

ఈ అభిషేక సేవలో పాల్గొనే భక్తులలో శ్రీస్వామివారి మూలమూర్తికి ధరింపజేసే 12 x 2 గజముల కొలతగల ధోవతి (పట్టు మేల్‌ఛాత్) 6 x 1 గజముల కొలతగల పట్టు ఉత్తరీయాన్ని కొలతలుకల పట్టువస్త్రాలను సమర్పించదలచినవారు (వీటి ధర రు. 12,250-- 00 లు) డిమాండు డ్రాఫ్టుగా పంపవచ్చు. ఈ పట్టు వస్త్రాలను గృహస్థు పాల్గొన్న రోజున వారి పేరిట. అభిషేకానంతరం మూలవరులకు అలంకరింపజేస్తారు.

అభిషేకంలో పాల్గొనదలచిన భక్తులు, తగిన సేవారుసుమును డి.డి.గా ''ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు, తి.తి. దేవస్థానములు,తిరుపతి'' వారి పేర ఏ జాతీయ బాంకులోనైనా సరే తీసి, దానిని దాదాపు 5 సంవత్సరాల కాలానికి ముందుగా ''పేష్కారు, తిరుమల శ్రీవారి ఆలయం, తిరుమల - 517 504'' వారికిపంపుతూ, తమకు కావలసిన శుక్రవారాభిషేకపు తేదీని ఖాయపరచుకోవచ్చు. సదరు తేదీ అనుమతిని ''ధ్రువ పత్రం'' ద్వారా భక్తులకు ముందుగానే తెలియజేయబడుతుంది. అయినా ఈ శుక్రవారాభిషేక సేవలో, అప్పటికి వున్న అవకాశాన్ని బట్టి మాత్రమే వీలు కల్పించబడుతుంది.

అభిషేకంలో పాల్గొనడానికి అనుమతి లభించిన భక్తులను ప్రతి శుక్రవారం తెల్లవారు జామున 3-30 గంటలకు ''వైకుంఠం క్యూ కాంప్లెక్సు'' ద్వారా మాత్రమే ఆలయంలోనికి ప్రవేశింపజేస్తారు.

ఈ అబిషేకానికి బక్తులు స్నానం చేసి శుచిగా శుభ్రమైన వస్త్రాల్ని ధరించి పవిత్రంగా రావాలి పురుషులు ధోవతి, ఉత్తరీయం మాత్రమే ధరించాలి. ఈ సేవలో పదేండ్లలోపు పిల్లలను అనుమతించడం జరుగదు.

శ్రీ వేంకటేశ్వరస్వామివారి మూల విరాణ్మూర్తి యొక్క అపూర్వ దివ్య సౌందర్యాన్ని సుమారు ఒక గంటపాటు సందర్శింపజేసే ఈ శుక్రవారాభిషేకం దేశం నలుమూలలనుండి ఎందర్నో భక్తులను విశేషంగా ఆకర్షిస్తూ వున్నది. నిజంగా ఈ దర్శనావకాశం అనేక జన్మల పుణ్య ఫలితంగా లభిస్తుందనడం ముమ్మాటికీ సత్యమైన మాట!

* * *

## 6. నిజపాద దర్శన సేవ

ప్రతి శుక్రవారం అబిషేకానంతరం అభిషేక సేవలో పాల్గొనే గృహస్థులు శ్రీస్వామివారిని దర్శించి వెళ్లిన తర్వాత ''నిజ పాద దర్శనం'' సేవ ప్రారంభమవుతుంది. ఈ సేవకుగాను నిర్ణీత రుసుమును చెల్లించిన భక్తులను అనుమతిస్తారు. వీరంతా అభిషేకానంతరం దివ్య తేజస్సుతో ప్రకాశిస్తూ వున్నట్టి, ఎలాంటి తొడుగులేనట్టి నిజపాదాలతో దర్శనమిస్తున్న శ్రీస్వామివారిని ఆపాద మస్తకం కన్నులారా తిలకించి ధన్యులవుతారు. ఇలా బంగారు కవచంలేని శ్రీస్వామివారి నిజపాదాలను అభిషేక దర్శనంలోగాని, లేదా అభిషేకానంతరం జరిగే ఈ ''నిజపాద దర్శనం'' లో కాని మాత్రమే దర్శించే భాగ్యం కలుగుతుంది. ఇక మిగిలిన అన్ని వేళల్లో శ్రీ వేంకటేశ్వరస్వామివారి పాదాలు బంగారు తొడుగుతో విరాజిల్లుతూ వుంటాయి.

ప్రతి శుక్రవారం అభిషేకానంతరం జరిగే ''నిజపాద దర్శనం'' లో పాల్గొన దలచిన భక్తులు రు. 100-00 లు (ఒక్కరికి మాత్రమే) డిమాండు డ్రాఫ్టును ఏ బ్యాంకులోనైనా సరే ''ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు, తి.తి. దేవస్థానములు, తిరుపతి''వారి పేర తీసి, దానిని ''పేష్కారు, తిరుమల శ్రీవారి ఆలయం, తిరుమల - 517 504'' వారికి 90 రోజులు ముందుగా పంపుతూ కావలసిన తేదీ (శుక్రవారం) కి సురక్షితం (రిజర్వు) చేసుకోవాలి.

''నిజపాద దర్శనం'' ఆర్జిత భక్తులను ప్రతి శుక్రవారం తెల్లవారు జామున 5-30 గంటలకు ''వైకుంఠం క్యూ కాంప్లెక్సు'' ద్వారా మాత్రమే శ్రీవారి ఆలయంలోనికి అనుమతిస్తారు.

**ఊర్ధ్వ పుండ్ర సమర్పణ**

శ్రీ వేంకటేశ్వరస్వామివారి సన్నిధిలో శ్రీస్వామివారి నావమానికి ఉపయోగపడే పచ్చ కర్పూరం కస్తూరిగల వెండిగిన్నెను జియ్యంగారు, అర్చకులకు అందించి వెలుపలికి వచ్చి, స్నపన మండపంలో, ఆచార్య పురుషులతోపాటు ఆసీనులవుతారు.

రాములవారిమేడ తలుపులను మూసి వేసి, అర్చకులు ఏకాంతముగా స్వామివారికి అలంకారం చేస్తారు. ఇలా లోపల అలంకార సేవ ప్రారంభం కాగానే బయట జియ్యంగార్లు ఆచార్య పురుషులు, దివ్య ప్రబంధ పారాయణం ప్రారంభిస్తారు.

ముందుగా అర్చకులు శ్రీస్వామివారి నామాన్ని పచ్చ కర్పూరం, కస్తూరితో యథా ప్రకారం సంపూర్ణంగా తీర్చి దిద్దుతారు. శుక్రవారంనాడు అభిషేకానంతరం సమర్పించిన నామం మళ్లీ గురువారం నాడు మాత్రమే సడలించబడుతుంది. ప్రతి శుక్రవారం శ్రీస్వామివారికి నామం (ఊర్ధ్వ పుండ్రాలు) సమర్పించటానికి సాధారణంగా 16 తులాల పచ్చ కర్పూరం, 1 1/2 తులం కస్తూరిని ఉపయోగిస్తారు. అయితే, ప్రతి సంవత్సరం బ్రహ్మోత్సవాలకు ముందు వచ్చే శుక్రవారంనాడు మధ్య వచ్చే శుక్రవారంనాడు – బ్రహ్మోత్సవాలకు తరువాత వచ్చే శుక్రవారంనాడు – ఇలా ప్రతి ఏటా మూడు శుక్రవారాల్లోగాని లేదా నాలుగు శుక్రవారాల్లోగాని శ్రీవారి నామానికి పచ్చ కర్పూరం, కస్తూరి – వీటి సమర్పణలో రెట్టింపుగా వుంటుంది. అంటే ఈ శుక్రవారాల్లో 32 తులాల పచ్చ కర్పూరం, 3 తులాల కస్తూరితో శ్రీవారి నామం తీర్చి దిద్ద బడుతుంది. అందువల్లే ఈ శుక్రవారాలను 'రెట్టింపు శుక్రవారా'' లని 'రెట్టవారా'' లని అంటారు. ఇలా నామం తీర్చి దిద్దడం పూర్తి కాగానే, బయట దివ్య ప్రబంధ పారాయణ పూర్తి అవుతుంది.

తర్వాత శ్రీస్వామివారికి 24 మూరలు x 4 మూరలు కొలతలుగల పట్టు ధోవతి, 12 x 2 మూరల ఉత్తరీయాన్ని అతి సుందరంగా ధరింపజేస్తారు. శ్రీవారి

ఖడ్గం సూర్య కఠారికి కూడ ఒక పట్టు వస్త్రాన్ని చుట్టి దానిని శ్రీస్వామివారికి బొడ్డు దగ్గర అమరుస్తారు. ఆ తర్వాత శ్రీస్వామివారికి అపాదమస్తకం బంగారు ఆభరణాల అలంకరణ ప్రారంభమవుతుంది. దీనిని ''సమర్పణ'' అంటారు. నామం, ఆభరణాల అలంకారం ఏకాంతంగా జరుగుతాయి. ప్రతి రోజు అలంకరింపబడే ఈ ఆభరణాల సమర్పణను ''సదా సమర్పణ'' అంటారు.

ఇక విశేష ఉత్సవ దినాల్లో సమర్పణయ్యే వజ్ర వైడూర్యాది నవరత్న ఖచిత కిరీటం, శంఖచక్రాలు, మకర కుండలాలు, వరదకటిహస్తాలు....... ఇత్యాదులు ఎన్నో శ్రీస్వామివారికి ప్రత్యేకాభరణాలుగా విరాజిల్లుతున్నాయి. వీటిని ''విశేష సమర్పణం'' ఆభరణాలని అంటారు. వీటి విలువ అనేక కోట్ల రూపాయలు. వీటిని బంగారు వాకిలి లోపల దక్షిణపు వారకు వున్న శ్రీ భాండారం అనే గదిలో భద్రపరుస్తారు.

ఇవిగాక ప్రత్యేకంగా ఉత్సవాల్లో అలంకరింపబడే అపురూపమైన ''మొజాతి నగలు'' తిరుపతిలో దేవస్థానంవారి ట్రెజరీలోభద్రపరచబడి వుంటాయి. వీటిని ఆయా సందర్భాల్లో తెచ్చి, ఉపయోగించి, మళ్ళీ పంపి వేస్తుంటారు. ఈ మొజాతి నగలు కేవలం డబ్బుపరమైన విలువేగాక, చారిత్రకపరమైన విలువగలవి. కృష్ణరాయలు, మైసూరు, గద్వాల, కార్వేటినగర చక్రవర్తులు... ఇలా ఎందరో ఎందరెందరో రాజులు, రారాజులు శ్రీస్వామివారికి సమర్పించిన అమూల్యాభరణాలే ఈ ''మొజాతి నగలు''

ఇలాంటి సర్వాభరణయుక్తుడైన శ్రీస్వామివారిని దర్శించి తరించండి! అడుగో! దర్శించ ధన్యులు కండి!

**వాడెవో కంటిరటిరే! వన్నెలవాడు**
**పైడి మోలము కటారు పరుజులవాడు**
**పెద్ద కిరీటము వాడు పీతాంబరమువాడు**
**నొద్దిక గౌస్తుభమణి వురము వాడు**
**ముద్దుల మొగమువాడు ముత్తేల నామమువాడు**
**అద్దిగో శంఖ చక్రాల హస్తాలవాడు.**
**అందిన కటి హస్తము నభయహస్తమువాడు**

*అందెల గజ్జెల బాదాలవాడు*
*కుందణంపు యీ మకర*
*కుండలంబులవాడు*
*కందువ బాహుపురుల కడియాలవాడు.*
*నగవు జూపులవాడు నాభికమలమువాడు*
*మొగపుల మొలనూళ్ల మొలవాడు*
*చిగురు మోవివాడు శ్రీ వేంకటేశుడు*
*తగు నలమేలుమంగ తాళి మెడవాడు.*

అభిషేకానంతరం ఇలా కిరీటము తప్ప మిగతా ఆభరణాలన్నీ శ్రీస్వామివారికి సమర్పించిన తర్వాత వక్షః స్థలంలో వున్న బంగారు అలమేలుమంగకు తిరుమంజనం (అభిషేకం) ప్రత్యేకంగా జరుగుతుంది.

**అలమేలుమంగకు మంగళ స్నానం**

అలమేలుమంగతాయారు శ్రీ వేంకటేశ్వరస్వామివారి వక్షఃస్థలంలోగల సువర్ణ హారం నడుమ బంగారు విగ్రహరూపంలో వేంచేసి వున్నారు. శ్రీస్వామివారి కంఠహారంలో విరాజిల్లుతూవున్న ఈ బంగారు లక్ష్మిని భగవద్రామానుజులవారు సమర్పించారట! శ్రీస్వామివారికి ప్రతి శుక్రవారం అభిషేకం జరిగిన అనంతరం, శ్రీరామానుజులు తాము సమర్పించిన ఈ బంగారు లక్ష్మికి తిరుమంజనం (అభిషేకం) జరిగేలాగున ఏర్పాటు చేశారట!

ప్రస్తుతం ప్రతి శుక్రవారం శ్రీస్వామివారి మూలమూర్తికి అభిషేకం జరిగిన అనంతరం, వస్త్ర సమర్పణ, ఊర్ధ్వ పుండ్ర సమర్పణ, ఆభరణ సమర్పణ అయిన తర్వాత వక్షః స్థలంలో హారంగా వేంచేసివున్న బంగారు లక్ష్మికి ప్రత్యేకంగా అభిషేకం జరుప బడుతున్నది.

అర్చకస్వామి శ్రీస్వామివారి మెడలోని బంగారు అలమేలుమంగను వెండితట్టలో యథా తథంగా ఆశీనయైయున్న భంగిమలో నిలువుగా వేంచేపు చేసిన పిదప, అర్ఘ్యపాద్యాచ మనాది ఉపచారాలు సమర్పిస్తారు. ఆ తర్వాత పరిమళ జలాన్ని బంగారు శంఖంలో తీసుకొని ''హరిః ఓమ్ హిరణ్య వర్ణాం హరిణీం......'' అని శ్రీ సూక్తంతో అభిషేకాన్ని ప్రారంభించగా కులశేఖరపడి (గడప) ఇవతల వున్న

వేదపండితులు ఆబుక్కులను అందిపుచ్చుకొని శ్రీసూక్తాన్ని పఠిస్తారు. అర్చకులు తొలుత పరిమళజలంతోను ఆ తర్వాత పసుపు నీళ్లతోను అమ్మవారికి అభిషేకం కావిస్తారు. పిదప శుద్ధ జలాభిషేకం అయిన తర్వాత పొడి వస్త్రంతో తుడిచి పట్టు వస్త్రాన్ని అలంక రిస్తారు. ఆ తర్వాత తిలకాన్ని దిద్ది శ్రీవారి వక్షః స్థలంలో కుడివైపు అలంకరిస్తారు. అలాగే శ్రీస్వామివారి వక్షఃస్థలంలో ఎడమవైపున బంగారు భూదేవి ప్రతిమను కూడ అలంకరిస్తారు.

ఇలా వక్షః స్థలంలో బంగారు శ్రీదేవి భూదేవులు అలంకృతలైన తర్వాత శ్రీస్వామి వారికి కిరీటాభరణాన్ని అలంకరిస్తారు. ఈ కిరీటం సమర్పించడంతో శ్రీస్వామివారికి ఆభరణాల అలంకరణ పూర్తవుతుంది. పిదప శ్రీ భూదేవులతో విరాజిల్లుతూవున్న శ్రీ వేంకట ప్రభువునకు బంగారు తట్టతో కర్పూర నీరాజనం జరుగుతుంది. ఆ తర్వాత తోమాలసేవ, అర్చనలు జరుగుతాయి. పిదప భక్తులను సర్వ దర్శనానికి అనుమతిస్తారు.

అభిషేకానంతరం ఏకాంతంగా జరుపబడే బంగారు లక్ష్మి అభిషేకాన్ని జియ్యంగార్లు ఏకాంగి వైష్ణవాచార్య పురుషులు,వేదపండితులు, ఆలయ అధికారులు మాత్రమే కులశేఖరపడికి ఈవల కూర్చొని తిలకిస్తారు.

ఇంతటితో ''వారోత్సవాలు'' పూర్తి అయ్యాయి.

**గోవిందా! గోవిందా!!గోవింద!!!**

* * *

# తిరుమలేశుని తిరునక్షత్రోత్సవాలు

తిరుమలలో శ్రీ స్వామివారి ఆలయంలో ప్రతినెలా ఆయానక్షత్రాలు కూడిన దినా లలో విశేషంగా కొన్ని ఉత్సవాలు ఊరేగింపులు పూజలు జరుపబడుతున్నాయి. ముఖ్యంగా శ్రీకృష్ణుని జన్మనక్షత్రమైన రోహిణీ నక్షత్రం రోజున, భగవద్రామానుజులు జననమొందిన ఆరుద్రా నక్షత్రంరోజున, శ్రీరామచంద్రుడు అవతరించిన పునర్వసు నక్షత్రంనాడు, అలాగే తిరుమలేశుడు స్వయం వ్యక్తమై అర్చామూర్తిగా సాలగ్రామ శిలా రూపంలో ఆవిర్భవించిన శ్రవణానక్షత్రం నాడు ఈ విశేషోత్సవాలు ఆరాధనలు జరుగు తున్నాయి.

ఈ నక్షత్రోత్సవాలు నెలకు ఒక్కసారే వస్తాయి. కనుక వీటిని మాసోత్సవాలని కూడా అంటారు.

ఈ నక్షత్రోత్సవాలని ఆయా రోజుల్లో ఆనందనిలయంలో కొలువైవున్న ఆయా ఉత్సవమూర్తులకు మాత్రమే నిర్వహింప బడతవి. ముందుగా ఈ సంచికలో రోహిణీనక్షత్రోత్సవం, ఆరుద్రానక్షత్రోత్సవాల గురించి తెలుసుకొందాం. తెలుసుకొనే ముందు ఒక్కసారి భగవన్నామాన్ని స్మరించండి మరి.

**గోవిందా! గోవిందా!!గోవింద!!!**

* * *

## 1. రోహిణీ నక్షత్రోత్సవం

ద్వాపర యుగంనాటి శ్రీకృష్ణుడే ఈ తిరుమల మీది శ్రీ వేంకటేశ్వరుడని ఎందరో మహనీయులు చెప్పారు. స్వయంగా శ్రీనివాసుడే వైకుంఠం నుంచి తరలి వచ్చిన సందర్భంలో పద్మావతితో, ఆమె చెలికత్తెలతో

తన పేరు శ్రీకృష్ణుడనీ, తన అన్న బలరాముడనీ వివరంగా చెప్పుకుంటాడు. అంతేగాదు పద్మావతీ శ్రీనివాసుల వివాహసందర్భంలో కూడ శ్రీనివాసుని పరంగా సంకల్పం చెప్పే సందర్భంలో వసుదేవుని పుత్రుడైన కృష్ణునిగానే చెప్పబడుతుంది.

అహరహం తిరుమలకు వచ్చే యాత్రికులు భక్తులు శ్రీస్వామివారిని గోవిందా! గోవిందా!! అని ఎలుగెత్తి కృష్ణుని పేరుతోనే పిలుస్తుంటారు.

పద కవితా పితామహుడైన తాళ్లపాక అన్నమాచార్యులు తిరుమలేశుని సాక్షాత్తు శ్రీకృష్ణునిగానే కీర్తించాడు. అన్నమయ్య ''ఆ వేంకటాద్రి గోవిందుడు ఆది మునుల సిద్ధాంజనమనీ, యశోదపాలిటి భాగ్యమనీ, దేవకిగన్న ఇంద్రనీల మాణిక్యమనీ, తలచిన కరికి తగుదిక్కైనవాడనీ, అల ద్రౌపదికి ఆపద్బంధువనీ, గొల్లెతల కాగిటిసౌఖ్యమనీ... వర్ణించాడు.

ద్వాపరయుగంనాటి యశోదే ఈనాటి వకుళమాతగా, శ్రీస్వామివారు ఆరగించే వంటల్ని పర్యవేక్షిస్తున్నది. ద్వాపర యుగంలో యశోద చేతి వెన్నముద్దలు, గోటి ముద్దలు తిన్న చిన్ని కృష్ణయ్య – నేటికీ తిరుమలలో ఆనాటి యశోద అంటే ఈనాటి వకుళమాత పంపిన 'మాత్రా దధ్యోదనం' వేకువజామున్నే ఆరగిస్తున్నాడు. ఆనాటి కృష్ణుడే ఈనాటి వెంకన్న అని స్పష్టం చెయ్యడానికన్నట్లుగా తిరుమల ఆనంద నిలయంలో రుక్మిణీ శ్రీకృష్ణుల ఉత్సవమూర్తుల ఎప్పటినుండో చోటు చేసుకున్నాయి.

సారాంశమేమంటే తిరుమల శ్రీనివాసుడు సాక్షాత్తు శ్రీకృష్ణుడు. అందుకు నిదర్శనంగా శ్రీకృష్ణాష్టమినాడు తిరుమల స్వామి శ్రీకృష్ణునిగా తిరుమల పురవీధుల్లో ఊరేగుతాడు. ఉట్ల ఉత్సవాల్లో పాల్గొంటాడు.

అలాగే ప్రతి ఏటా బ్రహ్మోత్సవంలో ఆనందనిలయుడు కాళింగమర్దనం చేస్తూనో, లేదా గోవర్ధనోద్ధరణం చేస్తూనో శ్రీ వేంకటాద్రి కృష్ణునిగా దర్శనమిస్తాడు. ప్రతి ఫాల్గుణ మాసంలో రుక్మిణీ సహితుడైన వేంకటాద్రి కిసునమూర్తి తిరుమల కోనేట్లో తెప్పపై తేలియాడుతూ దర్శనమిస్తాడు. సంక్రాంతి – దసరా పండుగ సందర్భాల్లో పారువేటకు కృష్ణ సహితంగా శ్రీనివాసుడు వెళతాడు.

అందువల్లే ప్రతినెలా శ్రీకృష్ణుని జన్మ నక్షత్రమైన రోహిణినాడు తిరుమలలో విశేష పూజలు జరుగుతున్నా.యి.

ప్రతి నెలా రోహిణి నక్షత్రం రోజున ఉదయం సుప్రభాతానంతరం భోగ శ్రీనివాసమూర్తికి అభిషేకానంతరం ప్రత్యేకంగా రుక్మిణీ శ్రీకృష్ణులకు అభిషేకం జగుగుతుంది.

ఉదయారాధనలు, మధ్యాహ్నా రాధనలు పూర్తి అయిన తరువాత శ్రీదేవి భూదేవి సహిత శ్రీమలయప్పస్వామి నిత్య కల్యాణోత్సవం, ఆర్జిత బ్రహ్మోత్సవం, డోలోత్సవం వంటి ఆర్జితసేవలు ముగిసిన తర్వాత ఆనందనిలయం ప్రవేశిస్తాడు. ఆ తర్వాత...

రుక్మిణీ సమేత కృష్ణస్వామివారిని బంగారు శ్రీ పీఠంలో అధిరోహింపజేసి, విశేష ఆభరణాలతో, పూల మాలలతో అలంకరిస్తారు. విమాన ప్రదక్షిణంగా బయటికి వచ్చి, ఛత్రచామర మంగళ వాద్య పురస్సరంగా వేదపారాయణ దివ్య ప్రబంధ గానాలు జరుగుతూవుండగా వృష, తురగ, గజ, భక్త బృందాలు ముందు నడుస్తూ వుండగా రుక్మిణీ శ్రీకృష్ణులు ఆలయం వెలుపల గల కొలువు మండపంలో సహస్ర దీపాలంకార సేవలో పాల్గొంటారు.

ఒకవైపు అశేష భక్తజనం దర్శిస్తుండగా, మరోవైపు వేదగానం జరుగుతూ వుంటుంది. ఇంకోవైపు గాయకులు వేంకటాద్రి కృష్ణుని దయా పరత్వాన్ని, ఆశ్రిత వాత్సల్యాన్ని కీర్తిస్తూ వుండగా ఇలా కొంతసేపు ఊయలలో ఊగిన తర్వాత సకల సార్వభౌమోచిత మర్యాదలతో పురవీధుల్లో ప్రదక్షిణంగా ఊరేగుతూ, అక్కడక్కడ భక్తులచే పూజలందు కొంటారు. ఇలా పురవీథుల్లో సంచరించి వేంకటాద్రి కృష్ణుడు రుక్మిణీ సమేతంగా ఆలయం ప్రవేశిస్తారు. బంగారువాకిలి దగ్గర నైవేద్య హారతులతో ఆస్థానం జరుప బడుతుంది. తీర్థ ప్రసాద వినియోగం అయిన తర్వాత రుక్మిణీ శ్రీకృష్ణులు ఆనంద నిలయం ప్రవేశించడంతో రోహిణీ నక్షత్రోత్సవం ఘనంగా ముగుస్తుంది.

* * *

## ౨. ఆరుద్ర నక్షత్రోత్సవం

**అనంతః ప్రథమం రూపం లక్ష్మణస్తు తతః పరమ్**
**బలభద్రః తృతీయ స్త్స్యాత్ కలౌ రామానుజ స్స్మృతః.**

కృతయుగంలో అనంతుడుగాను, త్రేతా యుగంలో లక్ష్మణస్వామిగాను, ద్వాపర యుగంలో బలరామునిగాను, జననమందిన ఆదిశేషుడే ఈ కలియుగంలో భగవ ద్రామానుజస్వామిగా అవతరించినాడని పై శ్లోక సారాంశం.

శ్రీ వైష్ణవమత ప్రవృద్ధ ప్రచారకులలో అగ్రగణ్యులు శ్రీరామానుజులు. వారు క్రీ.శ. 1017, పింగళనామ సంవత్సర మేష మాసంలో అనగా వైశాఖ మాసంలో ఆర్ద్రా నక్షత్రం రోజున అవతరించారు. విశిష్టాద్వైత మత ప్రచారకులైన వీరికి వేంకటాచలమన్న పరమ ప్రీతి. అందున్న వేంకటేశ్వరుడన్న ఎనలేని భక్తి. అందువల్లే క్రీ.శ. 11-12 శతాబ్దాల్లో వేంకటా చల క్షేత్రాన్ని దర్శించినాడు.

అనాదిగా వైఖానసాగమ శాస్త్రరీత్యా అర్చనలు కొనసాగుతున్న తిరుమల క్షేత్రంలో వీరు పూజా నివేదనలను నిబద్ధీకరించి, క్రమపరచి వాటిని స్వయంగా పర్యవేక్షించినారు. తన తదుపరి వాటిని ఆలయార్చనలు సక్రమంగా సాగేట్లుగా పరిశీలిస్తూ సేవలందించటానికి మఠాలను స్థాపించి వాటి కధిపతులుగా 'జీయరు' లను వైష్ణవ స్వాములను ఏర్పాటు చేసినారు. ఆనాటి నుండి ఈజీయరు స్వాములు ఆలయార్చనల్లో ప్రధాన పాత్ర వహిస్తూ శ్రీ స్వామివారి కైంకర్యంలో ప్రధానపాత్ర వహిస్తూనే వున్నారు.

అంతమాత్రమే కాదు. అనంతాళ్వాన్ అను శిష్యుని ప్రేరేపించి జీవితాంతం తిరుమల శ్రీస్వామివారికి పుష్ప కైంకర్యం చేయించినారు శ్రీరామానుజస్వామి.

తిరుమల శ్రీవారి పుష్ప కైంకర్యంలో అనాడు ప్రధాన పాత్ర వహించిన అనంతాళ్వారు, శ్రీవారి సన్నిధిలో తిరుమల ఆలయ ఆవరణంలోనే తమ గురువైన భగవద్రామానుజులవారి శిలామూర్తిని, ఉత్సవ మూర్తిని ప్రతిష్ఠించినారు. ఉత్సవాలు నిర్వహించారు. అలా ఏర్పాటు చేయబడి నిర్వహింపబడుతున్న రామానుజులవారి జయంతుత్సవాలే అరుద్రా నక్షత్రోత్సవాలుగా జరుగుతున్నాయి.

ప్రతి సంవత్సరం మేష మాసంలో (వైశాఖ శుద్ధ పంచమి) ఆరుద్రా నక్షత్రానికి ముగిసేట్లుగా పదిరోజుల ముందునుంచే భాష్యకారులైన శ్రీరామానుజులవారి జయంతి ఉత్సవాలు ''భాష్యకార ఉత్సవాలు'' అను పేర జరుపబడతాయి.

ఇవిగాక ప్రతినెలా ఆరుద్ర నక్షత్రం రోజున భాష్యకారులైన రామానుజుల వారికి శ్రీ వేంకటేశ్వరస్వామివారితోపాటు తిరుమల పురవీధుల్లో ఊరేగింపు జరుగుతుంది.

ఆరుద్ర నక్షత్రం రోజున యధా ప్రకారంగా ఉదయం మధ్యాహ్నం ఆరాధనలన్నీ ముగిసిన తర్వాత శ్రీవేంకటేశ్వరస్వామివారు కల్యాణోత్సవం, బ్రహ్మోత్సవం, డోలోత్సవం వంటి ఆర్జిత ఉత్సవాల్లో పాల్గొన్న తర్వాత ఆలయం వెలుపలవున్న కొలువు మండపంలోని సహస్ర దీపాలంకార సేవలో పాల్గొంటారు. ఇంతలో శ్రీరామానుజస్వామి ఒక పీఠాన్ని ఎక్కి ఆలయాన్ని వీడి స్వామివారికి ఎదురుగా వచ్చి నిలుస్తారు.

శ్రీస్వామివారి మీది పుష్పమాలను రామానుజులవారికి వేస్తారు. పిదప శ్రీస్వామివారికి హారతి ఇచ్చి, అదే శేష హారతిని రామానుజులవారికి ఇస్తారు. తర్వాత రామానుజులవారికి శఠారి మర్యాదలు అయిన తర్వాత జియ్యంగారికి ఏకాంగికి శఠారి మర్యాదలు జరుగుతాయి. పిదపతిరుమలపుర వీధుల్లో ఊరేగింపు జరుగుతుంది.

బంగారు తిరుచ్చిలో దేవేరులతో కూడిన శ్రీస్వామివారు బయలుదేరగా, శ్రీస్వామివారికి అభిముఖంగా మరొక పీఠంపై శ్రీరామానుజులవారు మహాప్రదక్షిణ మార్గంలో ఊరేగిన తర్వాత ఆలయం చేరుకుంటారు. విమాన ప్రదక్షిణంగా రామానుజులవారి మందిరాన్ని చేరుకొంటారు. రామానుజస్వామి మందిరం ప్రవేశిస్తారు. అక్కడ శ్రీస్వామివారికి ఆస్థానం జరుగుతుంది. శ్రీస్వామివారికి నివేదన అయిన తర్వాత హారతి జరుగుతుంది. ఈ శేష హారతినే రామానుజస్వామివారికిఇచ్చి శఠారి మర్యాదలు జరుపుతారు. ప్రసాద వినియోగం అయిన తర్వాత శ్రీస్వామివారు ఆనంద నిలయం ప్రవేశించడంతో ఆరుద్రా నక్షత్రోత్సవం ముగుస్తుంది.

* * *

## 3. పునర్వసు నక్షత్రోత్సవం

ఒకప్పటి త్రేతాయుగంలోని శ్రీరామ చంద్రుడే ఈనాడు వేంకటాచలంపై శ్రీనివాస ప్రభువుగా వెలిశాడనీ అంటారు. అందుకే నేటికీ శ్రీ వేంకటేశ్వరస్వామి--

**కౌసల్యా సుప్రజారామ! పూర్వా సంధ్యా ప్రవర్తతే;**
**ఉత్తిష్ఠ నరశార్దూల! కర్తవ్యం దైవమాహ్నికమ్.**

అని శ్రీరామచంద్రుని పేరుతోనే మేల్కొల్పులు పాడించుకుంటూ వున్నాడు. అంతేకాదు తిరుమల క్షేత్రంలో శ్రీవారి సన్నిధిలో శ్రీసీతారామలక్ష్మణ హనుమంతుల ఉత్సవ విగ్రహాలు కూడ కొలువై వున్నాయి. ఈ ఉత్సవమూర్తులు ఎప్పుడు ఎలా ఇక్కడ ప్రవేశ పెట్టబడినాయో చెప్పటం కష్టం. అలా ఈ వేంకటేశుడే ఆనాటి రాముడని చెప్పటాని కన్నట్లుగా ప్రతి సంవత్సరం శ్రీరామ నవమినాడు తిరుమల శ్రీవారి ఆలయంలో శ్రీ సీతారామలక్ష్మణ హనుమత్సమేతంగా కొలువు (ఆస్థానం) జరుగుతుంది. ఆ మరు నాడు దశమినాడు శ్రీరామ పట్టాభిషేక మహోత్సవంలో హనుమంత అంగద సుగ్రీవులు కూడా పాల్గొంటారు.

అంతమాత్రమేకాదు. ప్రతినెలా శ్రీరాముని జన్మ నక్షత్రం అయిన పునర్వసు రోజున తిరుమల పురవీధుల్లో శ్రీసీతారామ లక్ష్మణ హనుమంతులు ఊరేగింపబడతారు. ఈ పునర్వసు నక్షత్రం రోజున శ్రీ వేంకటేశ్వర స్వామివారు ఆలయం వెలుపలికి రారు.

ప్రతి రోజున ఉదయం సుప్రభాతం జరిగిన తర్వాత భోగశ్రీనివాసమూర్తికి నిత్యాభిషేకం, శ్రీవారి మూలమూర్తికి బంగారు పాదాభిషేకం జరుగుతుంది. పునర్వసు నక్షత్రం ఉన్న రోజున ఈ అభిషేకాలతోపాటు ప్రత్యేకంగా శ్రీ సీతారామ లక్ష్మణ హనుమంతులకు కూడ అభిషేకం జరుపబడు తుంది. ఆ తరువాత వస్త్రాలంకరణ తోమాల సేవ అన్నిమూర్తులకు జరుగుతుంది.

ఇక అప్పటినుండి యధాక్రమంగా అర్చన, మొదటిగంట, రెండవ అర్చన, రెండవ గంట అయిన తర్వాత శ్రీ వేంకటేశ్వరస్వామి వారికి కల్యాణోత్సవం, ఆర్జిత బ్రహ్మోత్సవం, డోలోత్సవం, వసంతోత్సవాలు జరుగుతాయి. ఆ తర్వాత శ్రీదేవి భూదేవి సహిత మలయప్ప స్వామివారు ఆనందనిలయ ప్రవేశం చేస్తారు.

ఆ తర్వాత శ్రీసీతారామలక్ష్మణులు ఒక బంగారు శ్రీపీఠాన్ని అధిరోహించి విశేష ఆభరణాలతో పూలమాలలతో అలంకరించు కొని ఆలయం బయటవున్న కొలువు మండపంలోనికి వేంచేసి, 'సహస్ర దీపాలంకార సేవ' లో పాల్గొంటారు.

ఇలా కొంత సేపు వేదపారాయణల మధ్య, బాజా భజంత్రీలు మ్రోగుతుండగా సహస్రదీపాలంకార సేవలో భక్తులకు దర్శనమిస్తారు. తర్వాత శ్రీసీతారామ లక్ష్మణులు ఆలయ మహా ప్రదక్షిణంగా ఊరేగుతారు.వీరికి ఎదురుగా

మరొక పీఠంపై హనుమంతులవారు శ్రీసీతారామలక్ష్మణులకు అభిముఖంగా ఊరేగుతారు. ఇలా ఈ ఉత్సవం ప్రదక్షిణంగా సాగి ఆలయం సన్నిధి వీధిలోవున్న శ్రీ బేడి ఆంజనేయస్వామివారి దగ్గరకు వస్తారు. అక్కడ రాములవారి మీది పూలహారాన్ని బేడిఆంజనేయస్వామికి అలంకరించి నివేదన చేస్తారు. పిదప శ్రీసీతా రామలక్ష్మణులకు కర్పూరహారతి ఇచ్చి ఆశేషహారతిని బేడి ఆంజనేయస్వామివారికి ఇస్తారు. ప్రసాద వితరణ అయిన తర్వాత శ్రీసీతారామ లక్ష్మణుల హనుమత్సమేతంగా శ్రీవారి ఆలయం ప్రవేశించడంతో పునర్వసు నక్షత్రం నాటి ప్రత్యేకోత్సవం సమాప్తమవుతుంది.

* * *

## 4. శ్రవణ నక్షత్రోత్సవం

కలియుగవైకుంఠంగా ప్రసిద్ధికెక్కిన పుణ్యక్షేత్రం తిరుమల. సుమారు ఐదువేల ఏండ్ల కిందట ఈ క్షేత్రంలో భక్తులపాలిటి కొంగు బంగారమై శ్రీవేంకటేశ్వరుడు వెలిసాడు. ఆ తిరుమల గోవిందుడు అలనాడు కన్యామాసంలో శ్రవణ నక్షత్రం రోజున సోమవారంనాడు స్వయంభువుగా ఆవిర్భవించినట్లుగా ప్రతీతి! అది మొదలుగా బ్రహ్మదేవుడు శ్రీనివాసుడు ఆవిర్భవించిన నక్షత్రమైన శ్రవణం రోజుకు సమాప్త మయ్యేట్లుగా ప్రతి కన్యామాసంలో పదిరోజుల పాటు ఉత్సవాల అత్యంత వైభవంగా నిర్వహించాడు. ఆనాడు బ్రహ్మదేవుడు నిర్వహించిన ఉత్సవాలు కాబట్టి అవి బ్రహ్మోత్సవాలని ప్రసిద్ధికెక్కి ఆనాటి నుండి నేటికీ నిరాఘాటంగా సాగుతునే వున్నై. ఒక వేళ అధికమాసం వచ్చినట్లయితే తులా మాసంలో వచ్చే దసరా నవ రాత్రుల్లో కూడా శ్రవణ నక్షత్రం నాటికి అవబృథం అయ్యేట్లుగా కూడ నవరాత్రి బ్రహ్మోత్సవాలు కూడ జరుగుతునే వున్నై.

ఇంతేగాక ప్రతి సంవత్సరం కార్తీక మాసంలో వచ్చే శ్రవణ నక్షత్రం రోజున తిరుమల శ్రీస్వామివారికి 'పుష్పయాగోత్సవం' అనే విశిష్టమైన ఉత్సవం అత్యంత వైభవంగా నిర్వహింపబడుతున్నది.

ఇలా వార్షికోత్సవాలేగాక ప్రతినెలా వచ్చే శ్రవణం నక్షత్రంరోజున తిరుమల శ్రీస్వామివారికి ప్రత్యేక పూజలు ఊరేగింపులు జరుపబడుతున్నాయి.

ప్రతిరోజు మాదిరే సుప్రభాతా నంతరం శ్రీ భోగ శ్రీనివాసునికి, శ్రీవారి మూలమూర్తి బంగారు పాదాలకు అభిషేకం జరగడంతోపాటు, శ్రవణ నక్షత్రం రోజున ప్రత్యేకంగా శ్రీదేవి భూదేవి సమేత శ్రీమలయప్ప స్వామివారికి కూడ అభిషేకం జరుగుతుంది. ఆ తరువాత తోమాలసేవ, కొలువు, అర్చన, మొదటిగంట, రెండవ అర్చన, రెండవ గంట ఇలా కార్యక్రమాలు పూర్తి అవుతాయి.

పిదప శ్రీదేవి భూదేవులతో కూడిన శ్రీ మలయప్పస్వామి బంగారుతిరుచ్చి నెక్కి ఛత్రచామర మంగళవాద్య పురస్సరంగా విమాన ప్రదక్షిణంగా వెళ్లి వెండి వాకిలి బయట ధ్వజస్తంభానికి ప్రదక్షిణం చేస్తూ సంపెంగ ప్రదక్షిణంలోని కల్యాణ మండపానికి తరలి వెళ్తారు. అక్కడ కల్యాణోత్సవం ముగిసిన తరువాత శ్రీస్వామివారు, ఆర్జిత బ్రహ్మోత్సవం డోలోత్సవం, వసంతోత్సవంలో పాల్గొంటారు తర్వాత ఆ సాయంత్రం విశేష ఆభరణాల్ల తోను, పుష్పాలతోను అలంకృతమైన శ్రీస్వామివారు దేవేరులతోకూడి ఆలయం వెలుపలవున్న కొలువు మండపం చేరుకొంటారు. వేయి నేతి దీపాలు వెలుగుతుండగా ఆ దీపాల వెలుగులు వెనక వున్న అద్దాల్లో ప్రతిఫలించి మరింత తేజస్సుతో కూడిన ఆ మండపం మధ్యలో వున్న ఊయలలో శ్రీస్వామివారు వేంచేస్తారు. సహస్ర దీపాలంకార సేవలో అశేష భక్త జనానికి దర్శనమిస్తూ, ఒక వైపు వేదగానం వింటూ, మరోవైపు గాయకుల కీర్తనలు వింటూ అత్యంత వైభవంగా శ్రీమలయప్ప స్వామివారు దేవేరులతోకూడ ఊయల లూగుతారు. తర్వాత నైవేద్యం, నక్షత్రహారతి, కర్పూర హారతులు జరుగుతాయి. ఆ తర్వాత శ్రీస్వామి వారు దేవేరులతో కూడి ఛత్రచామర సార్వ భౌమాధికారాలతోవేదపారాయణ, దివ్యప్రబంధ పారాయణలు సాగుతుండగా తిరుమల పురవీథుల్లోఊరేగుతారు. దేవేరులతో కూడివున్న శ్రీస్వామివారు ఆనంద నిలయం ప్రవేశించడంతో శ్రవణ నక్షత్రోత్సవం పూర్తి అవుతుంది.

ఇంతటితో తిరుమలేశుని తిరు నక్షత్రోత్సవాలు పూర్తి అయ్యాయి.

**గోవిందా! గోవిందా! గోవింద!!**

* * *

# సప్తగిరీశుని సంవత్సరోత్సవాలు

ఏడుకొండలవాడికి ఏడాదిపొడవునా ఆయా సమయాల్లో నిర్దిష్టంగా ఆ యా వుత్సవాలు జరుగుతున్నాయి. ఇలా ఎన్నో జరుగుతున్నా వీటన్నిటిలో సంవత్సరానికి ఒక్కమారు మాత్రమే ప్రత్యేక సమయాల్లో జరిగే సేవలు ఉత్సవాలు మాత్రం ప్రత్యేకతను సంతరించుకున్నాయి.

ప్రాచీనకాలంనుంచీ తిరుమలలో సప్తగిరీశునికి జరుగుతున్న సంవత్సరోత్సవాలలో కొన్ని నేటికీ అలాగే నిర్వహింపబడుతున్నాయి. మరికొన్ని కొద్దిగా మార్పులు చేర్పులతోజరుగుతున్నాయి. మరికొన్ని ఆయా కాలాల్లో కొత్తగా ఏర్పాటు చేయబడి నేటికీ కొనసాగుతున్నాయి. మరి కొన్ని ప్రాచీన కాలంనుంచీ జరుగుతూ అర్ధాంతరంగా మధ్యలోనే నిలిచి పోయాయి. మరికొన్ని ఉత్సవాలు కాలాంతరంలో నిలిచిపోయినా, వాటిలో కొన్ని పునరుద్ధరింపబడి ఘనంగా శ్రీ వేంకటేశ్వర స్వామికి జరుపబడుతున్నాయి.

ముఖ్యంగా సంవత్సరోత్సవాలన్నీ శ్రీవారి ఉత్సవమూర్తి అయిన శ్రీ మలయప్ప స్వామివారికి జరుగుతుండడం గమనింప దగిన విశేషం!

వైఖానసాగమశాస్త్రోక్తంగా శ్రీస్వామి వారికి ఒక్కొక్క విధంగా జరుగుతున్న ఉత్సవాల్లో స్వామివారి వైభవం ఒక్కొక్క విధంగా వుంటుంది మరి! అంతేకాదు. ఆ ఉత్సవాల్లో శ్రీనివాసుడు మహాదర్పంగా మహా శోభాయమానంగా దర్శన మివ్వడమేగాక, ప్రతి ఉత్సవంలోను ఎప్పటికప్పుడు నిత్యనూతనంగా భక్తులకు గోచరిస్తూ దివ్యానుభూతులను పంచుతూనే వున్నాడు.

ఇలాగ సంవత్సరం పొడవునా జరుగుతున్న సప్తగిరీశుని సంవత్సరోత్సవాలకు ముందుగా సంవత్సరంలో కొన్ని విశేష పండుగలకు ముందు ఆలయాన్ని పరిశుద్ధి చేసే కోయిల్ ఆళ్వారు తిరుమంజనం గూర్చి తెలుసుకొందాం.

**గోవిందా! గోవిందా! గోవింద!!**

* * *

## 1. కోయిల్ ఆళ్వారు తిరుమంజనం

కోయిల్ అనగా కోవెల, గుడి, క్షేత్రం అని అర్థాలు. ఆళ్వారు అనగా భక్తుడు అని అర్థం. భక్తుని హృదయంలో భగవంతు డున్నట్లే కోవెల లేదా గుడి లోపల (గర్భగుడిలో) భగవంతుడు ఉంటాడు. కనుక కోవెలను భక్తునితో పోల్చి చెప్పటం ఒక విశేషం. అలాంటి కోవెలభక్తుడికి (గుడి)జరిగే అభిషేకాన్నే ''కోయిల్ ఆళ్వారు తిరుమంజనం''అంటారు. ఒకవిధంగా దేవాలయశుద్ధిని, ముఖ్యంగా ''గర్భాలయ శుద్ధి'' కార్యక్రమాన్ని ''కోయిల్ ఆళ్వారు తిరుమంజనం'' అని చెప్పవచ్చు. తిరుమంజనం అనగా తిరుమజ్జనం. అనగా మంగళస్నానం అనిఅర్థం దాన్నే మంగళాభిషేక మంటారు.

తిరుమల పుణ్యక్షేత్రంలో శ్రీ వేంకటేశ్వరుడు స్వయంభువై సాలగ్రామ శిలామూర్తిగా వెలసిన గర్భాలయమే ఆనంద నిలయం. ఈ ఆనంద నిలయం మొదలు బంగారు వాకిలి వరకు గల ఆలయాన్ని సుగంధద్రవ్యాలు కలిపిన జలంతో శుద్ధి చెయ్యటమే కోయిల్ ఆళ్వారు తిరుమంజనం అంటారు. ఈ ఆలయశుద్ధి కార్యక్రమం ఒక మహాయజ్ఞంగా, పవిత్రకార్యంగా పెద్ద ఎత్తున ఆలయంలో నిర్వహింపబడుతుంది.

చాల పూర్వం నుండీ తిరుమలలో ఈ ''ఆలయశుద్ధి'' కార్యక్రమం పెద్ద ఎత్తున జరిగేదని, తెలుస్తున్నది. క్రీ.శ. 1535 నాటికి తిరుమలలో సంవత్సరం పొడవునా పది బ్రహ్మోత్సవాలు జరిగేవనీ, ఇలా ప్రతి బ్రహ్మోత్సవానికి ముందురోజున కోయిల్ ఆళ్వారు తిరుమంజనోత్సవాలు జరిగేవని శాసనాలు స్పష్టం చేస్తున్నాయి. 1535లో జరిగిన '''ఆలయశుద్ధి'కి భక్తుడైన వడతిరు వేంకట అయ్యన్ విరాళమిచ్చినట్లు తెలుస్తున్నది.

కోయిల్ ఆళ్వారు తిరుమంజనం పూర్తి అయిన వెంటనే వంగీపురం నారాయణ శెట్టి అనేదాత, స్వామివారికి పాలు, తేనె, పెరుగు, నెయ్యి ఒక్కొక్కటి ఒక్కొక్క నాలి - వీటితో 100 అరటి పండ్లు కలిపి తయారుచేసిన పంచామృతం, పానకం నివేదించటానికి గాను విరాళాలిచ్చాడట! ఆనాడు తిరుమంజ నానంతరం ''ఇడ్లి పడి'' నివేదన జరిగేదట! అనగా 51 ఇడ్లీలవంతున నివేదన చేసేవారు.

ప్రస్తుతం తిరుమలలో ఉగాది, ఆణివార ఆస్థానం, బ్రహ్మోత్సవం, వైకుంఠ ఏకాదశి పర్వదినాలకు ముందు అంటే సంవత్సరంలో నాలుగుమార్లు ఆలయశుద్ధి అనే కోయిల్ ఆళ్వారు తిరుమంజనం జరుప బడుతున్నది. ఇటీవల తిరుమలలో భక్తజన సమ్మర్దం విపరీతంగా పెరిగినందువల్ల పై ఉత్సవాలకు ముందురోజుకాకుండా, ముందువచ్చే మంగళవారంనాడు ఈ ఆలయశుద్ధి కార్యక్రమం నిర్వహింప బడుతున్నది. మంగళవారంనాడు మిగిలిన రోజులకన్న జన సమ్మర్దం కొంత తక్కువగా వుంటుంది.

కోయిల్ ఆళ్వారు తిరుమంజనం జరుపదలచిన మంగళవారంనాడు, ప్రతిరోజు మాదిరిగానే బంగారువాకిలిముందు సుప్రభాతం, విశ్వరూప దర్శనం, తోమాలసేవ, కొలువు, అర్చన మొదటి గంట నైవేద్యం శాత్తుమొర కార్యక్రమాలు యథాక్రమంగా జరుపబడతాయి.

ఆ తర్వాత ఆనందనిలయంలోని శ్రీ వేంకటేశ్వరస్వామివారి మూలమూర్తి (శిలామూర్తి)పై ఎలాంటి దుమ్ము, ధూళి, నీళ్లు పడకుండా శిరసాదిగా పాదాంతం వరకు ఒక వస్త్రాన్ని కప్పేస్తారు. ఇలా స్వామివారిపై కప్పే వస్త్రాన్ని "మలై గుడారం" అంటారు. ఇక మిగిలిన ఉత్సవ విగ్రహాలు, సాలగ్రామాలు మున్నగునవి అర్చకులు బంగారువాకిలి ముందుగల గంటా మండపంలోనికి తరలిస్తారు. ఒక్క భోగ శ్రీనివాసమూర్తి విగ్రహం మాత్రం మూలమూర్తితోపాటు మలై గుడారం లోపల వుంచుతారు. ఈ వెండి విగ్రహం ఎట్టి పరిస్థితుల్లోను బయటికి తీసుకొని రాబడదు. ఒకవేళ తీసుకొనివస్తే మూలమూర్తితో పట్టుదారంతోకాని, బంగారుతీగతోకాని అనుసంధింపబడి వుంటుంది. మిగిలిన విగ్రహాలన్నిటికి గంటా మండపంలో చుట్టూ తెరలుగట్టి ఏకాంతంగా తిరుమంజనం (అభిషేకం) చేస్తారు.

ఇక దీపపు సెమ్మెలు, పంచపాత్రలు, బంగారు తీర్థం చెంబులు, అన్నీ శ్రీస్వామివారి సన్నిధి నుండి బంగారు బావి వద్దకు తరలించి చింతపండు వగైరా వాటితో తోమి శుభ్రం చేస్తారు. వీటితోపాటు బంగారు సింహాసనం, మంచం, వెండి గొలుసులు బయటికి తెచ్చి విమాన ప్రదక్షిణ మార్గంలో ఆలయ సిబ్బంది తుడిచి శుభ్రం చేస్తారు,

ఇవేగాక రాములవారి మేడలో గల అనంత, గరుడ, విష్వక్సేన, సుగ్రీవ, హనుమంత అంగదుల విగ్రహాలను కూడ అర్చకులు తెచ్చి ఏకాంత తిరుమంజనం చేస్తారు. ఇలా అన్ని విగ్రహాలను శుభ్రంగా రుద్ధి శుద్ధ జలంతో అభిషేకించి, తుడిచి, పట్టువస్త్రాలను అలంకరిస్తారు.

ఆనంద నిలయంలో అర్చకులు, పరిచారకులు ఏకాంగులు మాత్రం ప్రవేశించి గర్భాలయం లోపల నాలుగు గోడలకు, పై కప్పు మీదా అంటుకున్న దుమ్ము ధూళి, బూజు, కర్పూరపు మసిని బాగా గోకి, రుద్ధి శీకాయనీళ్లతో కడుగుతారు.

ఇక కులశేఖరపడి (శ్రీస్వామివారికి ఎదురుగా వున్న మొదటి గడప)నుండి మొదలు దేవస్థానం ఉద్యోగులు ఆలయాన్ని శుభ్రం చేసే కార్యక్రమంలో ఎంతో ఉత్సాహంగా అత్యంత భక్తి ప్రపత్తులతో పాల్గొంటారు.

ఒకవైపు ఆనందనిలయంలో నాలుగుగోడలకు, పై భాగాన అంటుకున్న కర్పూరపు మసిని బాగాగీకి, కిందికి దులుపుతారు. మళ్లీ శీకాయ, వాషింగు షోడాను కలిపిన వేడినీళ్లతో గోడలను కడిగి శుభ్రం చేస్తారు. ఇలా ఒక్క ఆనంద నిలయంలోనే కాదు. విమాన ప్రద క్షిణంలోవున్న వరదరాజస్వామి ఆలయం, వంటశాలలోని వకుళమాత మందిరం, సుగంధపరిమళాలు పట్టు వస్త్రాలు భద్రపరిచే సభ అర, శ్రీరామానుజుల సన్నిధి, యోగ నరసింహస్వామి ఆలయం, వైకుంఠ ద్వారంలోవున్న విష్వక్సేనుల సన్నిధి, గరుడాళ్వారు సన్నిధి, బయటపడిపోటులో పోటు తాయార్‌సన్నిధి మున్నగుచోట్ల ఆలయ అర్చకపరిచారకవర్గం శుభ్రం చేస్తారు.

ఇంకోవైపు ఆలయంలోని దీపపు సెమ్మెలు చెంబులు, ఊయల గొలుసులు, తట్టలు, సహస్రకలశాలు శుభ్రం చేస్తుండగా.

మరోవైపు బంగారువాకిళ్లు, వెండివాకిళ్లు, బంగారు గోపురం, తుడిచి మెరుగులు పెడుతుంటారు.

రంగనాయక మండపంలోని బంగారు, వెండి వాహనాలను తుడిచి మెరుగులు పెడతారు.

ఇలా ఆలయంలో ఎటుచూసినా ఏ మూల చూచినా ఆలయ అధికారుల నుంచి సేవకులదాకా ఆలయాన్ని శుభ్రంచేసే కార్యక్రమంలో అత్యంత భక్తి ప్రపత్తులతో పాల్గొంటారు. ఇలా ఆలయం అంతటా శుభ్రం చేయడంతో ఒకఘట్టం పూర్తవుతుంది.

ఆ తర్వాత శుభ్రంచేసిన గోడలకు ''పరిమళం'' పూత పూయడం అనే కార్యక్రమం రెండోఘట్టం ప్రారంభ మవుతుంది.

దేవస్థానం కార్యనిర్వాహకులు ''కురాళం'' అనే '6 x 6' చతురస్రాకారం కలిగిన మఖమల్ గుడ్డను వెండి తట్టలో పట్టుకుంటారు. (గర్భాలయంలో శ్రీస్వామి వారి మూలమూర్తిపైన ఎలాంటి దుమ్ము ధూళి పడకుండా ఉపరితలానికి కట్టే చతురస్రాకారపు గుడ్డను కురాలం అంటారు). శ్రీమాన్ జియ్యంగారు పరిమళంగల వెండిగిన్నెను పట్టుకుంటారు. ఇలా దేవస్థానం అధికారులు, జియ్యంగారు, యోగనరసింహస్వామి ఆలయం పక్కనగల పరిమళపు అరనుండి ఛత్ర చామర బాజా భజంత్రీలతో వేదపారాయణలతో....బయలుదేరి ధ్వజస్తంభానికి ప్రదక్షిణంచేస్తూ వచ్చి, విమాన ప్రదక్షిణం చేసి, ఆలయ ప్రవేశంచేసి, శ్రీస్వామివారి సన్నిధిలో అర్చకులకు 'పరిమళాన్ని, కురాళాన్ని' అందిస్తారు.

వెంటనే అర్చకులు ''కురాళం'' వస్త్రాన్ని స్వామివారి విగ్రహంపైన ఉపరితలానికి కడతారు. ఆ తర్వాత జియ్యంగారు ఇచ్చిన పరిమళాన్ని అర్చకులు పరిచారకులు, ఆలయంలోని గోడలకు పూస్తారు.

తర్వాత అంతకుముందే తయారుచేసి సిద్ధంగా వుంచుకున్న పరిమళాన్ని ఆనందనిలయంలో గరుడాళ్వార్ మందిరంలో, యోగనరసింహస్వామి, వరదరాజస్వామి, వకుళమాత, భాష్యకారులు, విష్వక్సేనుల సన్నిధిలో అర్చకులు, పరిచారకులు పూస్తారు.

కులశేఖరపడి మొదలుగా బంగారు వాకిలి వరకు ఆలయ అధికారులు – ఇతర ఉద్యోగులు– సేవకులు మున్నగువారు ఈ పరిమళపు పూతను పూస్తారు. ఈ పరిమళం పూతను నామంకోపు (సుద్దపొడి) శ్రీచూర్ణం, గడ్డకర్పూరం, గంధంపొడి, కుంకుమ ఖిచిలిగడ్డ వగైరాలను పెద్ద పెద్ద మోతాదుల్లో కలిపి

ముందురోజు రాత్రే పెద్ద గంగాళాల్లో నీటితో కలిపి బాగా రంగరించి ఒక పలచని లేహ్యంగా తయారుచేసి వుంచుకుంటారు. ఆలయం శుభ్రపరచి, గోడలకు ఈ పరిమళపు లేహ్యాన్ని పూస్తారు.

ఇలా తిరుమలలో కోయిల్ ఆళ్వారు తిరుమంజనం కార్యక్రమం ఉదయం 7 గంటలనుండి ప్రారంభమై నాలుగు గంటలపాటు సాగుతుంది.

ఇంతలో రెండవ నైవేద్యానికి వలసిన వంటలు సిద్ధం చేసిన వెంటనే వంటశాలలు కూడ శుభ్రంచేసి పరిమళపు పూత పూస్తారు. పిదప ఆలయమంతా గోడలకు పూతపూసిన తర్వాత నేలంతా నీళ్లతో కడిగి శుభ్రం చేస్తారు.

ఇలా ఆలయం అంతటా శుభ్రం చేసిన తర్వాత ఆనంద నిలయంనుండి బయటికి తెచ్చిన బంగారుగిన్నెలు, దీపపు సెమ్మెలు, అర్ఘ్యపాత్రలు...వగైరాలన్నిటిని యథాస్థానం చేరుస్తారు.

ఆ తర్వాత, అర్చకులు బంగారువాకిలి దగ్గర అభిషేకించి, పట్టు వస్త్రాలను ధరింపజేసిన ఉత్సవమూర్తులను మళ్లీ సన్నిధి లోనికి తరలిస్తారు. ఆ తర్వాత కులశేఖరపడి రాములవారి మేడ, బంగారువాకిళ్లకు వున్న పాత పరదాలు (తెరలు) తీసి కొత్తవి కడతారు. ప్రతి, కోయిల్ ఆళ్వారు తిరుమంజనానికి ఆనందనిలయంలో శ్రీస్వామివారిపై వున్న 'కురాలం', వాకిళ్ల పరదాలు కొత్తవి కడతారు.

ఇలా ఆలయం శుద్ధిచేసి, ఎక్కడి వస్తువులు అక్కడికి చేరవేసిన అనంతరం, కులశేఖరపడితెరలు వేస్తారు. అర్చకులు శ్రీస్వామివారి మూలమూర్తి పై కప్పివున్న 'మలైగుడారం' తీసివేస్తారు. దీపారాధనలు చేస్తారు.

పిదప అన్నిమూర్తులకు లఘువుగా అర్ఘ్య పాద్యాచమన స్నానాది ఉపచారాలు క్లుప్తంగా సమర్పించి, కర్పూరహారతి ఇస్తుండగా తెరతీస్తారు. అర్చకులు హారతి స్వీకరించి శఠారి మర్యాదలు పొందుతారు.

తర్వాత ''కోయిల్ ఆళ్వారు తిరుమంజనం'' ఆర్జిత సేవా భక్తులను లోనికి ప్రవేశపెడతారు. వీరితో సంకల్పం చెప్పించి, శ్రీస్వామివారి దర్శనం, హారతి ఇసారు.

ఈ కోయిల్ ఆళ్వారు తిరుమంజనం సంవత్సరంలో నాలుగుమార్లు ఉగాది, ఆణివార ఆస్థానం, బ్రహ్మోత్సవం, వైకుంఠ ఏకాదశి పర్వదినాలకు ముందు వచ్చే మంగళవారాల్లో జరుపబడుతుంది.

## ఎలా పాల్గొనాలి?

కోయిల్ ఆళ్వార్ తిరుమంజనంలో పాల్గొనదలచిన భక్తులు, ఏ బాంకులోనైనా సరే; రు.3,000/- డి.డి.ని. ''ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు, తి.తి.దేవస్థానములు'' తిరుపతి వారిపేర తీసి, దానిని, 3 నెలలు ముందుగా ''పేష్కారు, తిరుమల శ్రీవారి ఆలయం, తిరుమల–5 1 7 5 0 4'' వారికిపంపుతూ కావలసిన తేదీ (మంగళవారం) కోయిల్ ఆళ్వారు తిరుమంజనానికి రిజర్వు చేసుకోవచ్చు. అనుమతిని ముందుగా ధ్రువపత్రం ద్వారా గృహస్థులకు తెలియజేయ బడుతుంది. అయినా అప్పటికి వున్న అవకాశాన్ని బట్టి మాత్రమే వీలు కల్పింపబడుతుంది.

ఆర్జిత భక్తులకు గృహస్థుతోపాటు పదిమందిని శ్రీవారి దర్శనానికి అనుమతిస్తారు. వీరికి 1 5 లడ్లు, 1 5 వడలు, 1 0 అప్పాలు, 1 0 దోసెలు, అన్నప్రసాదాలతోపాటు, వస్త్ర బహుమానం కూడా వుంటుంది.

కోయిల్ ఆళ్వార్ తిరుమంజన సేవా భక్తులను సదరు మంగళవారంరోజున ఉదయం 1 1 గంటలకు వైకుంఠం 'క్యూ 'ద్వారా మాత్రమే ఆలయంలోనికి ప్రవేశింపజేస్తారు.

**గోవిందా! గోవిందా! గోవింద!!**

* * *

## ౭. ఉగాది ఆస్థానం

శ్రీవైకుంఠంనుండి భక్తులకోసమే భూలోకానికి తరలివచ్చి, తెలుగునేలలో ఇల్లు గట్టుకొని తెలుగువారి ఇలవేలుపుగా, ఇలువేల్పుగా స్థిరంగా నిలిచిన శ్రీ వేంకటేశ్వరస్వామి కూడ తెలుగువారి మాదిరే తెలుగు సంవత్సరాది పండుగను చేసుకుంటున్నారు. దానినే ''ఉగాది అస్థానం'' అంటారు.

తెలుగు సంవత్సరాది పండుగనుండే తిరుమలేశుని ఆలయ కార్యక్రమాలు ఉత్సవాలు మొదలవుతాయి. అంటే శ్రీవారి సుప్రభాతసేవతో ''ఉగాది'' ప్రారంభమవు తుంది.

ఉగాదిరోజున సుప్రభాతం పూర్తి అయిన వెంటనే తోమాలసేవ జరుగుతుంది. తోమాలసేవ జరిగిన వెంటనే ప్రతిరోజూ మామూలుగా కొలువు శ్రీనివాసమూర్తికి జరిగే కొలువు జరుగదు. తోమాలసేవ అనంతరం శ్రీదేవి భూదేవి సమేతంగా శ్రీమలయప్పస్వామి వారికి శ్రీవారి సేనాధిపతి విష్వక్సేనుల మూర్తికి ఏకాంతంగా తిరుమంజనం జరుగుతుంది.

పిదప బంగారువాకిలి ముందరగల తిరుమహామణి మండపం (గంటా మండపం) లో, బంగారు వాకిలికి ఎదురుగా వున్న గరుడాళ్వారుకు అభిముఖంగా, బంగారు సర్వ భూపాల వాహనంలో దేవేరులతో కూడ శ్రీ మలయప్పస్వామివారిని వేంచేపు చేస్తారు. పిదప పట్టువస్త్రాలతోను వజ్ర వైడూర్య మరకత మాణిక్యాది సర్వాభరణాలతోను, కిరీటాలతోను, సుగంధ పరిమళ భరితమైన పుష్పమాలికలతోను ఉత్సవమూర్తులను శోభాయమానంగా విశేషంగా అలంకరిస్తారు.

శ్రీ మలయప్పస్వామివారి ఎడమ ప్రక్కన మరొక పీఠంపై దక్షిణాభిముఖంగా శ్రీవారి సేనాధిపతి విష్వక్సేనులవారిని కూడ వేంచేపు చేసి ఆభరణాలతో, పూలమాలలతో అలంకరిస్తారు. శిరస్త్రాణాన్ని, ఖడ్గాన్ని ధరించి అత్యంత భయభక్తులతో స్వామివారి ఆజ్ఞలను అమలు పరచడానికి సిద్ధమై సర్వసన్నద్ధమై ఉంటాడు సేనాధిపతి.

పిదప ఆనందనిలయంలోని మూల విరాణ్మూర్తికి బంగారువాకిలి దగ్గర సర్వభూపాల వాహనంలో వేంచేసివున్న శ్రీవారి ఉత్సవమూర్తులకు, సేనాధిపతికి విశేషమైన పడిప్రసాదాలు, అన్నప్రసాదాలు ఈ విధంగా నివేదింపబడతాయి.

శ్రీవారి అర్చకులు, పెద్ద జియ్యంగార్లు, చిన్న జియ్యంగార్లు, ఏకాంగులు, ఆచార్య పురుషులు, వేదపండితులు, దేవస్థానం కార్య నిర్వాహకులు, ఇతర అధికారులు, పేష్కార్లు, పారుపత్యదార్లు ఛత్రచామరాలతో మంగళ వాయిద్య పురస్సరంగా వేదపఠనం జరుగుతుండగా శ్రీవారి వంటవాళ్లు అప్పటికే సిద్ధమైన విశేషవంటకాలను నివేదనకు ఊరేగింపుగా తెస్తారు. లడ్డులు, వడలు, అప్పాలు, దోసెలు, పడి (పిండి వంటలు) ప్రసాదాలు, పులిహోర, పొంగలి, చక్కెర పొంగలి, దధ్యోదనం మున్నగు అన్న ప్రసాదాలను విమాన ప్రదక్షిణంలో బంగారుబావి ప్రక్కన వున్న వంటశాలనుండి ఉత్సవంగా బయలు దేరి, విమాన ప్రదక్షిణం చేసి, వెండివాకిలి ఎదురుగా బయటవున్న ధ్వజ స్తంభానికి ప్రదక్షిణంగా వెళ్లి, లోనికి వచ్చి ఆలయప్రవేశం చేస్తారు. మంగళవాయిద్యాలు బంగారువాకిలి దగ్గర ఆగిపోగా, మిగిలినవారు సన్నిధిలోని కొన్ని ప్రసాదాలను, బంగారు వాకిలి దగ్గర కొలువులో కొన్ని ప్రసాదాలను సమర్పిస్తారు. వెంటనే రెండుచోట్ల ఘంటా నాదంతో ఈ విశేష నివేదన జరుగుతుంది.

ఇలా రెండుచోట్ల నివేదన అయిన వెంటనే శ్రీయోగ నరసింహస్వామి ఆలయం ప్రక్కన వున్న 'పరిమళపు అర' దగ్గర నుండి శ్రీమాన్ పెద్ద జియ్యంగారు పెద్దవెండి తట్టలో మడతపెట్టి చుట్టగా చుట్టబడిన ఆరు పెద్దపట్టువస్త్రాలను తలమీద పెట్టుకొని ఛత్ర చామర మంగళవాద్య పురస్సరంగా ముందు పంచముఖ దివిటీలు వెలుగుతుండగా సన్నడోలు, పలకగంటలు మ్రోగుతుండగా, వేదపారాయణలు సాగుతుండగా ఏకాంగులు, దేవస్థానం అధికారులైన శ్రీ కార్యనిర్వహణాధి కారి, సంయుక్త కార్య నిర్వహణాధికారులు, డిప్యూటి కార్య నిర్వహణాధికారులు, పేష్కార్లు, పారుపత్యదారు మున్నగువారు వెంటరాగా ఆలయం వెండివాకిలి ముందు వున్న ధ్వజస్తంభానికి ప్రదక్షిణంగా వచ్చి పిదప ఆనంద నిలయ విమానానికి ప్రదక్షిణం చేస్తూ వచ్చి బంగారువాకిలి దగ్గరకు రాగా, అక్కడ బాజాభజంత్రీల వాళ్లు నిలిచి అక్కడే వాయిస్తుంటారు. బంగారువాకిలి లోపల ''సన్నిధి గొల్ల'' దివిటీతో, పట్టు వస్త్రాలతో కూడిన జియ్యంగార్లను, వగైరా పెద్దలందరిని సన్నిధివరకు పిలుచుకు

వెళ్లగా, అక్కడ శ్రీవారి సన్నిధిలో, జియ్యంగార్లు తమ తలపై వున్న పట్టు వస్త్రాలను అర్చకస్వాములకు అందిస్తారు. జియ్యంగార్లు, ఏకాంగులు మాత్రమే ఆనందనిలయంలో ప్రవేశం చేస్తారు. వెంటనే అర్చక స్వాములు కులశేఖరపడి (శ్రీస్వామివారి ముందు వున్న గడప) దగ్గర తెరను వేస్తారు.

లోపల అర్చకులు జియ్యంగారు సమర్పించిన ఆరు పట్టు వస్త్రాల్లో నాలిగింటిని శ్రీ వేంకటేశ్వరస్వామివారి మూలమూర్తికి అలంకరిస్తారు. ఒక వస్త్రాన్ని కిరీటానికి, రెండవ దాన్ని నందక ఖడ్గానికి, మూడవదానిని ఆదితోమాలగాను, నాలుగవదాన్ని ఉత్తరీయం గాను అలంకరిస్తారు. తెర తొలగించిన తర్వాత అర్చకస్వామి బంగారు పళ్లెంతో పచ్చ కర్పూరహారతిని ఇస్తారు. ఆ హారతిని ఏకాంగి అందరికి చూపించగా అక్కడ చేరి వున్న వారందరు కళ్లకద్దు కుంటారు. ముందుగా అర్చకులు తాము స్వీకరించిన పిదప వరుసక్రమంలో పెద్ద జియ్యంగారు, చిన్న జియ్యంగారు, ఆచార్య పురుషులు ఇలా తాళ్లపాకంవారి వరకు తీర్థం, శఠారి, చందనం, మడుపు (తాంబూలం) లను అర్చకులు ఇస్తారు. ఆ తర్వాత సర్కారువారు అయిన దేవస్థానం ఇ.ఓ. గారికి మిగిలిన అధికారులకు కూడ పై విధంగానే తీర్థ, చందన, శఠారులను సాయించి తాంబూల మిస్తారు.

ఆ తర్వాత మిగిలిన రెండు పట్టు వస్త్రాలు వున్న వెండి పళ్లాన్ని పెద్ద జియ్యంగారు తమ శిరస్సుపై పెట్టుకొని బంగారువాకిలి దగ్గరికి వచ్చి ఉత్సవ మూర్తులకు సమర్పిస్తారు. అర్చకులు ఆ రెండు పట్టు వస్త్రాల్లో ఒకదానిని శ్రీమలయప్ప స్వామికి, రెండవదానిని విష్వక్సేనులకు అలంకరిస్తారు.

పిదప ప్రధాన అర్చకులు తమ తలకు శ్రీవారి పాద వస్త్రంతో పరివట్టం (తలకు చుట్టూ కట్టే చిన్న పట్టు గుడ్డ) కట్టుకొని శ్రీస్వామివారలపై, విష్వక్సేనులపై కుంకు మాక్షతలు (అక్షతారోపణం) చల్లుతారు. ఆ తర్వాత సేనాధిపతివారికి పరి వట్టం కట్టి శ్రీస్వామివారికి వేసిన అక్షతలను తీసుకొని విష్వక్సేనులపై చల్లి శఠారి మర్యాదలు జరుపుతారు.

తర్వాత ప్రధాన అర్చకులు, శ్రీస్వామి వారి ద్వారా తండులదానం (బియ్యం), దక్షిణ తాంబూలను దానంగా స్వీకరించి, ''నిత్యైశ్వర్యోభవ'' అని స్వామీవారిని ఆశీర్వదిస్తారు. పిదప అక్కడవున్న మరొక అర్చకులు ప్రధాన అర్చకులకు పరివట్టం కట్టి శఠారి మర్యాదలు చేస్తారు.

పిదప శ్రీవారికి ఆస్థానం జరుగు తుంది. శ్రీస్వామివారి పాదాలమీద వున్న పంచాంగాన్ని తీసుకొని ఆస్థాన సిద్ధాంతి శ్రీస్వామివారికి నూతన పంచాంగ శ్రవణం చేయిస్తారు. ఆనాటి తిథి, వార నక్షత్రాలతో పాటుగా నూతన సంవత్సర ఫలితాలు, లాభ నష్టాలు, నవగ్రహాలగతులు, సస్యవృద్ధి, పశు వృద్ధి మున్నగు విషయాలతోపాటు 27 నక్షత్ర జాతకుల కందాయఫలాలు, రాజపూజ్యత అవమానాలను పంచాంగ శ్రవణంలో శ్రీస్వామి వారికి వినిపించబడతాయి. ప్రత్యేకంగా శ్రీస్వామివారికి ఆయన జన్మ నక్షత్రం శ్రవణం గురించి వినిపిస్తూ ఈ శ్రవణంలో ''ఓ స్వామీ! వేంకటాచలపతీ! అఖిలాండకోటి బ్రహ్మాండనాయకా! మీరు ఈ భూలోక వైకుంఠంలో అవతరించిన నక్షత్రం శ్రవణం. ఈ సంవత్సరంలో స్వామీ! మీరు మరింత దయాంతరంగులై భక్తుల పాపాలను పోగొడతారు. భక్తులకు సకల సంపదలను కలిగిస్తారు. శుభ పరంపరలను గుప్పిస్తారు. అందుకే స్వామీ! ఈ సంవత్సరంలో లక్షలాది మంది భక్తులు మీ దర్శనం కోసం అర్రులు చాస్తూ, తిరుమలయాత్ర చేస్తారు. మీకు అనేక ఉత్సవాలను వైభవంగా నిర్వహిస్తారు. భక్తులు మీకు ఇబ్బడిముబ్బడి ధనాన్ని సమర్పిస్తారు. ఇంకా మీ అనుగ్రహం చేత మీ కనుసన్నల్లో మెలిగే నవగ్రహదేవతలు అందరూ తమ భక్తుల్ని కాపాడుతూ రక్షిస్తారు. దేశమంతా సస్యశ్యామలమై వర్ధిల్లుతుంది. అతివృష్టి, అనావృష్టి రోగాదిభయాలున్నా మీ భక్తులు సర్వవేళల్లో, సర్వదేశాల్లో రక్షింపబడతారు అని సిద్ధాంతి పంచాంగ శ్రవణం చేస్తూవుండగా శ్రీనివాస ప్రభువు అరమోడ్పు కన్నులతో చూస్తూ, చెవులార వింటూ చిన్మయహాసంతో తల పంకిస్తూ అందరినీ ఆశీర్వదిస్తున్నట్లుగా వేయి వెలుగులతో దర్శనమిస్తారు. శ్రీదేవీ, భూదేవి వారలకు కూడ నక్షత్ర ఫలితాలు చెప్పిన తర్వాత అక్కడ చేరినవారు అధికారులు మున్నగువారు ఎవరైన మళ్లీ తమ నక్షత్ర ఫలితాలను కూడ విపులంగా విన్పించమని కోరగా సిద్ధాంతి వారి వారి నక్షత్రాల ఫలితాలను విన్పించగా అర్చకులు సిద్ధాంతికి శఠారిని అనుగ్రహిస్తారు.

పిదప జియ్యంగార్ల గుమాస్తావచ్చి ముందురోజు వచ్చిన హుండీ రాబడిని ఆదాయ వ్యయాలను ఉత్సవ విశేషాలను స్వామివారికి విన్పించును.

వెంటనే అర్చకులు శ్రీమలయప్ప స్వామివారలకు కొలువు పళ్లెం అనబడే బంగారుతట్టలో నవనీత హారతిని జరిపి సర్కారువారైన కార్యనిర్వహణాధికారికి

నవనీతం - తాంబూలం ఇస్తారు. సర్కారు హారతులు ఇ.ఓ. మొదలు పేష్కారు, పారుపత్యదారు వరకు ఒక్కొక్కరికి ఒక్కొక్క హారతిని వరుసగా జరుగును.

ఆ తరువాత మైసూరు, తాళ్ళపాకం వారు, తరిగొండవారి హారతులు కూడ స్వామివారికి జరుగును. చివరగా భక్తులందరి తరపున ఒక్కొక్క రూపాయ వంతున సేకరించి ''రూపాయ హారతి'' ని ఇస్తారు. పళ్లెంలో వచ్చిన రూపాయలను వెంటనే ఇ.ఓ. గారు ఖజానాకు జమ చేయిస్తారు.

చివరగా శ్రీమాన్ జియ్యంగారికి, పిదప దేవస్థానం ఇ.ఓ. గారికి పరివట్టంకట్టి శఠారి సాయించిన తర్వాత ప్రసాద వినియోగం జరుగును. ప్రసాదంతోపాటు చందన, తాంబూల అక్షింతలు ప్రసాదంగా ఇవ్వ బడతవి.

దీనితో ఉగాది ఆస్థానం పూర్తి అవుతుంది. పిదప భక్తులను సర్వదర్శనము నకు అనుమతిస్తారు. ఈ ఉగాది రోజున కల్యాణోత్సవాలు మున్నగు ఆర్జిత ఉత్సవాలు సేవలు ఏవీ జరుపబడవు.

ఇక ఆ సాయంత్రం తిరుమల పుర వీథుల్లో శ్రీదేవి భూదేవి సమేతంగా శ్రీ మలయప్పస్వామి ఊరేగుతూ భక్తులకు నూతన సంవత్సర ఆశీస్సులతోపాటు దివ్య దర్శనాన్ని అనుగ్రహిస్తారు.

* * *



**తిరుమలలో ప్రవేశద్వారం**

# 3. నిత్యోత్సవం

ఉగాది రోజున ప్రారంభమైన ఈ గ్రామోత్సవం ప్రతిరోజున జరుగుతూ 40 రోజులపాటు జరుగుతుంది. దీన్ని ''నిత్యోత్సవం'' అంటారు. శ్రీస్వామివారు పల్లకిలో వేంచేసి, తిరువీథుల్లో ఊరేగుతూ రాగా, వాయవ్య మూలన జియ్యంగార్లు తమ శిష్య పరంపరతో స్వామివారిని తమిళపాశుర ప్రబంధాలతో కీర్తిస్తారు. వీరు ప్రబంధాలు పాడుతుండగా భజంత్రీలు లేకుండా స్వామివారు అక్కడి నుంచి ముందుకు సాగును. వీరి ప్రబంధ పారాయణ ఈశాన్య మూలవరకు సాగగా అక్కడ అర్చకులు జియ్యంగారులకు శఠారి మర్యాదలు జరుగును. ఇక అక్కడనుంచి భజంత్రీవారు ముఖ వీణ (చిన్న మేళం) అనబడే వాయిద్యాన్ని వాయిస్తూండగా స్వామివారి పరకాలమఠంవరకు ఊరేగింపు సాగుతుంది. అక్కడ భజంత్రీవారికి శఠారి ఇవ్వబడు తుంది. పిదప తాళ్లపాక అన్నమాచార్యులవారి వంశీయులు ఒకరు అన్నమాచార్యులవారి కీర్తనను పాడుతూ వుండగా మళ్లీ స్వామివారు పరకాలమఠం వద్దనుండి వాహన మండపం వద్దకు ఎలాంటి వాయిద్యాలు లేకుండా ఒక్క అన్నమయ్య కీర్తనను వింటూ ముందుకు సాగును. వాహనమండపం వద్ద మళ్లీ యధా క్రమంగా భజంత్రీలు, వేద పారాయణలు ప్రారంభం కాగ కుంభ హారతి, కర్పూరహారతి జరుగును. అక్కడి నుంచి మళ్లీ స్వామివారు ఆలయ ప్రవేశం చేసి, ధ్వజస్తంభ ప్రదక్షిణంగా విమాన ప్రదక్షిణంలో ప్రవేశించును. విమాన ప్రదక్షిణంలో వంటశాల వద్ద వంట వారు, నైరుతి మూలన భజంత్రీవారు, వాయవ్య మూలన మైసూరు వారు, రికార్డుసెల్ వద్ద, సభేరా (సభ అర) వద్ద, సంకీర్తన భాండారం వద్ద తాళ్లపాకవారిచేత ఇలా అందరితో హారతు లందుకుంటూ చివరగా భాష్యకారుల సన్నిధి చేరుకోగా ఆస్థానం జరుగుతుంది. అక్కడ శ్రీస్వామివారికి బకాళాభాత్ (దధ్యోదనం), శనగపప్పు శుండలి (గుగ్గిళ్లు) నివేదన చేయబడుతవి. పిదప స్వామివారి పూల మాల శ్రీ భాష్య కారులకు సమర్పింపబడిన తరువాత శ్రీవారి శేషహారతిని రామానుజులకు ఇస్తారు. తర్వాత శ్రీవారి శఠారి రామానుజులకు సాయించ బడుతుంది. ప్రసాద వినియోగం తరువాత శ్రీ స్వామివారు ఆనందనిలయం ప్రవేశిస్తారు. ఇది ఉగాదినాడు తిరుమలలో జరిగే విశేషోత్సవం. సాయంత్రం జరిగే గ్రామోత్సవం 40 రోజుల పాటు 'నిత్యోత్సవం' పేరుతో వైశాఖశుద్ధ దశమి వరకు కొనసాగు తుంది.

నవనీతం – తాంబూలం ఇస్తారు. సర్కారు హారతులు ఇ.ఓ. మొదలు పేష్కారు, పారుపత్యదారు వరకు ఒక్కొక్కరికి ఒక్కొక్క హారతిని వరుసగా జరుగును.

ఆ తరువాత మైసూరు, తాళ్లపాకం వారు, తరిగొండవారి హారతులు కూడ స్వామివారికి జరుగును. చివరగా భక్తులందరి తరపున ఒక్కొక్క రూపాయ వంతున సేకరించి ''రూపాయ హారతి'' ని ఇస్తారు. పళ్లెంలో వచ్చిన రూపాయలను వెంటనే ఇ.ఓ. గారు ఖజానాకు జమ చేయిస్తారు.

చివరగా శ్రీమాన్ జియ్యంగారికి, పిదప దేవస్థానం ఇ.ఓ. గారికి పరివట్టంకట్టి శఠారి సాయించిన తర్వాత ప్రసాద వినియోగం జరుగును. ప్రసాదంతోపాటు చందన, తాంబూల అక్షింతలు ప్రసాదంగా ఇవ్వ బడతవి.

దీనితో ఉగాది ఆస్థానం పూర్తి అవుతుంది. పిదప భక్తులను సర్వదర్శనము నకు అనుమతిస్తారు. ఈ ఉగాది రోజున కల్యాణోత్సవాలు మున్నగు ఆర్జిత ఉత్సవాలు సేవలు ఏవీ జరుపబడవు.

ఇక ఆ సాయంత్రం తిరుమల పుర వీథుల్లో శ్రీదేవి భూదేవి సమేతంగా శ్రీ మలయప్పస్వామి ఊరేగుతూ భక్తులకు నూతన సంవత్సర ఆశీస్సులతోపాటు దివ్య దర్శనాన్ని అనుగ్రహిస్తారు.

* * *



**తిరుమలలో ప్రవేశద్వారం**

## 3. నిత్యోత్సవం

ఉగాది రోజున ప్రారంభమైన ఈ గ్రామోత్సవం ప్రతిరోజున జరుగుతూ 40 రోజులపాటు జరుగుతుంది. దీన్ని ''నిత్యోత్సవం'' అంటారు. శ్రీస్వామివారు పల్లకిలో వేంచేసి, తిరువీధుల్లో ఊరేగుతూ రాగా, వాయవ్య మూలన జియ్యంగార్లు తమ శిష్య పరంపరతో స్వామివారిని తమిళపాశుర ప్రబంధాలతో కీర్తిస్తారు. వీరు ప్రబంధాలు పాడుతుండగా భజంత్రీలు లేకుండా స్వామివారు అక్కడి నుంచి ముందుకు సాగును. వీరి ప్రబంధ పారాయణ ఈశాన్య మూలవరకు సాగగా అక్కడ అర్చకులు జియ్యంగారులకు శఠారి మర్యాదలు జరుగును. ఇక అక్కడనుంచి భజంత్రీవారు ముఖ వీణ (చిన్న మేళం) అనబడే వాయిద్యాన్ని వాయిస్తూండగా స్వామివారి పరకాలమఠంవరకు ఊరేగింపు సాగుతుంది. అక్కడ భజంత్రీవారికి శఠారి ఇవ్వబడు తుంది. పిదప తాళ్లపాక అన్నమాచార్యులవారి వంశీయులు ఒకరు అన్నమాచార్యులవారి కీర్తనను పాడుతూ వుండగా మళ్లీ స్వామివారు పరకాలమఠం వద్దనుండి వాహన మండపం వద్దకు ఎలాంటి వాయిద్యాలు లేకుండా ఒక్క అన్నమయ్య కీర్తనను వింటూ ముందుకు సాగును. వాహనమండపం వద్ద మళ్లీ యధా క్రమంగా భజంత్రీలు, వేద పారాయణలు ప్రారంభం కాగ కుంభ హారతి, కర్పూరహారతి జరుగును. అక్కడి నుంచి మళ్లీ స్వామివారు ఆలయ ప్రవేశం చేసి, ధ్వజస్తంభ ప్రదక్షిణంగా విమాన ప్రదక్షిణంలో ప్రవేశించును. విమాన ప్రదక్షిణంలో వంటశాల వద్ద వంట వారు, నైరుతి మూలన భజంత్రీవారు, వాయవ్య మూలన మైసూరు వారు, రికార్డుసెల్ వద్ద, సభేరా (సభ అర) వద్ద, సంకీర్తన భాండారం వద్ద తాళ్లపాకవారిచేత ఇలా అందరితో హారతు లందుకుంటూ చివరగా భాష్యకారుల సన్నిధి చేరుకోగా ఆస్థానం జరుగుతుంది. అక్కడ శ్రీస్వామివారికి బకాళాభాత్ (దధ్యోదనం), శనగపప్పు శుండలి (గుగ్గిళ్లు) నివేదన చేయబడుతవి. పిదప స్వామివారి పూల మాల శ్రీ భాష్య కారులకు సమర్పింపబడిన తరువాత శ్రీవారి శేషహారతిని రామానుజులకు ఇస్తారు. తర్వాత శ్రీవారి శఠారి రామానుజులకు సాయించ బడుతుంది. ప్రసాద వినియోగం తరువాత శ్రీ స్వామివారు ఆనందనిలయం ప్రవేశిస్తారు. ఇది ఉగాదినాడు తిరుమలలో జరిగే విశేషోత్సవం. సాయంత్రం జరిగే గ్రామోత్సవం 40 రోజుల పాటు 'నిత్యోత్సవం' పేరుతో వైశాఖశుద్ధ దశమి వరకు కొనసాగు తుంది.

# శ్రీరామనవమీ ఆస్థానం

త్రేతాయుగంలో ఒకే మాట, ఒకే బాణం, ఒకే భార్య అన్న ఆదర్శాలతో దుష్ట శిక్షణ, శిష్ట రక్షణ చేసి ధర్మాన్ని పునః ప్రతిష్ఠించిన ఆదర్శమూర్తి అవతారమూర్తి శ్రీరామచంద్రుడు. అప్పటి శ్రీరాముడే ఈ కలియుగంలోని భక్తులను రక్షించడానికై ''కలౌ వేంకట నాయకః'' అన్న సార్థక ధేయుడిగా ఈ వేంకటాచలంలో శ్రీ వేంకటేశ్వరస్వామి పేరుతో నిలిచాడని ప్రసిద్ధి, పురాణ ప్రవచనం కూడా. అందుకు అనుగుణంగానే శ్రీనివాసుడు ప్రతి రోజు ఉదయం పూట.

**కౌసల్యా సుప్రజారామ పూర్వసంధ్యా ప్రవర్తతే**
**ఉత్తిష్ఠ! నరశార్దూల కర్తవ్యం దైవమాహ్నికమ్.**

త్రేతాయుగంనాటి శ్రీరామచంద్రుని పేరుతోనే మేలుకొలుపులు పాడించు కొంటున్నాడు. అందుకు అనుగణంగానే తిరుమల క్షేత్రంలో శ్రీ వేంకటేశ్వర స్వామివారి సన్నిధిలో శ్రీసీతారామ లక్ష్మణ హనుమంత, సుగ్రీవ, అంగదుల పంచలోహవిగ్రహమూర్తులు నెలవై వున్నాయి.

అంతేకాదు తిరుమల దివ్య క్షేత్రంలో ప్రతి నెలా శ్రీరాముని జన్మనక్షత్రం పునర్వసు కూడిన రోజున శ్రీసీతారామ లక్ష్మణులకు ఊరేగింపు జరుగుతుంది. ఇక బ్రహ్మోత్సవంలో ప్రత్యేకంగా ఒక రోజు హనుమద్వా హనంపై శ్రీనివాసుడు శ్రీ వేంకటాద్రి రామునిగా దర్శనమిస్తూ భక్తులను అలరించి ఆనందింప జేస్తూన్నాడు.

ప్రత్యేకంగా తిరుమలలో చైత్రశుద్ధ నవమి శ్రీరాముని జన్మదినమైన శ్రీరామనవమిరోజు విశిష్ట ఉత్సవంగా జరుపబడుతున్నది. ఆ ఉత్సవాన్నే ''శ్రీరామనవమీ ఆస్థానం'' అంటారు.

శ్రీరామనవమి పండుగ రోజున ఉదయం ఆనందనిలయంలో ప్రతిరోజు మాదిరే సుప్రభాతం జరిగిన తర్వాత భోగ శ్రీనివాసమూర్తికి, శ్రీవేంకటేశ్వరస్వామివారి మూల విరాణ్మూర్తి బంగారు పాదపద్మాలకు ఆకాశ గంగా తీర్థ జలాలతో అభిషేకం జరుగుతుంది. ఆ తర్వాత ప్రత్యేకంగా శ్రీ సీతా రామలక్ష్మణ హనుమంతుని పంచలోహ ఉత్సవమూరులకు కూడ ఏకాంతంగా అభిషేకం

జరుపబడుతుంది. అభిషేకం అయిన తర్వాత ఈ శ్రీరాముని విగ్రహాలకు పట్టు వస్త్రాలతో, విశేష ఆభరణాలతో, పుష్పమాలలతో అలంకారం జరుగుతుంది.

ఆ తర్వాత శ్రీవారి ఆలయంలో తోమాలసేవ, కొలువు, సహస్ర నామార్చన, మొదటి గంట, రెండవ అర్చనగా అష్టోత్తర శతనామార్చన రెండవ గంట అయిన తర్వాత శ్రీదేవి భూదేవి సమేతంగా శ్రీమలయప్ప స్వామికి కల్యాణమండపంలో నిత్య కల్యాణో త్సవం, అద్దాల మండపంలో డోలోత్సవం, రంగనాయక మండపంలో ఆర్జిత బ్రహ్మోత్సవం, ఆర్జిత వసంతోత్సవాలు జరుప బడతాయి. ఈ ఉత్సవాలన్నీ అయిన తర్వాత శ్రీదేవి భూదేవి సమేతంగా శ్రీమలయప్ప స్వామి ఆనందనిలయంలో ప్రవేశిస్తారు.

శ్రీరామనవమి నాటి సాయంత్రం బంగారు వాకిలి ముందు శ్రీ సీతారామ లక్ష్మణుల మూర్తులను ఒక పల్లకిపై వేంచేపు చేసి సర్వాభరణాలతో, పుష్పమాలలతో శోభాయ మానంగా అలంకరిస్తారు. పిదప మరొక పీఠంపై హనుమంతుని కూడా వేంచేపు చేస్తారు.

శ్రీరామనవమి పండుగ సాయంత్రం శ్రీరాములవారిని మాత్రం బంగారు హనుమద్వాహనంపై వేంచేపుచేసి తిరుమల పురవీధుల్లో ఊరేగింపు జరుగుతుంది.

శ్రీరామనవమి నాడు సాయంత్రం పూట జరిగే హనుమద్వాహనంలో భక్తులు నిర్ణీత రుసుమును చెల్లించి పాల్గొనవచ్చు. ఈ వాహనసేవలో పాల్గొన్న భక్తులను ఉత్సవా నంతరం శ్రీ వేంకటేశ్వరస్వామివారి దర్శనానికి అనుమతిస్తారు.

ఇలా హనుమద్వాహనంపై శ్రీరామ చంద్రుడు తిరుమల పురవీధుల్లో ఛత్ర చామర సార్వభౌమోచిత లాంఛనాలతో, వేద పారాయణాలతో ఊరేగుతూ, భక్తులందరి చేత హారతులందుకొంటూ, చివరకు ఆలయంలో ప్రవేశిస్తారు.

ఉత్సవానంతరం ఆలయంలో బంగారు వాకిలి దగ్గర బంగారు సర్వభూపాల వాహనంలో శ్రీసీతారామలక్ష్మణులకు, ఆస్థానం జరుగుతుంది. వీరి ప్రక్కన మరొక పల్లకిపై దక్షిణాభిముఖంగా ఆంజనేయ స్వామిని కూడ వేంచేపు చేస్తారు. ఇలా సర్వ భూపాల వాహనంలో కొలువుదీరి వున్న శ్రీ సీతారామ లక్ష్మణ హనుమంతులకు అర్చకులు, పూజా నివేదనలు చేసి వారిపె కుంకుమాక్షతలను

ఆరోపణ చేస్తారు. అనగా అక్షతలు చల్లుదురు. పిదప శ్రీరామచంద్రుల వారి అనుజ్ఞతో శ్రీమద్రామాయణంలో శ్రీరామ జనన వృత్తాంతాన్ని పౌరాణికులు శ్రావ్యంగా పఠిస్తూ వివరిస్తారు. పురాణ పఠనం అయిన తరువాత పౌరాణికులకు తాంబూల సత్కారం జరుపబడుతుంది. ఆ తర్వాత శ్రీ సీతా రామ లక్ష్మణ హనుమంతులకు ఘనంగా నివేదన హారతులు సమర్పించబడతాయి. ఆ తర్వాత ప్రసాద వినియోగం అయిన తర్వాత శ్రీ సీతా రామ లక్ష్మణ హనుమంతులను ఆనంద నిలయంలో ప్రవేశపెట్టడంతో శ్రీరామ నవమినాటి ఆస్థానం ఘనంగా పూర్తి అవుతుంది. బంగారు వాకిలి ముందు జరిగే ఈ శ్రీరామనవమి ఆస్థానంలో ఆలయ అధికారులు, అర్చకులు, ఆలయ సిబ్బంది మాత్రమే పాల్గొని దర్శించే వీలు వుంటుంది.

శ్రీరామనవమినాడు తిరుమల పుణ్య క్షేత్రంలో జరిగే శ్రీరామనవమి ఆస్థానోత్సవం ద్వారా, ఆ త్రేతాయుగంనాటి రాముడే ఈనాటి వేంకటాద్రిరాముడు అని స్పష్టం చేస్తూ ఆ ఇద్దరూ ఒక్కరే అన్నట్లుగా రూఢి అవుతున్నది. ఇదే అభిప్రాయంతోనే కీర్తించిన పద కవితా పితామహుడు అయిన తాళ్లపాక అన్నమాచార్యులు వారి కీర్తనతో మనం అందరం శ్రీనివాసుని ప్రార్థించుదాం!

**రామచంద్రు డితడు రఘువీరుడు**
**కామిత ఫలము లియ్యగలిగె నిందరికి**
**గౌతము భార్యపాలిట కామధేనువితడు**
**ఘాతల. గౌశికులపాలి కల్పవృక్షము**
**సీతాదేవి పాలిటి చింతామణీతడు**
**యీతడూ దాసుల పాలిట యిహపర దైవము.**

**.........................................**

**తలప శబరిపాలి తత్త్వపు రహస్యము**
**అలరి గుహుని పాలి ఆదిమూలము**
**కలడన్నవారి పాలి కన్ను లెదుటి మూరితి**
**వెలయ శ్రీ వేంకటాద్రి విభుడితడు.**

**గోవిందా! గోవిందా! గోవింద!!!**

* * *

# 5. శ్రీరామ పట్టాభిషేకం

శ్రీరామ దశ దిగ్వ్యాప్తం దశేంద్రియ నియామకమ్
దశాస్యఘ్నం దాశరథిం శ్రీనివాసం భజే నిశమ్.

అనంతమైన సుఖాలనిస్తూ, పది దిక్కులలో వ్యాపించియున్న వాడూ, దశేంద్రియాలకు అభిమాన దైవాల్ని శాసించే వాడూ, దశముఖుడైన రావణుని సంహరించిన వాడూ దశరథుని కుమారుడూ అయిన శ్రీరామ చంద్రునిగా ప్రసిద్ధిపొందిన శ్రీనివాస ప్రభువును ఎల్లప్పుడు భజిస్తాను.

తిరుమల క్షేత్రంలో శ్రీరామనవమి నాటి అస్థానం జరిగిన తర్వాత ఆ మరునాడు చైత్ర శుద్ధ దశమిరోజున కూడ యధాప్రకారంగా ఆలయ కార్యక్రమాలు అయిన తర్వాత ఆ సాయంత్రం బంగారు వాకిలి ముందు బంగారు పీఠంపై శ్రీసీతారామ లక్ష్మణులను వేంచేపుచేసి అలంకరిస్తారు. మరొకపీఠంపై హనుమంతుని కూడ వేంచేపు చేస్తారు.

ఇలా అలంకరించిన శ్రీ సీతా రామ లక్ష్మణులను తిరుమల శ్రీవారి ఆలయం మహా ప్రదక్షిణ మార్గంలో ఊరేగిస్తారు. వీరికి అభిముఖంగా మరొక పల్లకిలో ఆంజనేయ స్వామివారిని ఊరేగిస్తారు. ఛత్రచామర, బాజా భజంత్రీలతో వేద పారాయణలతో ఊరేగు తున్న శ్రీరామస్వామివారు భక్తులందరిచేతా హారతులందుకొంటూ చివరకు సన్నిధి వీథి లోని శ్రీ బేడీ ఆంజనేయస్వామివారి సన్నిధికి వస్తారు. అక్కడ తొలిగా శ్రీరాముని మీది మాలను శ్రీ బేడీ ఆంజనేయస్వామికి వేసిన తర్వాత శ్రీరామునికి ఇచ్చిన శేష హారతిని శ్రీ బేడీ ఆంజనేయస్వామికి ఇస్తారు. పిదప అక్కడినుంచి బయలుదేరి శ్రీ సీతా రామ లక్ష్మణులు ఆలయం ప్రవేశం చేసి బంగారు వాకిలి వద్దకు వస్తారు.

బంగారు వాకిలి వద్ద బంగారు సర్వ భూపాల వాహనంలో తూర్పు ముఖంగా శ్రీ సీతా రామ లక్ష్మణులను వేంచేపు చేస్తారు. వీరికి ఎడమ వైపున అనగా దక్షిణ ముఖంగా ఒక్కొక్క పీఠంపై వానరరాజు సుగ్రీవుని, యువ రాజు అంగదుని,

హనుమంతుని ఆసీనుల్ని చేస్తారు. పిదప అర్చకస్వామి శ్రీ సీతా రామ లక్ష్మణులకు కుంకుమాక్షతలను ఆరోపణ చేస్తారు. ఆ అక్షితలను తీసుకొని సుగ్రీవ అంగద హనుమంతులకు చల్లుతారు.

పిదప పౌరాణికులు శ్రీమద్రామాయణంలోని పట్టాభిషేకఘట్టాన్ని శ్రుతి సులభంగా ప్రవచనం చేస్తారు. పౌరాణికులను చందన తాంబూలాదులతో సత్కరించిన తర్వాత మళ్లీ హారతులను ఇస్తారు. పిదప ప్రసాద చందన శరారి వినియోగం చేస్తారు.

ఆ తరువాత శ్రీ సీతారామ లక్ష్మణులు ఆనందనిలయంలో ప్రవేశించడంతో పట్టాభి షేక ఆస్థానం పూర్తి అవుతుంది. ఈ సందర్భంలో ఆ పట్టాభి రాముణ్ణి ఇలా కీర్తించుదాం.

నమోస్తు రామాయ సలక్ష్మణాయ
దేవ్యైచ తస్యై జనకాత్మజాయై
నమోస్తు రుద్రేంద్ర యమానిలేభ్యో
నమోస్తు చంద్రార్క మరుద్గణేభ్యః.

* * *



శ్రీ సీతారామ లక్ష్మణులు

# ౬. వసంతోత్సవాలు

చైత్ర వైశాఖ మాసములు వసంత ఋతువు. ఈ ఋతువులో చెట్లు చిగిర్చి పూలు పూయును. ప్రకృతి అంతా లేత చిగుళ్లతో పచ్చగా రంగు రంగుల పూలతో శ్రుతికింపైన కోకిల కూతలతో, శోభాయ మానంగా ఉంటుంది. అందుకే ఈ వసంత ఋతువును 'వసంతరాజం' అంటారు. భగవద్గీతలో ''ఋతూనాం కుసుమాకరః'' అని, ఋతువులలో వసంత ఋతువును నేను అని శ్రీకృష్ణుడు స్పష్టం చేశాడు.

అలాంటి ఆహ్లాదకరమైన వాతావర ణంలో తిరుమల కొండలరాయని వసంతోత్స వాలు ప్రతి సంవత్సరం చైత్ర శుద్ధ త్రయోదశి మొదలు చైత్ర పున్నమి వరకు మూడు రోజులపాటు వైభవంగా జరుప బడతాయి.

మొదటి రోజు అనగా చైత్ర శుద్ధ త్రయోదశినాడు యథా ప్రకారం సుప్రభాతం, తోమాలసేవ, మొదటి అర్చన, నైవేద్యం (మొదటి గంట) జరిగిన వెంటనే మళ్లీ రెండవ అర్చన, రెండవ గంట నైవేద్యం పూర్తి అయిన వెంటనే బంగారు శ్రీ పీఠం (తిరుచ్చి) లో శ్రీదేవి భూదేవి సహిత శ్రీమలయప్పస్వామి (వేంకటేశ్వర స్వామి) బయలుదేరి ఆలయానికి ప్రదక్షిణంగా పురవీథుల్లో ఛత్రచామర మర్యాదలతో వేదపారాయణలు, దివ్యప్రబంధ పారాయణాలతో భాజా భజంత్రీలతో ఊరేగుతూ ఆలయానికి మహాప్రదక్షిణ మార్గంలో నైరుతిమూలలో వున్న వసంత మండపాన్ని చేరుకుంటారు.

అప్పటికే చక్కని చిక్కని లతలతో రంగు రంగుల పుష్పాల తీగలతో శ్రీవారి వసంత మండపాన్ని రమణీయంగా అలంకరించి వుంటారు. శ్రీవేంకటేశ్వరస్వామి వారు వేసవికాల తాపానికి తాళలేక చల్లని ఉద్యానవనాల్లోనికి వచ్చి దేవేరులతో కూడి విశ్రాంతి తీసుకుంటారు. ఆ మధ్యాహ్నం 2 గంటల సమయంలో దేవేరులతో కూడి సుగంధ ద్రవ్యాలతో వసంతాలాడుతూ ఉత్సాహంగా తిరుమంజనలో పాల్గొనడానికి గాను శ్రీదేవి భూదేవి సమేతంగా శ్రీమలయప్ప స్వామివారు సిద్ధంగా వుంటారు.

ముందుగా దేవేరులతోకూడిన శ్రీ మలయప్పస్వామివారిని స్నానపీఠంపై వేంచేపు చేస్తారు. పిదప సర్వాభరణాలను తీసి వేసి స్నాన వస్త్రాలను ధరింపజేస్తారు.

ఇలా వసంత తిరు మంజనానికి సిద్ధమైవున్న శ్రీస్వామివారికి అమ్మవారలకు అర్చక స్వాములు, ముందుగా దంతధావన, ఆచమనాది అనుష్ఠాన క్రియలు సమర్పిస్తారు. ఆ తర్వాత ఒకవైపు వేద పండితులు పురుషసూక్త శ్రీసూక్త భూసూక్తాది పంచ సూక్తులను, పంచోపనిషత్తులను పారాయణ చేస్తుంటారు. మరోవైపు మంగళ వాయిద్యాలైన భజంత్రీలు సాగుతుంటాయి. అలాంటి శుభప్రదమైన వేళలో అర్చక స్వాములు ధూప దీప నివేదన హారతులిచ్చిన తర్వాత మొదట శుద్ధ జలంతో అభిషేకం చేస్తారు. ఇలా కొద్ది సేపు మంత్రోచ్చారణల మధ్య శుద్ధ జలంతో అభిషేకం పూర్తి చేసిన తర్వాత వట్టి గుడ్డతో శ్రీస్వామివారలను శుభ్రంగా తుడిచి ఆచమనా నంతరం శ్రీ చందనంతో ధూప వేస్తారు. పిదప దీప నైవేద్య హారతులిస్తారు. మళ్లీ శ్రీస్వామి వారలకు గోక్షీరం (ఆవుపాల) తో అభిషేకం జరుగుతుంది. వేదపండితులు వేదమంత్రాలు శ్రుతి పఠిస్తుండగా కొంతసేపు ఆవుపాలతో అభిషేకం జరిగిన తర్వాత మళ్లీ శుద్ధజలంతో అభిషేకిస్తారు. శుద్ధజలంతో అభిషేకం జరిగిన తర్వాత మళ్లీ పొడిగుడ్డతో శ్రీస్వామివారిని బాగా వత్తుతూ తుడుస్తారు. పిదప ధూప దీప నివేదనలు జరుపుతారు.

ఆ తరువాత వరుసగా పెరుగు, తేనె, కొబ్బరి నీళ్లు, పసుపుతో అభిషేకిస్తారు. వీటిలో అభిషేకించిన ప్రతిసారీ శుద్ధజలంతో అభిషేకం చేయించిన తర్వాత శ్రీస్వామివారలకు ధూపదీప నివేదన కర్పూర హారతులు జరుగుతవి.

చివరగా చందనాన్ని శ్రీస్వామివారలకు అమ్మవారలకు కిరీటాలకు..... ఇలా పాదాది శిరసాంతము చక్కగా అలదుతారు. ముగ్గురికి శ్రీతిలకాన్ని తీర్చిదిద్దిన తర్వాత తులసి మాలల్ని అలంకరిస్తారు. ఆచమనాదిక్రియలు సమ ర్పించిన తర్వాత ధూపదీప హారతులు అయిన తర్వాత దృష్టి దోష నివారణార్థం ''కుంభ హారతి'' ఇస్తారు. ఆ తర్వాత నక్షత్ర హారతిని కూడ సమర్పింపబడిన తర్వాత చిట్ట చివరగా కలశంలోని మంత్రజలంతో, బంగారు పళ్లెంతో సహస్రధారాభిషేకం జరుగు తుంది. ఇలా సహస్రధారాభిషేకంతో తొలినాటి వసం తోత్సవం పూర్తి అవుతుంది. ఆ సమయంలో సహస్రధారాభిషేక తీర్థాన్ని స్వీకరించి ముందుగా అర్చకులు తమపై చల్లుకొని, అక్కడ చేరివున్న దేవస్థానం అధికారులు, భక్తులు అందరిపైనా ''పూతో భవ'' అని ఆశీర్వదిస్తూ సంప్రో క్షిస్తారు. ఈ అభిషేక సందర్భంలో శ్రీస్వామివారలకు అలదిన పసుపు, చందనాన్ని భక్తులకు కొద్ది కొద్దిగా ప్రసాదంగా ఇవ్వబడుతుంది.

ఇలా అభిషేకాలు పూర్తి అయిన తర్వాత తెరలు వేస్తారు. తెరలోపల అర్చకులు శ్రీస్వామివారిని, దేవేరులను బాగా తుడిచి పట్టువస్త్రాలను సమర్పించి అలంకరిస్తుండగా జియ్యంగారులు మున్నగు వైష్ణవాచార్యులు దివ్యప్రబంధాన్ని పారాయణం చేస్తుంటారు. అలంకారం పూర్తి అయిన తర్వాత తెర లోపలనే ఏకాంతంగా చక్కెరపొంగలి, పొంగలి, దోసెలు వగైరా ప్రసాదాలు నివేదన చేయబడతవి. పిదప భక్తులకు తీర్థ చందన ప్రసాద వినియోగం జరుగుతుంది. ఈ వసంతోత్సవం ఒక రోజులో పాల్గొన్నఆర్జితం. భక్తులకు పట్టు ఉత్తరీయం, రవికతోపాటు ప్రసాదలు ఇవ్వబడతవి.

ఆ తర్వాత శ్రీస్వామివారలు అమ్మ వారలు చక్కగా సర్వాభరణాలతో, పుష్ప హారాలతో అలంకరింపబడిన అనంతరం వసంత మండపం నుండి సాయంత్రం బయలుదేరి, ఆలయ ప్రదక్షిణంగా పుర వీథుల్లో ఊరేగుతూ భక్తులందరిని అలరింప జేస్తూ ఆలయంలో ప్రవేశించడంతో తొలి నాటి (చైత్రశుద్ధ త్రయోదశి) వసంతోత్సవం పూర్తి అవుతుంది.

ఇక రెండవ రోజు కూడ సుప్రభాతం, తోమాలసేవ మొదట అర్చన, మొదటి గంట, రెండవ అర్చన, రెండో గంట అయిన వెంటనే శ్రీ వేంకటేశ్వరస్వామి ఉభయ దేవేరులతో కూడి ఆలయం ముందు వున్న బంగారు రథశాలకు వచ్చి స్వర్ణ రథాన్ని ఆరోహిస్తారు. రథ, గజ, తురగ, భక్తజనులమధ్య వైభవంగా స్వర్ణ రథంలో ప్రదక్షిణంగా ఊరేగుతూ, శ్రీస్వామివారు భక్తులను అనుగ్రహిస్తూ యథా స్థానం చేరుకుంటారు. అనంతరం శ్రీస్వామి వారు దేవేరులతోకూడి, బంగారు పీఠాన్ని ఎక్కి వసంతమండపాన్ని చేరుకుంటారు. పిదప మొదటి రోజు మాదిరిగానే శ్రీవారికి ఆరాధన, అభిషేకాదులు, నివేదనలు, కొలువు ఘనంగా జరుపబడి, ఆ సాయంత్రం ఆలయ ప్రవేశం చెయ్యడంతో రెండో రోజు వసంతోత్స వం ముగుస్తుంది.

ఇక మూడోరోజు చైత్రశుద్ధ పూర్ణిమ నాడు మొదటి, రెండు రోజుల మాదిరే ఉదయం, మధ్యాహ్నం ఆరాధనలు, నివేదనలు ముగిసిన వెంటనే శ్రీదేవి భూదేవులతో కూడి శ్రీవేంకటేశ్వరస్వామి ఒక బంగారు పీఠంలోను, కుడివైపు శ్రీసీతారామ లక్ష్మణులు మరొక బంగారుపీఠంలోను, వీరికి ఎదురుగా ఇంకొక

పీఠంలో అంజనేయ స్వామి, ఎడమవైపు మరొక బంగారు పీఠంలో రుక్మిణీ శ్రీకృష్ణులు వేంచేసి, పురవీధుల్లో ఊరేగుతూ, వసంతమండపం చేరుకుంటారు.

వసంత మండపం మధ్యలో దేవేరులతోకూడివున్న శ్రీమలయప్పస్వామి కొలువు దీరగా, స్వామివారికి కుడివైపు శ్రీసీతా రామలక్ష్మణ హనుమంతులు, ఎడమవైపు రుక్మిణీ శ్రీకృష్ణులు కొలువు తీరుతారు. ముగ్గురికి విడివిడిగా నైవేద్యం చెయ్యబడి అస్థానం జరుపబడుతుంది.

ఇక మధ్యాహ్నం 2 గంటలకు మూడవనాటి వసంతోత్సవం ప్రారంభమవుతుంది. తొలి, మలి రోజులమాదిరే మూడో రోజు ముగ్గురికి ఒకేసారి అభిషేకాదులు వేదఘోషల మధ్య, భాజా భజంత్రీల మధ్య ఘనంగా జరుపబడతాయి.

ఒకప్పటి త్రేతాయుగంనాటి రాముణ్ణీ, ద్వాపర యుగంనాటి కృష్ణుణ్ణినేనే నంటూ, శ్రీ వేంకటేశ్వరస్వామి స్పష్టం చేస్తున్నట్లుగా అటు రాముడు, ఇటు శ్రీకృష్ణుడు మధ్య, భక్త జనానికి దర్శనమిస్తూ అనుగ్రహిస్తారు. అభిషేకాదులు పూర్తి అయిన వెంటనే, సర్వాంగ సుందరంగా, ఆభరణాలతో, పూల మాలలతో అలంకరించిన తర్వాత ఆస్థానం జరుగుతుంది. ముగ్గురికి నివేదన జరిగిన తర్వాత, భక్తులకు ప్రసాద వితరణ చేయబడుతుంది. ఆ తర్వాత ముగ్గురు వేర్వేరు పీఠాల్లో బయలుదేరి ఊరేగుతూ, ఆలయం ప్రవేశించడంతో వార్షిక వసంతోత్సవాలు పూర్తవుతాయి.

తిరుమల క్షేత్రంలో క్రీస్తుశకం 1360 నాటి కంటే ముందుగానే జరుగుతున్నట్లుగా ఆనాటి శాసనంలో స్పష్టంగా తెలుస్తున్నది. క్రీ.శ. 1360 నాటిదిగా పేర్కొనబడుతున్న శాసనంలో ఈ వసంతోత్సవానికిగాను 32 ఆవులను ఒక కోడెదూడను, ఒక దీపపు సెమ్మెను ఎరమంచి పెరియమ్మ నాయకర్ అనే భక్తుడు బహూకరించినట్లు తెలుస్తున్నది.

ఈ వసంతోత్సవాలు 16 వ శతాబ్దం తొలినాళ్లల్లో 5 రోజులపాటు జరిగేవట! 1530 లో తాళ్లపాక తిరుమలయ్య, 1537 లో అడైప్పు విశ్వనాథనాయకర్, 1537లో అడైప్పు బైయప్ప నాయకర్ అనువాళ్లు అప్పట్లో జరిగే ఐదురోజుల వసంతోత్సవాలకు 5 పడు (నివేదన)లను ఏర్పాటు చేసినారు.

ఇలా క్రీ.శ. 1360 నుండీ అత్యంత ప్రాచీనతను, ప్రాముఖ్యతను సంతరించుకున్న తిరుమల వసంతోత్సవాలు నేడు మూడు రకాలుగా జరుపబడుతున్నాయి. 1. వార్షిక వసంతోత్సవాలు; 2. బ్రహ్మోత్సవాల్లో వసంతోత్సవాలు; 3.ఆర్జిత వసంతోత్సవాలు.

## 1. వార్షిక వసంతోత్సవాలు

ఇవి ప్రతి సంవత్సరం వసంత ఋతువులో అనగా చైత్రమాసంలో శుద్ధ త్రయోదశి మొదలు పూర్ణిమ వరకు మూడు రోజులపాటు జరుగుతాయి. మొదటి రెండు రోజుల్లో శ్రీదేవి భూదేవులతో కూడిన శ్రీ వేంకటేశ్వరస్వామి పాల్గొంటారు. రెండో రోజు బంగారు రథంలో ఊరేగింపు ఇక మూడోరోజు, దేవేరులతోకూడిన శ్రీస్వామి వారితోపాటు శ్రీ సీతారామ లక్ష్మణ హనుమంతులు, రుక్మిణీ శ్రీకృష్ణులు కూడ వసంతోత్సవంలో పాల్గొంటారు. ఈ వార్షిక వసంతోత్సవాలు మాత్రం, ఆలయం వెలుపల వసంత మండంలో జరుపబడతాయి. మూడు రోజులపాటు వసంతమండపంలో జరిగే ఈ వార్షిక వసంతోత్సవాలను ఆర్జిత గృహస్థు లతోపాటు, ఇతర భక్తులందరూ కూర్చొని తిలకించవచ్చు.

## 2. బ్రహ్మోత్సవంలో వసంతోత్సవాలు

ప్రతి సంవత్సరం వార్షిక బ్రహ్మోత్సవం లోను, నవరాత్రి బ్రహ్మోత్స వాల్లో ఆరవరోజు మధ్యాహ్నం శ్రీదేవేరులతో కూడిన శ్రీ వేంకటేశ్వరస్వామి వారికి వసంతోత్సవం జరుగుతుంది. బ్రహ్మోత్సవాల్లో ఈ ఒక్కరోజున జరిగే వసంతోత్సవంలో నిర్ణీత రుసుమును చెల్లించిన ఆర్జిత భక్తులు కూడ పాల్గొని దర్శించవచ్చు. ఈ వసంతోత్సం ఆలయంలోనేగల రంగ నాయక మండపంలో జరుపబడుతుంది. ఆర్జిత గృహస్థులు పాల్గొన్నా, పాల్గొనక పోయినా దేవస్థానంవారు బ్రహ్మోత్సవంలో ఈ వసంతోత్సవాన్ని విధిగా నిర్వహిస్తారు.

## 3. నిత్య వసంతోత్సవాలు

భక్తుల సౌకర్యార్థం, శ్రీదేవేరులతో కూడిన శ్రీ వేంకటేశ్వరస్వామివారికి ఇటీవల నిత్య వసంతోత్సవాలు ఏర్పాటు చేశారు. ప్రతి రోజూ, ఆలయంలోని రంగనాయక మండపంలో మధ్యాహ్నం 2 గంటలకు జరుప బడే వసంతోత్సవంలో నిర్ణీత రుసుమును చెల్లించిన ఆర్జిత భక్తులు పాల్గొనవచ్చు. ఈ నిత్య ఆర్జిత

వసంతోత్సవం భక్తుల కోరిక మేరకు మాత్రమే నిర్వహింబడుతుంది నిత్యమూ విధిగా మాత్రం జరుపబడదు

**ఎలా పాల్గొనాలి?**

మార్చి, ఏప్రిల్ అనగా చైత్ర శుద్ధ త్రయోదశి, చతుర్దశి, పున్నమి మూడు రోజుల్లో జరిగే వార్షిక బ్రహ్మోత్సవాల్లో ఏదో ఒక రోజు పాల్గొనడానికి లేదా ఏ రోజైనా వీలున్న రోజున ఆర్జితం చెల్లించి వసం తోత్సవంలో పాల్గొనవచ్చు

ఈ సేవను చేయించదలచుకొన్న తేదీకు 3 నెలలు ముందుగా రు.3,000/- ల డిమాండు డ్రాఫ్టును-- ''కార్య నిర్వహణాధికారి, తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి'' వారి పేర తీసి ''పేష్కారు, శ్రీవారి ఆలయం, తిరుమల--517 504'' వారికి పంపుకోవలసి వుంటుంది వీరికి ధ్రువపత్రం ద్వారా ముందుగానే తెలియజేయబడుతుంది. అయినా అప్పటికి వున్న అవకాశాన్నిబట్టి మాత్రమే వీలు కల్పించబడుతుంది.

అనుమతి లబించిన గృహస్థుతోపాటు మొత్తం పది మంది ప్రవేశం కల్పించబడు తుంది వీరికి ఒక పట్టు ఉత్తరీయం, రవిక గుడ్డతోపాటు 6 వడలు ప్రసాదంగా ఇవ్వబడతవి ఈ సేవలో పాల్గొన దలచిన గృహస్థు పంచ ఉత్తరీయాన్ని ధరించి రావలయును.

* * *



శ్రీవారి వసంతోత్సవం

## 7. శ్రీపద్మావతీ పరిణయం

సుమారు ఐదువేల ఏండ్ల క్రిందట, అంటే కలియుగం తొలినాళ్లలో సాక్షాత్తు మహా వైకుంఠం నుండి శ్రీమహావిష్ణువు శ్రీ వేంకటేశ్వరునిగా, భూలోకానికి తరలి వచ్చాడు. ఆ సమయంలో నారాయణ వనాన్ని పరిపాలించిన ఆకాశరాజు, తన కూతురైన పద్మావతిని శ్రీ వేంకటేశ్వరునకు ఇచ్చి వివాహం చేశాడు. ఆకాశరాజు వైశాఖ శుద్ధ దశమీ శుక్రవారం పూర్వ ఫల్గునీ నక్షత్రంలో నారాయణవనంలో కన్యాదానం చేసినట్లుగా వేంకటాచల మాహాత్మ్యం తెలుపుతోంది.

తిరుమలలో నిత్యకల్యాణం పచ్చలతోరణం' అని ప్రసిద్ధి కెక్కి నిత్యమూ ఎన్నో సేవలు ఉత్సవాలు జరుగుతున్నా.... ఇంతవరకు, వేంకటేశ్వరస్వామి పద్మావతిని వివాహమాడిన ఆనాటి ముహూర్తానికి గుర్తుగా ఎలాంటి ఉత్సవంగాని ఊరేగింపుగాని జరగడం లేదు. వేల ఏండ్ల తర్వాత, ఇటీవల తొలిసారిగా ఆనాటి పద్మావతీ శ్రీనివాసుల కల్యాణోత్సవ ముహూర్తానికి గుర్తుగా, సరిగ్గా అదే ముహూర్తంలో ప్రతి వైశాఖ శుద్ధ దశమి నాటికి అటుముందు ఒకరోజు, ఇటు తర్వాత ఒక రోజు మొత్తం మూడు రోజుల పాటు ''పద్మావతీ పరిణయం'' అన్న పేరుతో ఉత్సవం జరపటానికి తిరుమల తిరుపతి దేవస్థానం నిర్ణయించి 9 2 వైశాఖ మాసం నుంచి ఘనంగా నిర్వహించడం జరుగు తున్నది కూడ. ఇది సాధారణంగా మేనెలలో మూడు రోజులపాటు జరుపబడుతున్నది. ఆనాటి నారాయణ వనానికి ప్రతీకగా తిరుమల నారాయణగిరి ఉద్యానవనంలో ఈ పద్మావతి పరిణయోత్సవ వేడుకలు జరగడం విశేషం. ఈ ఉత్సవాలకోసం తిరుమల నారాయణగిరి ఉద్యానవనం రంగు రంగుల పుష్పాల చిత్రాలతోను, విద్యుద్దీపాలతోను శోభాయమానంగా తీర్చి దిద్దబడి అలంక రించబడుతుంది. ఆ వనంలో మధ్యలో వున్న పరిణయ వేదిక, దాని చుట్టూ నయనా నందకరంగా ఎత్తైన చిత్రాలు, లతలు, తీగలతో అలంకరింపబడుతుంది.

మొదటిరోజు అంటే వైశాఖ శుద్ధ నవమిరోజున తిరుమలలో యథా ప్రకారంగా తెల్లవారుజామునుంచి సుప్రభాతం, తోమాల సేవ, కొలువు, మొదటి అర్చన, నైవేద్యం, మున్నగు దైనందిన కార్యక్రమాలు, ఆర్జిత కల్యాణోత్సవం, బ్రహ్మోత్సవం, డోలోత్సవం...... మున్నగు నిత్య ఉత్సవాలు ముగిసిన తర్వాత

## 8. జ్యేష్ఠాభిషేకం - అభిధేయక అభిషేకం

తిరుమల దేవదేవునికి ప్రతి నిత్యం ఏదో ఒక ఉత్సవం జరుగుతునే వుంటుంది. ఏదో ఒక సంబరం సాగుతునే వుంటుంది. అందుకే 'నిచ్చల కల్యాణం పచ్చల తోరణం' అన్న ప్రసిద్ధి సంతరించుకున్న తిరుమల పుణ్యక్షేత్రంలో సాలీనా జరిగే ఎన్నో ఉత్సవాల్లో అత్యంత విశిష్టమైంది జ్యేష్ఠాభిషేకం. దీనినే అభిధేయక అభిషేకం అని కూడా అంటారు. ప్రతి సంవత్సరం జ్యేష్ఠ మాసంలో జ్యేష్ఠా నక్షత్రానికి పూర్తి యగునట్లుగా మూడురోజులపాటు జరుపబడే ఈ అభిషేక ఉత్సవమే 'జ్యేష్ఠాభిషేకం' అని ప్రసిద్ధి పొందింది. సాధారణంగా ఈ ఉత్సవం జూన్ నెలలో జరుపబడుతుంది.

తరతరాలుగా అభిషేకాదులతో పంచామృత స్నపన తిరుమంజనాదులతో అత్యంత ప్రాచీనములైన శ్రీ తిరుమలస్వామివారి ఉత్సవ మూర్తులు (శ్రీదేవి భూదేవి సహిత శ్రీ మలయప్పస్వామి) తరుగుపడకుండా, అరిగి పోకుండా వాటిని పరిరక్షించే నిమిత్తమై ఏర్పాటు చేసిన ఉత్సవమే అభిధేయక అభిషేకం, విగ్రహాలు బేధింపబడకుండా, (విరిగిపోకుంటా లేదా అరిగిపోకుండా) జాగ్రత్త తీసుకొంటూ వైఖానస ఆగమోక్తంగా చేయబడే ఉత్సవమే ఇది.

ఇప్పటికే ఎన్నో వందల ఏండ్లుగా సాలినా జరిగే ఎన్నో ఉత్సవాల్లో, ఊరేగింపు సందర్భాల్లో పంచామృత స్నపన తిరుమంజనాదులు, అభిషేకాలు శ్రీస్వామివారి ఉత్సవ మూర్తులకు జరుగుతున్నాయి. ఇటీవల ఈ అభిషేకోత్సవాలను నియమితం చేశారు. ఇకమీదట ప్రతి సంవత్సరం జ్యేష్ఠమాసంలో జ్యేష్ఠా నక్షత్రానికి ముగిసేట్లుగా మూడురోజులపాటు జరిగే ఈ అభిదేయక ఉత్సవాల్లో మాత్రమే అభిషేకాదులు జరుపబడతవి.

ఇక ఏడాది పొడవునా బంగారు తొడుగుతో (కవచం) అలంకరిచిన శ్రీస్వామివారి ఉత్సవమూర్తుల పాదాలకు మాత్రమే అభిషేకం జరుపబడుతుంది.

జ్యేష్ఠాభిషేకం ప్రారంభమయ్యే రోజున యథాప్రకారంగానే సుప్రభాతం, తోమాలసేవ, సహస్రనామార్చన, నైవేద్యం (మొదటి గంట), మళ్లీ ఆ వెంటనే రెండవ అర్చన, రెండవ నైవేద్యం కూడా జరుగుతాయి.

ఇక మూడవరోజు వైశాఖ శుద్ధ ఏకాదశి. ఈ రోజు సాయంత్రం స్వామివారు గరుడవాహనుడై వెళుతుడగా దేవేరులు దంతపు పల్లకి నెక్కి ఉద్యానవనానికి వెళ్తారు. ముందు రెండురోజులు మాదిరే ఎదుర్కోలు, పూలచెండ్లాట నూతన వస్త్ర సమర్పణ వగైరా పెండ్లి వేడుకలు ఘనంగా ముగిసిన తర్వాత కొలువు జరుగుతుంది. వేదపారాయణ సంగీత కచ్చేరీ, మున్నగు కార్యక్రమాలు ముగిసిన తర్వాత స్వామి దేవేరులతో కూడి ఊరేగుతూ ఆలయ ప్రవేశం చేస్తారు. దీనితో మూడురోజుల పద్మావతీ పరిణయోత్సవాలు ఘనంగా ముగుస్తవి.

**ఎలా పాల్గొనాలి?**

ప్రతి సంవత్సరం వైశాఖ మాసంలో వరుసగా శుద్ధ నవమీ, దశమి, ఏకాదశి రోజుల్లో మూడు రోజులపాటు తిరుమల వేంకట ప్రభువుకు జరుపబడే పద్మావతీ పరిణయోత్సవంలో భక్తులు కూడ రు. 5,000 ల రుసుమును చెల్లించి ఒక్కరోజు సేవలో మాత్రమే పాల్గొనవచ్చు.

ఈ నిర్ణీత రుసుము చెల్లించిన గృహస్థుతోపాటు ఐదుమందికి శ్రీవారి దర్శనావకాశం కల్పిస్తారు. అంతేగాక వీరికి ఉత్తరీయం, రవిక గుడ్డతోపాటు 5 లడ్లు, 5 వడలు ప్రసాదంగా ఇవ్వబడతాయి.

ప్రతి వైశాఖ మాసంలో మూడు రోజులపాటు జరిగే ఈ ఉత్సవంలో ఒక్క రోజుకు రు. 5,000 లు డిమాండు డ్రాఫ్టును, ''ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు, తి.తి. దేవస్థానములు, తిరుపతి'' వారి పేర ఏ జాతీయ బ్యాంకులోనైనా తీసి, దానిని ముందుగా ''పేష్కారు, తిరుమల శ్రీవారి ఆలయం, తిరుమల – 517 504'' వారికి పంపుతూ అనుమతిని పొందవచ్చును. అయినా అప్పటికి వున్న అవకాశాన్ని బట్టి మాత్రమే వీలు కల్పించబడుతుంది. వీరికి అనుమతి ధ్రువపత్రం ద్వారా తెలియజేయ బడుతుంది.

పద్మావతీ పరిణయోత్సవం మూడురోజులూ సాయంత్రం 3 గంటలకు శ్రీవారి ఆలయం దగ్గర నుంచి ప్రారంభమౌతుంది.

## 8. జ్యేష్ఠాభిషేకం - అభిధేయక అభిషేకం

తిరుమల దేవదేవునికి ప్రతి నిత్యం ఏదో ఒక ఉత్సవం జరుగుతునే వుంటుంది. ఏదో ఒక సంబరం సాగుతునే వుంటుంది. అందుకే 'నిచ్చల కల్యాణం పచ్చల తోరణం' అన్న ప్రసిద్ధి సంతరించుకున్న తిరుమల పుణ్యక్షేత్రంలో సాలీనా జరిగే ఎన్నో ఉత్సవాల్లో అత్యంత విశిష్టమైంది జ్యేష్ఠాభిషేకం. దీనినే అభిధేయక అభిషేకం అని కూడా అంటారు. ప్రతి సంవత్సరం జ్యేష్ఠ మాసంలో జ్యేష్ఠా నక్షత్రానికి పూర్తి యగునట్లుగా మూడురోజులపాటు జరుపబడే ఈ అభిషేక ఉత్సవమే 'జ్యేష్ఠాభిషేకం' అని ప్రసిద్ధి పొందింది. సాధారణంగా ఈ ఉత్సవం జూన్ నెలలో జరుపబడుతుంది.

తరతరాలుగా అభిషేకాదులతో పంచామృత స్నపన తిరుమంజనాదులతో అత్యంత ప్రాచీనములైన శ్రీ తిరుమలస్వామివారి ఉత్సవ మూర్తులు (శ్రీదేవి భూదేవి సహిత శ్రీ మలయప్పస్వామి) తరుగుపడకుండా, అరిగి పోకుండా వాటిని పరిరక్షించే నిమిత్తమై ఏర్పాటు చేసిన ఉత్సవమే అభిధేయక అభిషేకం, విగ్రహాలు బేధింపబడకుండా, (విరిగిపోకుంటా లేదా అరిగిపోకుండా) జాగ్రత్త తీసుకొంటూ వైఖానస ఆగమోక్తంగా చేయబడే ఉత్సవమే ఇది.

ఇప్పటికే ఎన్నో వందల ఏండ్లుగా సాలినా జరిగే ఎన్నో ఉత్సవాల్లో, ఊరేగింపు సందర్భాల్లో పంచామృత స్నపన తిరుమంజనాదులు, అభిషేకాలు శ్రీస్వామివారి ఉత్సవ మూర్తులకు జరుగుతున్నాయి. ఇటీవల ఈ అభిషేకోత్సవాలను నియమితం చేశారు. ఇకమీదట ప్రతి సంవత్సరం జ్యేష్ఠమాసంలో జ్యేష్ఠా నక్షత్రానికి ముగిసేట్లుగా మూడురోజులపాటు జరిగే ఈ అభిదేయక ఉత్సవాల్లో మాత్రమే అభిషేకాదులు జరుపబడతవి.

ఇక ఏడాది పొడవునా బంగారు తొడుగుతో (కవచం) అలంకరిచిన శ్రీస్వామివారి ఉత్సవమూర్తుల పాదాలకు మాత్రమే అభిషేకం జరుపబడుతుంది.

జ్యేష్ఠాభిషేకం ప్రారంభమయ్యే రోజున యథాప్రకారంగానే సుప్రభాతం, తోమాలసేవ, సహస్రనామార్చన, నైవేద్యం (మొదటి గంట), మళ్లీ ఆ వెంటనే రెండవ అర్చన, రెండవ నైవేద్యం కూడా జరుగుతాయి.

పిదప శ్రీదేవి భూదేవి ఉభయనాంచారులతో కూడివున్న శ్రీ మలయప్ప స్వామివారు ఆనందనిలయాన్ని విడిచి సంపంగి ప్రదక్షిణంలో వున్న కల్యాణ మండపంలోనికి వేంచేస్తారు.

ముందుగా ఋత్త్విక్కులు యాగశాలలో శాంతిహోమం నిర్వహిస్తారు. శతకలశ ప్రతిష్ఠ ఆవాహన, పిదప నవకలశ ప్రతిష్ఠ అవాహన చేసి పూజా నివేదన హారతులు చేస్తారు. తర్వాత కంకణ ప్రతిష్ఠ జేస్తారు.

పిదప శ్రీదేవి భూదేవి సమేత శ్రీ మలయప్పస్వామివారికి అర్ఘ్యపాద్యాచమనాది క్రియలు నిర్వర్తించి, కంకణధారణ చేస్తారు. ఆ పిదప శాంతిహోమాదులు పూర్తి అయిన తర్వాత స్వామివారికి దేవేరికి హోమతిలకం ధరింపజేస్తారు. ఆ తర్వాత స్నపన తిరుమంజనం ప్రారంభమవుతుంది.

**అభిషేకం (స్నపన తిరుమంజనం)**

ముందుగా బంగారు శంఖాలతో జియ్యంగార్ శుద్ధజలాలను అందిస్తుండగా అర్చకస్వామి పురుషసూక్తాన్ని ప్రారంభిస్తూ ఆ జలంతో శ్రీస్వామివారికి అభిషేకం చేస్తారు. వేదపండితులు పురుషసూక్తంతోపాటు శ్రీసూక్తం, భూసూక్తం ఇత్యాది పంచసూక్తాలను పఠిస్తుండగా అభిషేకం కొనసాగుతూ వుంటుంది.

శుద్ధజలంతో అయిన తర్వాత పాలతో అభిషేకం జరుగుతుంది. పాలతో అభిషేకం పూర్తి అయిన తరువాత శత కలశాలలోని కొన్నింటితో అభిషేకం చేస్తారు. ఆ తర్వాత పెరుగుతో అభిషేకం చేస్తారు. పెరుగుతో అభిషేకం పూర్తి అయినవెంటనే శతకలశాలలోని మరికొన్ని కలశాలతో అభిషేకిస్తారు.

ఇలా వరుసగా, తేనె, కొబ్బరినీళ్ళు, పసుపు అభిషేక్ చేస్తారు. చివరగా చందనాన్ని శ్రీస్వామివారికి అమ్మవారలకు శిరసాదిగా బాగా అలది తిలకధారణ చేసి, తులసిమాలల్ని అలంకరిస్తారు. ఆ తర్వాత నవకలశాలలోని జలంతో బంగారు తట్టలోని సహస్రధారలతో సహస్రధారాభిషేకం పూర్తి చేస్తారు. ఈ అభిషేక జలాన్ని ముందుగా అర్చకస్వామి తన శిరస్సుపై చల్లుకొని, ఆ తర్వాత భక్తులందరిపైనా 'పూతో భవ' అని ప్రోక్షిస్తారు.

ఆ తర్వాత ఉత్సవమూర్తులకు వస్త్రాలంకారం చేసి, నివేదన చేస్తారు.

పిదప శ్రీస్వామివారు, దేవేరులతో కూడి నిత్యకల్యాణోత్సవం, ఆర్జిత బ్రహ్మోత్సవం వగైరా ఉత్సవాలకు సిద్ధమవుతారు.

ఆ సాయంత్రం శ్రీ మలయప్పస్వామివారికి వజ్రకవచాన్ని ధరింపచేసి విశేష ఆభరణాదులతో పూలమాలలతో అలంకరిచి తిరుమల పుర వీధుల్లో ఊరేగుతారు.

మూడవరోజు స్వామివారికి సమర్పించిన బంగారు కవచం మళ్లీ సంవత్సరానికి, జ్యేష్ఠాభిషేకంవరకు అలాగే ఉంచడం జరుగుతుంది. ఈ మూడు రోజుల్లో శిరసాదిగ పాదాంతవరకు అభిషేకాలు జరుపబడతాయి. ఈ మూడు రోజులు తప్ప, మిగిలిన అన్ని సమయాల్లో జరిగే స్నపన తిరుమంజనాదులు శ్రీ మలయప్ప స్వామివారి పాదాలకు మాత్రమే నిర్వహింపబడుతుంది. చివరగా శుద్ధ జలంతో మాత్రమే శిరసాదిగ అభిషేకం జరుపబడుతుంది.

ప్రతి సంవత్సరం జ్యేష్ఠమాసం (జూన్ నెల)లో మూడు రోజులపాటు జరిగే తిరుమల శ్రీనివాసుని అభిధేయక అభిషేకంలో భక్తులు కూడ తగిన రుసుమును చెల్లించి పాల్గొని దర్శించవచ్చు.

మూడురోజులపాటు జరిగే ఈ ఉత్సవంలో ఒక్కొక్క రోజుకు రు. 2,000 లు చెల్లించి గృహస్థుతోపాటు 5 మంది పాల్గొనవచ్చు. వీరికి శ్రీవారి మూలవరుల దర్శనంతోపాటు ఒక లడ్డు, ఒక వడ ప్రసాదంగా ఇవ్వబడుతుంది. ఒక ఉత్తరీయం, ఒక రవికగుడ్డ కూడ బహూకరింపబడతాయి.

ఈ వార్షిక సేవలో పాల్గొన దలచిన భక్తులు రు. 2,000లు డిమాండు డ్రాఫ్టును 'ఎగ్జిక్యూటివ్ ఆఫీసర, తిరుమల తిరుపతి దేవస్థానం, తిరుపతి' వారిపేర ఏ బ్యాంకులోనైనా తీసి దానిని 'పేష్కారు, తిరుమల శ్రీవారి ఆలయం, తిరుమల – 517 504' వారికి చాల ముందుగా పంపుతూ ధ్రువపరచు కోవచ్చు.

అనుమతి ధ్రువపత్రం ద్వారా గృహస్థులకు ముందుగానే తెలియజేయబడుతుంది. అయినా అప్పటికి వున్న అవకాశాన్ని బట్టి మాత్రమే వీలు కల్పించ బడుతుంది.

ఈ సేవలో అనుమతి లభించిన భక్తులను 'అభిధేయక అభిషేకం' జరిగే రోజున, ఉదయం 6 గంటలకు 'వైకుంఠం క్యూ' ద్వారా ఆలయంలోనికి అనుమతింప బడతారు.

## 9. ఆణివార ఆస్థానం

సర్వజగత్ప్రభువైన తిరుమల శ్రీ వేంకటేశ్వరస్వామివారికి జరుగుతున్న వార్షిక ఉత్సవాల్లో అత్యంత ప్రాధాన్యతను సంత రించుకొన్నది ఆణివారోత్సవం. ఇది ప్రతి సంవత్సరం సౌరమానం ప్రకారం దక్షిణాయన పుణ్యకాలంలో అంటే కర్కాటక సంక్రాంతి నాడు, అంటే సర్వ సాధార ణంగా జూలై 16 వ తేదీన జరుపబడుతుంది. సౌరమానాన్ని అనుసరించే తమిళుల కాలమానం ప్రకారం ఆణిమాసం చివరిరోజున (జూలై 17న) జరుపబడే ఆస్థానం (కొలువు) కనుక దీనిని ఆణివార ఆస్థానమని అంటారు.

మామూలుగా ప్రతిరోజు మాదిరే దక్షిణాయన సంక్రమణం రోజున (ఈ జూలై 17న) ఉదయం శ్రీ స్వామివారికి సుప్రభాతం, విశ్వరూప దర్శనం, తోమాలసేవ, కొలువు యధా ప్రకారంగా జరుగుతవి. అయితే రోజూ జరిగే కొలువు శ్రీనివాసమూర్తికి బంగారు సింహాసనంపై కొలువు జరుపబడదు. తోమాల సేవ అయిన వెంటనే శ్రీదేవి భూదేవులతో కూడివున్న శ్రీమలయప్పకు (ఉత్సవ మూర్తులు), శ్రీ విష్వక్సేనుల (శ్రీస్వామివారి సేనాధిపతి) వారికీ ఆలయం లోనే ఏకాంతంగా తిరుమంజనం (అభిషేకం) జరుపబడు తుంది. పిదప మొదటి సహస్ర నామార్చన, నైవేద్యం (మొదటి గంట) జరుపబడతాయి.

పిదప బంగారు వాకిలి ముందుగల తిరుమహామణి (గంటామండపం) మండ పంలో సర్వభూపాల వాహనంలో ఉభయ దేవేరులతో కూడిన శ్రీస్వామివారిని బంగారు వాకిలి ముందుగా గరుత్మంతునికి అభిముఖంగా కొలువుకు వేంచేపు చేస్తారు. సర్వాభరణాదులతోను, సుగంధ పరిమళ భరితమైన పుష్పమాలికలతోను ఉత్సవ మూర్తులను విశేషంగా అలంకరిస్తారు.

శ్రీస్వామివారికి ప్రక్కగా వేరొకపీఠంపై దక్షిణాభిముఖంగా శ్రీవిష్వక్సేనుల వారిని కూడ వేంచేపుచేసి ఆభరణాలతో పుష్పమాలలతో అలంకరిస్తారు. శిరస్త్రాణాన్ని, ఖడ్గాన్ని ధరించి అత్యంత భయభక్తులతో శ్రీస్వామివారి ఆజ్ఞలను అమలుపరచడానికి సిద్ధమై సర్వ సన్నద్ధమై ఉంటాడు సేనాధిపతి.



జ్యేష్ఠాభిషేకం అలంకారంలో శ్రీస్వామివారు



పవిత్రోత్సవంలో శ్రీవారు

పిదప ఆనందనిలయంలోని మూల విరాట్టునకు, బంగారు వాకిలి దగ్గర ఆస్థానం లో వేంచేపుచేసివున్న శ్రీవారి ఉత్సవ మూర్తులకు, సేనాధిపతికి విశేషమైన ప్రసాదాలు ఈ విధంగా నివేదింపబడతాయి.

అర్చకులు శ్రీమాన్ పెద్దజియ్యంగార్లు, చిన్న జియ్యంగార్లు, ఏకాంగులు, ఆచార్య పురుషులు, వేద పండితులు, దేవస్థానం కార్య నిర్వాహకులు, ఇతర అధికార్లు, దేవాలయ పేష్కార్లు, పారుపత్యదార్లు, ఛత్రచామరాలతో, మంగళవాయిద్య పురస్సరంగా, వేదపండితులు వేదపారాయణ చేస్తూ వెంటరాగా గమేకార్లు (వంటవాళ్లు) సిద్ధమైవున్న విశేషమైన వంటకాలను (పొంగలి, చక్కెరపొంగలి, పులిహోర, దధ్యోదనం, లడ్డు, వడ, అప్పం, దోసె మున్నగువానిని) నివేదనకు తెస్తారు. విమాన ప్రదక్షిణంలో బంగారు బావి ప్రక్కనవున్న వంటశాల నుండి బయలుదేరి ఈ ప్రసాదాలను ఆనందనిలయానికి ప్రదక్షిణం చేస్తూ వెండివాకిలి ఎదురుగా బయటవున్న ధ్వజస్తంభానికి ప్రదక్షిణంగా వెళ్లి లోనికి వచ్చి ఆలయప్రవేశం చేసి, అటు మూల సన్నిధిలోను, ఇటు బంగారు వాకిలిదగ్గర ఆస్థానంలోను నివేదనకు ఉంచుతారు. గంటలు మోగుతుండగా రెండు చోట్ల ఈ విశేష నైవేద్యం జరుగుతుంది.

ఈ నైవేద్యం అయిన పిదప యోగ నరసింహస్వామిఆలయం ప్రక్కన వున్న 'పరిమళపు అర' దగ్గరనుండి శ్రీమాన్ పెద్ద జియ్యంగారు పెద్ద వెండితట్టలో మడతపెట్టి చుట్టగా చుట్టబడిన ఆరు పెద్దపట్టు వస్త్రాలను తలమీద పెట్టుకొని ఛత్ర చామర మంగళవాద్య పురస్సరంగా ముందు పంచముఖ దివిటీలు వెలుగుతుండగా, సన్న డోలు, పలక గంటలు మోగుతుండగా, వేద పారాయణలు సాగు తుండగా శ్రీమాన్ చిన్న జియ్యంగార్లు, ఏకాంగులు, దేవస్థానం కార్యనిర్వహణాధికారి, సంయుక్తకార్యనిర్వహణాధికారి, దేవాలయ పేష్కార్లు, పారుపత్య దార్లు మున్నగు ఆలయ అధికారులు వెంటరాగా ఆలయం వెండివాకిలి ముందువున్న ధ్వజస్తంభానికి ప్రదక్షిణంగా వచ్చి, పిదప ఆనందనిలయ విమానానికి ప్రదక్షిణం చేస్తూ వచ్చి నేరుగా ఆనంద నిలయంలోని శ్రీస్వామివారి మూలమూర్తుల దగ్గర సమర్పిస్తారు. జియ్యంగార్లు, ఏకాంగులు మాత్రమే ఆనందనిలయ ప్రవేశం చేస్తారు. అర్చకులు వెంటనే కులశేఖరపడి (శ్రీస్వామి వారి ముందువున్న గడప) దగ్గర తెరవేస్తారు. లోపల అర్చకస్వాములు జియ్యం గారు సమర్పించిన ఆరు పట్టువస్త్రాల్లో

నాలిగింటిని శ్రీవారి మూలమూర్తికి అలంకరిస్తారు. ఒకటి కిరీటానికి, రెండవదాన్ని నందక ఖడ్గానికి, మూడవదాన్ని ఆదితోమాలగాను, నాలగవ దాన్ని ఉత్తరీయంగాను అలంక రిస్తారు. తెర తొలగించిన తర్వాత అర్చకస్వామి శ్రీవేంక టేశ్వరస్వామివారి మూల మూర్తికి పూజా హారతులు చేస్తారు. హారతి అయిన తర్వాత ప్రధాన అర్చకులు తాము ముందుగా తీర్థం స్వీకరించి, శఠారి మర్యాద స్వీకరిస్తారు.

ఆ తర్వాత జియ్యంగార్లకు, ఏకాంగు లకు, తీర్థచందన శఠారి మర్యాదలు జరుపబడ తాయి. పిదప దేవస్థానం కార్య నిర్వాహకులకు ఆలయ అధికార్లకు, మిరాశి దార్లకు జరుగు తాయి. ఇలా అందరికి తీర్థచందన శఠారి తాం బూల మర్యాదలు అయిన తర్వాత శ్రీజియ్యం గారు మిగిలిన రెండు పట్టు వస్త్రాలను తలపై పెట్టుకొని బంగారు వాకిలి దగ్గర ఆస్థానంలో వేంచేసి వున్న ఉత్సవ మూర్తులకు సమర్పిస్తారు. అర్చకులు ఆ రెండు పట్టు వస్త్రాల్లో ఒక దానిని శ్రీమలయప్ప స్వామివారికి రెండవదానిని శ్రీ విష్వక్సేనులవారికి అలంకరిస్తారు.

పిదప ప్రధాన అర్చకులు తమ తలకు శ్రీవారి పాద వస్త్రంతో, పరివట్టం (తలకు చుట్టూ కట్టే చిన్న పట్టుగుడ్డ) కట్టుకొని శ్రీస్వామివారలపై, విష్వక్సేనులపై కుంకుమాక్ష తలు చల్లుతారు. ఆ తర్వాత సేనాధిపతివారికి పరివట్టం కట్టి శ్రీస్వామివారికి చల్లిన అక్షిత లను విష్వక్సేనులపై చల్లి శఠారి మర్యాదలు జరుపుతారు.

తర్వాత అర్చకులు శ్రీస్వామివారి ద్వారా తండులదానం (బియ్యం) దక్షిణ స్వీకరించి ''నిత్యైశ్వర్యోభవ'' అని స్వామి వారిని ఆశీర్వదిస్తారు. తదుపరి అర్చకులు శఠారి మర్యాదలు స్వీకరించిన పిదప శ్రీస్వామి వారికి కొలువు, మంగళహారతి జరుపుతారు. ఈ కొలువులో నువ్వులపిండిని స్వామివారికి నివేదిస్తారు.

ఆ తర్వాత అర్చకులు పెద్ద జియ్యంగారికి పరివట్టంకట్టి శ్రీస్వామివారి పాదాలవద్ద వుంచబడిన శ్రీజియ్యంగారి స్వంతమొహరును (సీలు) జియ్యంగారు చేతికిచ్చి దేవస్థానంవారు ''లచ్చన'' అను తాళం చెవుల గుత్తిని వారి కుడి చేతికి తగిలించి శ్రీస్వామి వారికి హారతి జరిపి తీర్థ చందన శఠారి మర్యాదలు జరుపుతారు. తర్వాత బీగాల గుత్తి శ్రీస్వామివారి పాదాల వద్ద వుంచబడుతుంది. అట్లే శ్రీ చిన్న జియ్యంగారికి, వారి స్వంత మొహరును చేతికిచ్చి బీగం చెవుల గుత్తిని ''లచ్చన''

ను చేతికి తగిలించి హారతి తీర్థ శఠారి చందన తాంబూల సత్కారాలు జరుప బడతాయి. ఆ తర్వాత ఏకాంగికి కూడ పై మాదిరే జరుగుతాయి.

ఆ తర్వాత దేవస్థానం తరుపున ఉన్నతాధికారి అయిన శ్రీ కార్యనిర్వహణాధి కారులవారికి మాత్రమే పరివట్టం కట్టి దేవస్థానం మొహరును, చేతికిచ్చి, బీగం చేతులగుత్తి "లచ్చన" ను చేతికి తగిలించి, హారతి చందన తాంబూల తీర్థ శఠారి మర్యాదలు జరుప బడతాయి.

పిదప ఏకాంగి తలకు పరివట్టం కట్టుకొని ఆస్థానంలో వేంచేసివున్న భక్తుల చేత శ్రీస్వామివారికి కానుకలను వసూలు చేసి, కార్య నిర్వాహకులకు సమర్పిస్తారు. ఆయన వాటిని ఒక సంచిలో పెట్టి సీలువేసి, వెండి తట్టలో తలపై పెట్టుకొని వెళ్లి శ్రీవారి హుండిలో సమర్పిస్తారు.

ఏకాంగివారికి శఠారి మర్యాదలయిన తర్వాత శ్రీ కార్యనిర్వాహకులకు హారతి తాంబూల శఠారి మర్యాదలు జరుగుతాయి. ఆ తర్వాత దేవస్థానం బోర్డు ఛేర్మన్, సభ్యులకు, సంయుక్త కార్య నిర్వాహకులకు, తిరుమల ఆలయ ఉపకార్య నిర్వహకులకు, పేష్కారు, పారుపత్యదారులకు వరుసగా హారతి తాంబూల మర్యాదలు జరుగుతాయి.

పిదప గమేకార్, మహంతు, మైసూరు, తాళ్లపాకం, తరిగొండవారి హారతులు చేస్తారు. ఆ తర్వాత అక్కడికి వచ్చిన భక్తులందరి తరుపున ఒక్క రూపాయి వసూలు చేసి అందరికి కలసి "రూపాయి హారతి" ఇవ్వబడు తుంది. ఈ హారతికి వసూలు అయిన రూపాయిలను వెంటనే శ్రీ కార్యనిర్వాహకుల సమక్షంలో ఖజానాకు జమచేయబడుతుంది.

మళ్లీ చివర్లో శ్రీ పెద్ద జియ్యంగారికి, శ్రీ కార్యనిర్వహణాధికారికి మాత్రమే పరివట్టం కట్టబడి శఠారి మర్యాదలు జరపబడతాయి.

అనంతరం శ్రీస్వామివారికి నివేదింప బడిన ప్రసాదాలు వగైరా, వారి వారి స్థానీయ హోదాను బట్టి వరుసగా ప్రసాద వితరణ జరుగుతుంది. ఆ తర్వాత భక్తులకు కూడ ప్రసాదం పంచబడుతుంది.

పిదప శ్రీస్వామివారు దేవేరులతో కూడి ఆ మండపంలోనే మధ్యాహ్నం నైవేద్యం (రెండవ గంట) అయ్యేంతవరకు వుంటారు. ఆ తర్వాత ఆ సాయంత్రం

తిరుమల పుర వీధులగుండా రమణీయంగా అలంకరింపబడ్డ 'పుష్పపల్లకి' లో అత్యంత వైభవంగా ఊరేగింపబడతారు. ఈ పుష్పపల్లకి వైభవం చూడవలసిందేగాని వర్ణింపసాధ్యము కాదు. ఉత్సవానంతరం శ్రీస్వామివారు దేవేరులతో ఆలయ ప్రవేశం చేస్తారు. ఆణివార ఆస్థానం రోజున కల్యాణోత్సవం, బ్రహ్మోత్సవం, వసంతోత్సవం వంటి ఆర్జిత ఉత్సవాలు జరుపబడవు.

పూర్వం మహంతులు దేవస్థానం పరిపాలనను స్వీకరించినరోజు అయిన ఈ ఆణివార ఆస్థానం రోజు నుండి తిరుమల తిరుపతి దేవస్థానం వారి ఆదాయ వ్యయాలు, నిలువలు, మున్నగు సంవత్సర లెక్కలు ఈ ఆణివారోత్సవం నాటి నుండే ప్రారంభ మయ్యేవి. కాని దేవస్థానానికి ధర్మకర్తల మండలి ఏర్పడిన తర్వాత ఈ లెక్కల ప్రారంభం వర్తమాన 'బడ్జెట్' లెక్కల కను గుణంగా 'మార్చి – ఏప్రిల్' కు మార్చు కొనడం జరిగింది. అయినా ఆ ఉత్సవం అలాగే జరు గుతూ విశేష ప్రాధాన్యాన్ని సంత రించుకుంది.

ఇదే ప్రకారంగా ఆణివార ఆస్థానం తిరుపతి శ్రీగోవిందరాజస్వామి ఆలయం లోను జరుగుతుంది. అయితే తిరుమలలో ఉదయం జరిగితే, అదే రోజు సాయంత్రం గోవిందరాజస్వామివారి ఆలయంలో జరుగుతుంది. తిరుమలలో పై కార్యక్రమంలో పాల్గొన్న శ్రీజియ్యంగార్లు పాల్గొనడానికి వీలుగా తిరుపతి గోవిందరాజస్వామి ఆలయంలో సాయంత్రం జరుగుతుంది. అలాగే తిరుపతి శ్రీకొదండ రామాలయంలో మరునాడు ఉదయం ఆణివార ఆస్థానం జరుపబడుతున్నది.

తిరుమలలో దక్షిణాయన పర్వం నాడు జరిగే యీ ఆణివార ఆస్థానం అర్చ కులు, జియ్యంగార్లు, ఆలయ అధికారులు మాత్రమే పాల్గొని చేయబడే ఉత్సవం. ఇందులో భక్తులు పాల్గొనడానికి వీలులేదు. ఇక ఆ సాయంత్రం జరిగే ''పుష్ప పల్లకి'' సేవను భక్తులందరు తిలకించవచ్చు. నిర్ణీత రుసుమును కూడ చెల్లించి శ్రీస్వామివారికి జరిగే పుష్పపల్లకి సేవలో పాల్గొనవచ్చు కూడ.

ఇప్పుడు ఆ ''పుష్పపల్లకి'' వివరాలు తెలుసుకుందాం.

# 10. పుష్పపల్లకి

ప్రతి సంవత్సరం దక్షిణాయన పుణ్య కాలం రోజున తిరుమల శ్రీవారి ఆలయంలో శ్రీస్వామివారికి ''ఆణివార ఆస్థానం'' అనే విశేషమైన దర్బార్ సేవ బంగారు వాకిలి ముందుగల మండపంలో జరుగుతుంది. సరిగ్గా ఇది ఆణిమాసం చివరి రోజు జరిగే ఆస్థానం. కనుకే ''ఆణివార ఆస్థానం'' అంటారు.

ఆణివారాస్థానం జరిగిన రోజున సాయంత్రం 5-30 గంటల సమయంలో శ్రీదేవి భూదేవులకూడివున్న శ్రీమలయప్ప స్వామివారికి పుష్పపల్లకిలో ఉత్సవం జరుగు తుంది. సుగంధ పరిమళాలను వెదజల్లే వింత వింతలైన రంగు పుష్పాలతో సర్వశోభాయ మానంగాతీర్చదిద్దబడిన పుష్పపల్లకిని శ్రీస్వామి వారి అధిరోహించి, ఛత్ర చామర బాజా భజంత్రీలతో, వేదపారాయణ, దివ్య ప్రబంధ పారాయణ మధ్య, అశేష భక్త జనాన్ని అనుగ్రహిస్తూ తిరుమల పురవీథుల్లో సంచరిస్తారు.

తిరుమల శ్రీస్వామివారికి జరిగే ఈ పుష్పపల్లకి సేవలో నిర్ణీత రుసుమును చెల్లించిన భక్తులు కూడ పాల్గొనవచ్చు. శ్రీస్వామివారి పుష్పపల్లకి ప్రారంభానికి ముందు వీరితో సంకల్పం చెప్పించి వెండి దండాలు చేతికిచ్చి, ఊరేగింపు ముందులో వీరిని అనుమతిస్తారు. ఊరేగింపు తర్వాత హారతి ఇచ్చి, లడ్డు, వడ, ఉత్తరీయంలో ఆర్జిత భక్తులను సత్కరిస్తారు. పిదప ఆర్జిత గృహస్థుతో పాటు ఐదుమందిని వైకుంఠం క్యూద్వారా శ్రీవారి దర్శనానికి అనుమతిస్తారు.

ఈ సంవత్సరం జూలై 16 న దక్షిణా యన సంక్రమణం రోజున తిరుమలలో జరుపబడే ''పుష్పపల్లకి'' ఉత్సవంలో పాల్గొనదలచిన భక్తులు రు. 1,000/- ల డిమాండు డ్రాఫ్టును ''ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు, తి.తి. దేవస్థానములు, తిరుపతి'' వారి పేరుమీదుగా ఏ బ్యాంకులోనైనా తీసి, దానిని ''పేష్కారు, తిరుమల శ్రీవారి ఆలయం, తిరుమల - 517 504'' వారికి చాల ముందుగా పంపుతూ, ''పుష్పపల్లకి'' సేవకు అనుమతి పొందవచ్చు. అనుమతిని, ధ్రువ పత్రం ద్వారా ముందుగానే భక్తులకు తెలియ జేయబడుతుంది. అయినా అప్పటికి వున్న అవకాశాన్ని బట్టి మాత్రమే వీలు కల్పించ బడుతుంది.

**గోవిందా! గోవిందా! గోవింద!!!**

# 11. పవిత్రోత్సవాలు

నిచ్చల కల్యాణం పచ్చల తోరణంగా ప్రసిద్ధి కెక్కిన తిరుమల పుణ్య క్షేత్రాన్ని నిత్యమూ వేలాది మంది భక్తులు సందర్శిస్తూ వుంటారు. ఆపదమొక్కుల దేవుడైన ఘన వేంకటేశునకు మొక్కుబళ్లు చెల్లించడానికి యాత్రికులు ఎండనకా, వాననకా, చలియనకా ఎల్లప్పుడు తిరుమలకు వస్తూ వుంటారు. ఇలా మొక్కుబళ్లు తీర్చడానికి, లేదా దర్శనానికి, తీర్థయాత్రాభిలాషతో, వచ్చే యాత్రికులు భక్తులు చాలా మంది అత్యంత భక్తి ప్రపత్తులతో, దీక్షబూని, పరమ పవిత్రంగా తిరుమల యాత్ర చేస్తారు.

వైదిక సంప్రదాయం ప్రకారం జాతాశౌచం (పురిటి మైల), మృతాశౌచం (మృతి వల్ల అంటు) లేదా స్త్రీల బహిష్టు సమయాలు వంటి కొన్ని సమయాల్లో క్షేత్ర దర్శనం, ఆలయ ప్రవేశం నిషిద్ధం. యాత్రికులు, భక్తులు తమ తమయాత్రల విషయంలో నియమాలను భక్తితో నియమంగా, సక్రమంగా పాటించినప్పటికీ, తమకు తెలియకుండా ఒక్కొక్కప్పుడు కొండకు రావడం స్వామివారిని దర్శించడం జరుగుతుంది. కొంత మంది భక్తులు తిరుమల కొండకు చేరిన తర్వాత వారికి జాతా శౌచం, మృతా శౌచం వంటివి కలుగవచ్చు. ఒక్క యాత్రికులవల్లనే గాక ఆలయంలో, విధి నిర్వహణలో వున్న ఉద్యోగులవల్ల కూడ ఇలాంటి దోషాలు కలుగవచ్చు. అంతేగాక శ్రీ వేంకటేశ్వరస్వామివారికి జరిగే సేవల్లో ఉత్సవాల్లో, కైంకర్యంలో ఏవైనా లోపాలు కలుగవచ్చు. విశేష సమయాల్లో చేరిన జన సమ్మర్దంవల్ల సమయాభావం ఏర్పడినప్పుడు స్వామివారి సేవల వేళలు, ఉత్సవ వేళలు మార్పు చేయబడి, పూజలు అర్చనలు క్లుప్తంగా జరుపబడవచ్చు. ఇలా నిత్య పూజా నివేదనాదులలో కానీ, దర్శనానికి వచ్చిన యాత్రిక జన సమ్మర్దం వల్లగానీ, ఆలయ సిబ్బందివల్లగానీ తెలిసి కొన్ని దోషాలు, తెలియక కొన్ని దోషాలు జరగవచ్చు. ఇలాంటి దోషాలవల్ల ఆలయ పవిత్రత కొంత తగ్గవచ్చు. తగ్గుతుంది కూడ.

ఆలయ పవిత్రతకు ఎలాంటి లోపం రానీయకుండా నివారించేందుకు తెలిసీ తెలియక జరిగే దోషాల పరిహారణార్థం జరిగే పవిత్ర కార్యక్రమమే

''పవిత్రోత్సవం'', ఈ పవిత్రోత్సవాలు కేవలం ఆలయశుద్ధి, పుణ్యాహవాచనం లాంటి కార్యక్రమాలు మాత్రం కావు. సంప్రోక్షణం కంటె బిన్నమైన పవిత్రోత్సవం ప్రత్యేక క్రియా కలాపంతోకూడి నట్టి కార్యక్రమాలుగా చెప్పవచ్చు.

ఈ పవిత్రోత్సవాలు తిరుమలలో చాల పూర్వం నుంచీ జరుగుతున్నట్లు తెలుస్తున్నది. క్రీస్తు శకం 15-16 శతాబ్దాల వరకు అత్యంత వైభవంగా పవిత్రోత్సవాలు నిర్వహింపబడ్డాయని ఎన్నో శాసనాలు స్పష్టం చేస్తున్నాయి.

క్రీస్తుశకం 1464 వ సంవత్సరంలోని ఒక తమిళ శాసనంలో తిరుమల పవిత్రోత్స వాలను గూర్చి ప్రస్తావన కనిపిస్తోంది. ఆనాడు పవిత్రోత్సవాలు జరిపించడానికి ఎలంబాక్కం అనే గ్రామాన్ని దానం చేసినట్లు, ఎలమండ్య, విక్రమాదిత్య, మంగళం గ్రామాల్లోని దేవ మాన్యాల వ్యవసాయానికైరెండు బావులు తవ్వించినట్లు తెలుస్తున్నది. అంతేగాక వీటన్నింటిపై వచ్చే రాబడిని తిరువేంగడ ముడయాన్ (వేంకటాచలం) ఆలయంలోని నిత్యోత్సవ విశేష సందర్భాల్లో నివేదనకు ఆడిమాసం (శ్రావణ మాసం) లో పంచాహ్నికంగా అంటే ఐదురోజులపాటు, పవిత్రోత్స వాలు నిర్వహించేందుకు ఉపయోగించాలని దాత శ్రీమన్మహామండలేశ్వర మేదినీ మీసర గండ కట్టారి సాళువ మల్లయదేవ మహారాజు ఈ శాసనం వ్రాయించినట్లు తెలుస్తున్నది.

అంతకుపూర్వంనుంచీ తిరుమలలో జరుగుతున్న పవిత్రోత్సవాలను క్రీస్తుశకం 1464 నుండి తన పేరిట జరిగేటట్లుగా ఈ రాజు ఏర్పాటుచేసి వుండవచ్చు. లేదా ఆనాటి నుంచే ఈ పవిత్రోత్సవాలు తిరుమలలో ప్రారంభింపబడి వుండవచ్చు. ఈ శాసనంలో ఇంకా విశేషాలు ఇలా వున్నాయి.

అంకురార్పణ రోజు కాకుండా శ్రావణ మాసం శుక్లపక్షంలో ఐదురోజులుగా పవిత్రోత్సవం జరిగేదట! ఐదవరోజు పున్నమి నాడు యజ్ఞోపవీతాలను మార్చుకునే వారట! అంతేగాక ఈ ఉత్సవాలకు కావలసిన వస్తువులు, వాటి ఖర్చు, దక్షిణలు, దానాలు వగైరాలు కూడ ఈ శాసనంలో పేర్కొన బడ్డాయి.

సోమకుంభం (నీటిపాత్ర); శ్రీస్వామివారి ఉత్సవమూర్తులకు వలసిన పవిత్రాలు చేయడానికిగాను 1 0 3 పణముల విలువగలిగినపత్తి (తులసి పెంచడానికి ఉపయోగించే పెరటి భూమిలో పెరిగిన పత్తి); ఆచార్యులకు అలంకారార్థం 1 0 పణముల విలువగల హస్తమాత్ర, కర్ణమాత్ర, దక్షిణ, గోదానం, 1 2 పణాల బంగారుదానం, 4 0 పణాల విలువ గలిగిన రత్నకంబళి, దిండు, నెమలి ఈకలు, కృష్ణాజినం పట్టువస్త్రాలు కలిగివున్న పంచ శయన తల్పం, వేదపారాయణ పురాణపఠన పండితులకు గౌరవ సంభావనగా 5 పణాలు, దక్షిణగా 1 0 పణాలు ఇచ్చేట్లుగా పై శాసనం తెలుపుతోంది.

పవిత్రాలను తయారుచెయ్యడానికి 2 0 ఫలాల పట్టుదారంగానీ, లేదా 2 0 0 ఫలాల నూలుదారంకాని ఉపయోగిస్తారు. ఈ దారాలకు తెలుపుతోపాటు నలుపు, ఎరుపు, ఆకుపచ్చ, పసుపుపచ్చ రంగులు అద్దకం చేసేవారట. అద్దకం చేసేవారికి 3 3౹౹ పణాలు రుసుముగా చెల్లించేటట్లుగా పేర్కొనబడింది. అలాగే ఉత్సవ పీఠాలతో మకర తోరణం లాంటివి చేసేవారికి 1 9 8౹ ఫణాలు చెల్లించేట్లుగా ఈ శాసనం తెలుపుతున్నది.

వేదఘోషలమధ్య పవిత్ర హోమాగ్నుల మధ్య బాజా భజంత్రీలు మోగుతుండగా శ్రీస్వామివారి ఉత్సవమూర్తులకు తామర పూసలవలె కనిపించే పవిత్రాలను అలంకరిస్తారు. పవిత్రోత్సవాల్లో ప్రతిరోజు ఉదయం సాయంత్రం అన్నప్రసాదాల నివేదన తప్పకుండా జరిగేది. ఈ పవిత్రోత్సవాల్లో అన్న ప్రసాదాల నివేదనకు దాతలు ఎందరో దానాలు ఇస్తూ శాసనాలు వ్రాయించారు.

శాసనాధారాల ప్రకారం క్రీస్తుశకం 1 5 6 2 వరకు తిరుమలలో శ్రీస్వామివారికి పవిత్రోత్సవాలు జరుపబడినట్లు తెలుస్తున్నది. ఏ కారణంచేతనో (బహుశా దాతలు కాల గర్భంలో కలిసిపోగా) తర్వాతి కాలంలో ఈ పవిత్రోత్సవాలు జరగడం నిలిచి పోయాయి.

వందల సంవత్సరాల తర్వాత మళ్లీ తిరుమల తిరుపతి దేవస్థానంవారు 1 9 6 2 నుంచి ఈ పవిత్రోత్సవాలను పునరుద్ధరించి ప్రతి ఏటా శ్రావణమాసంలో



శ్రీవారి వసంతోత్సవం



శ్రీ పద్మావతీ పరిణయోత్సవం



వీణాపాణి సరస్వతిగా సప్తగిరీశుడు



జగన్మోహినిగా జగన్నాటక సూత్రధారి

శుద్ధ ఏకాదశి నుండి త్రయాహ్నికంగా అంటే మూడు రోజులపాటు నిర్వహిస్తున్నారు. సాదారణంగా ఇది ఆగష్టులో జరుగుతుంది.

ప్రస్తుతం శ్రీ వేంకటేశ్వరస్వామివారి పవిత్రోత్సవాలు ప్రతి సంవత్సరం శ్రావణ శుద్ధ దశమి, ఏకాదశి, ద్వాదశి మూడు రోజుల పాటు జరుగుతున్నవి.

అంతకుముందు రోజు అంటే నవమి నాటి సాయంత్రం శ్రీస్వామివారి సేనాపతి అయిన విష్వక్సేనులవారు పల్లకి నెక్కి, ఆలయాన్ని విడిచి, పురవీధుల్లో ప్రదక్షిణంగా వెళ్లి నైరుతిమూలలో వున్న వసంత మండపం చేరుకుంటారు. అక్కడ భూమి పూజ చేసి మృత్సంగ్రహణం (పుట్టమన్నును) చేసి ప్రదక్షిణంగా ఆలయ ప్రవేశం చేస్తారు. ఆనాటి రాత్రే అంకురార్పణ మండపంలో నవ ధాన్యాల బీజావాపం (అంకురార్పణ) జరుగుతుంది.

ఇక పవిత్రోత్సవాల మొదటి రోజు, అంటే దశమినాటి ఉదయం సుప్రబాతం, తోమాలసేవ, కొలువు, అర్చన, మొదటి నైవేద్యం, రెండవ అర్చన, రెండవ నైవేద్యం అయిన వెంటనే దేవేరులతో కూడివున్న శ్రీమలయప్పస్వామివారు పల్లకి నెక్కి పవిత్రోత్సవ మండపానికి తరలి వస్తారు.

ఈ మండపంలో అర్చకస్వాములు ఏడు హోమగుండాల్లో అగ్ని ప్రతిష్ఠ చేస్తారు. వీటి మధ్య ఒక వేదికపై నవశకలాన్ని, మరో వేదికపై ప్రాయశ్చిత్త కలశాన్ని ప్రతిష్ఠిస్తారు. వీటికి ముందుగా స్నానపీఠంపై శ్రీదేవి భూదేవి సహిత శ్రీవేంకటేశ్వరస్వామి (మలయప్పను) ఆశీనుల్ని చేస్తారు.

ముందుగా తామరతూడుల మాదిరిగా లేదా తులసి పూసలలాగా వున్న పట్టు పవిత్రాలను (పట్టు దండలు) ఈ యాగ శాలలో ప్రతిష్ఠించి వైఖానసాగమ శాస్త్రోక్తంగా హోమాలు చేస్తారు. హోమం పూర్తయిన తర్వాత శ్రీదేవి భూదేవి సహిత స్వామివారలకు కంకణధారణ చేసి, హోమతిలకం పెట్టిన ఆ తర్వాత తెల్లని స్నానవస్త్రం ధరింపజేసి తిరుమజ్జనానికి (అభిషేకానికి) సిద్ధం చేస్తారు. భక్తులచే సంకల్పం చెప్పిస్తారు.

ముందుగా దంతధావన, ఆచమనాది అనుష్ఠాన క్రియలు సమర్పిస్తారు. ఆ తర్వాత ఒకవైపు వేద పఠన జరుగుతుండగా, బాజా భజంత్రీలు మోగుతుండగా

అభిషేకం ప్రారంభమవుతుంది. మొదట శుద్ధజలంతో అభిషేకం చేస్తారు. పిదప వట్టి గుడ్డతో తుడిచి ఆచమనాదిగా ధూప, దీప, నైవేద్య హారతులిస్తారు. ఆ తర్వాత ఆవుపాలతో అభిషేకం చేస్తారు. క్షీరాభిషేకం అయిన తర్వాత మళ్లీ శుద్ధ జలంతో అభిషేకించి తుడుస్తారు. తులసి సమర్పించి ఆచమనాదులు సమర్పించి ధూపదీప నైవేద్య హారతులివ్వడం జరుగు తుంది.

ఆ తరువాత వరుసగా పెరుగుతో, తేనెతో, కొబ్బరి నీళ్లతో, పసుపుతో అభిషేకిస్తారు. చివరగా చందనాన్ని శ్రీవారి శరీరానికి శ్రీస్వామి వారికి, అమ్మవారలకు, కిరీటాలకు, శరీర మంతా చక్కగా అలది, తిలకం పెట్టి, తులసి మాలల్ని సమర్పిస్తారు. ధూపదీప హారతులు అయింతర్వాత దృష్టి దోష పరిహరణార్థం 'కుంభహారతి' ఇస్తారు. ఆ తర్వాత నక్షత్ర హారతి ఇస్తారు. చివరగా కలశాలలోని జలంతో శ్రీస్వామివారికి అమ్మవారలకు సహస్రధారాభిషేకం జరుపబడగా అభిషేకం పూర్తవుతుంది. ఈ అభిషేక తీర్థాన్ని అర్చకస్వామి ముందు తాను చల్లుకొని, అందరిమీదా ''పూతోభవ'' అని చల్లుతారు. ఆ సందర్భంలోనే శ్రీవారికి అలదిన చందనం భక్తులకు కొద్ది కొద్దిగా ప్రసా దంగా ఇవ్వబడుతుంది. ఆ తర్వాత తెరలు వేసి స్వామివారలను బాగా తుడిచి పట్టువస్త్రా లను సమర్పించి, అలంకరిస్తుండగా, జియ్యంగార్లు వైష్ణవస్వాములు దివ్యప్రబంధాన్ని పారాయణం చేస్తారు. పిదప ఏకాంతంగా నైవేద్యం జరుగుతుంది.

ఆ తర్వాత అర్చకులు స్వామివారిని సర్వాభరణాలతో పుష్పమాలలతో అలంకరించి, ఆ సాయంత్రం తిరుమల పురవీథుల్లో ఊరేగిస్తారు. అనంతరం శ్రీస్వామివారు, పవిత్రోత్సవ మండపానికి వేంచేస్తారు. ఈ మూడు రోజులు శ్రీస్వామివారి ఉత్సవ మూర్తులు యాగశాలలోనే ఉంచబడతాయి.

ఇక రెండవరోజు శ్రావణశుద్ధ ఏకాదశి రోజు మొదటి రోజు ప్రకారమే హోమాదులు జరిగిన పిదప శ్రీస్వామివారికి శ్రీదేవి భూదేవులకు తిరుమంజనాదులు (అభిషేకం) పాలు, పెరుగు, తేనె, కొబ్బరినీళ్లు, పసుపు, చందనం తో యథాప్రకారంగా చేస్తారు. నైవేద్యాలు అయింతర్వాత శ్రీస్వామివారిని అలంకరిస్తారు ఆ తర్వాత ముందురోజు ప్రతిష్ఠ చేసిన పవిత్రాలను ఋత్విక్కులు

తలపై వెండి పళ్లాలలో పెట్టుకొని వేదపారాయణలు జరుగుతుండగా, మంగళవాద్యాలు మోగుతుం డగా, ఛత్రచామర గౌరవపురస్సరంగా పవిత్ర మండపం నుండి బయలు దేరి, ధ్వజస్తంభా నికి దక్షిణంవైపునుండి వెండి వాకిలి ప్రవేశించి, విమాన ప్రదక్షిణం చేస్తూ, బయటి ధ్వజ స్తంభానికి ప్రదక్షిణంగా వెళ్లి, మళ్లీ లోనికి వచ్చి ఆనందనిలయం ప్రవేశించి శ్రీస్వామివారి మూలమూర్తి దగ్గర వాటిని సమర్పిస్తారు. అక్కడ తెరవేసి, ఏకాంతంగా స్వామివారికి ఆచమనాది ఉపచారాలు చేసి తెర తీస్తారు. పిదప అర్చకులు అందరు కన్నులారా దర్శిస్తుండగా శ్రీ వేంకటేశ్వరస్వామివారికి పరమ పవిత్రాలైన పట్టు పవిత్రాలను సమర్పిస్తారు. కిరీటంపైన, ఒకటి మెడలో హారంగా వేస్తారు. మళ్లీ తెరవేసి, శ్రీస్వామివారి శంఖచక్రాలకు, నందక ఖడ్గానికి వక్షః స్థలంలో వున్న శ్రీదేవి, భూదేవులకు, వజ్రహస్త కటి హస్తములకు, శ్రీపాదములకు, ఇంకా ఆలయంలో వున్న భోగశ్రీనివాసమూర్తి, ఉగ్ర శ్రీనివాసమూర్తి, కొలువు శ్రీనివాసమూర్తి, శ్రీసీతారామలక్ష్మణులకు, రుక్మిణీ శ్రీ కృష్ణులకు ఇలా అన్ని ఉత్సవ మూర్తులకు పవిత్ర సమర్పణ జరుగుతుంది. ఆ తర్వాత హారతి జరుగుతుంది. బయటికి వచ్చి బంగారు వాకిలికి ఇరువైపులా వున్న జయ విజయులకు, బంగారు వాకిలికి ఎదురుగా వున్న గరుత్మంతునికి శోభాయ మానంగా పవిత్రమాలల్ని సమర్పిస్తారు.

ఇక విమాన ప్రదక్షిణ మార్గంలో వరుసగా శ్రీ వరదరాజస్వామివారికి, అన్న ప్రసాద వంటశాలలోని వకుళమాలికకు పవిత్రాల్ని అలంకరిస్తారు. అక్కడ నుండి బయలుదేరి యాగశాలలో వున్న విష్వక్సేన, అనంత గరుడ హనుమంత, సుగ్రీవ, అంగదులకు ఒక్కొ క్కరికి ఒక్కొక్క పవిత్రమాల సమర్పిస్తారు. పిదప అర్చకులు వైకుంఠ ప్రదక్షిణ ప్రాకారంపై ఎక్కి ఆనంద నిలయ విమానానికి నాలుగు దిక్కులా పూజలు చేసి, పవిత్రాలను సమర్పిస్తారు. విమానంపై ఉత్తర దిక్కున గల విమాన వేంకటేశ్వర స్వామికి కూడ పవిత్రం సమర్పించి హారతిస్తారు. పిదప ఆనందనిలయ విమానానికి ఎదురుగా తూర్పునగల గరుత్మం తుని గోపురానికి పవిత్రం సమర్పిస్తారు. ఆ తర్వాత కిందికి దిగివచ్చి, విమాన ప్రదక్షిణం చేస్తూ, వైకుంఠద్వారంవద్ద శ్రీవిష్వక్సేనులవారికి, శ్రీ యోగనరసింహస్వామివారికి, శ్రీ రామానుజుల మూలమూర్తికి, ఉత్సవమూర్తికి పవిత్రాలను సమర్పిస్తారు.

అక్కడినుంచి వెండివాకిలి బయటికి వచ్చి బంగారు ధ్వజస్తంభానికి, దాని వెనుకవున్న బలిపీఠానికి పవిత్రాలు సమర్పించడం జరుగుతుంది.

తర్వాత ధ్వజస్తంభానికి సరిగ్గా ఉత్తరం దిక్కున వున్న లడ్డు ప్రసాదం వంటశాలలోని పోటుతాయారుకు, ఆ ప్రక్కనేగల యామునాత్తురై పుష్ప మండపంలో వున్న శ్రీకృష్ణస్వామి చిన్న విగ్రహాలకు, పవిత్రాలు అలంకరించి నైవేద్య హారతులు ఇస్తారు.

పిదప మళ్లీ ధ్వజస్తంభందగ్గరకు వచ్చి, మహాద్వారం బయటికి వచ్చి, ఆలయ మహా ప్రదక్షిణం చేస్తూ, శ్రీ వరాహస్వామి ఆలయానికి వచ్చి అక్కడ మూలమూర్తికి, భూదేవికి, ఉత్సవమూర్తికి, శ్రీనివాసమూర్తికి, ద్వారపాలకులకు, ఈశాన్యమూలలో వున్న విష్వక్సేనులకు భాష్యకారులకు పవిత్ర సమర్పణ జరిపి ఘనంగా హారతులు సమర్పించడం జరుగుతుంది. ఆ తర్వాత వరాహస్వామికి ఎదురుగా కోనేటిగట్టున వున్న శ్రీ ఆంజనేయ స్వామివారికి, పవిత్రాన్ని సమర్పిస్తారు. అక్కడి నుండి బయలుదేరి శ్రీ వేంకటేశ్వరస్వామివారి సన్నిధివీధిలోగల శ్రీబేడి ఆంజనేయస్వామివారికి, పవిత్రాలు సమర్పించి, మళ్లీ ఆలయ ప్రవేశంచేసి, పవిత్రోత్సవ మండపానికి చేరుకొని అక్కడ శ్రీమలయప్పస్వామివారికి, శ్రీదేవి భూదేవులకు, యజ్ఞకుండాలకు, కలశాలకు పవిత్రాల్ని అలంకరించి ధూపదీప హారతు లిస్తారు. ఆ తర్వాత అర్చకస్వామి తాను ముందుగా శ్రీస్వామివారి పాదాలకు సమర్పించిన పవిత్రాన్ని కళ్లకద్దుకొని స్వీకరించి తన మెడలో వేసి కొంటారు. తర్వాత అర్చ కులు పవిత్రోత్సవ హోమాదులలో పాల్గొన్న ఋత్త్విక్కులకు శ్రీవారి ప్రసాదంగా ఒక్కొ క్కరికి ఒక్కొక్క పవిత్రాన్ని మెడలో వేస్తారు. ఇలా ఇక్కడితో ప్రధానకార్యమైన పవిత్ర సమర్పణ అత్యంత వేడుకగా కోలాహలంగా పరిసమాప్తమవుతుంది. ఆ తర్వాత అర్చకులు, ఋత్త్విక్కులు, యాగమండపం నుండి బయలుదేరి ఆనంద నిలయం ప్రవేశించి పవిత్ర సమర్పణకార్యం దిగ్విజయంగా, ఘనంగా నెరవేరినందుకుగాను, శ్రీస్వామివారి మూలమూర్తి పాదములకు భక్తితో నమస్క రించుకొంటారు. ఆ తర్వాత ఆలయంలో రెండవ అర్చన నైవేద్యం (రెండవ గంట) జరిగిన తర్వాత,

యాగశాలలో ఉభయ దేవేరులతో కూడిన శ్రీస్వామివారిని సర్వా భరణాలతో అలంకరించి బంగారు పల్లకిలో ఆ సాయంత్రం తిరుమల పురవీథుల్లో ఊరేగిస్తారు. పిదప శ్రీస్వామివారు ఆలయం ప్రవేశించి యాగమండపాన్ని చేరుకోవడంతో రెండవరోజు పవిత్రోత్సవం ముగిసినట్లే.

ఇక మూడవనాడు ఉదయం తొలి రెండురోజులమాదిరే యాగశాలలో హోమాలు జరుగుతవి. తర్వాత ఉత్సవ మూర్తులకు అభిషేకాదులు చేస్తారు. పిదప నైవేద్య అలంకారాదులు అయింతర్వాత ఆ రాత్రి పూర్ణాహుతితో పవిత్రోత్సవం పరిసమాప్త మవుతుంది. ఈ మూడో రోజు మాత్రం పుర వీథుల్లో ఊరేగింపు ఉండదు. పూర్ణాహుతి అయిన తర్వాత శ్రీస్వామివారు శ్రీదేవి భూదేవులతో కూడి విమాన ప్రదక్షిణంగా వెళ్లి ఆలయ ప్రవేశం చెయ్యడంతో మూడురోజుల పాటు జరిగిన పవిత్రోత్సవాలు పరిసమాప్త మవుతాయి.

ఈ పవిత్రోత్సవాన్ని తిరుమల తిరుపతి దేవస్థానంవారు ఆర్జిత సేవగా ప్రవేశపెట్టారు.

7500-00ల రూపాయలు చెల్లించిన గృహస్థుతోపాటు 5 గురు ఈ మూడు రోజులు కూడ పవిత్రోత్సవాన్ని తిలకించవచ్చు. 5 వంది ఈ మూడురోజులు శ్రీవారి మూల వరుల దర్శనం చేసుకోవచ్చు. ఇదికాకుండా మొదటి రోజు తోమాలసేవకు ఇద్దరినీ, రెండవరోజు అర్చనకు ఇద్దరినీ, మూడవ రోజు ఏకాంత సేవకు ఇద్దరినీ అనుమతిస్తారు. ఈ ఉత్సవం లో పాల్గొన్న గృహస్థుకు-- రెండవ రోజు 30 దోసెలు, సోల పొంగలి; మూడవ రోజు 30 దోసెలు, 6 వడలు, సోల పొంగలి ప్రసాదంగా ఇవ్వబడతవి. ఇంతమాత్రమేగాక గృహస్థుకు ఒకపట్టు ఉత్తరీయంతోపాటు శ్రీస్వామివారికి సమర్పింపబడిన ఒక పవిత్రమాల కూడా ప్రసాదంగా బహూకరింప బడుతుంది.

ఈ పవిత్రోత్సవం జరిగిన మూడు రోజుల్లోను కల్యాణోత్సవం, బ్రహ్మోత్సవం, వసంతోత్సవం వంటి ఇతర ఆర్జిత సేవలు జరుపబడవు.

ప్రతి సంవత్సరం శ్రావణ మాసంలో (ఆగష్టు) మూడు రోజులపాటు జరుపబడే ఈ పవిత్రోత్సవంలో పాల్గొన దలచిన గృహస్థు 7,500=00 రూ..ల

డిమాండు డ్రాఫ్టును ''ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు, తి.తి. దేవస్థానం, తిరుపతి'' వారి పేర తీసి ''పేష్కారు, శ్రీవారి ఆలయం, తిరుమల-5 1 7 5 0 4'' వారికి చాలా ముందుగా పంపుతూ ఖాయపరచుకోవచ్చును. అయినా అవకాశాన్నిబట్టి మాత్రమే వారికి అనుమతి ఇవ్వబడుతుంది. ఈ అనుమతి ధ్రువపత్రంను ముందుగానే గృహస్థుకు పంపబడుతుంది.

ఈ ఆర్జిత గృహస్థులు 'వైకుంఠం క్యూ' ద్వారా మాత్రమే ఆలయంలోనికి అనుమతింపబడతారు.

ఇలా సంవత్సరంలో ప్రతి శ్రావణ మాసంలో మూడు రోజులపాటు ఘనంగా, అత్యంత వైభవంగా జరుపబడే ఈ పవిత్రోత్సవాలతో, తిరుమల పుణ్యక్షేత్రంలో, ఆలయంలో తెలిసీ, తెలియక జరిగే దోషాలన్నీ పరిహారమయ్యి, శ్రీ వేంకటేశ్వరస్వామివారి ఆలయం కోటి దివ్యకాంతులను సంతరించు కుంటుంది. అనంత తేజస్సుతో విరాజిల్లుతున్న వేంకటాచలం అనునిత్యం భక్త సంరక్షణతో ప్రకాశిస్తూ వుంటుంది.

**గోవిందా! గోవిందా! గోవింద!!!**

* * *

# 12. గోకులాష్టమి

శ్రీకృష్ణుడు అవతారం కాదు. సాక్షాత్తు పరబ్రహ్మ స్వరూపం. శేషాద్రిపై వెలసి వున్న వరదహస్తుడైన ఘన వేంకటేశ్వరుడే ధర్మసంస్థానార్థమై యుగయుగాల్లో అవత రించాడు. అలాగే ద్వాపరయుగంలో అవతరించి పురిటిలోనుంచి ఎన్నో అద్భుత లీలల్ని చూపి అర్జునునికి గీతోపదేశం చేసి పరంజ్యోతియై ప్రకాశించిన శ్రీకృష్ణుడూ కలియుగంలో భక్తుల కొంగు బంగారమై వెలసిన తిరుమల గోవిందుడు ఒక్కడేయని భక్తుల విశ్వాసం. కేవలం విశ్వాసం మాత్రమే కాదు. ఇది యధార్థమని ఎందరో ఆళ్వారులు, కర్ణాటక హరిదాసులు..... ఇలా ఎందరో..... మరెందరో శ్రీ వేంకటేశ్వరుని కృష్ణునిగా వర్ణించారు, స్తుతించారు. అలాగే పదకవితా పితామహుడైన శ్రీ తాళ్లపాక అన్నమాచార్యుల దృష్టిలో తిరుమల శ్రీనివాస ప్రభువు సాక్షాత్తు శ్రీ కృష్ణుడే. అందుకే అన్నమయ్య శ్రీ వేంకటాద్రి గోవిందునికి, ద్వాపరయుగంనాటి గోపాలకృష్ణునికి అభేదం కల్పించి ఇద్దరూ అభిన్నులని వర్ణించారు.

శ్రీనివాసస్వామి తానే కృష్ణుణ్ణని స్వయంగా చెప్పుకొన్న ఘట్టాలున్నాయి.

వైకుంఠంనుండి వీడివచ్చిన శ్రీని వాసుడు తొలిసారిగా పద్మావతిని కలిసినపుడు, తన పేరు కృష్ణుడనీ, తన తల్లిదండ్రులు దేవకీ వసుదేవులనీ, అన్న బలరాముడనీ చెప్పు కొంటాడు.

అలాగే పద్మావతీ పరిణయ సంద ర్భంలో కన్యాదాన సమయంలో చెప్పబడే సంక ల్పంలో, శ్రీవేంకటేశ్వరుడు కృష్ణుడనీ, ఆయన తల్లిదండ్రులు దేవకీ వసుదేవులని శ్రీ వేంకటా చలమాహాత్మ్యంలో పేర్కొన బడింది.

అంతేకాదు. తిరుమల శ్రీవారి ఒకానొక అర్చకుడైన పెరియపెరుమాళ్‌కు, శ్రీరంగక్షేత్రం నుండి వచ్చిన 'వారియర్' అనే సంకీర్తనాకారునికి, 'చిరుక్కన్' అనే మరో భక్తునికి - ఇలా ఈ ముగ్గురికి తిరుమలలో ఒకానొక ఉత్సవ సందర్భంలో ఒకే రాత్రి ఒకే సమయంలో స్వప్నంలో కనిపించినాడు. సాక్షాత్తు శ్రీకృష్ణభగవానునిగా దర్శనమిచ్చి ''రామానుజమతానుయాయులైన ఓ పరమ వైష్ణవ భక్తాగ్రేసరులారా! నేను అవతరించిన శ్రీకృష్ణాష్టమి నాటి గుర్తుగా ఈ క్షేత్రంలో కూడ వైఖానస ఉత్సవం అత్యంత వైభవంగా జరుగు తుండేది. ఆ ఉత్సవాన్ని మళ్లీ

మీరు ముగ్గురు ఘనంగా ఆచరింపవలసిందని శ్రీస్వామివారు సాక్షాత్తు శ్రీకృష్ణభగవానునిగా దర్శనమిచ్చి ఆదేశించినాడనీ, అప్పటినుంచి మళ్లీ ఆగి పోయిన శ్రీకృష్ణజయంతి ఉత్సవం వైభవంగా జరుపబడుతున్నదని 'తిరుమళ్లై ఒళగు'' అనే గ్రంథం స్పష్టం చేస్తున్నది.

**తిరుమలలో ప్రస్తుతం శ్రీకృష్ణజయంతి**

శ్రీకృష్ణాష్టమినాటి రాత్రి శ్రీవారి ఆలయంలో తోమాలసేవ జరుగుతుంది. పిదప శ్రీదేవి భూదేవి సహిత శ్రీ ఉగ్ర శ్రీనివాసమూర్తిని బంగారువాకిలి ముందువున్న తిరుమామణి (ఘంటా మండపం) మండపంలో స్నానపీఠంపై వేంచేస్తారు. మరొక పీఠంపై శ్రీకృష్ణస్వామివారిని కూడ తూర్పుముఖంగా వేంచేపుచేసి, తిరుమంజనం (అభిషేకం) చేస్తారు.

ఇటు ఉగ్ర శ్రీనివాసమూర్తికి ఆ ప్రక్కన శ్రీ కృష్ణస్వామివారికి అభిషేకం ఏకాంతంగా మాత్రమే జరుపబడుతుంది. కేవలం అర్చకులు, ఆచార్య పురుషులు మాత్రమే చుట్టూ తెరలు గట్టి ఈ అభిషేకాన్ని నిర్వహిస్తారు. ఈ అభిషేకం పాలు, పెరుగు, తేనె, పరిమళం, చందనం ద్రవ్యాలతో జరుగుతుంది. కృష్ణాష్టమి సందర్భంలో జరిగే ఈ అభిషేకాన్ని ద్వాదశ తిరువారాధనం అంటారు. అనగా శ్రీ (వాసుదేవ) కృష్ణ భగవానుని ద్వాదశ మంత్ర బీజాక్షరాలను (ఓం నమో భగవతే వాసుదేవాయ) సంపుటీక రిస్తూ చేసే ఆరాధనమే ''ద్వాదశ తిరువా రాధనం'' అంటారు. పూర్వం దేవేరులతో కూడిన ఉగ్ర శ్రీనివాసమూర్తికి, శ్రీకృష్ణస్వామి వారికి 12 మార్లు అభిషేకం, 12 మార్లు నైవేద్యం జరిగేదట! అందుకే ఈ ఉత్సవాన్ని 'ద్వాదశ తిరువారాధనం' అంటారు. కాని నేడు ఒకే మారు అభిషేకం, ఒకేమారు నివేదన జరిగి నప్పటికి ద్వాదశ తిరువారాధన మనియే పిలువటం జరుగుతున్నది.

అభిషేక, నివేదనానంతరం ఉగ్ర శ్రీనివాసమూర్తివారిని దేవేరులతోకూడ మళ్లీ ఆనందనిలయంలోనికి వేంచేపు చేస్తారు.

పిదప తిరుమామణి మండపంలోనే సిద్ధంచేసి అలంకరించిన బంగారు సర్వ భూపాల వాహనంలో శ్రీకృష్ణస్వామి (వెన్నవముద్ద కృష్ణుని) వారిని



వేంకటాద్రి గోవిందుడు



పెద్దశేషవాహనం

శయనించినట్లుగా వేంచేపుచేసి అలంకరిస్తారు. ఇలా అలంకారం ఏకాంతంగా జరుగుతుండగా జియ్యంగార్లు, వైష్ణవాచార్యులు దివ్యప్రబంధ పారాయణ చేస్తారు. ఈ పారాయణను సేవాకాలం అంటారు. ఇలా అలంకారం పూర్తి అయిన వెంటనే శ్రీ కృష్ణస్వామివారికి నివేదన జరుగుతుంది. ద్రాక్ష పండ్లు, ఆపిల్, అరటి పండ్లు, వెన్న, నువ్వులపిండి, బకాళాబాత్, చక్కెర పొంగలి, దోసె నివేదించి కర్పూర హారతి ఇస్తారు.

పిదప జియ్యంగార్లు అందించిన తులసితో అర్చకులు శ్రీకృష్ణుణ్ని అర్చిస్తారు.

తర్వాత అర్చకులు శ్రీకృష్ణునిపై అక్షతారోపణం (కుంకుమాక్షతలు) చేస్తారు. ఈ అర్చకులకు శఠారిమర్యాదలు జరుగు తాయి.

ఈ సందర్భంగా పురాణపఠనం జరుగుతుంది. శ్రీ మద్భాగవతంలోని తృతీయాధ్యాయంలోని శ్రీ కృష్ణావతార ఘట్టాన్ని చదువుతూ హృదయంగమంగా పురాణ శ్రవణం చేయిస్తారు. పురాణపఠన అయిం తర్వాత పండితునికి శఠారి మర్యాద జరుగుతుంది. పిదప శ్రీకృష్ణస్వామికి కర్పూర హారతి జరిగిన తర్వాత, దేవాలయ అధికారులకు తాంబూలం హారతి ఇవ్వబడు తుంది.

మళ్లీ అక్కడవున్న భక్తుల తరుపున ఒక్కొక్కరిచేత వసూలుచేసిన రూపాయ లకు గాను ''రూపాయి హారతి'' ఇస్తారు. పిదప జియ్యంగారికి ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు గారికి, శఠారి మర్యాదలు జరిగిన తర్వాత చందన, అక్షతలు వినియోగం చేస్తారు. ఆ తర్వాత ప్రసాద వితరణ ఆస్థానం పూర్తవు తుంది. వెంటనే శ్రీకృష్ణస్వామి సన్నిధిలోనికి వేంచేస్తారు.

**తైలకాపు సమర్పణ**

ఆ తెల్లవారుజామున శ్రీవారి సుప్రభాతం, కొలువు, తోమాలసేవానంతరం శ్రీకృష్ణస్వామివారిని బంగారువాకిలి దగ్గర వేంచేపు చేసి నువ్వులనూనెతో తలంటుతారు. దీన్నే తైలకాపు సమర్పణ అంటారు. అప్పుడే జన్మించిన బాలకృష్ణుని సన్నిధివీథిగుండా, మహంతు మఠం, దక్షిణమాడ, మున్నగు ఆలయ మహా ప్రదక్షిణ మార్గంలో ఊరేగిస్తుండగా శ్రీకృష్ణునికి తైలకాపు చెయ్యగా మిగిలిన పురిటి తైలాన్ని నాలుగు వీధుల్లో భక్తులకు పంచుతారు. దానిని భక్తులు

తలంటుకొని అభ్యంగన స్నానం చేస్తారు. శ్రీ కృష్ణస్వామి సన్నిధి చేరుకోగానే మొదటి గంట నైవేద్యం, బలి శాత్తుమొర జరుపబడతాయి. పిదప భక్తులకు దర్శనం జరుగుతుంది.

ఇక ఆ మధ్యాహ్నం అర్చన, రెండవ నివేదనలు పూర్తి అవుతాయి. పిదప శ్రీవేంకటేశ్వరస్వామి (మలయప్పస్వామి) వారిని ఒక బంగారు శ్రీపీఠంలోను, శ్రీ కృష్ణస్వామిని మరొక శ్రీ పీఠంపైన వేంచేపుచేసి ఆభరణాలతో, పుష్పమాలలతో అలంక రిస్తారు. పిదప ఛత్రచామర, మంగళవాద్య పురస్సరంగా, ఆనందనిలయాన్ని వీడి విమాన ప్రదక్షిణంగా బయటికి వచ్చి ధ్వజస్తంభానికి నేరుగా ఉత్తరంగా వున్న యామునాత్తుర్తై పుష్ప అరలో శ్రీస్వామివారు వేంచేస్తారు. అలాగే అక్కడి పోటు దగ్గర వున్న నాలుగు కాళ్ళ మండపంలో శ్రీకృష్ణస్వామి వేంచేపు చెయ్యగా ఆస్థానం జరుగుతుంది. దోశ, చక్కెర పొంగలి నివేదన చేసి కర్పూర హారతి జరిగి, ప్రసాద వినియోగం జరుగుతుంది.

**తిరుమలలో ఉట్ల ఉత్సవం**

ఇక శ్రీస్వామివారు, శ్రీకృష్ణస్వామివారు అక్కడినుంచి కదలి సన్నిధివీధిలో శ్రీబేడి ఆంజనేయస్వామివారి దగ్గరలోగల శ్రీపెద్ద జియ్యంగార్ మఠంలోనికి వేంచేస్తారు. అక్కడ ఆస్థానం జరిగి, దోశలు నివేదన జరుగుతాయి. శ్రీబేడి ఆంజనేయస్వామివారి దగ్గర కట్టిన ఉట్లను, తిరుమల యువకులు ఉత్సాహంగా కొడతారు. ఆ తర్వాత శ్రీస్వామివారలు మఠంతుమఠానికి రాగా అక్కడ ఆస్థానం జరుగుతుంది. అక్కడ ఉట్ల ఉత్సవాన్ని తిలకిస్తారు. ఉట్లు కొట్టబడతాయి. మళ్లీ శ్రీస్వామివారలు దక్షిణ మాడవీధిలో ఊరేగుతూ అక్కడక్కడ కట్టబడిన ఉట్లను, ఉట్లను గొడుతున్న యువకులను, ఆనందంగా అనుగ్రహిస్తూ, కర్పూర హారతులందుకుంటూ ముందుకు సాగుతారు.

ఇలా మహాప్రదక్షిణమార్గంలో శ్రీస్వామివారలు, శ్రీచిన్నజియ్యంగార్ మఠం లోను, మైసూరు సత్రంలోను, పూజలందు కొంటూ అత్యంత కోలాహలంగా ఉట్లను గొడుతున్న యువకులను భక్తులను అనుగ్రహిస్తూ ఉత్తరమాడవీథిలో, అర్చకులు, తరిగొండ, తాళ్లపాకంవారిచేత, శ్రీవరాహ స్వామిచెంత హారతులందుకొంటూ చివరకు ఆలయంలో ప్రవేశిస్తారు.

* * *

# 13. బ్రహ్మోత్సవాలు

భక్తుల పాలిటి కొంగు బంగారమైన తిరుమల శ్రీ వేంకటేశ్వరస్వామివారికి సుప్రభాతం, తోమాలసేవ, అర్చన, కల్యాణోత్సవం, డోలోత్సవం, ఏకాంతసేవ వంటి నిత్యోత్సవాలు, విశేషపూజ, అష్టదళ పాద పద్మారాధన, సహస్ర కలశాభిషేకం, తిరుప్పావడ, పూలంగిసేవ, శుక్రవారాభిషేకం వంటి వారోత్సవాలు పుష్పయాగం, పవిత్రోత్సవం, ఆణివార ఆస్థానం....... వంటి వార్షికోత్సవాలు ఘనంగా జరుగుతాయి.

ఇలా ఏడాది పొడవునా ఏడుకొండల వాడికి ఎన్నో ఉత్సవాలు జరిగినా, ఊరేగింపులు నిర్వహింపబడినా, వాటి అన్నింటిలోను ఏడాది కొకమాటు పదినాళ్లపాటు జరిగే ''బ్రహ్మోత్సవాలు''తిరుమల చరిత్రలోనే అత్యంత ప్రాముఖ్యాన్ని వైభవాన్ని సంత రించుకున్నాయి.

ఉత్తమోత్తమైన శ్రీవైకుంఠాన్ని వదలి భక్తులను అనుగ్రహించడానికే భూలోకం వచ్చిన సాక్షాత్తు శ్రీమహావిష్ణువే ఈ శ్రీ వేంకటేశ్వరుడు. భక్తులచేత తృణమో, పణమో దానం పుచ్చుకొని వారి పాపాలను పోగొడతాడు! వారి నుంచి ఒకటిగ తీసికొని దానికి వేయిరెట్లుగ అనుగ్రహిస్తాడట! అంతే కాదు తన భక్తులకు కల్యాణప్రదములైన శుభ పరంపరలు కల్గించటానికే వారిచేత కల్యాణోత్సవాలు చేయించుకుంటాడట! ఉత్సవాలు చేయించుకుంటాడట! ఇలా ఊరేగింపులు, సేవలూ, వేడుకలు చేయించు కుంటూ ''కలౌ వేంకట నాయకః'' అన్ని ప్రసిద్ధి పొందిన దేవదేవుడు, జగత్కల్యాణ చక్రవర్తి తిరుమల గోవిందుడు!

కనుకనే తిరుమలక్షేత్రం ప్రతి నిత్యం ఏదో ఒక ఉత్సవం జరుగుతూనే వుంటుంది. ఎప్పుడూ ఏదో ఒక ఊరేగింపు నిర్వహింప బడుతూనే వుంటుంది. ఈ వేంకటాద్రి పుణ్య క్షేత్రంలో ఏడాది పొడవునా ప్రతిరోజూ పండుగే! ప్రతిరోజూ పచ్చతోరణాలే! ప్రతిపూటా పిండి వంటలే! పరమాన్నాలే! ఆహాహా! అలంకార ప్రియుడూ, నైవేద్య ప్రియుడూ, అంతకంటె అత్యంత భక్తప్రియుడూ అయిన శ్రీ వేంకటేశ్వరునిది ఎంతటి భోగం! ఎంతెంతటి వైభోగం! అంచేతే సర్వదేవతలకు

ఆలవాలమై నిరంతరం నిరంతరాయంగా భక్తజన సందోహంతో కిట కిటలాడే దివ్యక్షేత్రం ''నిత్య(చ్ఛ)ల కల్యాణం పచ్చలతోరణం'' గా బాసిల్లుతూ వుంది.

వేంకటాచల క్షేత్రంలో వెలసిన తొలినాళ్లతోనే శ్రీనివాసుడు బ్రహ్మదేవుణ్ణి పిలిచి జగత్కల్యాణం కొరకు తనకు ఉత్సవాలు నిర్వహించి ఘనంగా నివేదనాదులు చేయవలసిందని అజ్ఞాపించడట! శ్రీస్వామి వారి అజ్ఞ ప్రకారమే బ్రహ్మదేవుడు, వేంకటేశ్వరుడు ఆనందనిలయం మధ్యలో ఆవిర్భవించిన కన్యామాసం (ఆశ్వయుజం) లోని శ్రవణ నక్షత్రం నాటికి పూర్తి అయ్యే టట్లుగా, ముందు తొమ్మిది రోజుల నుంచి ఈ ఉత్సవాలను ఘనంగా, వైభవంగా నిర్వ హించారు. అందువల్లే ఇవి ''బ్రహ్మోత్సవాలు'' గా ప్రసిద్ధినంది నాటి నుండి నిరాఘాటంగా నిరాటంకంగా కొనసాగుతూనే వున్నాయి.

అంతేగాక సాక్షాత్తు పరబ్రహ్మ స్వరూపుడైన శ్రీనివాసదేవునికి జరుపబడు తున్న ఉత్సవాలు కనుకే బ్రహ్మోత్సవాలని కూడ పేరు కలగిందని కూడ మరొక ప్రచార ప్రసిద్ధి. అంతేగాక ''బ్రహ్మాండం'' గా జరిగే ఉత్సవాలు కనుక ''బ్రహ్మోత్సవాలు'' అని కూడ పిలువబడుతున్నాయని కూడ చెప్పడం కద్దు.

చాంద్రమానం ప్రకారం ప్రతి మూడవ ఏటా అధికమాసం వస్తూ వుంటుంది. ఇలా వచ్చిన సందర్భాల్లో కన్యామాసం (భాద్రపదం) లో ఒక బ్రహ్మోత్సవమూ, దసరా నవ రాత్రులలో (ఆశ్వయుజం) లో మరొక బ్రహ్మోత్సవమూ, ఇలా రెండుమార్లు నిర్వహింపబడతాయి. భాద్రపదమాసంలో అంటే కన్యామాసంలో నిర్వహించే ఉత్సవాలను వార్షిక బ్రహ్మోత్సవాలనీ, నవరాత్రులతో చేయబడే ఉత్సవాలను నవరాత్రి బ్రహ్మోత్సవా లనీ అంటారు. అధికమాసం రాని సంవత్స రంలో అయితే కన్యామాసం - నవరాత్రులు కలిసే వస్తాయి. కనుక ఒక బ్రహ్మోత్సవం జరుగుతుంది. అధికమాసంవచ్చినప్పుడు ప్రత్యేకంగా జరుపబడే రెండు బ్రహ్మోత్స వాలకూ పెద్ద తేడాలేదుకాని. రెండవ బ్రహ్మోత్సవంలో ధ్వజారోహణ, ధ్వజావ రోహణ లుండవు. వీలుననుసరించి రథోత్సవాలకు మొదటి ఉత్సవంలో చెక్కతేరు ఉపయోగిస్తే రెండవ రథోత్సవంలో వెండి తేరును ఉపయోగిసారు.

బ్రహ్మదేవుడు ప్రారంభించిన ఈ పదినాళ్ల ఉత్సవాలను, కాలక్రమేణ ఎందరో రాజులూ, మరెందరో రారాజులు తమ విజయపరంపరలకు కృతజ్ఞతగా తిరుమల శ్రీనివాసునకు బ్రహ్మోత్సవాలపేరిట నిర్వహించినారు. ఇలా నిర్వహింపబడిన బ్రహ్మోత్సవాలు నెలకొకటి వంతున ప్రతి ఏటా పంౘ్రెండు బ్రహ్మోత్సవాలు జరిగేవట!

క్రీ.శ. 6 1 4 లో పల్లవరాణి సమవాయి (పేరిందేవి) ''మనవాళ పెరుమాళ్'' అనే వెండి భోగశ్రీనివాసమూర్తి విగ్రహాన్ని తిరుమల ఆలయానికి సమర్పించింది. పెరటాసి (కన్యామాసం) నెలలో జరిగే బ్రహ్మోత్సవాలకు ముందు ఈ వెండి విగ్రహాన్ని పురవీథుల్లో ఊరేగించేట్లు ఏర్పాటు చేసిందట పరమభక్తురాలైన ఆ మహారాణి శ్యామమ్మ.

ఆ తర్వాత క్రీ.శ. 1 2 5 4 చైత్రమాసంలో తెలుగు పల్లవరాజు విజయగండ గోపాలదేవుడు; క్రీ.శ. 1 3 2 8 ఆషాఢమాసంలో 'ఆడితిరునాళ్ల' ను త్రిభువన చక్రవర్తి తిరువేంకటనాథయాదవ రాయలు; క్రీ.శ. 1 4 2 9 ఆశ్వయుజ మాసంలో వీరప్రతాపదేవరాయలు; క్రీ.శ. 1 4 4 6 లో ''మాసి తిరునాళ్ల పేర హరిహర రాయలు; క్రీ.శ. 1 5 3 0 లో ''అచ్యుతరాయ బ్రహ్మోత్సవం'' గా అచ్యుతరాయలు; ఇలా క్రీ.శ. 1 5 8 3 నాటికి బ్రహ్మోత్సవాలు, సంవత్సరంలో ఇంచు మించు ప్రతినెలా ఒక బ్రహ్మోత్సవం జరిగేదన్నమాట!

ఆ రాజులూ, వారి రాజ్యాలూ కాల గర్భంలో కలిసిపోయినందువల్ల వారు ఏర్పాటు చేసిన ఉత్సవాలు అర్ధాంతరంగానే నిలిచి పోయాయి.

కాని అలనాడు శ్రీనివాసప్రభువు ఆనతి మేరకు జగత్కల్యాణం కోసం సృష్టికర్తయైన బ్రహ్మదేవుడు నిర్వహించిన బ్రహ్మోత్సవాలు మాత్రం అఖండంగా అంగరంగవైభవంగా వైభోగంగా కొనసాగుతూ కొండలరాయని కొండంత వైభవాన్ని దశదదిశలా చాటుతూ వున్నాయి!

అందువల్లే బ్రహ్మోత్సవ సమయంలో ప్రతి రోజు ఉదయం, సాయంత్రం ఉత్సవాలకు ముందు ''బ్రహ్మరథం'' వెళుతూ వుంటుంది. ఈ రథంలో నిరాకార నిర్గుణ స్వరూపంతో బ్రహ్మదేవుడు వేంచేసి ఈ ఉత్సవాలకు అధ్వర్యం వహిస్తాడు. కాని ఒక్క రథోత్సవంనాడు మాత్రమే బ్రహ్మరథం వుండదు. శ్రీస్వామివారి

రథోత్సవంనాడు మాత్రం బ్రహ్మదేవుడు స్వయంగా శ్రీ వేంకటేశ్వరస్వామివారి తేరు యొక్క పగ్గాలను పట్టుకొని లాగుతూ రథోత్సవంలో పాల్గొంటాడు. అందువల్లే ఇవి బ్రహ్మోత్స వాలని పిలువబడుతూ, సాటిలేని విధంగా జరుపబడుతున్నాయి.

బ్రహ్మోత్సవాలు ధ్వజారోహణం నుంచి ప్రారంభమై ధ్వజ అవరోహణంతో సమాప్తమయ్యే పదినాళ్ల వేడుకలు!

**కోయిల్ ఆళ్వారు తిరుమంజనం (ఆలయశుద్ధి)**

ఈ వేడుకలు ప్రారంభించటానికి ముందే ఆలయాన్ని పూర్తిగా తప్పక శుద్ధి చేస్తారు. తిరుమలలో బ్రహ్మోత్సవాలకు ముందుగా వచ్చే మంగళవారంనాడు శ్రీస్వామి వారి ఆలయాన్ని ముఖ్యంగా సుగంధ ద్రవ్యాలతో శుద్ధి చేసే కార్యక్రమాన్ని ''కోయిల్ ఆళ్వారు తిరుమంజనం'' అనే పేరుతో పెద్ద ఎత్తున నిర్వహింపబడుతుంది. ఒక్క బ్రహ్మో త్సవాలకు ముందేగాక, ఉగాది, ఆణివార ఆస్థానం, వైకుంఠ ఏకాదశి పర్వ దినాలకు ముందు కూడ 'కోయిల్ ఆళ్వారు తిరు మంజనం' అనే పేరుతో పెద్ద ఎత్తున నిర్వహింప బడుతుంది. ఒక్క బ్రహ్మోత్సవాలకు ముందే గాక, ఉగాది, ఆణివార ఆస్థానం, వైకుంఠ ఏకాదశి పర్వదినాలకు ముందు కూడ 'కోయిల్ ఆళ్వారు తిరుమంజనం' అనబడే ఆలయశుద్ధి కార్యక్రమం జరుపబడుతుంది. (కోయిల్ ఆళ్వార్ తిరుమంజనం [వార్షికోత్సవం] చూడండి.) ఇలా ఆలయం అంతటా సర్వే సర్వత్రా కడగి, శుద్ధి చేసిన తర్వాత, శ్రీస్వామివారి ఆలయాన్ని నయనాభి రామంగా, సుమనోహరంగా విద్యుద్దీపాల తోను, పూల పందిళ్లతోను, మామిడాకు తోరణాలతోను, అరటిస్తంభాల తోను అందంగా అలంక రిస్తారు.

**అంకురార్పణ**

ఆ తర్వాతి కార్యక్రమం అంకు రార్పణం. ధ్వజారోహణకు ముందు రోజు సాయంకాల సమయంలో శ్రీస్వామివారి సేనాపతులైన శ్రీ విష్వక్సేనులవారు ఆలయానికి నైరుతి మూలలో వున్న వసంతమండపానికి ఛత్రచామర మంగళ వాద్య పురస్సరంగా తరళి వెళ్లి, అక్కడ భూమి పూజ వగైరాదులు చేసి మృత్సంగ్రహణం చేసి ప్రదక్షిణంగా వచ్చి ఆలయంలో ప్రవేశిస్తారు. ఇక ఆ రాత్రే బ్రహ్మోత్సవాలకు, నవధ్యానాలతో అంకు రార్పణం (బీజావాపం) జరుగుతుంది.

**ధ్వజారోహణం**

ఇక ఆ మరునాటి ప్రధాన కార్యక్రమమే ధ్వజారోహణం.

వైఖానసాగమ శాస్త్రోక్తంగా గరుడ కేతన ప్రతిష్ఠ, కంకణధారణ, ఆలయ ఆవరణలోను, బయట చుట్టూ అష్టదిక్కుల్లోను బలిని వేస్తూ శ్రీస్వామివారు శ్రీదేవి భూదేవి సమేతంగా, ఆలయ పరివార దేవతలతో ఊరేగుతూ వుండగా, అష్ట దిక్పాలురు ఆహ్వానింపబడతారు. ఇలా దేవతలను ఆహ్వానించిన అనంతరం శ్రీస్వామివారు ఆలయం ప్రవేశించి ధ్వజస్తంభం దగ్గరికి చేరుకొంటారు. మిగిలిన పరివార దేవతలైన అనంత, గరుడ, విష్వక్సేన, సుగ్రీవ, హనుమంత అంగదులు విమాన ప్రదక్షిణంలో వున్న అంకురార్పణ మండపానికి చేరుకొంటారు.

పిదప శ్రీదేవి భూదేవి సమేత శ్రీమలయప్పస్వామివారి సమక్షంలో వేద గానాల మధ్య మంగళవాద్యాలు మోగు తుండగా అర్చకస్వాములు బంగారు ధ్వజ స్తంభంపై గరుడధ్వజాన్ని ఎగుర వేస్తారు. ఈ సందర్భంగా ముద్గలాన్నం (పెసరపులగం) నివేదింపబడుతుంది. ఈ ప్రసాదాన్ని స్వీకరిస్తే సంతాన భాగ్యానికి నోచుకోని స్త్రీలు సంతాన వతులు అవుతారని ప్రతీతి!

ఇక ఆ తర్వాత శ్రీస్వామివారిని దేవేరు లతో కూడ ఆ రాత్రినుంచే ఊరేగింపులు చేస్తారు. ప్రతి రోజు ఉదయం, సాయంత్రం, ఒక్కొక్క వాహనం మీద ఉత్సవాలు అంగ రంగవైభవంగా 9 రోజుల పాటు జరుగుతాయి.

**పెద్ద శేషవాహనం — చిన శేషవాహనం**

ధ్వజారోహణం అయిన రోజు రాత్రే శ్రీదేవి భూదేవి సమేత శ్రీమలయప్ప స్వామి వారికి బంగారు శేషవాహనంపై గ్రామోత్సవం జరుగుతుంది. ఆ మరునాడు ఉదయం చిన శేష వాహనంపై శ్రీస్వామివారు ఊరేగింప బడతారు.

''భక్తులారా! సాక్షాత్తు శ్రీ మహా వైకుంఠంలో పాలసముద్రంపై ఆదిశేషుడు సర్వదా శయ్యగా, ఆసనంగా, గొడుగుగా, పాదుకలుగా......... ఇలా అనేక విధాలుగా ఉపయోగపడుతుండగా, శ్రీదేవి భూదేవులు సేవిస్తున్న ఆనాటి నారూపాన్ని దేవతలు, సనక సనందనాది మహర్షులు మాత్రమే దర్శించ గలరు. అందువల్లే మీ కొరకు ఈ వేంకటాచలంలో 'కలౌ వేంకట నాయకః' అన్న ప్రసిద్ధి నంది, మీకు దర్శనమిస్తున్నారు. ఆ ఆదిశేషుడే ఈ శేషాచలం''. అందుకే

బ్రహ్మోత్సవం తొలినాడు పెదశేషవాహనంలో శ్రీదేవి భూదేవులతోకూడి వున్న స్వామివారు అశేష భక్తజనానికి దర్శనమిస్తూ, తిరుమల పురవీదుల్లో ఊరేగుతారు. మరునాడు వెండి చిన శేషవాహనంలో శ్రీస్వామివారు ఒక్కరే ఉత్సవం జరుపుకుంటూ దర్శనమిస్తారు.

**హంస వాహనం**

రెండవరోజు రాత్రి బంగారు హంసపై శ్రీ వేంకటేశ్వరస్వామివారొక్కరే వీణా పాణియై, విజ్ఞానవల్లియైన చదువుల తల్లికి ప్రతిరూపంగా భక్తజనాళికి దర్శనమిస్తూ ఆనంద సందోహంలో ముంచెత్తుతారు. ఓ భక్తులారా! మీ మానస హంసల్ని నా పరం చెయ్యండి. మిమ్మల్ని పరమహంసలుగా మార్చి, ఆనందమయకోశంలో ప్రవేశింపజేస్తాను. తద్వారా పునరావృత్తి రహిత మోక్షాన్ని పొందగలరను దివ్య సందేశాన్ని శ్రీస్వామివారు అనుగ్రహిస్తారు.

**సింహ వాహనం**

మూడవనాటి ఉదయం శ్రీనివాసుడు ఒక్కడే సింహవాహనంపై ఊరేగింప బడతాడు. సింహం గాంభీర్యానికి శౌర్యానికి ప్రతీక! అయినా హింసకు పాల్పడుతుంది కాబట్టే అది సింహం అయింది. "ఓ భక్తులారా! మీకు ఎవరివల్ల అయినా హింస, బాధ కలిగి నట్లైతే నన్ను శరణువేడండి. ఇదిగో ఇలా మిమ్మల్ని హింసపెట్టే శత్రువుల్ని అణచివేస్తా" నని శ్రీస్వామివారు భక్తులకు ధైర్య స్థైర్యాలను ప్రసాదిస్తూ ఉత్సవం చేసుకొంటాడు.

**ముత్యపు పందిరి**

మూడవనాటి రాత్రి ముత్యపు పందిరి వాహనంపై ఉభయదేవేరులతోకూడి వున్న శ్రీ మలయప్ప స్వామివారు ఊరేగుతారు.

ఓ పరమభక్తులారా! మీ మనస్సుల్ని హృదయాల్ని నిర్మలంగా ఉంచుకొని కరుణా సింధువు అయిన శ్రీ వేంకటాచలపతిని సేవించండి. పనికి రాని గవ్వ స్వాతి చినుకు వల్ల ముత్యంగా మారినట్లుగాఆ పరాత్పరుని కరుణా కటాక్ష వీక్షణాలవల్ల మీ జీవితాలు ధన్యములవుతాయని ఈ ముత్యాల పందిరి వాహనం దివ్యప్రబోధ మిసుంది.



గరుడోత్సవం



శ్వేతాంబరధారి శేషాచలపతి

**కల్పవృక్షం**

నాల్గవనాటి ఉదయమే కల్పవృక్ష వాహనం. శ్రీదేవి భూదేవి ఉభయదేవేరులతో కూడి వున్న శ్రీవేంకటేశ్వరుడు కల్పవృక్ష వాహనంపై ఉత్సవం జరుపుకుంటూ దర్శన మిస్తారు!

అదేదో కల్పవృక్షమట! దేవలోకంలో వుంటూ దేవతలందరు కోరినవన్నీ తీరుస్తుందట! మరి ఆ దేవలోకం ఎక్కడ వుందో తెలియనే తెలియదు. ఇక ఆ వృక్షం సంగతి సరే సరి! అని మీరు చింతించవద్దు! ఓ భక్తులారా! మీ పాలిటి కల్ప వృక్షాన్ని నేనే, మీకు ఏం కావాలో అన్ని కోరండి నేను తీరుస్తాను. అంటూ కల్పవృక్షంపై వేంచేసిన శ్రీనివాసుడు దర్శనమిస్తాడు.

**సర్వభూపాల వాహనం**

నాల్గవనాటి రాత్రే సర్వభూపాల వాహనం. ఇది ఒక స్వర్ణమండపం. సర్వ శోభాయమానంగా అలంకరింపబడ్డ ఆ బంగారు మండపం మధ్యలో ఉభయ నాచ్చి యారులతోకూడివున్న శ్రీనివాసప్రభువు కొలువై ఊరేగుతూ దర్శనమిస్తాడు. ఈ సర్వ భూపాల వాహనంలో సర్వజగత్ప్రభువైన శ్రీ వేంకటపతి మహాదర్పంగా వుంటారు! ఆ సమయంలో ఎవరు ఏది అడిగినా, అడిగిన వెంటనే ప్రసాదిస్తారు.

ఓ భక్తులారా! మీ హృదయం కూడ ఒక స్వర్ణ మండపమే! అందులో నన్ను ప్రతిష్ఠించుకోండి! అప్పుడు మీకు సర్వ కామ్యాలు కరతలామలకమవుతాయి. అన్నట్లుగా స్వామివారు దివ్య దర్శన మిస్తారు.

**మోహినీ అవతారం**

ఐదవనాటి ఉదయం శ్రీస్వామివారు అలనాటి మోహినీ అవతారం దాల్చి దంతపు పల్లకి నెక్కి దర్శనమిస్తాడు. ఎవరీ సౌందర్య రాశి! ఎవరీ మెరుపు తీగ! అని శ్రీదేవి భూదేవులు ఆ అందాలరాసిని చూసి అసూయ పడతారు. ఆ తళకు బెళకులు, నడకల హోయలు మైమరచిచూస్తూ, అంతలోనే తీరుకొని ఓహో జగన్నాటక సూత్రధారుడైన మన స్వామే ఈ జగన్మోహిని కదా! అని ముసి ముసి నవ్వులతో సంతృప్తి పడతారట శ్రీనివాసుని దేవేరులు!

ఆ మోహిని నిజంగా జగన్మోహినియే! ఒక సౌందర్య రేఖ! ఒక బంగారు మొలక!

శ్రీ వేంకటేశ్వరుడు మోహినీ అవతారంతో దంతపు పల్లకి నెక్కి అమృత కలశాన్ని చేతబూని ''భక్తులారా! దానవుల వలె బాహ్య సౌందర్యానికి భ్రమపడి భ్రష్టు చెందవద్దు. సర్వాంతర్యామిగా నన్ను గుర్తించి, శరణువేడి ఆరాధించండి. మీకు అమృతాన్ని ప్రసాదించగలనని చెప్పుతూ శ్రీతిరుమల స్వామి దర్శనమిస్తాడు.

**గోవిందా! గోవిందా! గోవింద!!!**

## గరుడోత్సవం

బ్రహ్మోత్సవాలలో ఐదవనాటి రాత్రి జరిగే బంగారు గరుడోత్సవ ప్రాధాన్యం ఇంతింతని వర్ణింపలేనిది! వర్ణింపరానిది! ఆ రోజు ఆనందనిలయంలోని మూలవిరాట్టు నకు అలంకరించే మకర కంఠి లక్ష్మీహారాది విశిష్ట ఆభరణాలు శ్రీస్వామివారి ఉత్సవ మూర్తికి అలంకరిస్తారు. ఆనాడే తమిళ నాడులోని శ్రీవిల్లిపుత్తూరు నుంచి అక్కడి గోదాదేవికి అలంకరించిన పూలమాలను గరుడోత్సవం నాటికి తిరుమలకు తెచ్చి శ్రీస్వామివారలకు అలంకరిస్తారు. ఆ రోజే ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం తరపున ముఖ్యమంత్రి సమర్పించిన నూతనపట్టు వస్త్రాలను కూడ స్వామివారికి అలంకరిస్తారు.

ఇక మద్రాసునుంచి మిరాశిదారులు, కాలినడకన పదిరోజులు ముందుగా బయలుదేరి కొత్త గొడుగులను దారిలో ఊరూరా పూజలందుకుంటూ, సరిగ్గా గరుడోత్సవం నాటికి తిరుమలకు తెస్తారు. ఆ కొత్తగొడుగులను ధరించి బంగారు గరుడునిపై వేంచేసి, తిరుమల పురవీథుల్లో అశేష భక్తజన ప్రవాహం మధ్య శ్రీవారు చిరు నవ్వులు చిందిస్తూ వరదహస్తుడై అనుగ్రహిస్తూ ఊరేగుతారు.

సాక్షాత్తు వేదమయుడూ, అప్రతి హతశౌర్యవంతుడు, బలవంతుడు అయిన గరుడునిపై శ్రీనివాసదేవుడు విహరించడం బ్రహ్మోత్సవాలలో వాహనసేవలలో కెల్ల పరాకాష్ఠ!

ఓ భక్తులారా! అన్ని వేళల్లో దుష్ట శిక్షణ శిష్టరక్షణకై ఆర్తత్రాణ పరాయణుడనై శంఖచక్రాది ఆయుధాలను ధరించి, గరుడవాహనుడనై సిద్ధంగా

వుంటాను. నన్ను శరణువేడి నిర్భయంగా వుండండి! అని అభయమిస్తూ తిరుమల పుర వీధుల్లో గరుడవాహనంపై సంచరిస్తాడు శ్రీనివాసస్వామి.

శ్రీశ్రీనివాసపరాత్పరుని బంగారు గరుడోత్సవ దర్శనం సర్వపాప హరం! సర్వ సంపత్కరం! సర్వశ్రేయోదాయకం!!

**పల్లించిన నీ పసిడి గరుడనిని**
**కెల్లున నీవెక్కిన యపుడు**
**ఝల్లనె రాక్షస సమితి నీ మహిమ**
**వెల్లి మునుగుదురు వేంకటరమణా!**

**హనుమద్వాహనం**

ఆరవనాటి ఉదయం శ్రీనివాసుడు హనుమంతుడిపై ఊరేగుతూ భక్తులకు దర్శనమిస్తాడు. త్రేతాయాం రఘునందనః అని ప్రసిద్ధినందిన ఆ శ్రీరామచంద్రుణ్ణి నేనే. అందుకే ''కౌసల్యా సుప్రజారామా!'' అంటూ ప్రతి నిత్యం ఆ రాముని పేరుతోనే మేలు కొలుపులు పాడించుకుంటున్నాను. మీ భాగ్యవశంచేత కలియుగంలో వేంకటేశునిగా ఇదిగో నేడు ఈ భక్తాగ్రేసరుడైన ఆంజనేయునిపై వేంకటాద్రి రామునిగా దర్శనమిస్తూ వున్నాను. దర్శించి తరించండి అన్నట్లుగా శ్రీనివాసుడు హనుమంతునిపై ఊరేగుతారు.

**వసంతోత్సవం - సువర్ణరథం**

ఆ మధ్యాహ్నం శ్రీదేవి భూదేవి సమేతంగాశ్రీ మలయప్పస్వామివారికి వసంతో త్సవం జరుగుతుంది. ఈ సమయంలో శ్రీస్వామివారు దేవేరులతోపాటు దేవస్థానం ఉన్నతాధికారులు మొదట చిన్న అధికారుల వరకు అందరూ ఒకరి కొకరు వసంతములు చల్లుకుంటూ వసంతోత్సవ వేడుకల్లో ఆనందోత్సాహాలతో భక్తి ప్రపత్తులతో పాల్గొంటారు.

అనంతరం ఆ సాయంత్రం శ్రీదేవి భూదేవి సమేతంగా శ్రీ మలయప్ప స్వామివారు స్వర్ణ రథాన్ని అధిరోహించి తిరుమల పురవీధుల్లో ఛత్ర చామర బాజా భజంత్రీలతో వేదపారాయణాలతో ఊరేగుతూ అశేష భక్తజనాన్ని అనుగ్రహిస్తూ ఆనందింప జేస్తారు. వసంతోత్సవం అయిన వెంటనే జరిగే స్వర్ణ రథోత్సవాన్ని ''సువర్ణ రథరంగ డోలోత్సవం'' అంటారు.

**గజవాహనం**

ఆరవనాటి రాత్రి శ్రీ వేంకటేశ్వర స్వామివారు గజేంద్రునిపై సంచరిస్తూ దర్శన మిస్తారు.

ఓ భక్తులారా! ఈ గజేంద్రుడు బలవంతుడే కాని అహంకారి! తనకున్న బల గర్వంచేత పదివేల ఏండ్లు చిన్న మొసలి పిల్లతో పోరాడి, చివరకు విధిలేక నన్ను శరణు వేడినాడు. నేను జాలిపడి అల వైకుంఠ పురంలో నుండి వెంటనే దిగివచ్చి, శరణార్తుడైన ఈ గజేంద్రుని మొసలిబారినుండి రక్షించాను. కనుక భక్తులారా! మీ శక్తియుక్తులపై ఆధారపడక మీ రక్షణ భారమంతా నా మీద ఉంచుడు. ఎప్పుడూ మిమ్మల్ని కంటికి రెప్పవలె కాపాడుతానన్నట్లుగా శ్రీస్వామివారు గజవాహనుడై దర్శనమిస్తాడు.

**సూర్యప్రభ - చంద్రప్రభ**

ఏడవనాటి ఉదయం సూర్యప్రభ వాహనంపైనా ఆ రాత్రి చంద్రప్రభ వాహనంపైనా వెలుగుల కన్నిటికి పెద్దవెలుగైన శ్రీ వేంకట పరంజ్యోతి తిరుమల వీథుల్లో వింత వింత కాంతులతో సంచరిస్తాడు!

''జ్యోతిషాం రవి రంశుమాన్, నక్షత్రాణామహం శశీ'' జ్యోతి స్వరూపాల్లో సూర్యుణ్ణి నేను, నేనే చంద్రుణ్ణి. అంతేకాదు. అఖండ జ్యోతి స్వరూపుణ్ణైన నేను, సర్వ చరాచర జీవరాసులన్నింటియందు ఆత్మ స్వరూపినై వెలుగుతున్నాను. అసలు నా రూపమే జ్యోతి! తేజస్సు!! అని తన తేజో రూపాన్ని మరింత ఉద్ధరింపజేస్తూ సూర్య చంద్రులపై దర్శనమిస్తాడు ఏడుకొండల వేంకటేశ్వరస్వామి.

**రథోత్సవం**

బ్రహ్మోత్సవాల్లో ఎనిమిదవ రోజు ఉదయం జరిగే విశేష ఉత్సవం రథోత్సవం. తిరుమల కొండలరాయనికి జరిగే ఉత్సవాల్లో అన్నింటికంటె రథోత్సవం విశిష్టంగా, అత్యంత వైభవంగా ఆనందదాయకంగా వుంటుంది.

రథస్థం కేశవం దృష్ట్వా పునర్జన్మ న విద్యతే.

అన్నట్లుగా తిరుమల శ్రీనివాసుని దర్శనంతో తమ జన్మ పరంపర నశిస్తుందన్న భక్తి విశ్వాసాలతో, శ్రీస్వామివారి రథంయొక్క పగ్గాలను లాగుతూ ''గోవిందా! గోవిందా!'' అంటూ గోవిదనామ స్మరణచేస్తూ రథోత్సవంలో స్వయంగా పాలు పంచుకునే భక్తజనుల ఆనందం వర్ణనాతీతం!

'ఓ భక్తులారా! మీ శరీరమే ఒక దివ్య రథం. అందులో వున్న ఆత్మను నేను. ఇక గుర్రాలంటారా మీ యొక్క ఇంద్రియాలు. మీ బుద్ధే సారథి! మీ మనస్సే పగ్గం. మీ శరీర రథం సక్రమమైన మార్గంలో నడచి పరమ సుఖమయమైన ఆనందమయకోశం చేరాలంటే మీ మనస్సనే పగ్గంతో ఇంద్రియాలనే గుర్రాలను అదుపుచేస్తూ మీబుద్ధి అనే సారథితో శరీరమనే రథంలో ఆత్మ రూపంలో వేంచేసివున్న నన్ను సేవించి తరించండి. ముక్తిని పొందండి' అని దివ్య ప్రబోధమిస్తూ శ్రీదేవి భూదేవి సమేత శ్రీస్వామివారు రథోత్సవంలో పాల్గొంటారు.

**అశ్వవాహనం**

ఎనిమిదవనాటి రాత్రి శ్రీస్వామివారు శిరస్త్రాణాన్ని దాల్చి, చేత ఖడ్గం పూని అశ్వంపై సంచరిస్తాడు. ''భక్తులారా! మీ ఇంద్రియాలే గుర్రాలు! వాటిని నిగ్రహించడం మీకు చేతకాని పని. నేను మాత్రమే మీకు ఇంద్రియ నిగ్రహాన్ని ప్రసాదించి సరియైన మార్గంలో నడిపించి తరింప జేయగలను'' అని స్వామివారు ఉపదేశిస్తూ దర్శనమిస్తాడు. అంతేగాక ''రాష్ట్రం వై అశ్వః'' అన్నట్లు జగమే ఒక గుర్రం. సర్వజగన్నియామకుడను నేనే అని శ్రీస్వామి భక్తులకు తెలియజేస్తూ, అశ్వ వీరుడుగా మొక్కులందుకుంటాడు. దుష్టశిక్షణ, శిష్ట రక్షణ చేయటానికి రాబోయే కల్కిని కూడా నేనే అని శ్రీ వేంకటేశ్వరస్వామి అశ్వవాహనంపై మహా రౌద్రంగా దర్శన మిస్తారు.

**చక్రస్నానం**

తొమ్మిదవనాటి ఉదయం శ్రీవరాహస్వామి ఆలయ ప్రాగణంలో శ్రీదేవి భూదేవీ సమేత శ్రీమలయప్పస్వామిని, శ్రీసుదర్శన చక్రత్తాళ్వారుతోకూడ వేంచేపు చేయించి, పంచామృత స్నపన తిరుమంజనం చేస్తారు. ఆ తర్వాత శ్రీసుదర్శన

చక్రత్తాళ్వారును శ్రీ స్వామి పుష్కరిణిలో ముంచి పవిత్ర స్నానం చేయిస్తారు. అదే సమయంలో వేలాది భక్త జనం పవిత్ర పుష్కరిణిలో మునకలిడి పునీతులవుతారు. ఆ తర్వాత శ్రీస్వామి వారలు, సుదర్శన చక్రస్వామి ఊరేగింపుగా వచ్చి ఆలయ ప్రవేశం చేస్తారు.

**ధ్వజావరోహణం**

తొమ్మిదవ నాటి రాత్రి ధ్వజ అవరోహణోత్సవం జరుపబడుతుంది. శ్రీదేవి భూదేవి సమేత శ్రీ మలయప్పస్వామివారి సమక్షంలో వేదపారాయణలు సాగుతుండగా బజంత్రీ వాద్యాలు, భేరీమృదంగాలు మోగు తుండగా బ్రహ్మాది దేవతలందరికి, దిక్పాలురకు వీడ్కోలు చెప్పూతూ, గరుడ ధ్వజాన్ని ధ్వజస్తంభంమీది నుంచి దించుతారు. నివేదన కర్పూర నీరాజనాదులన్నీ అయిన తర్వాత అర్చకులకు, ఆచార్య పురుషులకు సత్కారం జరిగి, వారిని సగౌరవంగా వారి వారి విడుదలకు సాగనంప బడుదురు. దీనిలో పదిరోజులపాటు వైభవంగా సాగిన బ్రహ్మోత్సవాలు ఘనంగా సమాప్తమవుతాయి.

ఈ బ్రహ్మోత్సవ సందర్భంలో ఏడు కొండల్లో ఒకవైపు గోవిందలు పెడుతూ కొండలెక్కే భక్తజనం..... మరోవైపు భక్తితో చిందులేస్తూ భజనచేసే భజన బృందాలు. ఇంకో వైపు కోలాట నృత్యాలు చెక్క భజనలు.... హరికథలు..... బుర్రకథలు.... పగటి వేషాలు. పవిత్ర పుష్కరిణిలో స్నానాలు, దర్శనాలూ, నున్నటి గుండ్లతో ముఖం నిండా పట్టె నామాలతో సాక్షాత్తు నామాలవాని నడుస్తున్న ప్రతిరూపాలుగా కన్పట్టే భక్తాగ్రేసరులు, సాక్షాత్తు లక్ష్మీ రూపాలుగా కన్పడుతూ స్వామికి నీరాజనా లిస్తున్న పుణ్య స్త్రీలు, నిత్యాన్న దానాలు, ప్రసాద వితరణలు, యాత్రికుల సేవలో అహరహ కృషి చేస్తున్న దేవస్థానం ఉద్యోగ బృందాలు, రక్షక భటులు, స్కౌట్లు, గైడ్లు ఆరోగ్యాధికారులూ, అర్చక స్వాములూ, ధార్మిక ప్రసంగాలు.... ఇలా ఎందరో... ఎందరెందరో ఎన్నో విధాలుగా విధి నిర్వహణ చేస్తున్నా.... వీరందరి దృష్టీ ధ్యేయం ఒక్కటే. గమ్యం ఒక్కటే అని కొట్ట వచ్చినట్లు తెలియ జేస్తూ ఆనందనిలయం నుంచి శ్రుతి కింపుగా వినవచ్చే వేదాల నాదాలు....... ఇలా తిరుమల అంతటా ఒక ఆధ్యాత్మిక తేజస్సు నిండి వుంటుంది.

బ్రహ్మోత్సవ సమయంలో తిరుమల క్షేత్రం అంతటా స్వాగత తోరణాలతో, ఆలయ ప్రాకారాలు, మండపాలు, పుష్కరిణి, సత్రాలు ఇలా సర్వే సర్వత్రా విద్యుద్దీపాలతో శోభాయమానంగా అలంకరింపబడుతుంది. కన్నులకు మిరు మిట్లు గొలిపే విద్యుత్ కాంతుల్లో తిరుమల కొండలు, కోనలు ఆనంద నిలయ విమాన దృశ్యం చూచి తీరవలసిందే కాని వర్ణింప సాధ్యం కానిది.

తిరుమల బ్రహ్మోత్సవంలో మరో ప్రత్యేకత పుష్పాలంకరణ. దేవస్థానం వారి ఉద్యాన వనాల శాఖ తిరుమల శ్రీస్వామివారి కైంకర్యాని కమసరమయ్యే పూలను పూయించి సరఫరా చెయ్యడమేగాక తిరుమల అంతటా గీతోపదేశం, గజేంద్రమోక్షం, అన్నమయ్య, త్యాగయ్య, శ్రీ వేంకటేశ్వరస్వామి మున్నగు చిత్రాలు రంగు రంగుల పుష్పాలతో తీర్చి దిద్దిన తీరు, డోలోత్సవ మండపం, శ్రీవారి ఆలయం లోపల, బయటా సుగంధ పరిమళాలు వెదజల్లుచున్న పుష్పజాతులతో చేసిన అలంకరణలు అలంకారాలు, కళా నైపుణ్యాలూ, చూపరులనిట్టే ఆకర్షించి నిలిపి యాత్రికులను ఆనంద రస జగత్తులో ఓల లాడిస్తాయి.

ఇలా తిరుమలేశుని తిరునాళ్లుగా ప్రసిద్ధి చెందిన బ్రహ్మోత్సవాల్లో మనసారా, తృప్తి దీరా పాల్గొన్న భక్తజనం వింత వింతలుగా కోటికాంతు లీనుతున్న తిరుమల ఆనంద నిలయ విమాన వైభవాన్ని మళ్లీ దర్శించే భాగ్యం ఎప్పుడా! అని ఆర్తితో ఆనందంతో ఆర్ద్ర నయనాలతో యాత్రిక జనం స్వగృహాలు చేరుకుంటారు. తమ జీవితంలో ఒక కొత్త అనుభూతిని, ఆనందాన్ని పొందుతూ తిరుమలలో గడపిన క్షణాలను మధుర స్మృతులుగా పదిలపరచుకుంటారు.

**శ్రీవేంకటాద్రి శృంగాగ్ర మంగళాభరణాంఘ్రయే**
**మంగళానాం నివాసాయ శ్రీనివాసాయ మంగళమ్.**

సమస్త సన్మంగళములకు నిలయమైన వాడును, శ్రీవేంకటాచల శిఖరములకే ఆభరణములుగా ప్రకాశిస్తూవున్న దివ్య పాద పద్మములతో విరాజిల్లువాడును అయిన శ్రీశ్రీశ్రీ శ్రీనివాస జగత్ప్రభువునకు మంగళ మగు గాక! శుభమంగళమగుగాక!! నిత్య జయ మంగళమగు గాక!!!

**గోవిందా! గోవిందా! గోవింద!!!**

* * *

# 14. దీపావళి ఆస్థానం

సర్వజగత్ప్రభువైన శ్రీనివాస పరమాత్మకు జరుగుతున్న వార్షిక ఉత్సవాల్లో ''దీపావళి ఆస్దానం'' ఒకటి. ఆశ్వయుజ మాసం అమావాస్య (దీపావళి) నాడు యథా ప్రకారంగా శ్రీవేంకటేశ్వరస్వామి వారికి సుప్రభాతం మొదలుకొని మొదటి గంట నివేదనవరకు యథా ప్రకారంగా జరుగుతవి.

బ్రహ్మోత్సవాలలో ఆనంద నిలయాన్నివీడి బయటికి వెళ్లి రంగనాయక మండపంలోనే వుంటూవున్న శ్రీ మలయప్పస్వామి దేవేరులతో కూడి దీపావళి రోజున ఆస్దానానికై గంటా మండపంలోనికి వస్తారు. పిదప ఉభయదేవేరులతో కూడిన శ్రీమలయప్పస్వామిని, బంగారు వాకిలి ముందు ఏర్పాటుచేసిన సర్వభూపాల వాహనంలో గరుడాళ్వారుకు అభిముఖంగా ఏర్పాటు చేస్తారు. సేనాపతి అయిన శ్రీ విష్వక్సేనులవారిని కూడ స్వామివారి ఎడమప్రక్కన మరొక పీఠంపై దక్షిణాభి ముఖంగా వేంచేపుచేస్తారు.

ఆ తర్వాత లోపల మూలమూర్తికి, బయట కొలువులో వున్న శ్రీ స్వామివారికి రెండవ అర్చన చేస్తారు. పిదప ఆస్థాన ప్రసాదాలను, గమేకార్లు తీసికొనిరాగా, వెంట ఛత్రచామర మంగళ వాద్య పురస్సరంగా బయలుదేరి ధ్వజస్తంభానికి ప్రదక్షిణంగా వచ్చి లోపల, కొలువులోను సమర్పించగా రెండవ గంట జరుగుతుంది. అటు తర్వాత శ్రీ జియ్యంగారు 6 పట్టువస్త్రాలను వెండి తట్టలో పెట్టుకొని దేవస్థానం అధికారులు వెంటరాగా, మంగళవాద్యాలలో ఛత్ర చామరాలతో బయలుదేరి ధ్వజస్తంభానికి ప్రదక్షిణంగా వచ్చి, విమాన ప్రదక్షిణంలో చేస్తూ ఆనంద నిలయంలోపల సమర్పిస్తారు. అర్చకస్వాములు వాటిలో నాలుగింటిని శ్రీస్వామివారి కిరీటంనను, ఖడ్గానికి, ఉత్తరీయంగానను, ఆదితోమాలగాను సమర్పించి అక్షతారోపణంచేసి హారతుల నిస్తారు. మళ్లీ అక్కడినుంచి శ్రీజియ్యంగారు మిగిలిన రెండు వస్త్రాలతో బయలుదేరి కొలువులో సమర్పిస్తారు.

ఆస్థానంలో అర్చకులు వాటిలో ఒక దానిని శ్రీమలయప్పస్వామివారికి, మరొక దానిని శ్రీవిష్వక్సేనులకు సమర్పిస్తారు. తర్వాత శ్రీస్వామివారికి, సేనాధిపతికి అక్షతారోపణం జరుగును. పిదప విష్వక్సేనులకు, అర్చకులకు శఠారి మర్యాదలు జరుగును. పిదప అర్చకులు శ్రీస్వామివారినుండి బియ్యాన్ని దక్షిణను దానంగా స్వీకరించి ''నిత్యైశ్వర్యోభవ'' అని శ్రీస్వామివారినే ఆశీర్వదిస్తారు. ఆ తర్వాత జియ్యంగార్లకు, దేవస్థానం అధికారులకు హారతి చందన శఠారి మర్యాదలు జరుగును. చివరగా స్థానీయులైన వారికి కూడ హారతి చందన శఠారి మర్యాదలు చేస్తారు. పిదప ప్రసాద వినియోగం జరుగును.

ఈ ''దీపావళి ఆస్థానం'' బంగారు వాకిలి ముందుగల ఘంటా మండపంలో జరుగుతుంది. ఈ ఆస్థానంలో యాత్రికులు పాల్గొనడానికి వీలులేదు.

పిదప శ్రీస్వామివారు తర్వాత ఉత్సవాల్లో పాల్గొనడానికి బయలుదేరడంతో దీపావళి ఆస్థానం సమాప్తమవుతుంది.

* * *

## 15. పుష్పయాగం

ప్రతి సంవత్సరం బ్రహ్మోత్సవాల అనంతరం కార్తీక మాసంలో తిరుమల శ్రీ వేంకటేశ్వరస్వామివారికి జరిగే అత్యంత విశిష్టమైన ఉత్సవం పుష్పయాగం. ప్రతి కార్తీక మాసంలో శ్రీస్వామివారి జన్మ నక్షత్రమైన శ్రవణ నక్షత్రం రోజున వివిధరకాల పువ్వులతో జరిగే పుష్పయాగోత్సవ వైభవం ఇంతింతని వర్ణింపరానివి వర్ణింపలేనిది.

కామితార్థ ప్రదమైన ఈ పుష్పయాగం సర్వజగన్నియామకుడైన తిరువేంకటపతికి అనేక విధాలైన రంగురంగుల పరిమళ భరితమైన పుష్పాలతో జరపడం ప్రాచీనకాలం నుంచీ ఆనవాయితీగా వుండేదని శాసనాలవల్ల తెలియవస్తున్నది. క్రీస్తుశకం 15వ శతాబ్దంలోని తాళ్లపాక అన్నమాచార్యులు శ్రీస్వామివారికి ఆనాడు జరిగే పుష్పయాగాన్ని గూర్చి అనేక విధాల కీర్తించాడు కూడ .

కాని ఏ కారణంవల్లనో ఎప్పుడో అర్థాంతరంగా తిరుమలలో జరిగే శ్రీవారి పుష్పయాగం నిలిచిపోయింది.

మళ్లీ వందల సంవత్సరాల అనంతరం తిరుమల తిరుపతి దేవస్థానంవారు 1980 నవంబరు 14 నుంచి ప్రతి సంవత్సరం కార్తీక మాసం శ్రవణ నక్షత్రం రోజున ఈ పుష్ప యాగోత్సవాన్ని పునరుద్ధరించి తిరుమల శ్రీస్వామివారికి ఘనంగా నిర్వహించడం జరుగుతున్నది.

విగ్రహాలు ప్రతిష్ఠించిన తర్వాతగాని, ఏవైన ఉత్సవాలు ఊరేగింపులు జరిగిన తర్వాత గాని తిరుమల్పనికి పుష్పయాగం నిర్వహింపబడేదట. అంతేగాక దక్షిణాయన ఉత్తరాయన పుణ్యకాలాల్లో, మేషతులా సంక్రమణాల్లోను శ్రీ తిరుమలప్పని జన్మ నక్షత్రమైన శ్రవణంలోను పుష్పయాగం చేస్తారట! భక్తులు, యాత్రికులు తమ తమ పుట్టిన రోజుల్లోగాని, బంధుమిత్రులు పుట్టిన రోజుల్లోగానీ ఈ పుష్పయాగం చేయవచ్చని ఆగమ శాస్త్రాలు నిర్దేశిస్తున్నాయి.

ఇంకా ప్రభుత్వాధిపతులు, దేశాధి నేతలు, తమ ప్రభుత్వాలు సక్రమంగా సాగాలని తమ తమ రాజ్యాలు సుభిక్షంగా, సస్యశ్యామలంగా వుండాలని ప్రార్థిస్తూ శ్రీ వేంకటేశునికి పుష్పయాగం చేయించడం కూడ వుందని శాస్త్రాలు స్పష్టం చేస్తున్నాయి.

ఇంతేగాక సర్వజన బాధాకరములైన అతివృష్టి, అనావృష్టి, దుర్భిక్షం, భూకంపం, సాముహిక రోగ దుర్మణం మున్నగు సమాజ ఉపద్రవ సమయాల్లోను యుద్ధ బీభత్స వేళల్లోను కలుష భంజనుడగు ఘన వేంకటేశునకు పుష్పయాగం చేయటం కలదని శ్రీవేంకటాచల మాహాత్మ్యంలోను, వివిధ ఆగమ శాస్త్రాల్లోను ప్రస్తావనలు వున్నాయి.

అంతేగాక బ్రహ్మోత్సవంలో ధ్వజారోహణ జరిగిన ఏడవనాడు తిరుమల స్వామికి పుష్పయాగం జరిగేదని పురాణాల వల్ల తెలుస్తోంది.

ప్రస్తుతం తిరుమలప్పనికి వైభవంగా జరిగే పుష్పయాగోత్సవ విధానాన్ని తెలుసుకుందాం.

పుష్పయాగం జరిగేనాడు యథా ప్రకారం ఆనందనిలయంలో నిత్య సేవలైన సుప్రభాతం, విశ్వరూప దర్శనం, తోమాల సేవ, అర్చన, మొదటి నైవేద్యం జరుగుతాయి. ఆ తర్వాత వెంటనే రెండవ అర్చన, రెండవ గంట నైవేద్యం కూడ జరుగుతుంది. ఆ తర్వాత శ్రీదేవి భూదేవులతో కూడి వున్న శ్రీమలయప్ప స్వామివారు (ఉత్సవమూర్తులు) ఆనంద నిలయాన్ని వీడి సంపంగి ప్రదక్షిణంలో వున్న కల్యాణ మండపంలో ఏర్పాటు చేసిన యాగశాలకు వేంచేస్తారు.

ముందుగా యాగశాలలో ఋత్విక్కులు శ్రీ విష్ణు గాయత్రీ మహా మంత్రాన్ని ఉచ్చరిస్తూ అగ్ని ప్రతిష్ఠచేసి బిల్వ దళాలలతో 108 సార్లు హోమం చేస్తారు. పుష్పాధిపతిని కూడ ఆవాహనం చేసి 12 పర్యాయాలు వైష్ణవాంతంగా యాగం చేస్తారు. ఆ తర్వాత శ్రీదేవి భూదేవి సహిత మలయప్ప స్వామివారికి కంకణాలను ధరింపజేసి, హోమ తిలకాన్ని పెట్టిన తర్వాత స్నపన తిరుమంజనం చేస్తారు.

ముందుగా శ్రీదేవి, భూదేవి, స్వామివారికి స్నానవస్త్రాలు ధరింపజేసి, అర్ఘ్య పాద్యాచమనాలు జరిపి తొలిగా శుద్ధోదక స్నానం చేయిస్తారు. ఆ తర్వాత ఆవుపాలతో అభిషేకం చేస్తారు. మళ్లీ శుద్ధజలంతో అభిషేకించి ధూపదీప కర్పూర నీరాజనం గావిస్తారు. ఆ తర్వాత పెరుగు, తేనె, కొబ్బరి నీళ్లు, పసుపులతో అభిషేకం చేస్తారు. చివరగా చందనాన్ని బాగా అలది తులసి మాలల్ని ధరింపజేసి, నక్షత్ర హారతి ఇస్తారు. పిదప బంగారు తట్టతో సహస్రధారాభిషేకం చేస్తారు.

ఈ స్నపన తిరుమంజనం జరుగుతుండగా వేదపండితులు శ్రీసూక్త పురుషసూక్త, భూసూక్తాలను పఠిస్తారు. అభిషేకం పూర్తికాగానే వేద పఠన ఆగిపోతుంది. ద్రావిడ వేదమైన నీరాట్టం ప్రారంభిస్తారు.

శ్రీస్వామివారి అభిషేక జలాన్ని అర్చకులు 'పూతోభవ' అని ముందుగా చల్లుకొని భక్తులందరి మీదా చల్లుతారు. వెంటనే స్వామివారికి నివేదన జరుగుతుంది.

దీనితో పుష్పయాగంలోని మొదటి ఘట్టం పూర్తవుతుంది. ఆ తర్వాత శ్రీదేవి భూదేవి సహిత శ్రీస్వామివారికి పట్టువస్త్రాలను ధరింపజేసి, ఆభరణాలతోను, పూలమాలల తోను అలంకరిస్తారు. అలంకరించిన శ్రీస్వామివారలను అక్కడే ఏర్పాటుచేసిన పెద శేషవాహనంలో వేంచేపు చేస్తారు. ఆ తర్వాత శ్రీనివాస స్వామికి విశిష్ట రీతిలో పుష్పయాగం ప్రారంభమవుతుంది.

ఒకవైపు వేదపండితులు వేదాలు నాలిగింటిని వరుసగా ఒక వేదం తర్వాత మరొక వేదం పారాయణ చేస్తుంటారు. ఆ వేదనాదాల మధ్య మరో వైపు భక్త కవులు పండితులు వాగ్గేయకారులు వందిమాగధులు భక్తకోటికి కొంగుబంగారమై దర్శనమిస్తున్న కొండల కోనేటిరాయని అఖండ పూర్ణతనూ, ఆద్యంత రహిత్వాన్నీ, ఆపదుద్ధారకత్వాన్ని, ఆర్త రక్షకత్వాన్ని, పురుషోత్తమత్వాన్ని, విశ్వాత్మకత్వాన్ని తమ తమ శక్త్యానుసారం వివిధ సాహితీ ప్రక్రియల విశేషాలతో అత్యంత భక్తి ప్రపత్తులతో కీర్తిస్తుండగా ఋత్త్విక్కుల మహా మంత్రోచ్చారణలతో నిరంతరం భక్త పరిరక్షణశీలుడైన శ్రీవేంకటాచలపతికి పుష్పాంజలి కైంకర్యం జరుగుతుంది.

ఆ పుష్పారాధన శ్రీవారి మూర్తులు పాదాలనుండి హృదయంవరకు పూలలో మునిగేంతవరకు జరుగుతుంది. ఇలా ఈ మూర్తులు (విగ్రహాలు) హృదయం వరకు పుష్పాలతో నిండిపోగానే ధూపదీప నీరాజనాలు ఇచ్చి ఆ పుష్పాలను పాదాలవరకు సవరిస్తారు. మళ్లీ విగ్రహాలు పూలతో నిండగానే ధూపదీప హారతులిచ్చి ఆ పూలను మళ్లీ సవరిస్తారు.

ఇలా ఇరవైమార్లు రకరకాలైన రంగు రంగుపూలలో సుగంధాల్ని విరజిమ్మే పుష్పజాతులతో ఈ పుష్పారాధన వైభవంగా, కనుల పండువుగా సాగుతుంది. ఆ తర్వాత శ్రీ స్వామివారికి నైవేద్యం జరుగుతుంది. ఆ తర్వాత శ్రీమలయప్పస్వామి దేవేరులతో కూడి బంగారు (తిరుచ్చి) శ్రీపీఠంలో ఎక్కి రాజ లాంఛనాలతో

ప్రదక్షిణంగా వెళ్లి ఆనంద నిలయంలో ప్రవేశిస్తారు. దీనిలో శ్రీవారి పుష్పయాగం పూర్తవుతుంది.

తిరుమల తిరుపతి దేవస్థానంవారు భక్తుల సేవా వినియోగార్థం ఈ పుష్పయాగాన్ని ఆర్జిత సేవగా కూడ ప్రవేశపెట్టారు. రు.3,500 లు చెల్లించిన గృహస్థుతోపాటు 5 గురు వ్యక్తులు ఈ పుష్పయాగంలో పాల్గొనవచ్చు. వీరికి రెండు మార్లు ఆనందనిలయుని (మూల మూర్తి) దర్శనబాగ్యం కలిగిస్తారు. గృహస్థుకు ఒక ఉత్తరీయం, ఒక రవిక గుడ్డను బహూకరిస్తారు.

ప్రతి కార్తీకమాసం శ్రవణ నక్షత్రం రోజున జరిపే ఈ పుష్పయాగ సేవలో పాల్గొన దలచిన భక్తులు రు.3,500/- లు డిమాండు డ్రాఫ్టును ''ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు, తి.తి. దేవస్థానములు, తిరుపతి'' వారి పేర ఏ బ్యాంకులోనైనా సరే తీసి, దానిని ''పేష్కారు, శ్రీవారి ఆలయం, తిరుమల - 517 504'' వారికి ముందుగా పంపుతూ రిజర్వు చేసుకోవచ్చును. అనుమతిని ధ్రువపత్రంద్వారా భక్తులకు ముందుగానే తెలియజేయబడు తుంది. అయినా ఆనాటికి వున్న అవకాశాన్ని బట్టి మాత్రమే వీలు కల్పించబడుతుంది.

పుష్పయాగంలో అనుమతి లభించిన భక్తులను పుష్పయాగం జరిగే రోజు ఉదయం 6 గంటలకు 'వైకుంఠం క్యూ'' ద్వారా ఆలయంలోనికి ప్రవేశింపజేస్తారు.

ఇలా భక్తులు చేసే పుష్ప యాగోత్సవంలో కలియుగవైకుంఠమైన తిరుమల పుణ్యక్షేత్రం కోటి దివ్యకాంతుల్ని సంతరించుకుంటుంది. భక్త సంరక్షణతో పాటు ఇహపర సుఖాలనిచ్చి మానవుని సేవ చేస్తున్న మాధవుడే ఈ బ్రహ్మాండ నాయకుడు. ఈ బంగారు శిఖరాల బహు బ్రహ్మ మయమునకు మన కిష్టమైన ఈ క్రింది అష్టవిధపుష్పాలను పుష్పాంజలిగా సమర్పించి తరిద్దాం.

**అహింసా ప్రథమం పుష్పం పుష్ప మింద్రియ నిగ్రహః**
**క్షాంతి పుష్పం దయా పుష్పం జ్ఞానం పుష్పమతః పరమ్**
**సత్యం పుష్పం తపః పుష్పం భావ పుష్ప మథాష్టమమ్**
**ఏవ మష్ట విధ పుష్పం విష్ణోః ప్రీతికరం పరమ్.**

**గోవిందా! గోవిందా! గోవింద!!!**

* * *

# 16. తిరుమలలో తిరుప్పావై

ఆర్తత్రాణ పరాయణుడైన ఘన వేంకటగిరినాధునికి ప్రతిరోజు ఉదయం సుప్రభాతం మొదలుకొని రాత్రి ఏకాంత సేవ వరకు ఎన్నో ఉత్సవాలు జరుగుతాయి.

ఇంత మాత్రమేగాక తిరుమల స్వామికి నిత్యోత్సవాలు, వారోత్సవాలు, పక్షోత్సవాలు, మాసోత్సవాలు, వార్షికోత్సవాలు అత్యంత వైభవంగా జరుపబడుతున్నాయి.

ఇలా ఎన్నో సేవలు జరుగుతున్నప్పటికీ ప్రతిదినం శ్రీవేంకటేశ్వరస్వామివారి దిన చర్య ''కౌసల్యా సుప్రజా రామ! పూర్వా సంధ్యా ప్రవర్తతే!'' అను సుప్రభాత స్తవంతోనే ప్రారంభమవుతుంది. ఈ సుప్రభాత సేవ ధనుర్మాసంలో ఒక్క నెలరోజులపాటు తప్ప మిగిలిన సంవత్సరమంతా సాగుతున్నది. ధనుర్మాసంలో ఒక నెలరోజులపాటు గోదా దేవి (అండాళ్) శ్రీ వేంకటేశ్వరుణ్ణి కీర్తించిన ''తిరుప్పావై'' సంకీర్తనాగానం జరుగుతుంది. ఈ ధనుర్మాసం సాధారణంగా మార్గశిర పుష్య మాసాల్లో వస్తుంది. అంటే సౌరమానం ప్రకారం డిసెంబరు 15, 16 వ తేదీల్లో ప్రారంభమై జనవరి 14 తో ముగుస్తుంది.

తమిళ సాహిత్యంలో నాలుగు వేల పాటలు (పాశురాలు) గల ''నాలాయిర దివ్య ప్రబంధం'' చాలా ప్రసిద్ధమైంది. దీనిని వైష్ణవ భక్తాగ్రేసరులైన పండ్రెండుగురు ఆళ్వారులు, భక్తులు చెప్పారు. వీరినే దివ్యసూరులని, పరమ యోగులని అంటారు.

పరమయోగులైన ఈ ఆళ్వారులు శ్రీ మహావిష్ణువును గూర్చి పరవశించి పాడిన పాశుర ప్రబంధాలు వేదాలవలె సంభావింప బడుతున్నాయి. అందులో ''తిరుప్పావై'' అనే ముప్పది పాశురాల కర్త గోదాదేవి. ఈమె 'పెరియాళ్వారు' అని ప్రసిద్ధిపొందిన విష్ణు చిత్తుని పెంపుడు బిడ్డ. శ్రీవిల్లిపుత్తూరులోని వటపత్రశాయియైన శ్రీమహావిష్ణువుకు, విష్ణు చిత్తుడు కైంకర్యం చేస్తున్న పూలమాలల్ని ముందుగా తాను ధరించి, మళ్లీ వాటిని స్వామి వారి కైంకర్యానికి పంపినందువల్ల ఈమెకు ''ఆముక్తమాల్యద'' అనీ, ''చూడికొడుత్త నాచ్చియార్'' అని ప్రసిద్ధమైన పేర్లు ఏర్పడాడాయి.

ద్వాపరయుగంలో శ్రీకృష్ణభగవానుణ్ణి భర్తగా పొందవలెననే ఉద్దేశంతో మార్గశిర మాసంలో గోపికలు కాత్యాయనీ వ్రతం చేశారు. అలాగే గోదాదేవి కూడ తనను తాను గోపికగా భావించుకొని, ధనుర్మాసంలో (మార్గళి) ఆ వ్రతాన్ని భక్తితో ఆచరించింది. నెలరోజులపాటు ప్రతిదినం వేకువజాముననే శ్రీవిల్లిపుత్తూరులో వేంచేసియున్న వటపత్ర శాయి అయిన శ్రీమహావిష్ణువును గూర్చి రోజు కొక్క పాశురాన్ని (పాట) పరవశించి పరమగానం చేసేది. ఆమె ఈ వ్రతం చేసి చివరకు శ్రీరంగనాథుణ్ణి పరిణయమాడి ఆండాళ్‌గా ప్రసిద్ధిపొందింది. ఆండాళ్ అనగా భగవంతుణ్ణి వశం చేసుకున్న స్త్రీ అని అర్థం. ఈమె చేసిన వ్రతమే ''తిరుప్పావై'' గా పేరు పొందింది. తిరు = శ్రీ, పావై = వ్రతం. అంటే శ్రీ వ్రతమన్నమాట. ఈమే గోదాదేవి. కోదా అంటె మాలిక. అంటే పాశురాలనే మాలికల చేత కీర్తించి భగవంతుణ్ణి వశం చేసుకొన్నది కనుక ఆమె 'గోదాదేవి'. ఆనాటినుండి శ్రీరంగంలో ''తిరుప్పావై'' గానం చేయబడు తున్నది.

వైష్ణవ భక్తాగ్రేసరులు అనేకమంది దర్శించి కీర్తించిన వైష్ణవ ప్రధానక్షేత్రం తిరుమల. పోయగై ఆళ్వారు, తిరుమళిశై ఆళ్వారు, నమ్మాళ్వారు.... మున్నగువారు శ్రీ వేంకటాచలపతిని దర్శించి అనేక రీతుల కీర్తించి గానం చేశారు. ఏకైక స్త్రీ ఆళ్వారుగా ప్రసిద్ధిపొందిన ఆండాళ్‌కూడా తిరుమల సందర్శించి ఇలా కీర్తించింది.

**''షెయ్యదోర్ తళలు మిళ్ శక్కొరక్కై**
**వేంగడ వర్కైన్నై విదికిత్తియే''.**

వేయి వెలుంగులతో ప్రకాశిస్తున్న శంఖ చక్రాలను ధరించినట్టి తిరువేంకటపతికి నన్ను నేను పూర్తిగా అంకితమైనానని చెప్పి ''నాచ్చియార్ తిరుమొళి'' లో విన్నవించు కొంది. గోదాదేవి చెప్పిన ఈ అంకిత భావాన్ని దృ ష్టిలో వుంచుకొని భగవద్రామానుజులవారు తిరుమల తిరుపతి ఆలయాల్లో ''తిరుప్పావై'' పఠనను ప్రతి ధనుర్మాసంలో అనుష్ఠింప జేశారు. రామానుజాచార్యులవారికి గోదాదేవి మీదా, ఆమె చెప్పిన ''తిరుప్పావై'' మీదా అత్యంత భక్తీ, ప్రపత్తీ కూడ. ఈ తిరుప్పావై సర్వవేదసారమని వ్యా ఖ్యానించి, ప్రచారంచేసిన శ్రీరామానుజులు, ''తిరుప్పావై జీయర్'' ప్రసిద్ధి పొందారు.

తిరుమలలో శ్రీస్వామివారి సుప్ర భాతానికి బదులుగా నెలరోజులపాటు ధను ర్మాసంలో 'తిరుప్పావై' పఠనను అనుష్ఠింప జేయడమేగాక, ఆ ధనుర్మాసంలోనే ''శ్రీగోదా నీరాట్టోత్సవాన్ని, సంక్రాంతి మరునాడు కనుమ పండుగ రోజున గోదా కల్యాణాన్ని ఏర్పాటు చేసిన వారు కూడా రామానుజాచార్యులవారే అంతమాత్రమేగాక ప్రతి సంవత్సరం శ్రీ వేంకటేశ్వరస్వామివారి బ్రహ్మోత్సవంలో గరుడోత్సవం నాటికి శ్రీవిల్లిపుత్తూరు నుండి గోదాదేవి అమ్మవారికి అలంకరించిన పూల మాలను తెచ్చి తిరుమల శ్రీస్వామివారికి ధరింపచేయడమనే సంప్రదాయం నేటికీ కొన సాగుతున్నది.

ప్రతి ధనుర్మాసంలో తిరుమల శ్రీ వేంకటేశ్వరస్వామివారి వక్షః స్థలమునగల ''బంగారు అలమేలుమంగ'' ను ఆండాళ్‌గా భావించి అలంకరిస్తారు. ఎర్రనిరాళ్లు పొదిగిన బంగారు చిలకబొమ్మను అమ్మవారి కుడిపార్శ్వంలో ధరించినట్లు ఏర్పాటు చేస్తారు. అలాగే పూలతో తయారుచేసిన మరొక చిలుక బొమ్మను ఎడమ పార్శ్వంలోగల బంగారు భూదేవికి అలంకరిస్తారు. ఈనెల అంతా తెల్లవారు జామున సుప్రభాతానికి బదులుగా జియ్యంగార్లు, ఏకాంగి, వైష్ణవాచార్యులు మున్నగువారు ఆండాళ్ తిరుప్పావై పఠిస్తారు. పిదప శ్రీ వేంకటేశ్వరస్వామివారికి తోమాల సేవ, సహస్రనామార్చన జరుగుతాయి. ధనుర్మా సంలో జరిగే సహస్రనామార్చనలో తులసికి బదులుగా మారేడు దళాలను (బిలువ పత్రం) ఉపయోగించడం విశేషం. పిదప నైవేద్యం జరిగిన తర్వాత జియ్యంగార్లు ఆనాటి పాశురాన్ని రెండుమార్లు గానం చేస్తారు.

ధనుర్మాసం ముప్పైరోజులు శ్రీ వేంకటేశ్వరుని శ్రీకృష్ణునిగానే భావించి పూజలు జరుపబడతాయి. ప్రతి రాత్రి ఆనంద నిలయంలో వున్న శ్రీకృష్ణస్వామి (వెన్నముద్ద కృష్ణునితో) వారికి గోరువెచ్చని నీటితో స్నానం చేయించి, అలంకరించి, ఏకాంత సేవాభాగ్యాన్ని కల్గిస్తారు. (ధనుర్మాసంలో కాక మిగతా రోజుల్లో భోగ శ్రీనివాసమూర్తి ఏకాంతసేవలో పాల్గొంటారు).

అంటే తిరుమల వేంకటేశ్వరుడు సాక్షాత్తు శ్రీకృష్ణుడని భావం. అందుకే తిరుమల స్వామివారిని గోవిందుడని అంటారు. అంతేగాక పద్మావతీ శ్రీనివాసుల కల్యాణ సమయంలో తన పేరు శ్రీకృష్ణుడనీ, తల్లిదండ్రులు దేవకీవసుదేవులనీ

సంకల్పం చెప్పినట్లు వేంకటాచల మాహాత్మ్యంలో పేర్కొనబడింది. కనుకనే శ్రీకృష్ణ జయంతి నాడు, బ్రహ్మోత్సవంలోను, శ్రీ తిరుమల స్వామివారిని కృష్ణునిగా ఊరేగిస్తారు. అంతేగాదు శ్రీకృష్ణాష్టమినాడు తిరుమలలో పెద్ద ఎత్తున్న ఉట్లపండుగలో శ్రీనివాసుడు పాల్గొంటాడు. అంతేగాక ప్రతి రోహిణి నక్షత్రం రోజున తిరుమలలో శ్రీకృష్ణుడే ఊరేగింపపబడతాడు.

కనుకనే భక్తులు అడుగడుగునా తిరుమల శ్రీవేంకటేశ్వరుణ్ణి ''గోవిందా! గోవిందా!! ఏడుకొండలవాడా గోవిందా! వేంకటరమణ గోవిందా!! సంకటహరణ గోవింద! గోవింద!!'' అని ఎలుగెత్తి పిలుస్తారు.

అట్టి గోవిందుని ధనుర్మాసంలో అందరూ గోపికలుగా భావించుకొని 'తిరుప్పావై' ని పారాయణం చేసి ఇష్టార్థాలను పొందెదరు గాక!

ప్రతి ధనుర్మాసంలో సుప్రభాతానికి బదులుగా పఠింపబడే ''తిరుప్పావై'' గానం తిరుమలలో ఏకాంతంగా జరుగుతుంది. అంటే ఆర్జిత భక్తులు గానీ లేదా ఇతరులుగానీ అనుమతింపబడరు. ''తిరుప్పావై'' పఠన తర్వాత జరిగే తోమాల సహస్రనామార్చన మున్నగు సేవల్లో యథాప్రకారం ఆర్జిత భక్తులు పాల్గొనవచ్చును.

గోదాదేవి సాక్షాత్తు లక్ష్మీదేవిగా భావించి ఆమె చెప్పిన ''తిరుప్పావై'' ని పఠిస్తూ అందరూ గోపికలుగా భావించి అమ్మవారి ద్వారా పురుషోత్తముడైన శ్రీవేంకటేశ్వరుణ్ణి సేవిస్తే సంతృప్తికరంగా సంపత్కరములైన సర్వ శుభములు కలుగుననుట ముమ్మాటికీ సత్యము.

అన్నమాచార్యులు కూడా గోదాదేవిని సాక్షాత్తు మహాలక్ష్మిగా భావిస్తూ ఇలా కీర్తించారు.

**చూడరమ్మ సతులాల శోభాన పాడరమ్మ**
**కూడున్నది పతి చూడికుడుత నాచారి.**

**శ్రీమహాలక్ష్మియట! సింగారాల కేమరుదు**
**కాముని తల్లియట! చక్కదనాల కేమరుదు**

పిదప చక్రత్తాళ్వారుకు వస్త్రాలంకారం, పుష్పమాలాలంకారం జరిగిన తరువాత నివేదన హారతులు ఘనంగా జరుగును. అక్కడి నుండి సుదర్శనులు బయలుదేరి ప్రదక్షిణంగా వచ్చి శ్రీవారి ఆలయంలో ప్రవేశిస్తారు.

తిరుమలలో స్వామి పుష్కరిణిలో సంవత్సరంలో నాలుగుమారులు చక్రస్నానం జరుగుతుంది. భాద్రపదమాస శుక్ల చతుర్దశి, అనంతపద్మనాభ వ్రతం రోజున ఒకసారి 10 రోజులు జరిగే బ్రహ్మోత్సవాల్లో చివరి రోజున రెండవమారు, వైకుంఠ ఏకాదశి మరునాడు ద్వాదశినాటి ఉదయం మూడవ మారు, రథసప్తమినాడు మధ్యాహ్నం నాల్గవ మారు శ్రీసుదర్శన చక్రత్తాళ్వారు చక్రస్నానం జరిపించబడుతుంది.

**గోవిందా! గోవిందా! గోవింద!!!**

* * *

# 17. వైకుంఠ ఏకాదశి

ప్రతి సంవత్సరం ధనుర్మాసంలో శుక్ల పక్షంలో వచ్చే ఏకాదశిని ''వైకుంఠ ఏకాదశి'' పర్వదినంగా చేస్తారు.

వైకుంఠ ఏకాదశికి మూడో రోజు అనగా దశమినాటి రాత్రి ఏకాంత సేవానంతరం బంగారు వాకిళ్లు మూసివేస్తారు. పిదప తెల్లవారు జామున వైకుంఠ ఏకాదశినాడు సుప్రభాతం మొదలుకొని మరునాడు ద్వాదశినాడు రాత్రి ఏకాంత సేవవరకు శ్రీస్వామివారి గర్భాలయ మునకు అనుకొనివున్న ముక్కోటి ప్రదక్షిణ మార్గము తెరచివుంచుతారు. ఈ ఏకాదశి, ద్వాదశి రెండురోజులు శ్రీవారి దర్శనానంతరం భక్తులు ముక్కోటి ప్రదక్షిణ మార్గంలో వెళ్లుదురు. ఈ ముక్కోటి ప్రదక్షిణ ప్రవేశ ద్వారమును వైకుంఠ ద్వారమని, ఆ మార్గమును వైకుంఠ ప్రదక్షిణ మని అంటారు.

ఆనాడు ఈ మార్గము రంగు రంగుల విద్యుద్దీపాలలోను, పూలమాలలతోను చక్కగా ఆహ్లాదంగా అలంకరింప బడియుండును. శ్రీనివాసస్వామివారికి అతి దగ్గరగావున్న ఈ ప్రదక్షిణ మార్గంలో దర్శనానంతరం వెళ్లిన భక్తులు ఒక వింత దివ్యానుభూతిని చవి చూస్తూ మైమరుస్తారు.

వైకుంఠ ఏకాదశి మరునాడు సూర్యోదయంలో అనగా ద్వాదశినాడు సూర్యోదయంలో ''శ్రీస్వామి పుష్కరిణి తీర్థము కోటి'' జరుగును. అనగా వైకుంఠ ఏకాదశినాడు ముల్లోకాల్లో వున్న 3 కోట్ల 5 0 లక్షల పుణ్యతీర్థాలు, పుష్కరిణు లు, తిరుమలలో వున్న ''శ్రీస్వామి పుష్కరిణి'' లో ఆవహించును. సర్వదేవతా సాన్నిధ్యముగా కలుగును. అందువల్ల ఆ పర్వదినమందు శ్రీవారి ఆలయంలో శ్రీవేంకటేశ్వస్వామివారికి సుప్రభాతం, తోమాలసేవ, అర్చన, నివేద నాదులు యథాప్రకారంగా పూర్తి అగును. పిదప ఆనంద నిలయంలో వున్న 'సుదర్శన చక్రత్తాళ్వార్' పల్లకిని అధిరోహించి ఊరేగింపుగా తిరుమల తిరువీథులో మహాప్రదక్షిణంగా వచ్చి శ్రీవరాహస్వామి ఆలయ ప్రాంగణం చేరుకుంటారు. అక్కడ శ్రీసుదర్శన భగవానుని మూర్తికి అభిషేకం జరిగిన తరువాత పుష్కరిణిలో పవిత్రస్నానం చేయించుదురు. ఇలా చక్రస్నానం జరుగు సమయంలోవేలాదిమంది భక్తులు కూడా ఆ చక్రంతోపాటుగా పుష్కరిణిలో మునిగి పవిత్రస్నానాలు చేస్తారు.

పిదప చక్రత్తాళ్వారుకు వస్త్రాలంకారం, పుష్పమాలాలంకారం జరిగిన తరువాత నివేదన హారతులు ఘనంగా జరుగును. అక్కడి నుండి సుదర్శనులు బయలుదేరి ప్రదక్షిణంగా వచ్చి శ్రీవారి ఆలయంలో ప్రవేశిస్తారు.

తిరుమలలో స్వామి పుష్కరిణిలో సంవత్సరంలో నాలుగుమారులు చక్రస్నానం జరుగుతుంది. భాద్రపదమాస శుక్ల చతుర్దశి, అనంతపద్మనాభ వ్రతం రోజున ఒకసారి 10 రోజులు జరిగే బ్రహ్మోత్సవాల్లో చివరి రోజున రెండవమారు, వైకుంఠ ఏకాదశి మరునాడు ద్వాదశినాటి ఉదయం మూడవ మారు, రథసప్తమినాడు మధ్యాహ్నం నాల్గవ మారు శ్రీసుదర్శన చక్రత్తాళ్వారు చక్రస్నానం జరిపించబడుతుంది.

**గోవిందా! గోవిందా! గోవింద!!!**

* * *

# 18. పారువేట ఉత్సవం

పారువేట అనగా మృగాలు పరుగెత్తుతుండగా వాటిని వెంబడించి వేటాడటం. అడవిలో విచ్చలవిడిగా తిరుగుతూ బీభత్సాన్ని కలిగిస్తున్న క్రూర మృగాలను వేటాడి చంపి ప్రశాంతతను చేకూర్చే ప్రధాన లక్ష్యంతో పూర్వం రాజులు వేటకు వెళ్లేవారు.

అరిషడ్వర్గాల ప్రభావానికి లోనైన ఇంద్రియాల ప్రేరణతో నిలకడలేక పోరాడుతూ ఉండే చంచలమైన మనస్సే ఒక మృగం. అలాంటి స్థిరత్వం లేని భక్తుని మనస్సును పంచాయుధాలతో శ్రీవేంకటేశ్వర స్వామి వేటాడి పట్టుకొని ఏకాగ్రతను ప్రసాదించడమే ఈ ''పారువేట'' ఉత్సవ నిర్వహణలోని అంతరార్థంగా అధ్యాత్మ విదులు ప్రవచిస్తారు.

ప్రతి సంవత్సరం సంక్రాంతి పండుగకు మరునాడే కనుమపండుగ. ఆ రోజున జగత్ర్పభువైన శ్రీ శ్రీనివాస చక్రవర్తి శంఖ చక్ర గదా ధనుః ఖడ్గములనే పంచాయుధాలను ధరించి వన విహారార్థం వెళ్లి దుష్ట మృగాలను వేటాడి విజయగర్వంతో తిరిగి వస్తారు. కోనేటిరాయని పారువేట ఉత్సవం అత్యంత కోలాహలంగాను, ఆనందభరితంగాను సాగు తుంది. అధికమాసం వచ్చిన సందర్భంలో నవరాత్రి బ్రహ్మోత్సవంగా జరుప బడే రెండవ బ్రహ్మోత్సవానంతరం కూడ శ్రీ స్వామివారు పారువేటకు వెళతారు.

ప్రతిరోజు మాదిరే యథారీతిగా కనుమ పండుగరోజున సుప్రభాతం, తోమాల సేవ, కొలువు, అర్చన, మొదటి గంట నైవేద్యం జరుగుతాయి. ఆ తరువాత రెండవ అర్చన నైవేద్యాలు అనగా మధ్యాహ్న పూజా నైవేద్యా దులు జరిగిన వెంటనే శ్రీ వేంకటేశ్వరస్వామి వారు వేటదుస్తులు తొడిగి తలపై శిరస్త్రాణం ధరిస్తారు. ఆ తర్వాత ఆభరణాలను, పుష్ప మాలలను అలంకరించు కొంటారు. సుదర్శన చక్రాన్ని, పాంచజన్య శంఖాన్ని, నందక ఖడ్గాన్ని, కౌమోదకి గదను శార్ఙమనే విల్లును - ఇలా పంచాయుధాలను ధరించి వేటకు సన్నద్ధమవు తాడు. ఇంతేగాక ఇంకా వేట పరికరాలైన డాలు, కత్తి, బల్లెం (ఈటె) మొదలైన ఆయుధాలను కూడ స్వీకరించి శ్రీశ్రీని వాస ప్రభువు వెండి శ్రీపీఠాన్ని అధిరోహించి ఆలయం వెలుపలికి

విచ్చేస్తారు. శ్రీకృష్ణస్వామి కూడ మరొక పీఠంపై అధిరోహించి శ్రీస్వామి వారిని అనుసరిస్తాడు. ఇలా శ్రీవేంకటేశ్వరుడు శ్రీకృష్ణుడు ఆలయం వెలుపలికి వచ్చి బాజా భజంత్రీలతో, వేద పారాయణలతో ఛత్రచామ రాది రాజ మర్యాదలతో గజతురగ భక్త బృందం ముందు వెళుతూ వుండగా, బాకా లూదుతూ వుండగా వేటకు బయలుదేరి నేరుగా ఉత్తరం దిశగా వెళ్లి పాపవినాశనం దారిలో ఇంచుమించు 2 కి.మీ. దూరంలో వున్న పారువేట మండపానికి మధ్యాహ్నం సుమారు 2 గ..ల సమయానికి చేరుకుంటారు.

అప్పటికే పుణ్యాహవాచనాది కార్య క్రమాలతో శుద్ధిచేసి, సర్వశోభాయ మానంగా అలంకరింపబడిన పారువేట మండపంలో శ్రీవేంకటేశ్వరస్వామి శ్రీకృష్ణ స్వామివారితో పాటు వేంచేస్తారు. ఈ మండపంలో సుమారు రెండుగంటలపాటు కొలువుదీరి వుండగా శ్రీస్వామివారి సన్నిధిలో అన్నమయ్య సంకీర్తనలు, హరికథవంటి సంగీత సాంస్కృతిక కార్యక్రమాలు ఘనంగా జరుగుతాయి.

పిదప సాయంత్రం 4 గంటల సమయంలో శ్రీస్వామివారికి, కృష్ణస్వామివారికి పూజా నివేదనలు హారతులు జరుగుతాయి. ఈ సందర్భంలో పారువేట ఉత్సవం ఉభయ దారులైన తాళ్లపాకవారికి, పరివట్టం కట్టి, శఠారి మర్యాదలు జరుపబడిన పిదప స్థాన బహుమా నంగా ప్రసాదంతో సత్కారం జరుగుతుంది.

ఆ తర్వాత శ్రీమలయప్పస్వామి శ్రీ కృష్ణస్వామి పారువేట మండపం వదలి బయటికి వస్తారు. ఇంతలో శ్రీస్వామివారి సన్నిధిలో నిత్యమూ సేవ చేస్తున్న సన్నిధిగొల్లలు అక్కడకు సమీపంలోనే వున్న తమ విడిదికి అలనాటి కృష్ణుని రూపంలో విచ్చేసి వెన్నను ఆరగించవలసిందిగా ఆహ్వానిస్తారు. అప్పుడు శ్రీకృష్ణస్వామి వారివెంట వారి విడిదికి వెళ్లి పూజా హారతులు స్వీకరించి, వెన్నను ఆరగించి తిరిగి వేంకటేశ్వరుని చెంతకు వస్తాడు. మళ్లీ ఆ గొల్లలు అలా కృష్ణస్వామి రూపంలో వచ్చి తమను అనుగ్రహించిన శ్రీవేంకటేశ్వరునికి కూడా ఘనంగా పూజా హారతులు సమర్పిస్తారు. ఇక్కడ సన్నిధి గొల్ల శ్రీస్వామివారిచే శఠారి మర్యాదలు పొందు తాడు.

ఆ తర్వాత శ్రీవేంకటేశ్వరుడు రౌద్రాకారంతో వీరావేశంతో పరుగెత్తుతూ మృగాలను వేటాడుతాడు. ఇందువల్లనే కాబోలు ''మృగయా రసికాయాధం వృష భాసుర హారిణే'' (వేట స్వారస్యం బాగా ఎరిగినవాడూ, వృషభాసురుణ్ణి సంహరించిన వాడు) అని అష్టోత్తర శత నామ స్తోత్రంలో సముచితంగా కొనియాడబడినాడు.

శ్రీస్వామివారు పంచాయుధాలను ఎక్కుపెట్టి పరుగెడుతుండగా, శ్రీస్వామివారి ముందు శ్రీవారి రూపంగా భాసించిన అర్చక స్వామి వెండి బల్లేన్ని (ఈటెను) చేతబట్టుకొని మహా అట్టహాసంగా ముందుకు పరుగెడుతూ జంతువులను వేటాడతారు. ముందు వున్న మృగాలు (జింకలు) పారిపోతాయి. ఆ వెంటనే మళ్లీ వెనక్కు వెళ్లి యథాస్థానంలో నిలబడతారు. మళ్లీ శ్రీస్వామివారు వేగంగా ముందుకు పరుగెడుతూండగా, వారి రూపంగా వున్న అర్చకస్వామి ముందుకురికి ఈటెను విసరుతాడు. ఇలా మూడుమార్లు వేటాడం జరుగుతుంది.

వేటలో విజయులై శ్రీ వేంకటేశ్వర స్వామివారికి, శ్రీకృష్ణస్వామివారికి పూజా హారతులు ఘనంగా జరుగుతాయి.

పిదప శ్రీకృష్ణస్వామి వెంటరాగా శ్రీ మలయప్పస్వామివారు ఛత్రచామర మర్యాదలతో మంగళ తూర్యరవములు మోగుతుండగా గజ తురగ భక్తబృందాలు ముదు నడుస్తుండగా వేద పారాయణలు సాగుతుండగా విజయ గర్వంతో మహా దర్పంగా తిరుమల పురప్రవేశం చేస్తారు. దారి పొడవునా అక్కడక్కడా విజయ సంకేతంగా శ్రీస్వామివారు హారతు లందుకొంటూ ఆలయ మహాద్వారం వద్దకువస్తారు. శ్రీకృష్ణ స్వామివారు మాత్రం ఆలయ ప్రవేశం చేస్తారు. ఆ తర్వాత అక్కడనుండి హథీరాంజీ మఠం వారికి ఉభయ నిర్వహకులుగా వెండి బెత్తాలు ఇస్తారు. వారు ఆ వెండి దండాన్ని ధరించి ఆలయ మహాప్రదక్షిణ మార్గంలో ముందు నడుస్తుండగా శ్రీ వేంకటేశ్వరస్వామివారు సకల రాచమర్యాదలతో పురవీథుల్లో ఊరేగుతూ ఆలయమహాద్వారం వద్దకు చేరుకోగానే మహంతుమఠం వారికి హారతి శఠారి మర్యాదలు జరుగుతాయి.

ఆ తర్వాత శ్రీస్వామివారు ఆలయ ప్రవేశం చెయ్యడంతో ఈ పారువేట ఉత్సవం ఘనంగా ముగుస్తుంది.

పరమ శాంతమూర్తి, కరుణామూర్తి అయిన శ్రీ వేంకటేశ్వరస్వామి ఈ పారువేట ఉత్సవంలో పంచాయుధాలను ధరించి రౌద్ర మూర్తిగా మహాదర్పంతో దర్శనమిస్తాడు. మహా మహిమోపేతములైన అత్యంత శక్తి వంతములైన శంఖ చక్ర గదా ఖడ్గ శార్ఙములనే పంచాయుధాలతో శ్రీస్వామివారు దుష్ట శిక్షణ శిష్ట రక్షణ చేయటానికే ఈ వేంకటాచలంపై నిలిచారనడానికి ఈ పారువేట ఉత్సవం ప్రకృష్టమైన దృష్టాంతం. అందువల్లనే 'కలౌ వేంకట నాయకః' అనే ప్రశస్తి ఏర్పడింది.

ఈ పారువేట ఉత్సవ సందర్భంలో నిత్యం మనలోని దుష్ట శక్తులను, దురాలోచన లను వేటాడి సంహరించి మనకు సర్వ సౌభాగ్యాలను అనుగ్రహింపవలసినదిగా శ్రీస్వామివారి పంచాయుధాలను, ఆ ఆయుధా లను ధరించిన ఘన వేంకటగిరి నాథుణ్ణి మిక్కిలిగా ప్రార్థిద్దాం. ఆయన అనుగ్రహంతో తరిద్దాం!

స్ఫుర త్సహస్రార శిఖాతి తీవ్రం
సుదర్శనం భాస్కరకోటి తుల్యమ్,
సురద్విషాం ప్రాణవినాశి విష్ణోః
చక్రం సదా హం శరణం ప్రపద్యే.

విష్ణోర్ము ఖోత్థానిల పూరితస్య
యస్య ధ్వని ర్దానవ దర్ప హంతా
తం పాంచ జన్యం శశి కోటి శుభ్రం
శంఖం సదా హం శరణం ప్రపద్యే.

హిరణ్మయీం మేరు సమాన సారాం
కౌమోదకీం దైత్యకులైక హంత్రీమ్
వైకుంఠ వామాగ్ర కరాభి మృష్టాం
గదాం సదా హం శరణం ప్రపద్యే.

రక్షో సురాణాం కరినోగ్ర కంఠ
చ్ఛే దక్షర చ్ఛోణిత దిగ్ధ ధారమ్
తం నందకం నామ హరేః ప్రదీప్తం
ఖడ్గం సదా హం శరణం ప్రపద్యే.

యజ్జ్యా నినాద శ్రవణాత్సురాణాం
చేతాంసి నిర్ముక్త భయాని సద్యః
భవంతి దైత్యాశని బాణ వర్షి
శార్ఙ్గం సదా హం శరణం ప్రపద్యే.

యచ్చక్ర శంఖం గదఖడ్గ శార్ఙ్గం
పీతాంబరం కౌస్తుభవత్స లాంఛితమ్
శ్రియా సమేతోజ్జ్వల శోభితాంగం
విష్ణుం సదా హం శరణం ప్రపద్యే.

గోవిందా! గోవిందా! గోవింద!!!

* * *

# 19. ప్రణయ కలహోత్సవం

తిరుమలలో పురవీధిలో ప్రతి ఏటా జరుపబడే వినోదభరితమైన ఉత్సవమే ప్రణయ కలహోత్సవం. వేటకు వెళ్లి వచ్చిన స్వామివారిని చూచి అమ్మవారలు కోపగించు కోవడం, శాంతించవలసినదిగా శ్రీస్వామివారు ప్రార్థించడం వంటి రసాత్మకమైన సంభాషణ లతో కూడి అత్యంత భక్తిరస భరితంగా జరిగే ఈ ఉత్సవం ప్రతి ఏటా ధనుర్మాసంలో వైకుంఠ ఏకాదశినాటికి సరిగ్గా ఆరవరోజున తిరుమలలో నిర్వహింపబడుతుంది.

ఆ రోజున యథాప్రకారం ఉదయా రాధన, మధ్యాహ్నారాధన ముగిసిన తర్వాత శ్రీ మలయప్పస్వామివారు శ్రీపీఠాన్ని (తిరుచ్చి) ఎక్కి ఆలయ పురవీధుల్లో ప్రదక్షిణంగా ఛత్ర చామర మర్యాదలతో ఊరేగుతూ వచ్చి ఈశాన్యమూలలోగల పరకాలమఠం – ఏకాంగి మఠం సమీపంలో దక్షిణముఖంగా వేచి వుంటారు. ఇంతలో మరొక తిరుచ్చిపై శ్రీదేవి భూదేవులు ఎక్కి ఆలయాన్ని వీడి అప్రదక్షి ణంగా ఛత్రచామర మర్యాదలతో వచ్చి శ్రీస్వామి వారికి ఎదురుగా వచ్చి నిలిచి వుంటారు.

ఈ సమయంలో, జియ్యంగార్‌కి, పౌరాణికునికి పరివట్టం (పట్టుగుడ్డ) కడతారు. పౌరాణికుడు శ్రీస్వామివారి దేవేరుల ప్రణయ కలహానికి సంబంధించి పురాణాన్ని ఆలా పిస్తుండగా జియ్యంగార్ శ్రీదేవి భూదేవి వద్ద నిలబడి రెండు పూలచెండ్లను స్వామివారి మీద విసరివేయును. ఎక్కడెక్కడో తిరిగివచ్చిన స్వామికి అమ్మవారు విసరిన పూలబంతుల దెబ్బకు జడిసి కొంచెం వెనుకకు కదులుతారు.

మళ్లీ శ్రీస్వామివారు తానేమి తప్పు చేయలేదని తనను క్షమించమని అమ్మవార లను ప్రార్థిస్తూ ముందుకురాగా మళ్లీ అమ్మ వారల తరుపున శ్రీమాన్ జియ్యంగార్ మళ్లీ పూలబంతులను విసరును. మళ్లీ శ్రీస్వామివారు అమ్మవారల తాకిడికి, బెదరుతున్నట్లుగా నడిస్తూ మళ్లీ రెండు మూడు అడుగులు వెనక్కి వేస్తారు. మళ్లీ ముందుకు వచ్చి ప్రాధేయపడతాడు. అయినా మూడవసారికూడ అమ్మవార్లు కోపాన్ని వీడక మళ్లీ వెడతారు. మూడవసారి బెదిరిన స్వామి వెనకకు జరుగుతాడు. ఇలా మూడుమారులు పూర్తయ్యే సరికి ''పురాణ పఠనం'' పూర్తవుతుంది. అమ్మవారలు శాంతించి ప్రదక్షిణంగా వెళ్లి శ్రీస్వామివారికి ప్రక్కన నిలుస్తారు.

పిమ్మట శ్రీస్వామివారు, శ్రీదేవి భూదేవులు పరస్పరము పుష్పమాలలు మూడుమార్లు మార్చుకుంటారు.

పిదప జియ్యంగార్లకు, పౌరాణికునికి హారతి, శఠారి మర్యాదలు జరుపబడతాయి. పిమ్మట శ్రీమలయప్పస్వామి, శ్రీదేవి భూదేవు లతో కూడి ఆలయ ప్రవేశం చేసి రంగ మండపంలోనికి వేంచేస్తారు. ప్రతి ఏటా ధనుర్మాసంలో వైకుంఠ ఏకాదశినాటికి సరిగ్గా ఆరవరోజున కోనేటి గట్టున వీథిలో జరుపబడే రసవత్తరమైన ఈ ప్రణయ కలహోత్సవాన్ని వేలాది మంది భక్తులు దర్శిస్తారు.

* * *

## ౨౦. తణ్ణీరముదు ఉత్సవం

### ఆకాశగంగా తీర్థోత్సవం

తిరుమల క్షేత్రంలో శ్రీవేంకటేశ్వర స్వామివారి కౌతుకమూర్తియైన భోగ శ్రీనివాస మూర్తికి నిత్యమూ ఉదయం సుప్రభాతం అయిన వెంటనే ఆకాశగంగా తీర్థంతో అభిషేకం జరుగుతుంది. క్రీ.శ. 973 ఏండ్ల క్రితం ఈ నిత్యాభిషేక కైంకర్యానికిగాను 'తిరుమల నంబి' అనే వైష్ణవ భక్తుడు వుండేవారు. ప్రతి నిత్యం అభిషేకానికిగాను ఆకాశగంగాతీర్థాన్ని కుండతో తెచ్చి ఇచ్చేవారు. ప్రతిరోజు క్రమం తప్పక ఆకాశగంగా తీర్థకైంకర్యం చేస్తున్న తిరుమల నంబిని శ్రీవేంకటేశ్వరస్వామి పరీక్ష చేశాడట. ఒకరోజు తీర్థాన్ని తెస్తున్న ఆచార్యులకు దారిలో స్వామి వారు ఒక వేటవానిగా కనపడి ఆ జలా న్నిచ్చి దాహం తీర్చమని కోరాడట! అది శ్రీ వేంకటేశ్వరస్వామివారి అభిషేక నిమిత్తంగా తీసుకెళ్లుతున్నందున తిరుమల నంబి ఆ జలాన్ని ఇవ్వటానికి ససేమిరా నిరాకరించాడు. స్వామి వారు తిరుమలనంబికి తెలియకుండా వెనుక నుంచిబాణంతో అతని తలపైవున్న కుండకు రంధ్రం చేయగా నీరంతా కారి పోతుండగా చేతిలో ఆ నీటి ధార పడేట్లుగాచేసి స్వామివారు వెంట నడుస్తూ దప్పి తీర్చుకున్నా డట. తిరుమలనంబికి వట్టి కుండ కన్పడేసరికి నీరుకారిపోయాడట! మళ్లీ నీరు తేవటానికి బయలుదేరారట! తిరుమలనంబి భక్తికి, నిష్ఠకు సంతసించి శ్రీవేంకటేశ్వరస్వామి ప్రత్యక్షమై దర్శనమిచ్చాడట!

ప్రతి సంవత్సరం తిరుమలలో డిసెంబరు - మార్గళి మాసంలో వైకుంఠ ఏకాదశినాటికి 1 1 రోజుల ముందుగా అధ్యయనోత్సవం ప్రారంభమవు తుంది. ఈ అధ్యయనోత్సవం 2 5 వ రోజు అధ్యయ నోత్సవ సమాప్తి మరు రోజున ఈ సంపుట నను పురస్కరించుకొని "తన్నీరముదు ఉత్సవం" జరుగుతుంది. వైకుంఠ ఏకాదశి నాటికి 1 4 వ రోజున అధ్యయన సమాప్తి రోజున తిరుమలనంబి చేసిన ఆకాశగంగా తీర్థ కైంకర్యాన్ని పారంపర్యంగా నేటికీ కొనసాగిస్తున్న కైంకర్యపరులు ఆకాశగంగా తీర్థం తీసుకొని వస్తారు. ఛత్ర చామర బాజా భజంత్రీలలో ఎదురేగి ఆ తీర్థ కుంభములకు హారతితో స్వాగతం పలికి ఆలయ మహా ప్రదక్షిణంగా ఊరేగింపబడుతూ చివరకు ఆలయం ప్రవేశిస్తారు. వీరికి శ్రీస్వామివారి దర్శన, కర్పూరహారతి, తీర్థ శఠారి మర్యాదలతోపాటు వస్త్ర బహుమానంతో సత్కారాలు జరుప బడతవి.

* * *

## 21. రథసప్తమి

ప్రతి సంవత్సరం మాఘమాసం శుద్ధ సమప్తమినాడు 'సూర్యజయంతి' పండుగగా ''రథసప్తమి'' అనే పేరుతో దేశమంతటా చేస్తారు. ప్రతి వైష్ణవాలయంలో విశేషంగా ఉత్సవాలు జరుపబడుతాయి.

కలియుగవైకుంఠమైన తిరుమల పుణ్యక్షేత్రంలో కూడా ''రథసప్తమి'' పండుగ అత్యంత వైభవంగా జరుపబడుతున్నది. క్రీస్తు శకం 1564 నుండి జరుపబడుతున్నట్లుగా శాసనాల్లో పేర్కొనబడిన ఈ రథసప్తమి పండుగరోజున సూర్యోదయం మొదలు చంద్రోదయం వరకు తిరుమల స్వామివారు ఏడు వాహనాల్లో ఊరేగుతూ భక్తజనాన్ని అనుగ్రహిస్తారు. ఈ రథసప్తమినాటికి తిరుమల చేరుకొనే భక్తజన సందోహం అత్యంత కోలాహలంగా వుంటుంది.

రథసప్తమి పండుగనాడు యథా ప్రకారం వరుసగా సుప్రభాతం, తోమాలసేవ, కొలువు, మొదటి అర్చన, మొదటి నైవేద్యం జరుపబడతాయి. ఆ తర్వాత శ్రీవేంకటేశ్వర స్వామివారు (మలయప్ప) ఆలయానికి ఎదురుగా వున్న వాహన మండపానికి వేంచేస్తారు.

**సూర్యప్రభ వాహనం**

ఈ మండపంలో అర్చకులు స్వామివారిని సప్తాశ్వములుకల వెండి సూర్యప్రభ వాహనంపై వేంచేపుచేసి, వజ్రకవచాది సర్వ ఆభరణాలతోను, పూలమాలలతోను అలంకరిస్తారు. పిదప, జియ్యంగార్లు, దేవస్థానం అధికార్ల సమక్షంలో శ్రీస్వామి వారికి కర్పూరహారతి ఇస్తారు. వెంటనే వృష, గజ, తురగ, భక్తజనులతో, ఛత్ర చామరాది సార్వ భౌమాధికారాలతో భాజాభజంత్రీలు మోగు తుండగా, వేదపారాయణలు సాగు తుండగా వాహనమండపం నుంచి సూర్యప్రభ వాహనంపై శ్రీస్వామివారు బయలుదేరి ఆలయ ప్రదక్షి ణంగా ఊరేగుతూ, ముందుగా దక్షిణ, పశ్చిమ వీథుల్లో ఊరేగి, సూర్యోదయా త్పూర్వమే, పశ్చిమ ఉత్తర వీథులకూడలికి వాయవ్య మూలకు చేరుకొని, అక్కడ ఏర్పాటు చేసివున్న పందిట్లో తూర్పుముఖంగా నిలిచి వేచి వుంటారు.

ఇంతలో తన వెలుగుద్వారా, సర్వ లోకాలకూ చైతన్యాన్ని కలిగిస్తూ ఉదయించే శ్రీ సూర్య భగవానుడు ముందుగా తన అనంత కోటి కిరణాలను,

సర్వ జగన్నియామకుడైన శ్రీవేంకటేశ్వరస్వామివారిపై ప్రసరింపజేసి ఆపాద మస్తకము భక్త్యంజలి సమర్పిస్తారు.

ఆ సూర్యోదయవేళ, ఆ బాలభాస్కరుని పసిమి పచ్చని వెలుగురేకలు సూర్యప్రభ వాహనంపై వెలుగుతున్న శ్రీ తిరుమలేశుని వజ్ర కిరీటంపైనా, ఆ తర్వాత వక్షః స్థలంపైనా, శంఖు చక్రాలపైనా ఇలా...... చివరగా శ్రీవారి పాద పద్మాలపైనా ప్రసరించి, ప్రతిఫలించగా, ఒక వినూత్న తేజంతో వింత వింతలుగా శ్రీస్వామివారు తేజరిల్లుచుండగా, ఆ దృశ్యాన్ని వేలాది భక్తజనం కన్నుల కరవెల్ల తీరునట్లు దర్శించి ధన్యులవుతారు. ఇలా శ్రీ సూర్య నారాయణస్వామి తన కిరణాలతో కొండల రాయణ్ణి ఆపాదమస్తకం అర్చించిన వెంటనే స్వామివారికి అర్ఘ్య పాద్యాచమనాలు సమర్పిస్తారు. పిదప నైవేద్యమిచ్చి కర్పూర హారతి ఇస్తారు. హారతి అనంతరం మళ్లీ అక్కడినుంచి శ్రీస్వామివారు సూర్యప్రభ వాహనంపై ఉత్తరమాడ వీథిగుండా సాగి వాహన మండపం చేరుకొంటారు. దీనితో అత్యంత ప్రధానమైన సూర్యప్రభ వాహనం పూర్తవు తుంది.

**చిన్నశేష వాహనం**

పిదప శ్రీమలయప్పస్వామి సూర్య ప్రభను వీడి, చిన్నశేషవాహనంపై ఆసీనులై అలంకృతులవుతారు. మళ్లీ సకల రాచ మర్యాదలతో తిరుమల నాలుగుమాడ వీథుల్లో ఊరేగుతూ, అక్కడక్కడ భక్తులచే పూజ లందుకొంటూ చివరగా యథాస్థానం అనగా వాహన మండపానికి చేరుకొంటారు.

**గరుడ వాహనం**

ఆ తర్వాత శ్రీస్వామివారు వెండి గరుడునిపై వేంచేసి సర్వాభరణ భూషితుడై, పుష్పమాలాలంకృతుడై ఛత్రచామర సార్వ భౌమాధిక మర్యాదలతో తిరుమల పుర వీథుల్లో ఊరేగి వాహనమండపం చేరుకొంటారు

**హనుమద్వాహనం**

పిదప శ్రీమలయప్పస్వామి హను మంతునిపైనెక్కి తానే త్రేతాయుగంనాటి రాముణ్ణి నేనే ''హనుమత్పరితోషితాయ నమః'' ''వాయుసూనుకృతాసేవాయ నమః'' అని చాటుతూ ఊరేగుతూ వాహన మండపాన్ని చేరుకొంటారు. అక్కడినుంచి వాహన మండపంనుంచి స్వామివారు బంగారు పీఠాన్నెక్కి ఆనంద నిలయం ప్రవేశిసారు.

**చక్ర స్నానం (సుదర్శన చక్రత్తాళ్వారు)**

శ్రీస్వామివారు ఆలయం ప్రవేశించిన వెంటనే శ్రీసుదర్శన చక్రస్వామిని పల్లకిలో వేంచేపు చేసికొని ఆలయ ప్రదక్షిణంగా నాలుగు వీధుల్లో ఊరేగిస్తూ వరాహస్వామి ఆలయాన్ని చేరుకొంటారు.

వరాహస్వామి ఆలయ ప్రాంగణంలో చక్రత్తాళ్వారుకు అర్చకులు పంచామృతాభిషేకం చేసిన తర్వాత పవిత్ర పుష్కరిణిలో ముంచి స్నానం చేయిస్తారు. అనంతరం చక్రస్వామిని అలంకరించి నైవేద్య హారతులిస్తారు. పిదప అక్కడినుంచి బయలుదేరి ఆ సుదర్శన స్వామి ఊరేగుతూ ఆలయాన్ని ప్రవేశిస్తారు.

పిదప మధ్యాహ్న సమయంలో ఆల యంలో జరిగే రెండవ అర్చన (అష్టోత్తరం) రెండవ గంట (నైవేద్యం) పూర్తవుతాయి. ఇలా మధ్యాహ్నం ఆరగింపులు పూర్తికాగానే శ్రీ వేంకటేశ్వరస్వామి శ్రీదేవి భూదేవి ఉభయ దేవేరులతో కూడిన బంగారు పీఠంలో ఆలయం ఎదురుగా వున్న వాహన మండపానికి తరలివస్తారు.

**కల్పవృక్ష వాహనం**

అర్చకులు ఉభయదేవేరులతో కూడి వున్న మలయప్పను కల్పవృక్ష వాహనంపై వేంచేపు చేసి, సర్వాలంకారాలతో తిరుమల నాలుగు వీధుల్లో ఊరేగిస్తారు.

**సర్వభూపాల వాహనం**

పిదప ఉభయనాచ్చియారులతోవున్న శ్రీ వేంకటేశ్వరుణ్ణి సర్వభూపాల వాహనంలోని తరలింపజేసి, కన్నులపండువుగా అలంకరించి పురవీథుల్లో ఊరేగిస్తారు.

**చంద్రప్రభ వాహనం**

ఇది చివరి ఉత్సవం. శ్రీదేవి భూదేవుల నిరువురిని వాహన మండపంలోనే వదలి శ్రీ స్వామివారు తానొక్కడే ముత్యాల కవచాన్ని ధరించి, అలంకృతుడై చంద్ర ప్రభ వాహనాన్ని ఎక్కి నాలుగు మాడవీథుల్లో ఊరేగడానికి బయలుదేరతాడు. ఇంతలో చంద్రోదయం అవుతుంది. ఆ చంద్రోదయ కిరణాల్లో శ్రీస్వామివారి ముత్యాలకవచం, శంఖు చక్రాలు, కిరీటం చల్లని కాంతు లీనుతుండగా,

శ్రీస్వామివారు అశేష భక్తజనంపై తన చల్లని చూపులను ప్రసరింపజేస్తూ చిరునవ్వులు చిందిస్తూ ఊరేగి చివరగా మండపాన్ని చేరు కొంటారు.

పిదప దేవేరులతో కూడి శ్రీస్వామి వారు బంగారు పీఠాన్ని ఎక్కి ఆలయాన్ని ప్రవేశిస్తారు. దీనితో రథసప్తమి నాటి ఉత్సవాలు ఘనంగా పూర్తి అవుతాయి. ఆ తర్వాత ఆలయంలో యథాప్రకారంగా రాత్రి ఆరాధన, నివేదనలు జరుపబడతాయి.

ఇలా రథసప్తమినాడు సప్తగిరీశుడు బ్రహ్మోత్సవాల్లోవలె చాలా ఉత్సవాల్లో ఊరేగింపబడతాడు. బ్రహ్మోత్సవం పది రోజులపాటు జరుగగా, రథసప్తమినాడు ఒకే రోజున, రథోత్సవం తప్ప ఇతర ఉత్సవాలు జరుపబడుతున్నాయి. అందువల్లే ''రథ సప్తమి'' ని తిరుమలలో జరుగుతున్న ''ఒక రోజు'' బ్రహ్మోత్సవమని అంటారు.

పూర్వం శ్రీస్వామివారికి ఏటా పది పదకొండు బ్రహ్మోత్సవాలు జరిగేవట. అంటే ఇంచుమించు ప్రతి నెలా ఒక బ్రహ్మోత్సవం జరిగేదన్నమాట. అలా జరుగుతున్న బ్రహ్మోత్సవాల్లో, కాలక్రమేణా నిలిచిపోయినవి నిలిచిపోగా, ఇంకా అమలులో వుండి జరుగుతున్న బ్రహ్మోత్సవమే రథసప్తమి నాటి ఉత్సవాలుగా భావింపబడుతున్నది.

ఈ రథసప్తమినాటి ఉత్సవాల్లో కొన్నింటిలో శ్రీ వేంకటేశ్వరస్వామివారు ఒక్కరుగాను, మరికొన్నింటి ఉత్సవాల్లో దేవేరులతో కలిసి తిరుమల తిరువీథుల్లో ఊరేగుతారు. బ్రహ్మోత్సవాలలాగే అశేష భక్త జనం రథసప్తమినాటి ఉత్సవాల్లో ఊరేగే తిరుమల శ్రీస్వామివారి వైభవాన్ని కన్నులారా తిలకించి ధన్యులవుతుంటారు.

* * *

## 22. తెప్పోత్సవాలు

తెప్ప అనగా పడవ, ఓడ. ఓడలో సుఖాసీనులైన శ్రీ తిరుమల స్వామివారిని కోనేటిలో విహారం చేయించడమే తెప్పోత్సవం అంటారు. ఈ తెప్పోత్సవాలను తమిళంలో 'తిరుపల్లి ఓడై తిరునాళ్' అంటారు. వీటినే తెలుగులో 'తెప్ప తిరునాళ్లు' అని అంటారు.

తిరుమలలో శ్రీవేంకటేశ్వరునికి అత్యంత ప్రాచీనకాలం నుండే తెప్పోత్సవాలు జరిగేవని తెలుస్తున్నది. ఈ ఉత్సవాల కొరకే క్రీ.శ. 1468 లో పుష్కరిణి మధ్యలో, సాళువ నరసింహరాయలు ఒక మండపాన్ని నిర్మించారు. దీనినే 'నీరాళి మండపం' అంటారు. ఆ సమయంలో ఈ మండపంలో కొలువై వున్న స్వామివారికి నివేదనల కట్టడి ఏర్పాటు చేశాడట! అప్పట్లో ఈతెప్పోత్సవాలు సంక్రాంతి పండుగ మరురోజు, బ్రహ్మోత్సవా ల్లోను, ఇంకా ఆయా సందర్భాల్లో జరుప బడేవని తెలుస్తున్నది.

క్రీ.శ. 15 వ శతాబ్దానికి చెందిన అన్నమయ్య తిరుమల తెప్పోత్సవాలను గొప్పగా కీర్తించాడు.

**లలిత**

**ఎందు నీకుఁ బ్రియమో యీ తెప్ప తిరునాళ్లు**
**దిందువడె సిరులతో తెప్ప తిరుణాళ్లు**
**పాల జలనిధిలోఁ బవ్వళించి పాము తెప్పఁ**
**దేలుచున్నదది దెప్ప తిరునాళ్ళు వోలి నేకోదకమై వొక్క**
**మఱ్ఱియాకు మీఁద తేలుచున్న దది తెప్ప తిరుణాళ్లు.**
**అమృతము దచ్చునాఁడు అంబుధిలో మంధరము**
**తెమలఁ దేలించు తెప్ప తిరుణాళ్లు యమునలో కాళింగు**
**నంగపు పడిగె మీఁద తిమరి తొక్కిన తెప్ప తిరునాళ్లుఁ**
**అప్పుడు పదారువేలు అంగనల చెమటల**
**తెప్పలఁ దేలిన తెప్ప తిరునాళ్లు వొప్పుగ శ్రీ వేంకటాద్రి**
**నున్నతిఁ గోనేటిలోన తెప్పరిల్లె నేఁట నేఁట**
**తెప్ప తిరుణాళ్లు.**

*--అన్నమయ్య అధ్యాత్మ కీర్తన - 143*
*(సంపుటము - 2 - 1981)*

అంతేగాక స్వామివారు తేలియాడే కోనేటి మహత్మ్యాన్ని కూడ అన్నమాచార్యులు గొప్పగా కీర్తించాడు. అన్నమయ్య కుమారుడు పెద తిరుమలయ్య, నీరాళి మండపాన్ని, పుష్కరిణిని బాగు చేయించాడు.

ఇలా చాలాకాలంనుంచి జరుగుతున్న తెప్పోత్సవాలు ఏ కారణం చేతో మధ్యలో ఆగి పోయాయి. మళ్లీ మహంతు ప్రయాగదాసు గారు తిరుమల తెప్పోత్సవాలను ఉద్ధరించి, దుర్మతి నామ సంవత్సర ( 1 9 2 1 ) ఫాల్గుణ శుద్ధ ఏకాదశి నుంచి 5 రోజులపాటు జరిగేట్లుగా ఏర్పాటు చేశాడు. మళ్లీ ఆనాటినుండి నిరాఘాటంగా తెప్పోత్సవాలు సాగిపోతున్నాయి.

ప్రస్తుతం ప్రతి సంవత్సరం ఫాల్గుణ మాసంలో శుద్ధ ఏకాదశి నుండి పౌర్ణమి వరకు ఐదు రోజులపాటు తెప్పోత్సవాలు ఘనంగా జరుగుతున్నాయి. ఇవి సాధారణంగా మార్చి – ఏప్రిల్ నెలల్లో జరుగుతాయి.

ఐదురోజులపాటు జరిగే ఈ తెప్పోత్సవాల్లో మొదటి (ఏకాదశి రోజు) సాయంకాలం 6 గంటలకు తిరుమల కోనేట్లో తెప్పలో విహరించుటకు శ్రీ సీతారామ లక్ష్మణులు ఆలయం నుండి ఛత్రచామర మర్యాదలతో బయలు వెడలి, ఆలయ మహా ప్రదక్షిణ మార్గంలో ఊరేగుతూ, చివరకు కోనేటి దరిని చేరుకొని తెప్పను అధిరోహిస్తారు. మిరుమిట్లు గొలిపే విద్యుద్దీపాల కాంతిలో, వేద నాదాల మధ్య, మంగళ వాయిద్యాలు మోగు తుండగా, అన్నమయ్య కీర్తనల్ని వింటూ, శ్రీ సీతా రామ లక్ష్మణులు సర్వశోభాయమానంగా తీర్చిదిద్ది అలంకరించిన తెప్పలో మూడు మార్లు ప్రదక్షిణంగా విహరిస్తారు. నాలుగు వైపులా కోనేటి ఒడ్డున మెట్లపై వేలాది మంది భక్తజనం శ్రీస్వామివారలను కన్నులారా తిలకించి పులకిస్తారు. మొదటిరోజు మూడు ప్రదక్షిణలు అయిన వెంటనే నివేదన కర్పూరహారతి జరిగిన తర్వాత ఆర్జిత సేవా భక్తులకు వస్త్ర బహుమానం జరుగుతుంది. ఆ తర్వాత శ్రీ సీతారామ లక్ష్మణులు పల్లకి నెక్కి ఛత్రచామర మర్యాదలతో ఆలయప్రవేశం చెయ్యడంతో మొదటి రోజు తెప్పోత్సవం ముగుస్తుంది.

ఇక రెండవరోజు ద్వాదశిరోజున శ్రీ రుక్మిణీ కృష్ణులు పురవీథుల్లో ప్రదక్షిణంగా ఊరేగుతూ వచ్చి, పుష్కరిణిలోని తెప్ప నధిరోహించి మూడుమార్లు

ప్రదక్షిణంగా విహరిస్తారు. ఆ తర్వాత నివేదలు, హారతి అనంతరం శ్రీరుక్మిణీ కృష్ణులు ఆలయప్రవేశం చేస్తారు.

ఇక మూడవరోజు త్రయోదశినాడు శ్రీదేవి భూదేవి సమేత శ్రీమలయప్పస్వామి తిరుచ్చినెక్కి సర్వాభరణభూషితుడై ఛత్ర చామర మర్యాద పురస్సరంగా పురవీథుల్లో ఊరేగుతూ కోనేటికి వచ్చి తెప్పలో ఆసీనులై వేదగానాల మధ్య భాజాభజంత్రీలు మ్రోగుతుండగా, బాణా సంచా కాలుస్తుండగా అశేష భక్త జనాన్ని అనుగ్రహిస్తూ మూడు మారులు ప్రదక్షిణ విహరిస్తారు. చివర నైవేద్య హారతులిస్తారు. ఆ తర్వాత శ్రీస్వామివారు దేవేరులతో ఆలయాన్ని ప్రవేశిస్తారు.

ఇలాగే నాలుగవరోజు శ్రీదేవి భూదేవులతో కూడిన శ్రీవేంకటేశ్వర స్వామివారు ఐదు ప్రదక్షిణాలున్ను ఐదవ రోజు 7 మార్లు తెప్పలో విహరిస్తారు.

వేసవి ప్రారంభంలో పున్నమిరోజుల నాటి వెన్నెల కాంతుల్లో చల్లని నీళ్లల్లో శ్రీస్వామివారిని ఊరేగించే ఈ తెప్పోత్స వాలను భక్తులు కూడ నిర్ణీత అర్జిత రుసుమును చెల్లించి చేయించవచ్చును.

ఒకరోజు తెప్పోత్సవానికి రు.2,500/- లు డి.డి. ఏ బాంకులో నైనా 'ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు, తి.తి. దేవస్థానములు, తిరుపతి' వారి పేర తీసి, దానినిప 'పేష్కారు, తిరుమల శ్రీవారి ఆలయం, తిరుమల – 517 504' వారికి చాల ముందుగా పంపుతూ రిజర్వు చేసుకోవచ్చు. అనుమతిని ధ్రువపత్రం ద్వారా ముందుగానే భక్తులకు తెలియ జేయబడుతుంది. అయినా, అప్పటికి వున్న అవకాశాన్ని బట్టి మాత్రమే వీలు కల్పించబడుతుంది.

నిర్ణీత రుసుమును చెల్లించిన గృహస్థుతో పాటు 5 మందికి శ్రీవారి దర్శనం కల్పించబడు తుంది. తెప్పోత్సవం ప్రారంభానికి ముందు గృహస్థుచే సంకల్పం చెప్పించబడుతుంది. చివర్లో ఉత్తరీయం, ఒక రవిక గుడ్డ బహుమానంగా ఇవ్వబడతవి. పిదప వీరు శ్రీవేంకటేశ్వర స్వామివారి మూలవరుల దర్శనానికి కూడ అనుమ తించబడతారు.

**గోవిందా! గోవిందా! గోవింద!!!**

* * *

# 23. ఇతర ఉత్సవాలు

తిరుమల శ్రీ వేంకటేశ్వరస్వామివారి క్షేత్రంలో పైన తెలిపిన ఉత్సవాలేగాక ఇంకా అనేకమైన ఇతర సేవలు, ఉత్సవాలు జరుపబడుతున్నాయి.

**శ్రీ నరసింహజయంతి:** ప్రతి సంవత్సరం వైశాఖమాసం శుక్ల చతుర్దశి రోజున నరసింహజయంతి ఉత్సవం శ్రీవారి ఆలయంలో ఏకాంతంగా జరుగుతుంది. ఆ రోజు సాయంత్రం ఆలయ ప్రాంగణంలో వున్న శ్రీ సన్నిధి యోగనరసింహస్వామి వారికి, అభిషేక, అర్చన, నివేదనలు ఘనంగా జరుగుతాయి.

**నారాయణగిరిలో ఛత్రస్థాపనోత్సవం:** ప్రతి సంవత్సరం ఆషాఢ మాసం శుద్ధ ఏకాదశీ సందర్భంగా మరునాడు శుద్ధ ద్వాదశి రోజున ఈ ఉత్సవం జరుగుతుంది. ఆనాడు ఉదయం శ్రీవారి ఆలయం నుంచి బాజాభజంత్రిలతో శ్రీవారి అర్చకులు, వేద పండితులు, ప్రసాదాలతో ఛత్ర చామరాలతో బయలుదేరి నారాయణగిరి పర్వతంపైన వెలసిన శ్రీవారి దివ్యపాద పద్మముల సన్నిధికి చేరుకుంటారు. మొట్టమొదట మహావైకుంఠం నుండి భూలోక వైకుంఠమైన ఈ క్షేత్రంలో శ్రీ వేంకటేశ్వరుడు ఈ పర్వతంపై కాలుమోపిన దివ్య ప్రదేశంగా నారాయణగిరి పర్వతం చెప్పబడుతుంది. ఈ పర్వతంపై వెలసిన శ్రీనివాసుని దివ్యపాదపద్మాలకు అభిషేకాది అలంకార అర్చనలు నివేదనాదులు అయిన తర్వాత రెండు భూచక్రగొడుగులను అక్కడి స్తంభాలకుగాని చెట్లకుగాని కట్టి వస్తారు. పిదప అక్కడ చేరిన భక్తులకు, ప్రసాద వితరణ జరుగుతుంది.

**శ్రీవరాహజయంతి:** ప్రతి సంవత్సరం శ్రావణమాసంలో వచ్చే శ్రవణ నక్షత్రం నాడు శ్రీవరాహజయంతి ఉత్సవం తిరుమల క్షేత్రంలో జరుపబడుతుంది. ఆనాడు సాయంత్రం తిరుమలలో శ్రీ స్వామిపుష్కరిణికి వాయువ్య మూలలో వున్న శ్రీ భూవరాహ స్వామి ఆలయంలో శ్రీవరాహజయంతి వేడుకలు ఘనంగా జరుగుతుంది. ఆనాడు రాత్రి వరాహస్వామి సన్నిధిలో శ్రీవారి అర్చకులు విశేషంగా ఆరాధన, అర్చనలు, నివేదనలు ఘనంగా నిర్వహిస్తారు.

**అనంత పద్మనాభ చతుర్దశి:** ప్రతి సంవత్సరం భాద్రపద శుక్ల చతుర్దశి నాడు అనంత పద్మనాభ వ్రతం. ఆ రోజు తిరుమల శ్రీవారి ఆలయంలో, ఉదయం పూజలు పూర్తి అయిన తర్వాత శ్రీ సుదర్శన చక్రత్తాళ్వారులు, ఊరేగింపుగా శ్రీ వరాహస్వామి ఆలయం చేరుకుంటారు. అక్కడ శ్రీ సుదర్శనునికి అభిషేక అర్చనలు పూర్తి అయిన తర్వాత శ్రీ స్వామి పుష్కరిణిలో చక్రస్నానం జరుపబడిన తర్వాత మళ్లీ ఆలయం చేరుకొంటారు. పిదప శ్రీ వేంకటేశ్వర స్వామి పాదసన్నిధిలో శ్రీ అనంత పద్మనాభ స్వామి వ్రతం పట్టుతోరాలను ఉంచి అర్చించిన తర్వాత, వాటిని, అర్చకులు, ఏకాంగులు, ఆలయ అధికారులు చేతికి ధరిస్తారు.

**చక్రతీర్థముక్కోటి ఉత్సవం:** తిరుమలక్షేత్రం ఎన్నో తీర్థాలకు, పుష్కరిణిలకు నిలయము. అలాగే చక్రతీర్థం అనే పవిత్రతీర్థం తిరుమలకు వాయవ్యమూలంలో సుమారు 5 కి.మీటర్ల దూరంలో వుంది. ఈ తీర్థంలో శ్రీ సుదర్శన భగవానులు, శ్రీ లక్ష్మీనరసింహ స్వామి, శ్రీ ఆంజనేయస్వామి విగ్రహమూర్తులు అక్కడి కొండకు మలచబడి వున్నాయి. గతంలో ఎందరో రాక్షసులను సంహరించిన

సుదర్శన భగవానుడు నేటికీ ఈ తీర్థంలో తేజోరూపంతో తిరుగుతూ వుంటాడని పురాణప్రసిద్ధి. ప్రతి సంవత్సరం సౌరమానం ప్రకారం వృశ్చికమాసం అనగా మార్గశిర మాసం శుద్ధద్వాదశి రోజున శ్రీవారి ఆలయంలో చక్రతీర్థముక్కోటి ఉత్సవం జరుగుతుంది.

ఆనాడు శ్రీవారి ఆలయంలో ఉదయం, మధ్యాహ్నంనాటి పూజలు, నివేదనలు పూర్తి అయిన తర్వాత శ్రీవారి ఆలయం నుండి అర్చకులు, వేదపండితుళు, అధికారులు, మంగళవాయిద్యాలతో పూజద్రవ్యాలతో, శ్రీ చక్రతీర్థం చేకుకుంటారు. అక్కడ వేంచేసి వున్న శ్రీ సుదర్శన భగవానునికి శ్రీ లక్ష్మీనరసింహస్వామికి, ఆంజనేయ స్వామికి అభిషేక అర్చన, అలంకార, నివేదనలు ఘనంగా నిర్వహించిన పిదప అక్కడ చేరిన భక్తులందరికీ ప్రసాద వితరణ చేస్తారు.

**కైశికద్వాదశి:** ప్రతిసంవత్సరం కార్తికమాసంలో శుక్లద్వాదశి రోజున శ్రీవారి ఆలయంలో కైశికద్వాదశి ఉత్సవం జరుగుతుంది. ఆనాడు, సూర్యోదయానికి చాల ముందుగనే శ్రీవారి ఆలయంలో వున్న శ్రీదేవి, భూదేవి సమేతంగా ఉన్న శ్రీ ఉగ్ర శ్రీనివాసమూర్తికి అభిషేక అర్చనలు, అలంకారాలు సమర్పించిన తర్వాత తిరుమల పురవీధుల్లో ఊరేగింపు జరుగుతుందని మళ్లీ సూర్యోదయం కాకముందే ఈ ఉగ్ర శ్రీనివాసమూర్తి ఆలయంలో ప్రవేశిస్తారు. ఈ స్వామికి సూర్యకిరణాలు సోకితే ఉగ్రత్వం వస్తుందని చెప్పబడుతున్నది. ఈ ఒక్కరోజు మాత్రమే ఉగ్ర శ్రీనివాసమూర్తి ఆలయం వెలుపలికి ఊరేగింపుగా వస్తాడు.

**కార్తీక దీపోత్సవం:** దీపావళి పండుగ మొదలుగా కార్తీక మాసమంతా దీపాలపండుగగా జరుపడం ఆనవాయితీ. తిరుమల శ్రీవారి ఆలయంలో కార్తీక పౌర్ణమినాడు ఈ దీపోత్సవం విశేషంగా కన్నుల

పండువుగా జరుపబడుతుంది. కార్తీక పున్నమినాటి సాయంత్రం శ్రీ శ్రీనివాసభగవానునికి సాయంకాల కైంకర్యాదులు నివేదనలు పూర్తి అయిన తర్వాత ఈ దీపోత్సవం విశేషంగా కన్నులపండువుగా జరుపబడుతుంది. కార్తీక పూర్ణిమనాడు సాయంత్రం శ్రీ శ్రీనివాస భగవానునికి సాయంకాల కైంకర్యాదులు నివేదనలు పూర్తి అయిన తర్వాత ఈ దీపోత్సవం జరుగుతుంది.

మొదట శ్రీ యోగనరసింహస్వామి ఆలయం ప్రక్కనవున్న పరిమళం అరదగ్గర నూరు కొత్త మట్టి మూకుళ్లలో నేతి వత్తులతో దీపాలను వెలిగిస్తారు. తదుపరి వీటిని ఛత్రచామర, మంగళవాయిద్య సమేతంగా ఊరేగింపుతో విమానం ప్రదక్షిణం చేస్తూ, ఆనంద నిలయంలో శ్రీవారికి హారతి ఇస్తారు. ఆ తర్వాత వరుసగా గర్భాలయంలో బ్రహ్మ అఖండం, కులశేఖరపడి రాములవారి మేడ, బంగారునాటి, ద్వారపాలకులు, గరుడాళ్వారు, వరదరాజస్వామి సన్నిధి, వకుళమాత, బంగారు బావి, కల్యాణమండపం, సభ అర తాళ్లపాకం అర, భాష్యకారుల సన్నిధి, యోగనరసింహస్వామి, విష్వక్సేనులు, చందనం అర, పరిమేళం అర, వెండివాకిలి, ధ్వజస్తంభం, బలిపీఠం, క్షేత్రపాలకుల సన్నిధి తిరుమలరాయమండపం, పూలబావి, రంగనాయక మండపం, మహాద్వారం, బేడి ఆంజనేయస్వామి శ్రీ వరాహస్వామి ఆలయం. స్వామిపుష్కరిణి సుమారుగా 100 నేతి జ్యోతులను మంగళవాద్య పురస్సరంగా వేదమంత్రోచ్చారణలతో ఏర్పాటు చేస్తారు. కార్తీక మాసం పౌర్ణమినాడు తిరుమల కొండలో జరిగే ఈ కార్తీక దీపోత్సవం చూసి తీరవలెగాని వర్ణించడానికి సాధ్యం కాదు.

**శ్రీరామకృష్ణ తీర్థముక్కోటి ఉత్సవం:** తిరుమల క్షేత్ర సానువుల్లో వెలసి వున్న అనేక పవిత్ర తీర్థాల్లో శ్రీరామకృష్ణ తీర్థం ముఖ్యమైంది. ఇక్కడ తపస్సు చేసిన రామకృష్ణుడను యోగికి పుష్యమాసం పున్నమీనాడు శ్రీనివాసుడు ప్రత్యక్షమై వరాలు ఇచ్చాడు. ఆనాడు ఈక్షేత్రముక్కోటి ఉత్సవం జరుగుతుంది.

ప్రతి సంవత్సరం పుష్యమాసం పౌర్ణమి రోజున శ్రీవారి ఆలయంలో ఉదయం, మధ్యాహ్న పూజలు పూర్తి అయిన తర్వాత శ్రీవారి అర్చకులు, వేదపండితులు అధికారులు, ఊరేగింపుగా శ్రీ రామకృష్ణ తీర్థానికి వెళతారు. అక్కడ వున్న శ్రీ రామకృష్ణుల విగ్రహాలకు అభిషేక అర్చన నివేదనలు ఘనంగా నిర్వహించి అక్కడ చేరిన భక్తులకు ప్రసాద వితరణ చేస్తారు. ఈ రామకృష్ణ తీర్థం పాపవినాశన తీర్థానికి 5 కిలో మీటర్ల దూరంలో వుంది.

**క్షేత్రపాలక ఉత్సవం (తిరుమలలో మహాశివరాత్రి):** ప్రతి సంవత్సరం శివరాత్రి పర్వదినం తిరుమలలో మహావైభవంగా జరుగుతుంది. ఈ క్షేత్రానికి రుద్రుడు క్షేత్రపాలకుడు అందువల్ల శివరాత్రినాడు జరిగే ఈ శివపూజను 'క్షేత్రపాలకోత్సవం' అంటారు.

క్షేత్రపాలకుడైన రుద్రుడు శ్రీవారి ఆలయానికి ఆగ్నేయమూలలో 2 కిలోమీటర్ల దూరంలో వున్న గోగర్భ తీర్థంలో వెలసి వున్నాడు.

ప్రతి సంవత్సరం మహాశివరాత్రినాడు, శ్రీవారి ఆలయంలో ఉదయం, మధ్యాహ్నం పూజలు పూర్తి అయిన తర్వాత ఆలయంనుండి

శ్రీవారి అర్చకులు, వేదపండితులు, అధికారులు, మేళతాళాలలో మంగళవాయిద్యాలతో ఊరేగింపుగా గోగర్భ తీర్థం చేరుకుంటారు. అక్కడ క్షేత్రపాలకుడైన శివునకు నమక చమక మంత్ర సహితంగా రుద్రాభిషేకం పూర్తిచేసిన తర్వాత అలంకారం అర్చనలు, వడపప్పు, పానకం, చక్కెర పొంగలి మున్నగు నివేదనలు సమర్పించి ఘనంగా హారతులు ఇస్తారు. పిదప అక్కడ చేరిన తీర్థ జనానికి ప్రసాదాలను వినియోగం చేస్తారు. ఈ ఉత్సవాన్ని మహాశివరాత్రినాడు గోగర్భానికి వెళ్ళిన యాత్రికులందరు దర్శించవచ్చును.

**హనుమజ్జయంతి ఉత్సవం:** ప్రతి సంవత్సరం వైశాఖ బహుళ దశమినాడు హనుమజ్జయంతి వేడుకలు, తిరుమల క్షేత్రంలో ఘనంగా జరుగుతాయి.

శ్రీవారి ఆలయానికి ఎదురుగా వున్న శ్రీ బేడి ఆంజనేయస్వామి వారికి, శ్రీ వరాహస్వామి ఆలయానికి ఎదురుగా వున్న శ్రీ కోనేటి గట్టు ఆంజనేయ స్వామివారికి, ఇటీవల కాలంలో కాలినడక బాటలో పదవ మైలు దగ్గర వున్న శ్రీ భక్తాంజనేయ స్వామివారికి హనుమజ్జయంతి నాడు విశేషంగా అభిషేక, అర్చన, నివేదనలు జరుపబడుతాయి. తిరుమలలోని శ్రీ జాబాలి తీర్థంలో ఓకూడ శ్రీ హనుమజ్జయంతి ఉత్సవం 'ఘనంగా నిర్వహింప బడుతున్నది. ఆరోజు ఉదయం శ్రీ ఆంజనేయస్వామివారికి అభిషేక, అర్చన, అలంకార నివేదనలు జరుపబడుతాయి. ఈ హనుమజ్జయంతి నాటికి భక్తులు హనుమద్దీక్షతో తిరుమల చేరుకొని జాబాలి తీర్థంలో దీక్షను విరమిస్తారు.

**తిరువాడిపూరం ఉత్సవం:** ప్రతి సంవత్సరం కటకమాసం శుక్ల చవితి పూర్వఫల్గునీ నక్షత్రంనాడు తిరువాడిపూరం ఉత్సవం జరుగును. శ్రీ ఆండాళ్ పుట్టిన రోజు ఇది. కాని తిరుమలలో ఇదేరోజున, శ్రీవారి పుష్పకైంకర్యపరులైన అనంతాళ్వార్ పరమపదించిన రోజు. అందువల్ల ఈ రోజు శ్రీస్వామివారు ఉభయదేవేరులతో కూడి అనంతాళ్వారుల తోటకువెళ్ళి అక్కడ పూజలందుకొని అక్కడ వున్న అనంతాళ్వారుల సమాధికి శ్రీవారి పుష్పహారం శఠారి సత్కారం జరిపిన తరువాత శ్రీ స్వామివారు ఆలయం చేరుకుంటారు.

**శ్రీబాగ్‌సవారి - పురిశైతోట ఉత్సవం:** తిరుమల శ్రీవారి బ్రహ్మోత్సవాలు ముగిసిన మరునాడు శ్రీ స్వామివారు ఒక్కరే, శ్రీవారి ఆలయానికి, పుష్కరిణికి అప్రదక్షిణంగా ఊరేగింపబడుతూ అనంతాళ్వారుల తోటకు వెళ్ళి అక్కడ పూజా నివేదనాదుల నందుకొంటారు. పిదప అక్కడ అనంతాళ్వారుల సమాధికి శ్రీవారి పుష్పమాల శఠారి మర్యాదలు జరిగిన తర్వాత స్వామివారు తిరిగి అప్రదక్షిణగానే ఆలయం చేరుకుంటారు. ఆనంద నిలయుని అనంతాళ్వానుల మధ్య జరిగిన గాథకు నిదర్శనమే ఈ ఉత్సవం. దీనిన్ని భక్తులందరు దర్శించ వచ్చును.

**శ్రీ వరలక్ష్మి వ్రతం:** ప్రతి సంవత్సరం వరలక్ష్మివ్రతం నాటి సాయంత్రపుట తిరుమల శ్రీవారి వంటశాలలో వున్న వకుళమాతను మహాలక్ష్మిగా భావించి అభిషేకార్చనలు, నివేదనలు ఘనంగా జరుగు తుండడం విశేషం. అందువల్లే ఈమె పచనలక్ష్మి, పాచకలక్ష్మి అని పిలువబడుతున్నది.

ఇలా తిరుమల శ్రీవారి ఆలయంలో క్షేత్రంలో ప్రతినిత్యం ఎన్నో సేవలు, ఎన్నెన్నో ఉత్సవాలు జరుపబడుతుంటాయి. అందుకే

శ్రీనివాసుడు 'ఉత్సవాల దేవుడు' అని ప్రసిద్ధి పొందాడు. ప్రాచీనంగా జరిగే కొన్ని ఉత్సవాలు కాలాంతరంలో నిలిచిపోయి, వాటిల్లో కొన్ని మళ్లీ పునరుద్ధరింపబడి జరుపబడుతున్నాయి. కొన్ని ఉత్సవాలు కొత్తగా ఏర్పాటు చేయబడినాయి. ఆ ఉత్సవాలన్నింటినీ పరిశీలించటం అసాధ్యం కూడ. శ్రీ శ్రీనివాస భగవానుడు అనంతుడు. అచ్యుతుడు. ఆయన భూలోక వైకుంఠమైన శ్రీ వేంకటాచలంలో వేంచేసి వున్నంతవరకు ఉత్సవాలు జరుగుతునే వుంటాయి.

తిరుమలేశునికి జరిగే ఈ ఉత్సవాలను చేసినా చాలు! వాటిని దర్శించినా చాలు చాలు! కనీసం వాటిని స్మరించినా అంతకంటే చాలు! వారి జన్మము ధన్యము. వారివారి కోరికలు అన్నీ నెరవేరతాయి.

తెలుగువారి 'ఇలవేలువ్పూ', 'ఇలువేలువ్పూ' అయిన ఆపదమొక్కుల వాడికి, ఏడుకొండలవాడికి,

**'కోరి మమ్ము నేలినట్టి కులదైవము, చాల**
**నేరిచి పెద్దలిచ్చిన నిధానము'**

అయిన శ్రీ వేంకటేశ్వర స్వామివారి దివ్య పాద పద్మములకు ఈ చిన్న పుస్తకాన్ని సమర్పించి తరింతుము గాక! అయినా, నాది కాని వస్తువు, ఆయనకు మాత్రమే చెందిన వస్తువును, ఆయనకు ముట్టజెప్పడంలో గొప్పేముంది గనక!

**చెడనీక బ్రదికించే సిద్ధమంత్రమా! రోగా-**
**లడచి రక్షించే దివ్యౌషధమా!**
**బడి బాయక తిరిగే ప్రాణ బంధుడా! మమ్ము**
**గడియించినట్టి శ్రీ వేంకటనాథుడా!!**

—తాళ్ళపాక అన్నమాచార్యులు